# పాండురంగ మాహాత్మ్యము

## (సంజీవనీ వ్యాఖ్యాన సహితము



## పంచమాశ్వాసము

కృతికర్త :

తెనాలి రామకృష్ణుడు

( 1495 - 1580 )

వ్యాఖ్యాత :

వంతరాం రామకృష్ణారావు,

ఆంధ్రశాఖ

ప్రభుత్వ కళాశాల

రాజమండ్రి - 533 105

# సమర్పణము

శా॥ శ్రీమద్వర్ష దమోఘపటలీ స్నిగ్ధచ్ఛటామేఖదితో
ద్దామాంగద్యుతిజాల! జాలపదపద్మాక్షస్మృదురుస్తుత్యసం
గామోద్భాసితదివ్యభవ్యమహిమ భ్రాజిష్ణు! జిష్ణుప్రియా
పేమస్థానసురద్రుమాపహరణా! శ్రీశేషశైలాధిపా!

తే॥ అంశుమద్దిలీపులు జీవితాంతమెంత
శ్రమపడిన రాక యలభగీరథునికొఅకె
కాచుకొనియున్న నాఁటిగంగమ్మ చరిత
ననుకరించిన సంజీవనమ్మ యిదిగో!

తే॥ పరులదొనఁగులు తెగనాడిపలుకఁబోదు
నుడువదనపేక్షితంబులు ముడుపులువిప్ప
నప్రమాణోక్తులాడదు నుప్రసన్న
చెట్టవట్టుముస్వామి! సంజీవనమ్మ.

మ॥ నవసూత్రగ్రథనప్రశంసితుఁడు పజ్ఞాశాలిభాషాసరి
ద్ధవమంథాద్రి విమర్శకాగ్రణికవిత్వజ్ఞుండు వ్యాఖ్యాతృమూ
ర్ధవతంసుండుకుశాగ్రబుద్ధియగు వంద్రాం రామకృష్ణుండు భ
క్తివిశిష్టుండిడుకాన్కయంచెటఁగిరక్తింగొమ్ము సంజీవనిన్.

తే॥ ఓలిగవరంబునొక్కటి యొసఁగుమనుచు
నాలుగేండ్లుగవేఁడుచున్నాఁడ నిపుడు
తీర్పఁదటియయ్యెమంగమాధీశ! నిన్ను
జివరనర్థించెద నభీష్టసిద్ధినెఱపు.

# సమర్పణము

శా॥ శ్రీమద్వర్ష దమోఘపటలీ స్నిగ్ధచ్ఛటామేదితో
ద్దామాంగద్యుతిజాల! జాలపదపద్మాకృద్గురుస్తుత్యసం
గామోద్భాసితదివ్యభవ్యమహిమభ్రాజిష్ణు! జిష్ణుప్రియా
ప్రేమస్థానసురద్రుమాపహారణా! శ్రీశేషశైలాధిపా!

తే॥ అంశుమద్దిలీపులు జీవితాంతమెంత
శ్రమపడిన రాక యలభగీరథునికొఱకె
కాచుకొనియున్ననాఁటిగంగమ్మ చరిత
ననుకరించిన సంజీవనమ్మ యిదిగో!

తే॥ పరులదోఁగులు తెగనాడిపలుకఁబోదు
నుడువదనపేక్షితంబులు ముడుపులువిప్ప
నప్రమాణోక్తులాడదు సుప్రసన్న
చెట్టువట్టుముస్వామి! సంజీవనమ్మ.

మ॥ నవసూత్రగ్రథనప్రశంసితుఁడుపజ్ఞాశాలిభాషాసరి
ద్ధవమంథాద్రి విమర్శకాగ్రణికవిత్వజ్ఞుండు వ్యాఖ్యాతృమూ
ర్ధవతంసుండుకుశాగ్రబుద్ధియగు వత్రాం రామకృష్ణుండు భ
క్తివిశిష్టుండిడుకాన్కయంచెఱిఁగిరక్తింగొమ్ము సంజీవనిన్.

తే॥ ఓలిగవరంబునొక్కటి యొసఁగుమనుచు
నాలుగేండ్లుగవేఁడుచున్నాఁడ నిప్పుడు
తీర్చెఁదటియయ్యెమంగమాధీశ! నిన్ను
జివరనర్థించెద నభీష్టసిద్ధినెఱపు.

| | |
|---|---|
| కాళహ | శ్రీకాళహస్తి మాహాత్మ్యము |
| కాళికా | కాళికాపురాణము |
| కాశీ | కాశీఖండము (సంస్కృతము తెలుఁగు) |
| కా. సూ. | కావ్యాలంకారసూత్రవృత్తి |
| కు. సం. | కుమారసంభవము (సంస్కృతము తెలుఁగు) |
| గరుడ | గరుడపురాణము |
| గురుబాల | గురుబాలప్రబోధిక |
| చాటు | చాటుపద్యము |
| ఛాందో | ఛాందోగ్యోపనిషత్తు |
| జై. భా | జైమినిభారతము (సంస్కృతము / తెలుఁగు) |
| జ్యోతిర్వే | జ్యోతిర్వేదము |
| తంత్ర | తంత్రసారము |
| తిథ్యా | తిథ్యాదితత్త్వము |
| త్రి. వి. | త్రికాండవిశేషము |
| దశ | దశకుమారచరిత్ర |
| దీ పి. | కీ. శే. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు |
| దేవీపు | దేవీపురాణము |
| ద్రోణ | ద్రోణపర్వము |
| ధనం | ధనంజయకోశము |
| నరస | నరసభూపాలీయము |
| న. వి. | నన్నయవిజ్ఞాననిరతి |
| నారాయ | నారాయణోపనిషత్తు |
| నా. శా. | నాట్యశాస్త్రము |

| | |
|---|---|
| కాళహ | శ్రీకాళహస్తి మాహాత్మ్యము |
| కాళికా | కాళికాపురాణము |
| కాశీ | కాశీఖండము (సంస్కృతము/తెలుగు) |
| కా. సూ. | కావ్యాలంకారసూత్రవృత్తి |
| కు. సం. | కుమారసంభవము (సంస్కృతము తెలుగు) |
| గరుడ | గరుడపురాణము |
| గురుబాల | గురుబాలప్రబోధిక |
| చాటు | చాటుపద్యము |
| ఛాందో | ఛాందోగ్యోపనిషత్తు |
| జై. భా | జైమినిభారతము (సంస్కృతము / తెలుగు) |
| జ్యోతిర్వే | జ్యోతిర్వేదము |
| తంత్ర | తంత్రసారము |
| తిథ్యా | తిథ్యాదితత్త్వము |
| త్రి. వి. | త్రికాండవిశేషము |
| దశ | దశకుమారచరిత్ర |
| దీ పి. | కీ. శే. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు |
| దేవీపు | దేవీపురాణము |
| ద్రోణ | ద్రోణపర్వము |
| ధనం | ధనంజయకోశము |
| నరస | నరసభూపాలీయము |
| న. వి. | నన్నయావిజ్ఞాననిరతి |
| నారాయ | నారాయణోపనిషత్తు |
| నా. శా. | నాట్యశాస్త్రము |

| | |
|---|---|
| రఘు (సంజీ) | రఘువంశము (సంజీవనీవ్యాఖ్య) |
| రసిక | రసికజనమనోభిరామము |
| రాఘవ | రాఘవపాండవీయము |
| రామా | రామాభ్యుదయము |
| వసు | వసుచరిత్ర |
| వా | వార్త్తికము |
| వాచ | వాచస్పత్యమ్ |
| వామన | వామనపురాణము |
| వాయు | వాయుపురాణము |
| వాల్మీకి | వాల్మీకి రామాయణము |
| వికృ | వికృతివివేకము |
| విక్రమా | విక్రమార్కచరిత్ర |
| విరాటు | విరాటుపర్వము |
| వి. పు (విష్ణు) | విష్ణుపురాణము (సంస్కృతము తెలుఁగు) |
| విశ్వ | విశ్వకోశము |
| వీర | వీరభద్రవిజయము |
| వృషా | వృషాధిపశతకము |
| వై. వి. | వైజయంతీకోశము |
| వై. పా. | వైయాకరణపారిజాతము |
| శబ్దక | శబ్దకల్పద్రుమము |
| శబ్దస్తో | శబ్దస్తోమమహానిధి |
| శ. ర. | శబ్దరత్నాకరము |
| శాంతి | శాంతిపర్వము |
| శివరా | శివరాత్రిమాహాత్మ్యము |

| | |
|---|---|
| శృం. నై. | శృంగారనైషధము |
| శృం. శా. | శృంగారశాకుంతలము |
| శ్రీధ | శ్రీధరీయము |
| శ్రు | శ్రుతి |
| సం. భాగ. | సంస్కృతభాగవతము |
| సభా | సభాపర్వము |
| సర్వ. సం. | సర్వశబ్దసంబోధిని |
| సా. ద. | సాహిత్యదర్పణము |
| సి. కౌ. | సిద్ధాంతకౌముది |
| సిద్ధాంత (సిద్ధా. శి.) | సిద్ధాంతశిఖామణి |
| సూ. ని. | సూర్యరాయాంధ్రనిఘంటువు |
| హంస | హంసవింశతి |
| హ. న. | హరిశ్చంద్రనలోపాఖ్యానము |
| హారా | హారావళీకోశము |



# విషయసూచిక





"రామకృష్ణుని కృతిని రామకృష్ణుఁడే వివరింపసమర్థుఁడు.
సంజీవనిచే, తమరపదమల్లినాథులైనారు."

— కీ. శే. దివాకర్ల వేంకటావధానిగారు
(27-2-1986)

# పాండురంగ మాహాత్మ్యము



## పంచమాశ్వాసము



### [సంజీవనీ వ్యాఖ్యాన సహితము]



క॥ శ్రీ షణ్ముఖజననీమహి
భాషానిభనిజవధూశుభప్రదలీలా !
భూషితకల్యాణోజ్జ్వల
వేషా ! రామాను 1 జేంద్రవేదాద్రీశా ! 1

వ్యా :— శ్రీ = లక్ష్మీదేవితోడను, షణ్ముఖజననీ = కుమారస్వామితల్లితోడను - పార్వతీదేవితోడను, మహి = భూదేవితోడను, భాషా = సరస్వతీదేవితోడను, (బ్రాహ్మీతుభారతీభాషా - అమ) నిభ = సమానమయిన, నిజ = తనదైన, వధూ = భార్యయొక్క - ధర్మపత్నియొక్క (భార్యాజాయా - వధూః - వై. ని) శుభప్రద = కళ్యాణకరమయిన, లీలా = విలాసముగలవాఁడా ! భూషిత =

1 ప :— 1 జయ్య - ప, త, గౌ; జేంద్ర - ర, అ.

అలంకరింపఁబడిన. కళ్యాణ = శుభకరమగు, ఉజ్జ్వల = ప్రకాశించు నట్టి, వేషా= భూషణాదులుగలవాఁడా! (రత్నాభరణములుగలవాఁడా- అనుట) రామానుజేంద్ర = ఇంద్రునివంటి రామానుజయ్యయొక్క - శ్రేష్ఠుఁడయినరామానుజయ్య కుమారుఁడవగు, వేదాద్రీశా = వేదాద్రి నాథా! - శ్రేష్ఠుడైనవేదాద్రీ! (కృతిపతికి సంబోధన)

వ॥ ఆకర్ణింపుము. 2

వ్యా :— ఆకర్ణింపుము = వినుము.

క॥ అని యీక్రియనానతి యి
చ్చినహెచ్చిన సంతసంబుచిత్తము 1 తోడం
బెనఁగొన ననిమిషముని యి
ట్లను నజ్జగదేకనిధికిఁబ్రాంజలియగుచున్. 3

వ్యా :— అని = కాలభైరవుని దర్శించినపిమ్మట విట్ఠలుని దర్శింపఁదగునని, ( 4 - 308 ) ఈక్రియన్ = ఈవిధముగా, ఆనతి యిచ్చినన్ = అనుగ్రహించిచెప్పఁగా, హెచ్చిన = అతిశయించిన, సంతసంబు = సంతోషము, చిత్తముతోడన్ = మనస్సుతో, పెనఁ గొనన్ = పెనవేసికొనఁగా, అనిమిషమౌని = దేవముని - నారదుఁడు, అజ్జగదేకనిధికిన్ = ఆలోకైకనిధానమునకు - ఆశివునకు, ప్రాంజలి యగుచున్ = దోసిలిపట్టినవాఁడగుచు, ఇట్లు = ఈప్రకారముగా, అనున్ = పలికెను.

వ్యాక :— అనున్ = అనెను. భూతమునలాట్టు = బా. క్రియా 22

3 ప :- 1 లోనం - త; తోడన్ - ర, అ;

తే॥ క్షేత్రమాహాత్మ్యమును మహాక్షేత్రపాల
దివ్యచరితంబునందుండు దేవదేవు
గుణకలాపంబుఁబుండరీకుని మహిమయు
వింటిభవబంధములవీడుకొంటిదేవ ! 4

వ్యా :— క్షేత్ర = క్షేత్రముయొక్క - పౌండరీక క్షేత్రము యొక్క, మాహాత్మ్యమును = మహిమయు, మహాక్షేత్రపాల = (అ) గొప్పక్షేత్రమునుబాలించువానియొక్క - కాలభైరవునియొక్క. దివ్య= లోకాతీతమయిన, చరితంబు = చరిత్రయు, అందున్ = అచ్చోటు - ఆపౌండరీకమునందు, ఉండు = వర్తిల్లు, దేవదేవు = హరియొక్క - విట్ఠలునియొక్క, గుణకలాపంబు = సద్గుణసమూహమును, (కలాపో భూషణేబర్హే తూణీరేసంహతావపి - అమ) పుండరీకుని మహిమయున్= పుండరీకునిగొప్పతనమును, వింటిన్ = ఆలించితిని. దేవ = ఓదేవుడా!- ఓశంకరా! భవబంధములు = జన్మసంబంధముగల బంధనములు, వీడు కొంటిన్ = వదలించుకొంటిని.

దేవదేవుఁడు — "దేవానాం దేవేషువాదేవః శ్రేష్ఠత్వాత్ - శివః -- బ్రహ్మ -- విష్ణుః -- గణేశః" [శబ్దక] "దేవదేవ = దేవేషు మధ్యేదీవ్యతి" [శబ్దస్తో]

తే॥ ఎన్ని ద్వారంబు 1 లయ్యాయియొదవసించు
ద్వారదేవతలెందఱాస్థలమునందుఁ
బ్రబలు 2 క్షేత్రాశ్రితపుణ్యవైభవము 3 వేఱ
యొందుగలదని యానతియుండ మఱియు. 5

5 ప :- 1 లయ్యాయి - గః లాయాయి గౌ, లయ్యాయి - ర,అ. 2 క్షేత్రాది- ముద్రి [అ]. ర, క్షేత్రాలి - అ. 3 పేరనొందు ముద్రి [అ, ర; వేఱయొందు - అ.

వ్యా :— ద్వారములు = వాకిళ్లు, ఎన్ని = ఎంతసఖ్య గలవి? అయ్యాయియెడన్ = ఆయాస్థలమునందు - ఆయావాకిళ్ల యందు, వసించు = వర్తిల్లు, ద్వారదేవతలు = ద్వారపాలకులయిన వేల్పులు, ఎందఱు = ఎంతమంది? అస్థలమునందున్ = అచోట - ఆపౌండరీకమునందు, ప్రబలు = వర్ధిల్లు, క్షేత్రాళి = క్షేత్రశ్రేణి యొక్క, పుణ్యవైభవము = సుకృతసంపత్తి, వేఱయొండు = వేఱే యేదయినను, కలదేని = ఉన్నయెడల, మఱియున్ = ఇంకను, అనతియుండు = సెలవిండు, (దయచేసిచెప్పుఁడు)

క॥ అనినారదుండు ప్రార్థిం
చినఁబద్మదళాయతాక్షుఁజిత్తాంభోజం
బుననిల్పియతనిఁబలుకున్
మనసిజమర్దనుఁడు మధురమధురారభటిన్. ౬

వ్యా :— అని = ఈప్రకారముగా, నారదుండు = నారదుఁడు ప్రార్థించినన్ = వేఁడగా, మనసిజమర్దనుఁడు = మన్మథునిమర్దించిన వాఁడు - శివుఁడు, పద్మదళాయతాక్షున = తామరఱేకులవంటి విశాల ములయిన కన్నులుగలవానిని - విష్ణుమూర్తిని, చిత్తాంభోజంబునన్ = హృదయపద్మమునందు, నిలిపి = నెలకొనఁజేసి, మధురమధుర = మిక్కిలి తీయనయిన, ఆరభటిన్ = ధ్వనితో-కంఠస్వరముతో, అతనిన్ = అతనినిగూర్చి - నారదునిగూర్చి, పలుకున్ = (ఇట్లు) వచించెను.

ఆరభటి-ధ్వనియనునర్థము శబ్దకల్పద్రుమాది సంస్కృతనిఘంటువు లందుఁగానరాదు "ఆరభటి = క్రోఁత" - శ ర. ఈయర్థమును. సూ. ని. గ్రహింపవలేదు. గ్రహించియుండవలసినది.

---

ఆరభటీశబ్దరూపాంతరమగు 'ఆర్భటీ' శబ్దము శ. ర. సూ. ని. సంస్కృతనిఘంటువులలోఁగానరాదు.

వ్యాక :— పలుకున్ - భూతమునలాటు - బా. క్రియా. 22

## క్షేత్రమందలి యితర దేవతలు

క॥ సుఖమాలికాతరంగిణి
సఖియైభీమరథిఁగూడిచనునెచ్చటు స
త్సుఖకరమచ్చోటు, చతు
ర్ముఖముఖ 1 నుతసాది తీర్థమునునై వెలయున్. 7

వ్యా :— సుఖమాలికా = సుఖమాలికయను పేరుగల, తరంగిణి = నది, సఖియై = చెలియై - ఉపనదియై, భీమరథిన్ = భైమీనదిని, కూడి = కలిసి, ఎచ్చటున్ = ఏస్థలమునందు, చనున్ = ఒప్పునో, (చనెనలరెననంగనొప్పనవ్మాటుగాఁజెప్పఁబడును - ఆం. భా) అచ్చోటు = ఆస్థలము, సత్సుఖకరము = మంచిసౌఖ్యదాయమును, చతుర్ముఖముఖ = బ్రహ్మాదులచేత, నుతము = పొగడఁబడినదియు, ఆదితీర్థమునునై = ఆద్యమయిన తీర్థమునై, వెలయున్ = ఒప్పును.

వ్యాక :— చనున్ = చనునో, ఓ - అధ్యాహార్యము. (పౌ. వాక్య 13)

చతుర్ముఖుఁడు - నలువ. బ్రహ్మచతుర్ముఖ్యము ఖగోళ దృశ్యము, చూ 1 _ 3 వ్యాఖ.

క॥ పూర్వద్వారంబగునది
దర్వీకరసార్వభౌమ 2 తల్పునగరికిన్
సర్వసుపర్వార్చితపద
గీర్వనిత వసించునచటఁగృష్ణునియాజ్ఞన్. 8

7 ప :- 1 నత - డ: ద, బ; నుత - ర, అ;
8 ప :- 1 తల్పమగతి - గ; తల్పునగరికిన్ - ర, అ. గౌ;

వ్యా :— అది = అయ్యాది - సుఖమాలికానదియు భీమరథీ నటయుఁగలిసినతీర్థము, 7 ప దర్వీకరసార్వభౌమతల్ప = సర్ప చక్రవర్తి (ఆదిశేషుఁడు) శయ్యగాఁగలవానియొక్క (హరియొక్క) - విఠ్ఠలునియొక్క, నగరికిన్ = గుడికి, పూర్వద్వారంబు = తూర్పువాకిలి, అగున్ = అగును. సర్వసుపర్వ = సమస్తదేవతలచేతను, అర్చిత = పూజింపఁబడిన, పద = పాదములుగల, గీర్వనిత = వాక్కాంత - సరస్వతీదేవి, కృష్ణనియాజ్ఞన్ = హరియాదేశముచేత, అచటన్ = అక్కడ - ఆపూర్వద్వారమునొద్ద; వసించున్ = నివసించును.

వ్యాక :— నగరు + కు + ను = నగరికిని = నగరికిన్. ఔపవిభక్తికము.

క॥ శ్రీమహితము సిద్ధేశ్వర
నామాంకమపంక 1 మయసనాథములక్ష్మీ
కాముకనిహితముఖచరా
లీమాన్యము నైనశంభులింగముతోడన్. 9

వ్యా :— శ్రీమహితము = శోభచేతమన్నింపఁబడినది, సిద్ధేశ్వరనామ = సిద్ధేశ్వరమనుపేరు, అంకము = చిహ్నముగాఁగలది, అపంకము = పాపములేనిది; (అస్త్రీపంకంపుమాన్పాప్మాపాపంకిల్బిష కల్మషమ్ - అమ) అయ = శుభకరమగువిధితో, (అయశ్శుభావహోవిధిః - అమ) సనాథము = కూడుకొన్నది, లక్ష్మీకాముక = రమాపతిచే - విఠ్ఠలునిచే (ప్రియఃకామీచకాముకః. వల్లభోథపతిః ప్రేయాన్- ధనంజ) నిహిత = స్థాపింపఁబడినది - ప్రతిష్ఠింపఁబడినది, ఐన = అయినట్టి. శంభులింగముతోడన్ = శివలింగముతో, (మీఁది పద్యముతోనన్వయము)

---

9 ప :- 1 జలసనా - ముద్రి (అ), ర; మయ - అ, గౌ.

లింగము —

"లయంగచ్ఛతియత్రైవ, జగదేతచ్చరాచరమ్
పునఃపునఃసముత్పత్తిం, తల్లింగంబ్రహ్మశాశ్వతమ్
తస్మాల్లింగమితిఖ్యాతం, సత్యానందచిదాత్మకమ్
బృహత్వాద్బృంహణత్వాచ్చ, బ్రహ్మశబ్దాభిధేయకమ్"
(సిద్ధాంత)

క॥ తగుదక్షి 1 ణంపువాకిలి
నగధరునగరునకు; భీమ 2 నందనపొందున్
దగిలినయది యచ్చోటన
యగమ్యపుష్పావతీమహానదియనఘా! 10

వ్యా :— నగధరు = పర్వతధారియొక్క - గోవర్ధనధారి యొక్క (కృష్ణునియొక్క) - విఠ్ఠలునియొక్క; నగరునకున్ = గుడికి, దక్షిణంపువాకిలి = దక్షిణద్వారము, తగున్ = ఒప్పును. (కృష్ణ ప్రతిష్ఠితశివలింగసహితమగు సిద్ధేశ్వరమనునది, విఠ్ఠలునిగుడికి దక్షిణ ద్వారమనుట - 9 ప) అనఘా = ఓసుకృతీ! - ఓనారదా! అచ్చో టన = అస్థలమునందే, అగమ్య = ప్రాపింపరాని, పుష్పావతీమహా నది = పుష్పావతియనుపేరుగల గొప్పయేఱు, భీమనందన = భైమీ నదియొక్క, పొందున్ = కలయికను, తగిలినయది = పొందినది, (పుష్పావతీనదియచ్చటనేభైమీనదియందుసంగమమునందినదియనుట)

సుఖమాలికానదియు [7ప] పుష్పావతీనదియు భైమీనదికి నుపనదులన్న మాట

10 ప :- 1 ణంబు - ర [ప్రా] ణంపు - ర, అ, గౌ. 2 నందనుబొందున్-గ; నందనపొందున్ - ర, అ, గౌ.

వ్యాక :— పుష్పావతీ - పుష్ప+మత్+ఈ = పుష్ప+వత్+ఈ "మతౌబహ్వచోऽనజిరాదీనామ్" [పాణి] అనుసూత్రముచే దీర్ఘము - పుష్పావతీ. ఇదికులకము. [ప్రౌ. వ్యాక 23]

క॥ దానస్నానాదిహృతా
జ్ఞానానలదాహమైనసంగమతీర్థం
బానెలవునవిఖ్యాతం
బైనది; సురలుండుదురుశిలాకృతినందున్. 11

వ్యా :— దాన = త్యాగములు, స్నాన = మజ్జనములు, ఆది = మొదలయినవానిచేత, హృత = హరింపఁబడిన - అణ్పఁబడిన అజ్ఞాన = తెలివిలేమియనెడు, అనల = అగ్నియొక్క, దాహము = కాల్చుటగలది, ఐన = అయినట్టి, సంగమతీర్థంబు = సంగమమను తీర్థము, ఆనెలవునన్ = ఆస్థలమునందు - పుష్పావతీభైమీనదీసంగమ స్థలమునందు, విఖ్యాతంబైనది = మిక్కిలిప్రసిద్ధికెక్కినది. అందున్ = అచ్చట - ఆసంగమతీర్థమునందు, సురలు = దేవతలు, శిలాకృతిన్ = శిలారూపమున - విగ్రహరూపమున; ఉండుదురు = ఉందురు.

వ॥ అదిభవదీయాశ్రమంబగుట 1 నీవునెఱుంగుదు;
వదియునుంగాక. 12

వ్యా :— అది = అయ్యది - ఆసంగమతీర్థము, భవదీయ= నీదైన, ఆశ్రమంబు = నివాసస్థానము, అగుటన్ = అగుటచేత, నీవున్ = నీవును, ఎఱుంగుదువు = తెలియుదువు (నీకునుదెలియు ననటు) అదియునుంగాక = అంతేకాకుండ. [కింది పద్యముతో నన్వయము]

---

12 ప :- 1 నీవెఱింగు - ముద్రి [అ]. ర: నీవునెఱుంగు - అ, గౌ.

చ॥ కలఁడొకబోయతన్నికటకాననభూమి, నతండువిల్లున
మ్ములుధరియించి కల్మషసమూహము లెత్తిన 1 మేనుఁబోలెఁబె
రలుకవహించెనేనిహృదయంబుగలంగు, 2 ధరాధర 3 స్థలీ
నిలయ 4 వసత్కరీంద్రులకు నిక్కమ తక్కుమృగంబులోర్చునే? 13

వ్యా :— ఒక = ఒకానొక, బోయ = కిరాతుఁడు, తత్ = దానియొక్క - సంగమతీర్థము యొక్క, నికటకాననభూమిన్ = సమీపారణ్యప్రదేశమునందు, కలఁడు = ఉండెను. అతండు = అతఁడు - ఆకిరాతుఁడు, విల్లున్ = ధనుస్సును, అమ్ములున్ = బాణములును, ధరియించి = తాల్చి, కల్మషసమూహములు = పాపసముదాయములు ఎత్తిన, = తాల్చిన, మేనుఁబోలెన్ = శరీరమో! యనునట్లు, పేరలుక = అధికకోపమును, వహించెనేని = పొందినయెడల, ధరాధరస్థలీ = పర్వతప్రదేశమునందలి, నిలయ = ఉనికిపట్టులయందు, వసత్= నివసించుచున్న, కరీంద్రులకున్ = శ్రేష్ఠములయిన యేనుఁగులకు, నిక్కము+అ = నిజముగానే, హృదయంబు = మనస్సు, కలంగున్ = క్షోభించును. తక్కుమృగంబులు = తక్కినజంతువులు, ఓర్చునే = సహించునా? [సహింపలేవనుట]

నిక్కమహృదయంబుకలంగు —జాతీయమయినవ్యక్తీకరణము. 'నిజముగా' - నేఁటివ్యవహారము

అలం :— ఉత్ప్రేక్ష, అర్థాపత్తి

---

13 ప :- 1 మేనువోలె — గౌ; మేనుఁబోలె - ర, అ. 2 ధరాదరో - డ, త; ధరాధరో — గ, ధరోదర - గౌ; ధరాధర - ర, అ. 3 స్థలిన్ క, స్థలీ - ర, అ. 4 వసత్కటీంద్రునకు - క, వసత్కపీంద్రున- త; వసత్కరీంద్రులకు - ర, అ.

చ॥ అడవికివేఁటమైనరిగి యాతఁడొకానొకనాఁడొకింతయున్
మెడమలఁగింపలేక, తనమేపొడ 1 లొండొనురెండునేకమై
పొడమఁగ 2 బీదకన్ను 3 వడి, 4 బూడిదపండునుబోలెబూఁదుపా
ఱెడునొకదుప్పికిన్ 5 గలియఁ6 బ్రేలిభయజ్వరతప్తచిత్తమై. 14

వ్యా :— అతఁడు = అతఁడు - అబోయ, ఒకానొకనాఁడు = ఒకానొకదినము, అడవికిన్ = అరణ్యమునకు, వేఁటమైన్ = వేఁటకొఱకు, అరిగి = చని, ఒకింతయున్ = కొంచెమయినను, మెడ = గ్రీవము, మలఁగింపలేక = త్రిప్పలేక, తన = తనయొక్క, మేపొడలు = ఒడలిమచ్చలు, ఒండునురెండునేకమై = ఒకటిరెండు పరస్పరముకలిసియొక్కటియై, పొడమగన్ = పుట్టఁగా - ఏర్పడఁగా, బీదకన్నువడి = మేనిబలుపుచే సన్నగిల్లినకన్నులుగలదయి, బూడిదపండునుబోలెన్ = విభూతియుండవలె. బూఁదుపాఱెడు = బూఁజుపట్టిన, ఒకదుప్పికిన్ = ఒకానొకపృషతమునకు, (పృషతాఖ్యయ దరు దుప్పియనంగ - అం. భా.) కలియన్ = ఉఱుకఁగా, ప్రేలి = ప్రేలిపడి భయజ్వర = భీతియనెడు వేఁకిచేత, తప్త = తపింపఁజేయఁబడిన, చిత్తమై = మనస్సుగలదై. [మీఁదిపద్యముతో నన్వయము]

తే॥ అచనూరువుయూథంబుఁద్రోచిపఱచె
వింటునమ్మెర్చిబోయ 1 వెన్వెంటఁదఱుమ

---

14 ప :- 1 లొండ్లును - గ; లొడ్లను - ర [పా] లొండును - ర, అ, గౌ.
2 జీద - గ; ఙీఁద - ర, గౌ; బీద - అ 3 పడి - ర; వడి- అ. గౌ. 4 బూడెదపన్నును - గ; బూడెదపండును—గ; బూడిదపండును - ర. అ. గౌ. 5 గలయ - గౌ; గవియ - ర, అ.
6 బ్రౌలె - త; బ్రేకి - క; బ్రేలి - ర, అ.

15 ప :- 1 వెన్నంటఁదఱిమె - గ, వెన్వెంటఁదఱిమె - ర, గౌ. వెన్వెంటఁదఱుమ - అ.

లోలజిహ్వాకరాళవిశాలముఖత
2 మోవిభీతేందుమృగశాబమో! యనంగ. 15

వ్యా :— అచమూరువు = అయిఱ్ఱిజాతివిశేషము - అదుప్పి, (చూ 16 వ్యాఖ్య) వింటన్ = ధనుస్సునందు, అమ్ము = బాణము, ఏర్చి = సంధించి, బోయ = కిరాతుఁడు, వెన్వెంటన్ = మిక్కిలి వెనుకభాగమునందు, తఱుమన్ = కవియఁగా. లోల = చంచలమయిన, జిహ్వా = నాలుకచేత, కరాళ = భయంకరమయిన, విశాల = విరివియయిన, ముఖ = నోరుగల తమః = రాహువునకు (తమస్తురాహుః స్వర్భానుః సైంహికేయో విధుంతుదః - అమ) విభీత = మిక్కిలిభయపడినదియగు, ఇందు = చంద్రునియొక్క, మృగశాబమో = లేడిపిల్లయో, అనంగన్ = అనునట్లు, యూథంబు = సజాతీయసమూహమును - దుప్పులగుంపును, (యూథంతిర్యక్సమూహేస్యాద్బృంద మాత్రేచభాషితమ్ - విశ్వ) ద్రోచి = అతిక్రమించి, పఱచెన్ = పరుగెత్తెను.

బోయ, రాహువుగాను; సంధించిన బాణముగల ధనుస్సు రాహువుయొక్క నాలుకచేత భయంకరమయిన యారాహువుయొక్క వెడఁదనోరుగాను సంభావన.

బోయనల్లనివాఁడు. రాహువునునలుపే. కావుననే రాహువునుఁ దమస్సనుట.

రాహువుసూర్యచంద్రులనుగప్పెననుటఖగోళదృశ్యము భూచంద్రచ్ఛాయలకు రాహువుప్రతీక.

చంద్రునిలోని మచ్చనులేడిగాను గుందేలుగాను, వటవృక్షాదులుగానుజెప్పుదురు. [కవిక] మృగాంకశశాంకశబ్దములు ప్రసిద్ధములు.

అలం :— ఉత్ప్రేక్ష.

---

2 నోలి - ముద్రి (అ), ర; మోవిభీ – అ, గొ.

ఉ॥ ఆ రురువీగతిన్ బఱచియగ్రమహింబడిలేచి, వెండియున్
భూరిరయంబునంజని వపుర్వ్యథ సంగమతీర్థతీరవి
స్ఫారలతా 1 నికుంజములు 2 బల్విడిఁదూఱునెడన్ గిరాతుఁడున్
గ్రూరశిలీముఖంబుదొడి గుండియగాఁడఁగనేసె; నేసినన్. **16**

వ్యా :— ఆ రురువు = ఆయిఱ్ఱిజాతిభేదము - ఆదుప్పి, ఈగతిన్ = ఈవిధముగా, పఱచి = పరుగెత్తి, అగ్రమహిన్ = ముందటి భాగమునందు, పడి = కూలి, లేచి = ఉత్థితమయి, వెండియున్ = మఱియు, భూరి = అధికమయిన, రయంబునన్ = వేగముతో; చని = అరిగి, వపుః = దేహముయొక్క, వ్యథన్ = బాధచేత, సంగమతీర్థ = సంగమతీర్థముయొక్క, తీర = ఒడ్డునందలి. విస్ఫార = మిక్కిలియధికమయిన. లతానికుంజముల = తీఁగపొదరిండ్లను, బల్విడిన్ = శీఘ్రముగా, తూఱునెడన్ = చొచ్చునమయమున, కిరాతుఁడున్ = బోయయు, క్రూర = భయంకరమయిన, శిలీముఖంబు= బాణము. (అళిబాణౌశిలీముఖౌ - అమ) తొడి = సంధించి, గుండియ = గుండెయందు. గాఁడఁగన్ = గ్రుచ్చుకొనునట్లు; ఏసెన్ = ప్రయోగించెను. ఏసినన్ = ప్రయోగింపఁగా "మీఁదిపద్యముతోనన్వయము"

రురువు, దుప్పి (14 ప) చమూరువు (15 ప) మృగవిశేష వాచకములు. రురువు = నల్లచారలదుప్పి, దుప్పి = పృషతము, తెల్లమచ్చలయిఱ్ఱి, చమూరువు = సంశయాస్పదమైనతోఁకగలిగి, తెలుపుగాని నలుపుగాని నానావర్ణములుగాని కలిగినమృగము - గురుబాల, మృగవిశేషవాచకములను మృగసామాన్య వాచకములుగా వాడుట యౌపచారికము.

వ్యాక :— గుండియ = గుండియయందు (ప్రౌ. కారక 20)

---

16 ప :- 1 నికుంజకము - క; నికుంజములు - ర, అ. 2 బల్వడి-ర,అ; బల్విడి - గొ.

సీ॥ ఆశరముఖనిభంబాశరమటుగాఁడఁ
బవనాభిహతిఁదూలుబంధుజీవ
కుంజంబు 1 పూవులఁ 2 గూలించువిధమున
నవనవక్షతజబిందువుల దొరఁగఁ
జేయుచు, వివృతాస్యసీమఁబ్రాణానిల
ప్రస్థానపటుహోగ్రరవమనంగ
నార్తనాదముగ్రగమ్మనదియేటితెలినీటి
తెమలున నుటికి దేదీప్యమాన

తే॥ హాటకవిమానమెక్కి విద్యాధరేంద్రుఁ
3 డగుచు, లావణ్యపుష్పాస్త్రుఁడగుచుఁ, జంద్రు
సాంద్ర 4 తర కాంతియగుచు, నతీంద్రమహిమ
గగనమునకేఁగెఁదొలుమేను 5 గానఁబడదు. 17

వ్యా :— ఆశర = అగ్నియొక్క, (ఆశరస్తుపుమాన్వైశ్వానరేచ రజనీచరే - మే. ని.) ముఖ = శిఖతో (అగ్నిజ్వాలతో - అనుట) నిభంబు = సదృశమయిన, ఆశరము = ఆబాణము. అటు = అట్లు, కాఁడన్ = (గుండెయందు) నాటఁగా, పవన = గాలియొక్క, అభిహతిన్ = పెద్దదెబ్బచేత, తూలు = చలించు, బంధుజీవకుంజంబు = మంకెనపొద, పూవులన్ = పుష్పములను, కూలించువిధమునన్ = రాల్చునట్లు, నవనవ = మిక్కిలికొ్రత్తవయిన, క్షతజబిందువులు = నెత్తురుబొట్లు, తొరఁగఁజేయుచున్ = స్రవింపఁజేయుచు, వివృత = తెఱవఁబడిన, అస్యసీమన్ = ముఖప్రదేశమువలన (నుండి) ప్రాణా

17 ప :- 1 పూవులు – గౌ: పూవుల - ర, అ. 2 గూరించు - ప: గూలించు ర, అ. 3 దరుగు - గౌ: డగుచు - ర, అ. 4 తను - ముద్రి [అ]. ర; తర – అ. 5 కానఁబడదు - ర, అ. కానఁబడఁగ-త, కానఁబడదు – గౌ.

నిల = ప్రాణవాయువుయొక్క, ప్రస్థాన = గమన (ప్రయాణ) కాలమునందలి, పటుహ = తప్పెటయొక్క, ఉగ్ర = భయంకర మయిన, రవము = ధ్వని, అనంగన్ = అనునట్లు, ఆర్తనాదము = ఆక్రందనము: క్రమ్మన్ = వ్యాపింపఁగా, అది = అయ్యది - అదుప్పి ఏటి = (భైమీ) నదియొక్క - సంగమతీర్థముయొక్క, తెలి= స్వచ్ఛ మయిన, నీటి = జలముయొక్క, తెమలునన్ = ప్రవాహమునందు, ఉటికి = దుమికి, దేదీప్యమాన = మిక్కిలి ప్రకాశించుచున్న, హాటక విమానము = బంగారుదేవరథమును, ఎక్కి = అధిరోహించి, విద్యాధరేంద్రుఁడు = ఇంద్రునివంటిఖేచరుఁడు - శ్రేష్ఠుఁడయిన ఖేచరుఁడు, అగుచున్ = అయి, లావణ్య = సౌందర్యమునందు, పుష్పాస్త్రుఁడు = మన్మథుఁడు, అగుచున్ = అయి, చంద్ర = శశివతె. సాంద్రతర = మిక్కిలి దట్టమయిన, కాంతి = ద్యుతిగలవాఁడు, అగుచున్ = అయి, అతీంద్ర = అతిక్రమించిన యింద్రుఁడుగల, మహిమన్ = గొప్ప తనముతో, గగనమునకున్ = ఆకాశమునకు - స్వర్గమునకు, ఏగెన్ = అరిగెను. తొలుమేను = పూర్వదేహము (ఇట్టిశరీరమనుట) కానఁబడదు = చూపట్టదు.

ప్రస్థానకాలమున వాద్యములు మ్రోఁగించుట యాచారము. "యానప్రక్రమ సూచకంబులగుతూర్యంబుల్" (విరాట 3-143) కావున నాక్రందనధ్వనిప్రాణవాయుప్రయాణకాలపటుహధ్వనివలెనున్నదనుట.

అలం :— ఉపమ.

శా॥ చిత్తంబద్భుతమందనమ్మృగవధాజీవుండులోలోనఁద
ద్వృత్తంబుల్బలుమాఱుమెచ్చి, నిజదుర్వృత్తిన్ విసర్జిం 1 చుచున్
దత్తీర్థాంబువు 2 లాడికోర్కిలివిగతాతంకాత్ముఁడై శుద్ధిద
శోత్కృత్తిన్ముక్తశరీరుఁడైకనియెదివ్యుల్మెచ్చనుచ్చస్థితిన్. 18

18 ప ॥ 1 పుచుక - గొ, చుచుక - ర, అ. 2 నాడి-ర,అ. లాడి-ర [టీక]

వ్యా :— అమ్మృగవధాజీవుండు = ఆజంతువులను జంపుట బ్రదుకుతెరువుగాఁగలవాఁడు - అబోయ, చిత్తంబు = మనస్సు, అద్భుత మందన్ = ఆశ్చర్యపడఁగా, లోలోనన్ = లోలోపల - మనస్సు లోపల, తద్వృత్తంబున్ = ఆకడచినవృత్తాంతము, పలుమాఱు = పెక్కు పర్యాయములు, మెచ్చి = కొనియాడి, నిజ = తనదైన, దుర్వృత్తిన్ = దుష్టమయిన వర్తనమును, విసర్జించుచున్ = విడిచిపుచ్చుచు, తత్తీర్థాంబువులు = ఆ (సంగమ) తీర్థజలములందు, ఆడి = స్నానముచేసి, క్రోలి = (ఆసంగమతీర్థజలములను) త్రాగి, విగత = పోయిన - నశించిన, ఆతంక = సందేహముగల, ఆత్ముఁడై = మనస్సుగలవాఁడై శుద్ధి = పవిత్రత, తళ్కొత్తన్ = సంభవింపఁగా - సిద్ధింపఁగా, ముక్త = విడువఁబడిన, శరీరుఁడై = దేహముగలవాఁడై, దేహత్యాగముచేసినవాఁడై - అనుట దివ్యుల్ = దేవతలు, మెచ్చన్ = కొనియాడఁగా, ఉచ్చస్థితిన్ = ఉన్నతస్థానమును, కనియెన్=పొందెను

వ్యాక :— తీర్థాంబువులాడిక్రోలి - తీర్థాంబువులు = తీర్థాంబువులందు - ప్రౌ. కారక 20, తీర్థాంబువులు = తీర్థాంబువులను - బా. కారక 24. విభక్తివిపరిణామము గ్రాహ్యము- ప్రౌఢ- కారక 26

క॥ కావునఁదత్తీర్థంబున
నేవలనఁబరాసులగు విహీనమతులకున్
గైవల్యసిద్ధియగువన
1 నీవలనతిశుద్ధమతులనేటికినెన్నన్. 19

వ్యా :— కావునన్ = కాఁబట్టి, తత్తీర్థంబునన్ = ఆ (సంగమ) తీర్థమునందు, ఏవలనన్ = ఏవిధముగానయినను, పర = పోయిన, అసులు = ప్రాణములుగలవారు - మరణించినవారు, అగు =

19 ప :- 1 నీవతె - ముద్రి [అ], ర; నీవల - అ.

అయిన, విహీనమతులకున్ = మిక్కిలియధమబుద్ధిగలవారికి, కైవల్య సిద్ధి = మోక్షప్రాప్తి, అగుననన్ = అగుననఁగా, ఈవలన్ = ఇఁక, అతిశుద్ధమతులన్ = మిక్కిలిపవిత్రమయిన బుద్ధులుగలవారినిగూర్చి, ఏటికిన్ = ఎందులకు, ఎన్నన్ = పరిసంగించుట? అతిశుద్ధమతులకుఁ గైవల్యప్రాప్తియగునని చెప్పనక్కఱలేదనుట.

సీ॥ 1 సంధ్యలు 2 మూఁటు 3 నిచ్చనివాళులిచ్చుచు
బిరుదాంకమాలికల్ పేరుకొనుచు
లోచూపుదివ్వటు నాలోకించిచొక్కుచుఁ
బులకాశ్రుగాద్గద్యములఁబొరయుచు
శ్రుతులెట్టులట్లసంస్తుతులాచరిం 4 చుచు
5 వీనులఁదత్కథా 6 వితతివినుచుఁ
గరతాళగతులఁజొక్కటముగానాడుచు
7 నావేళమూర్ఛల నలఁతఁగనుచు

తే॥ విష్ణుసేవింతురచటనవ్విబుధవల్ల
భాజనం 8 బులు, తత్కృపాభాజనంబు
లమ్మహాక్రీడనస్థలినాచరించె
లంఘనాక్రీడనముదొల్లిలచ్చిమగఁడు, 20

వ్యా :— సంధ్యలుమూఁటన్ = సంధ్యాకాలములుమూఁడింటి

---

20 ప :- 1 సంధ్యల - ర; సంధ్యలు - అ. 2 మూఁడు – గ; మూఁట - ర, అ. 3 నిచ్చలునివాళిచ్చు - గౌ; నిచ్చనివారు -గ; నిచ్చనివాళు లిచ్చుచు - ర, అ. 4 పుచు - గౌ, చుచు - ర. అ. 5 విష్ణునిన్-గ వీనుల - ర, అ. 6 వినుతి - గ; వితతి - ర, అ. 7 నావేళ- డ, ద, బ; నావేశ - ర, అ. 8 బుల-గౌ; బులు - ర, అ.

యందు (ప్రాతర్మధ్యాహ్న సాయంసంధ్యాకాలములమూఁడింటియందు-అనుట) నిచ్చనివాళులు = ప్రతిదినమునియతముగానిచ్చునీరాజనములు, ఇచ్చుచున్ = ఒసఁగుచు. (నీరాజనాభిధనెగడునివాళియారతినాఁగ - ఆం. భా) బిరుదాంకమాలికల్ = బిరుదరూపస్తోత్రపంక్తులను, పేరుకొనుచున్ = పారాయణముచేయుచు.

బిరుదము — "విరుదః = విరుదంకవయః ప్రాహుర్గుణోత్కర్షాదివర్ణనమ్" చూ. 2-172 వ్యాఖ్య.

అంకమాలికల్ — కు. సం. 3-281, అంకనములు - పండితా 48 పు. అంకనసేయుదు-వృషా 59 ప. అంకింపఁడు-పండితా 203 పు. అంకించుచున్న - భాగ 8 స్కం - 134

27 లోచూపు = అంతర్దృష్టియొక్క (జ్ఞానదృష్టియొక్క-అనుట) తివుటన్ = ప్రయత్నముచేత, ఆలోకించి = చూచి, చొక్కుచున్ = పరవశించుచు, పులకాశ్రుగద్గద్యములన్ = గగుర్పాటులనుగన్నీళ్లను గొంతుబొంగురువడుటలను, పొరయుచున్ = పొందుచు

పులకాశ్రుగాద్గద్యములు సాత్త్వికభావములు.

"స్తంభః స్వేదోఽథరోమాంచః, స్వరభంగోఽథవేపథుః
వైవర్ణ్యమశ్రుప్రళయ. ఇత్యష్టౌసాత్త్వికాఃస్మృతాః" (సా. ద)

37 శ్రుతులు = వేదములు, ఎట్టులు = ఏప్రకారమో - ఏ ప్రకారముగా స్తుతించునో, అట్లు = ఆప్రకారముగానే, సంస్తుతులు = స్తోత్రములు, ఆచరించుచున్ = చేయుచు, వీనులన్ = చెవులతో - ఆసక్తితో, తత్కథావితతిన్ = అతనియొక్క (విష్ణునియొక్క) చరిత్రల సమూహమును, వినుచున్ = ఆలకించుచు,

పీనులవిను - ఇది జాతీయమయిన వ్యక్తీకరణము. శ్రుతులు - వేదములు "శ్రుతిస్తువేదోవిజ్ఞేయో, ధర్మశాస్త్రంతువైస్మృతి" (మ. స్మృ)

4 కరతాళ = చేతితోవాయించు వాద్యవిశేషములయొక్క, (కరతాళమ్ = కరాభ్యాంహస్తాభ్యాంపీయమానస్తాళోయత్ర - వాద్య విశేషః - శబ్దక) గతులన్ = రీతులతో - మోగించువిధానములతో, చొక్కటముగాన్ = ఒప్పిదముగా, ఆడుచున్ = నర్తించుచు, ఆవేశ మూర్ఛలన్ = (భక్తిజన్యమగు) నుద్రేకమువలని సొమ్మసిల్లుటలచేత, అలతన్ = శ్రమను, కనుచున్ = పొందుచు.

అచటన్ = ఆ కోట - అసంగమతీర్థమునందు, తత్ = అతని యొక్క - అవిట్టలునియొక్క, కృపా = దయకు, భాజనంబులు = పాత్రములయిన, అవ్విబుధవల్లభాజనంబులు = ఆదేవపక్షి జనములు, విష్ణున్ = కృష్ణుని-విట్ఠలుని, సేవింతురు=భజింతురు అమ్మహాక్రీడనస్థలిన్= ఆగొప్పదయిన క్రీడాస్థానమునందు, లచ్చిమగఁడు = లక్ష్మీపతి - విట్ఠలుఁడు, తొల్లి = పూర్వము, లంఘనాక్రీడనము = కుప్పిగంతు లాటను, ఆచరించెన్ = ఒనర్చెను. (కుప్పిగంతులాటయాడెననుట)

లంఘనాక్రీడనము - కుప్పిగంతులాటకుసంస్కృతీకరణరూపము ము. కా "కుప్పిగంతులు పిడిగుద్దులాటలు పిల్ల, దీవులు గొబ్బిళ్లు గూవనాలు, నాదిగాశైశవక్రీడలాడిరపుడు; రామకృష్ణులు గోపదారకులఁ గూడి" (వి. పు 7-202)

మ॥ విను, మున్శౌరికినోడి సంగమమరుద్విద్వేషియొచ్చోటికో
చని, వెండింజనుదెంచి, యచ్చటశిలాసంఛన్నదేహంబుతో
డనిలాగర్భమునందుదాఁగఁగని 1 గాఢకోపోద్ధుఁడై దేవకీ
తనయుండా శిలగ్రొచ్చివైచిమెదిపెన్దద్దైత్యు జూర్ణంబుగన్ 21

---

21 ప :- 1 బాధ - గ; గాఢ - ర, అ, గొ.

వ్యా :— విను = (నారదా!) ఆకర్ణింపుము. మును = పూర్వము, సంగమ = సంగముఁడను పేరుగల. మరుద్విద్వేషి = దేవతావిరోధి - దైత్యుఁడు, శౌరికిన్ = కృష్ణునకు - విట్ఠలునకు, ఓడి = భయపడి, ఎచ్చోటికో = ఎక్కడికో, చని = అరిగి, వెండిన్ = మఱియు, (మరల - అనుట) చనుదెంచి = వచ్చి, అచ్చటన్ = అక్కడ - ఆసంగమతీర్థమునందు, శిలా = ఱాతితో, సంఛన్న = బాగుగాఁగప్పఁబడిన, దేహంబుతోడన్ = శరీరముతో, ఇలాగర్భము నందున్ = భూగర్భమునందు, (భూమిలోపల - అనుట) దాఁగన్ = మఱుఁగుపడఁగా, కని = చూచి, గాఢక్రోధుఁడై = మిక్కుటమయిన కోపముగలవాఁడయి, దేవకీతనయుండు = దేవకీసుతుఁడు - కృష్ణుఁడు (విట్ఠలుఁడనుట) ఆశిలన్ = ఆఱాతిని, గొబ్బిచ్చివైచి = పెల్లగించి వేసి, తద్దైత్యున్ = ఆ దితిసుతుని, చూర్ణంబుగన్ = పొడియగునట్లు, మెదిపెన్ = నలఁగఁగొట్టెను, [చూర్ణము చేసెననుట]

శౌరి = "శూరఇతి వసుదేవస్యపితా, తస్యగోత్రాపత్యంశౌరిః" [గురుబాల]

క॥ 1 పువ్విలుతుతండ్రియచ్చట
ముప్వం 2 క మురుపునమురళిమోయించె మనం
3 బువ్విళులూరఁగ శ్రుతులకు
నవ్విధము తదీయపదయుగాంకము 4 దెలుపున్. 22

వ్యా :— అచ్చటన్ = ఆస్థలమునందు - అసంగమతీర్థము నందు, పువ్విలుతుతండ్రి = మదనజనకుఁడు [హరి] - విట్ఠలుఁడు.

---

22 ప :- 1 పువ్విల్తు -గౌ, పువ్విలుతు - ర, అ. 2 కలమురువుమురళీ-క; కమురువునమురళి - ర, అ. 3 బువ్విళ్లూరఁగ - ర; బువ్విళు లూరఁగ - అ, గౌ. 4 దెలుపన్ - ర, గౌ; దెలుపున్- అ

ముప్వంక = మూఁడువంకరలసమాహారముగలిగిన, మురువునన్=సొగసుతో, శ్రుతులకున్ = వేదములకు, మనంబు = హృదయము, ఉవ్విళులూరఁగన్ = తహతహపడఁగా, మురళిన్ = వేణువును, మ్రోయించెన్ = మోఁగించెను. [ఊఁదెను] అవ్విధము = ఆరీతిని - ముప్వంకగానిల్చిమురళియూఁదిన రీతిని, తదీయ = అతనిదయిన - అవిట్లునిద్దైన, పదయుగ = అడుగుదోయియొక్క, అంకము = చిహ్నము, తెలుపున్ = ఎఱిఁగించును. (పాదచిహ్నములు ముప్వంక మురువుతోమురళి మ్రోయించెనను విషయమునెఱిఁగించుననుట)

ముప్వంక మురువు - చూ 4-134 వ్యాఖ్య

క॥ మహినేవంవిధచిత్ర
వహమగు నద్దక్షి 1 ణంపు 2 వాకిటి 3 మహిమల్
బహు 4 ముఖములవినుతింపఁగ
నహిపతియుంజాలఁడనిన నన్యులవశమే. **23**

వ్యా :— మహిన్ = భూమియందు. ఏవంవిధ = ఇటువంటి, చిత్రవహము = ఆశ్చర్యముకలిగించునది, అగు = అయిన, అద్దక్షిణంపువాకిటి మహిమల్ = ఆదక్షిణద్వారముయొక్క (=ఆసంగమతీర్థముయొక్క - అనుట) మాహాత్మ్యములు, అహిపతియున్ = సర్పరాజును - ఆదిశేషుఁడును, బహుముఖములన్ = పెక్కుమోములతో - వేనోళ్ళతో, వినుతింపఁగన్ = స్తుతించుటకు, చాలఁడు = శక్తుఁడు కాఁడు, అనినన్ = అనఁగా, (అన్నచో) అన్యులవశమే = ఇతరులకు శక్యమా? (శక్యముకాదనుట)

అలం :— అర్థాపత్తి

---

23 ప :- 1 ణంబు - గొ; ణంపు - ర.అ. 2 వాకిట-ముద్రి(అ) వాకిటి-ర,అ. 3 మహితుల్-గ; మహిమల్-ర,అ;గొ. 4 విధముల-ర; ముఖముల-అ,గొ.

సీ॥ తనకటాక్షములు సంతానచింతారత్న
నిర్మాణపరమాణునికరమనఁగఁ
దనవిలాసంబు మద్వైరిశంబరనిషూ
దనపాలిత 1 పురః పతాకయనఁగ
దనమనస్సరసిసంతతచిదానందమై
భవమరాళము 2 నున్కిపట్టనంగఁ
దనప్రసాదంబు భక్తవరేణ్యదుర్గతి
క్షాళనోచితచంద్రగోళియనఁగ

తే॥ వెలయునేదేవియాదేవి విదుమదు
కదునిర్ణిద్ర 3 తనుకాంతిభద్రపరమ
మాయభువనేశ్వరి 4 వసింప, మధువిరోధి
5 ధామమునఁగల్గుపశ్చిమద్వారమమరు. 24

వ్యా ;— తన = తనయొక్క, కటాక్షములు = క్రేఁగంటి చూపులు, సంతాన= సంతానమను పేరుగల దేవతావృక్షములయొక్కయు చింతారత్న = చింతామణులయొక్కయు, నిర్మాణ = నిర్మితియందు అయిన. పరమాణు = పీలువులయొక్క, నికరమనఁగన్ = సమూహమో యనునట్లును.

భువనేశ్వరీదేవి క్రేఁగంటిచూపులు సంతానచింతామణుల నిర్మాణమున నుపయుక్తమయిన పరమాణువులోయన్నట్లున్నవనుట.

సంతానచింతామణులు కోరిన కోరికలనిచ్చును. గావున నామె క్రేఁగంటిచూపులు వాంఛితార్థప్రదములనితాత్పర్యము.

---

24ప: పురః[రీ?]. అ:పురః.ర,గౌ. 2కున్కి.ముద్రి[అ].ర. న:న్కి.అ,గౌ. 3తర.త; తను.ర,అ. 4 వసించు - చ, ప; వసింప - ర,అ. 5 నామ ప; ధామ-ర,అ,గౌ.

సంతానము, దేవతరుపంచకములోనొకటి. చూ 1-62 వ్యాఖ్య.

పరమాణువులు జగత్కారణములని వైశేషికన్యాయదర్శనములు తెలుపును. నేఁటివైజ్ఞానికులును బ్రపంచము తొంబదిరెండుమూలపదార్థములతోనేర్పడెననియు నీమూలపదార్థములలో న్యూట్రానులు. ప్రోటానులు, ఎలక్ట్రానులునను పరమాణువులే యుండుననియుఁగనుఁగొనియున్నారు. పరమాణుసంఖ్యాభేదముచేవస్తుభేదమేర్పడెను. ఉదా ॥

| | | | | |
|---|---|---|---|---|
| బంగారము | — | 79 ప్రో, | 118 న్యూ, | 70 ఎల |
| సీసము | — | 82 ప్రో, | 125 న్యూ, | 82 ఎల |
| పాదరసము | — | 80 ప్రో, | 122 న్యూ, | 80 ఎల |

సంతాన చింతారత్నములును బరమాణునిర్మితములేకావలెను. ఆపరమాణువుల సంయోగమునకు భువనేశ్వరీదేవి క్రేఁగంటిచూపులు ప్రేరకములేమో! యని సంభావన. న్యాయదర్శనపక్షమున నీశ్వరుఁడు సృష్టికి నిమిత్తకారణము. అద్వైతమతమున నీశ్వరుఁడు నిమిత్తోపాదానకారణము.

2. తన = తనయొక్క, విలాసంబు = సౌందర్యము, మత్ = నాయొక్క, వైరి, శత్రువయిన, శంబరనిషూదన = శంబరాసురహంతచేత - మన్మథునిచేత, (వక్త-శివుఁడు) పాలిత = పాలింపఁబడిన, పురః = ఎదుటిభాగమునందున్న, పతాకయనఁగన్ = జెండాగుడ్డయోయనునట్లును.

3. తన = తనయొక్క, మనస్సరసి = హృదయమనెడు సరోవరము, సంతత = ఎల్లప్పుడు, చిదానందవైభవ = జ్ఞానానందసంపత్తియనెడు, మరాళము = హంసయొక్క, ఉన్కిపట్టు = నివాసస్థానమో, అనంగన్ = అనునట్లును.

4] తన = తనయొక్క, ప్రసాదంబు = అనుగ్రహము, భక్తవరేణ్య = భక్తముఖ్యులయొక్క, (ముఖ్యవర్యవరేణ్యశ్చ-అమ) దుర్గతి = దుస్థితిని, క్షాళన = కడిగివేయుటకు - తొలఁగించుటకు, ఉచిత = యోగ్యమయిన, చంద్రగోళియనఁగన్ = వెన్నెలయోయనునట్లును, (చంద్రికా చంద్రిమాచాంద్రి, కౌముదీచంద్రగోళికా - వై. ని.)

ఏదేవి = ఏభగవతి (దేవస్యపత్నీ. దేవ+జీష్) వెలయున్ = ఒప్పునో, ఆదేవి = ఆభగవతి, విద్రుమమ్రు = పగడపుఁజెట్టువలె, "పలాశీద్రుద్రుమాగమాః - అమ" కద్రు = పింగళవర్ణముగల - బంగారువన్నెగల, ("కద్రుఃకనకపింగళః - ఇతినామమాలా" శబ్దక) స్నిగ్ధద్రి = ప్రిస్ఫుటమయిన, తనుకాంతి = శరీరద్యుతిచేత, భద్రి = ఒప్పిదమయినదియు, పరమ = ఉత్కృష్టురాలగు, మాయ = దుర్గయునగు, "మాయా = దుర్గా - శబ్దక | భువనేశ్వరి = భువనేశ్వరీదేవి, వసింపన్ = నివసింపఁగా, మధువిరోధి = హరియొక్క - విట్ఠలునియొక్క, ధామమునన్ = నిలయమునందు, కల్గు = ఉండు, పశ్చిమద్వారము = పడమటివాకిలి, అమరున్ = ఒప్పును.

విద్రుమద్రుకద్రు - ఇటుఁబీతరక్తములకైక్యము కవిసమయము. "పీతరక్తయోః -- నిబంధనంచకవిసమయః" [కావ్యమీ-]

అలం ;— ఉత్ప్రేక్ష.

ఉ॥ 1బోర్మహిషున్నిజాంఘ్రిఁగలబొట్టనవ్రేల్తుదమట్టిపట్టిమున్.
పేర్మిఁదదంగమున్ 2 మెదిచిపెట్టిననెత్తురు 3 బొట్టువోలె, జ్యో

---

25 ప :- 1 పోర్మ - ముద్రి (అ) ర: బోర్మహిషిన్ - గా, బోర్మహిషున్-అ.
2 మెదిపి - ముద్రి - (అ). ర, గా, మెదిచి - అ; మెదటి-గ.
3 బొట్టుఁబోలె - ర; బొట్టువోలె - అ, గా.

తిర్మయవీక్షణంబలిక 4 దేశమునంగలదుర్గ, 5 స్వర్గదన్
6 వార్మణిధారియుత్తరపువాకిటనిల్పినవాఁడు 7 కాపుగన్. 25

వ్యా :— బోర్మహిషున్ = గోండ్రుమని గర్జించు మహిషాసురుని, నిజ = తనదైన, అంఘ్రిన్ = పాదమునందు, కల = ఉన్న, బొట్టనవేఁల్తుదన్ = అంగుష్ఠాగ్రముతో, మట్టిపట్టి = తొక్కిపట్టి, మున్ = పూర్వము, పేర్మిన్ = ప్రీతితో, తత్ = అతనియొక్క-మహిషాసురునియొక్క, అంగమున్ = దేహమును, మెదిచి = మర్దించి, పెట్టిన = తాల్చిన, నెత్తురుబొట్టువోలెన్ = రక్తతిలకమోయనునట్లు; జ్యోతిర్మయ = అగ్నిమయమయిన, (జ్యోతిస్తారాగ్నిభాజ్వాలా-వై.ని.) వీక్షణంబు = నేత్రమును, అలికదేశమునన్ = నుదుటిభాగమునందు, కల = కలిగిన, స్వర్గదన్ = నాకమునొసఁగునదియగు. దుర్గన్ = దుర్గాదేవిని, వార్మణిధారి = నీటిమానికమును (కౌస్తుభమును) ధరించువాఁడు - విట్ఠలుఁడు, ఉత్తరపువాకిటన్ = ఉత్తరద్వారమునందు, కాపుగన్ = రక్షకురాలుగా, నిల్పినవాఁడు = వసింపఁజేసినవాఁడు.

వార్మణి = నీటికెంపు. చూ 1-13 వ్యాఖ్య.

ఇందుఁ బేర్కొనఁబడిన దుర్గమహిషాసురమర్దనియగు భద్రకాళి (చూ 5.29)

"సింహమారుహ్యకల్పాంతే, నిహతోమహిషోయయా
మహిషఘ్నీతతోదేవీ, కన్యావై సింహవాహనీ" (దేవీపు)

దుర్గకులలాటనేత్రముండుననుటకు - "నౌమిభాల విలోచనాం, మహిషోత్తమాంగనిషేదుషీమ్" (తంత్రి)

---

4 దేహ - ఉ. ద, బ; దేశ – ర, అ. 5 సర్గ – క; స్వర్గ - ర. అ.
6 వార్మణధారినుత్త - ఉ. ద. బ; వార్మణిధారియుత్త - అ,ర,గౌ;
7 కాపుగాన్ – ర; కావుతఁ - గౌ; కాపుగఁ - అ.

వ్యాక :— బోరు + మహిషున్ = బోర్మహిషున్. [బా. ప్రకీర్ణక 16]

అలం :— ఉత్ప్రేక్ష

*క॥ తరణియుభైమియును బర
స్పరమచ్చటఁగూడినిగుడఁబావనమగుత
త్సరిదంబువునందాడిన
నరునకునవ్వారిపాదనఖమున వెడలున్. 26

వ్యా :— అచ్చటున్ = అస్థలమునందు - అయుత్తరపువాకిటికి సమీపప్రదేశమునందు,(25ప) తరణియున్=తరణీనదియు, భైమియును= భైమీనదియు, పరస్పరము = అన్యోన్యము, కూడి = కలిసి, నిగుడన్ = ప్రవహింపఁగా, పావనమగు = పవిత్రమగు, తత్సరిత్ = ఆ నది యొక్క, అంబువునందున్ = నీటియందు [తరణీభైమీనదులు కలిసిన కూడలి స్థలమునందలి నీటియందు- అనుట] ఆడిన = స్నానముచేసిన నరునకున్ = మానవునకు. అవ్వారి = అనీరు, చరణనఖమునన్ = కాలిగోటియందుండి, వెడలున్ = నిర్గమించును. విష్ణుసారూప్యమోక్షము కలుగుననుట.

విష్ణుపాదమునుండి గంగ పుట్టినది. తరణీభైమీనది కూడలిలో స్నానముచేసిన నరునకు నానదీజలము చరణనఖమునుండి బయలు వెడలుననుటచే విష్ణుపాదమునుండి గంగపుట్టుటయనులక్షణము ప్రాపించు నన్నమాట. ఇట్లు చెప్పుటచేఁదరణీభైమీనదీసంగమజలమునకు గంగతో నభేదము సూచితము. కాఁగాఁబాదనఖమున భైమీనదీజలము వెలువడుట

*"ఈపద్యము. చ - త లలోలేదు. పూర్వోత్తరపద్యములతో సందర్భశుద్ధియు చాలదు." — 'అ' అధోజ్ఞాపిక.

విష్ణుసారూప్యసూచకము. సారూప్యము = చూ 5.151 వ్యాఖ్య. విష్ణుసారూప్యముకలుగునని భంగ్యంతరముగఁజెప్పబడినది.

అలం :— పర్యాయోక్తి.

క॥ ఎవ్వఁడు వ్యాధిగ్రస్తుం
డెవ్వఁడుభయవిహ్వలాత్ముఁడెవ్వం 1 డధనుం
డవ్వాఁడచ్చటి దుర్గం
బువ్వులఁబూజించి యిష్టభోగము 2 లందున్. **27**

వ్యా :— వ్యాధిగ్రస్తుండు = రోగముచేనాక్రమింపఁబడిన వాఁడు, ఎవ్వఁడు = ఎవఁడో, భయ = భీతిచేత, విహ్వలాత్ముండు = వ్యాకులపడిన మనస్సుగలవాఁడు - దరిద్రుఁడు, ఎవ్వండు = ఎవఁడో అవ్వాఁడు = అతఁడు, అచ్చటిదుర్గన్ = అక్కడనున్న (ఉత్తరద్వార మునందున్న) దుర్గను, పువ్వులన్ = పుష్పములతో, పూజించి = అర్చించి ఇష్టభోగములు = కోరిన సుఖములను, అందున్ = పొందును. [పొందును.]

వ్యాక :— ఎవ్వఁడు = ఎవ్వఁడో. ఓ - అధ్యాహార్యము. [ప్రౌ. వాక్య. 13]

వ॥ ఇన్నాలుగునంతర్ద్వారంబు 1 లింకటు 2 బహిర్ద్వార ప్రకారంబు లాకర్ణింపుమని గోకర్ణకుండలుండాకర్ణన వశంవదాశయుండగు కుశేశయాసనసూతికిట్లనియె. **28**

---

27 ప :- 1 డధముం – డ, ద, బ; డధనుం - -ర, అ, గౌ. 2 లొందున్-ర; లందుఁ – అ, గౌ.

28 ప :- 1 లింకట – ముద్రి (అ); లింక - ర; లింకిటు–అ. 2 బహిర్ద్వారంబులప్రకారంబా-ర; బహిర్ద్వారంబా-గౌ; బహిర్ద్వారప్రకారంబులా-అ.

వ్యా :— ఇన్నాలుగున్ = ఈనాలుగును, అంతర్ద్వారంబులు = లోపలివాకిళ్లు, ఇంకిటున్ = ఇటుపైని, ఇటున్ = ఇచ్చటి, బహిర్ద్వార ప్రకారంబులు = వెలుపటివాకిళ్ల విధములు, ఆకర్ణింపుమని = వినుమని, గోకర్ణ కుండలుండు = సర్పములుకుండలములుగాఁగలవాఁడు - శివుఁడు, [గోకర్ణ = గోర్నేత్రింకర్ణో యస్య, సర్పే - శబ్దార్థః] ఆకర్ణన = వినుటకు, వశంవద = అధీనమయిన, ఆశయుండు = మనస్సుగలవాఁడు. [ఆశయః = చేతః - శబ్దక] అగు = అయిన, కుశేశయాసన = బ్రహ్మయొక్క, [కమలాసనునియొక్క] సూతికిన్ = బిడ్డకు- [సూతిః = సంతానః - శబ్దక] - నారదునకు-నారదునిగూర్చి, ఇట్లు = ఈప్రకారముగా, అనియెన్ = అనెను.

వ్యాక :— సూతికిన్ = సూతిని (గూర్చి) - ప్రా. కారక 13

సీ॥ కలకురక్కసుని [1] జక్కఁగఁదొక్కి మించిన
భద్రకాళికయెందుఁబ్రస్ఫురించు
నిందుండు విధమునవెందునేవసియింతు
నలు లేక కోటీశ్వరాహ్వయమునఁ
బ్రవహించునెందునభ్రింకషోర్మulఁబుణ్య
జలయనుజలధియోషామతల్లి
నతజగత్త్రితయ శ్రీనారాయణీదేవి
వర్తించునెందేని వార్తకెక్కి

తే॥ యట్టియట్టాలతోరణ [2] హట్టుకట్టి
మస్ఫురద్గోపురైడూకమణిమయోరు
హర్మ్యరమ్యంబుకరవీరమనుపురంబు
పశ్చిమద్వారమగుజగత్పతినగరికి. 29

---

29 ప :- 1 నొక్కరునిజిక్కఁగఁదొక్కి. భద్ర ముద్రి అ.ర.గొ; జక్కఁగఁదొక్కిమించిన - ఆ. 2 పట్ట - గ; హట్ట - ర, ఆ, గొ.

వ్యా :— కలుషరక్కసుని = క్రూరుఁడైనరాక్షసుని - మహిషాసురుని, చక్కఁగన్ = బాగుగా, త్రొక్కి = కాలితోనదిమి, మించిన = విజృంభించిన, భద్రకాళిక = కాత్యాయని, (భద్రకాళీతుగంధోల్యాం, కాత్యాయన్యామపిస్త్రియామ్ - మే. ని.) ఎందున్ = ఎచ్చట, ప్రస్ఫురించున్ = ఒప్పునో.

మహిషాసురునిమర్దించినదుర్గ, భద్రకాళి. దుర్గాపాదాశ్రయణము నతఁడువరముగాఁబడసెను. [కాళికా]

2 ఇందున్ = ఇక్కడ - కైలాసమునందు, ఉండువిధమునన్= వసించునట్లు. ఎందున్ = ఎక్కడ, ఏన్ = నేను, అలేక = భేదములేకుండ, కోటీశ్వర = కోటీశ్వరుఁడనెడు, అహ్వయమునన్ = నామముతో. వసియింతున్ = నివసింతునో!

3] పుణ్యజలయను = పుణ్యజలయనెడు, జలధియోషామతల్లి = శ్రేష్ఠమయిన సముద్రకాంత - శ్రేష్ఠమయిననది, ఎందున్ = ఎక్కడ, అభ్రంకష = అకాశమునొరయు, [మిక్కిలియెత్తయిన - అనుట] ఊర్ములన్ = కెరటములతో, ప్రవహించున్ = పాఱునో!

4] నత = నమస్కరించునదియగు, జగత్త్రితయ = లోకముల మూఁడింటినిగలిగిన, (స్వర్గమర్త్యపాతాళలోకములుగలిగిన - అనుట) నారాయణీదేవి = నారాయణీదేవియను పేరుగల లక్ష్మీమూర్తి, ఎందేని = ఎక్కడ, వార్తకెక్కి = ప్రసిద్ధిగాంచి, వర్తించున్ = ఉండునో!

ఎందేని - 'ఏని' వాక్యాలంకారము. "ఇంబుకసర్వలోకజనులెవ్వనియేని" (ఆది 1-76)

అట్టి = అటువంటి, అట్టాల = ప్రాకారములపైభాగముల చేతను, (అట్టాలః = ప్రాకారాదుపరితనమున్నతస్థానమ్ - ఇతి శ్రీధర

స్వామీ - శబ్దక) తోరణ = బహిర్ద్వారములచేతను, (తోరణోస్త్రీ బహిర్ద్వారమ్ - అమ) హట్ట = అంగడివీధులచేతను, (హట్టః = అంగడి వీథి - గురుబాల) కుట్టిమ = నెలకట్టులచేతను, (శిలారత్నాదినిబద్ధ ప్రదేశములచేతను) స్ఫురత్ = ప్రకాశించుచున్న, గోపుర = పుర ద్వారములచేతను, విడూక = నడుమ నెముకలుంచికట్టినగోడలచేతను, (విడూకంయదంతర్న్యస్తకీకసమ్ - అమ) మణిమయ = మణులతో, నిర్మించిన, ఉరు = గొప్పవయిన, హర్మ్య = ధనికులగృహములచేతను (హర్మ్యాదిర్ధనినాంనివాసః - అమ) రమ్యంబు = రమణీయమయిన, కరవీరమనెడునగరము, జగత్పతి = లోకనాథునియొక్క - విట్ఠలునియొక్క నగరికిన్ = గుడికి, పశ్చిమద్వారముగున్ = పడమటివాకిలియగును.

వ్యాక :— నగరు + కి = నగరికి. పక్షమున - నగరునకు (5-10)

తే॥ క్షోణిఁగృష్ణానదీతీర శూర్పలాఖ్య
తీర్థరాజాధివాసినై, తీర్థచరణ
ధామమణిసౌధదక్షిణద్వారమేను
జాగరూకతఁబాలింతుయోగివర్య! **30**

వ్యా :— క్షోణిన్ = భూమియందు, కృష్ణానదీతీర = కృష్ణానదియొడ్డునందలి, శూర్పల = శూర్పలమనెడు, ఆఖ్య = పేరుగల తీర్థరాజ = తీర్థశ్రేష్ఠమునందు, అధివాసినై = నివసించువాఁడనయి, తీర్థచరణ = పుణ్యనది (గంగానది) పాదమునందుఁగలవానియొక్క, (హరియొక్క) - విట్ఠలునియొక్క, ధామ = నిలయమయిన - విట్ఠ లుని నివాసస్థానమయిన, మణిసౌధ = రత్ననిర్మితరాజసదనముయొక్క (సౌధోస్త్రీరాజసదనమ్ - అమ) - సువర్ణమయమగు పాండురంగా లయముయొక్క, దక్షిణద్వారము = దక్షిణపువాకిలి. యోగివర్య = ఓయోగివరేణ్య - ఓనారదా! ఏను = నేను, (శివుఁడు - వక్త) జాగ రూకతన్ = జాగ్రత్తతో, పాలింతున్ = సంరక్షింతును.

శా॥ గర్వోద్రిక్తతరంగసంఘములవీఁకన్ బుష్కరిణ్యాపగా
వార్వేణుల్దనయుత్తరంపుదెసఁబర్వంగా, గదాపాణియై
సర్వా 1 లంకృతిశాలియై వెలయుఁగంసధ్వంసనాగార రా
ట్పూర్వద్వారమునం, ద్రివిక్రముఁడు, మైపొంగంబయోదచ్ఛవిన్
31

వ్యా :— గర్వ = దర్పముచేత - ఉబ్బుచేత. (పొంగుట చేత) ఉద్రిక్త = విజృంభించిన, తరంగసంఘముల = కెరటముల సమూహముయొక్క, వీకన్ = ఔన్నత్యముచేత, పుష్కరిణ్యాపగా = పుష్కరిణీనదియొక్క, (స్రవంతీనిమ్నగాపగా - అమ) వార్వేణుల్ = జలప్రవాహములు, (ప్రవాహః పునరోఘస్స్యాద్వేణీ- అభి చిం.) తన = తనయొక్క, ఉత్తరంపుదెసన్ = ఉత్తరదిక్కున, పర్వంగాన్ = ప్రవహింపగా, గదాపాణియై = గదచేతియందుఁగలవాఁడై, సర్వ = సమస్తమయిన, అలంకృతి = అలంకారములతో, శాలియై = ప్రకాశించువాఁడై, త్రివిక్రముఁడు = వామనుఁడు. మై = శరీరము, పయోద= మేఘముయొక్క, ఛవిన్ = కాంతితో, పొంగన్ = అతిశయింపఁగా, కంసధ్వంసన=కంసవినాశకునియొక్క (హరియొక్క)-విఠ్ఠలునియొక్క, అగారరాట్ = గృహరాజముయొక్క - పాండురంగ దేవాలయముయొక్క, పూర్వద్వారమునన్ = తూర్పువాకిట, వెలయున్ = ఒప్పును.

త్రివిక్రముఁడు — "త్రివిక్రమః = త్రీన్‌లోకాన్ విశేషేణ క్రమతివ్యాప్నోతీతి, యద్వా. త్రిషులోకేషుబలిబంధనార్థభూర్వ్యోమస్వర్గేషుక్రమః పాదన్యాసోయస్య---త్రీణిపదానివిచక్రమే. ఇతిశ్రుతేః.

త్రిరిత్యేవంత్రయోలోకాః కీర్తితా మునిసత్తమైః
విక్రామంస్తతః సర్వాం, స్త్రివిక్రమోఽసిజనార్దన.
ఇతిహరివంశే, - ఇతిశాంకరభాష్యమ్ -

---

31 ప :- 1 లంకృత - ర, అ.

క॥ 1 కరనఖరదళిత రక్షః
పరివృఢవక్షోరుణాంబుపరిచిత 2 దీప్తా
త్యురుకేసరి 3 దోహళుఁడగు
నరకేసరియుత్తరంబునగవనిఁగాచున్, **32**

**వ్యా :—** కరనఖర = చేతిగోళ్లచేత. (నఖోఽస్త్రీనఖరోఽస్త్రియామ్ - అమ) దళిత = చీల్పఁబడిన, రక్షపరివృఢ = రాక్షసరాజుయొక్క, (ప్రిభుఃపరివృఢోధిపః - అమ)- హిరణ్యకశిపునియొక్క, వక్షః = ఱొమ్మునందలి, అరుణాంబు = రక్తవారియొక్క - రక్తప్రవాహముయొక్క, పరిచిత = పరిచయముగలిగిన, దీప్త = ప్రకాశించిన, అత్యురు = మిక్కిలిగొప్పదయిన, కేసర = జూలుచేత, దోహాలుఁడగు = ఉత్సాహముగలవాఁడగు, నరకేసరి = నృసింహుఁడు, ఉత్తరంబునగవనిన్ = ఉత్తరదిక్కునందలి పురద్వారమును, కాచున్ = రక్షించును.

అరుణ — శోణశబ్దమువలె నిది రుధిరార్థమునఁబ్రియుక్తము "శోణమ్ = రుధిరమ్ - ఇతిరాజనిర్ఘంటుః" (శబ్దక) మహాదేహని, ర్గతసాంద్రారుణపూరము - ఆది 2-24. ఘోరపం, కారుణవారిపూరము- ఆది 6-300. తదీ, యారుణమున - అరణ్య 2-260. అరుణవారి - రామా 8-117

**వ్యాక :—** ఉత్తరంబునగవను = ఉత్తరంబునందలిగవను. సప్తమ్యలుక్సమాసము - ప్రౌ. సమాస 37

**అలం :—** వృత్త్యను ప్రాసము.

---

32 ప :- 1 ఖర - ప, ర; కర - అ, గౌ. 2 తత్రత్యుర - క, చ, త, గౌ. దీప్తాత్యురు - ర, అ. 3 దోహదుఁడగు - ర, అ. దోహలుఁడగు-గౌ

క॥ లోనాలుగువెలినాలుగు
నైనమహాద్వారభూములపవర్గ శ్రీ
నీనఁగనీనగరాద్ధరు
శ్రీనగరగణితవిభూతిఁజెందు, మునీంద్రా! 33

వ్యా :— లోన్ = లోపల, నాలుగున్ = నాలుగును, వెలిన్ = వెలుపల, నాలుగున్ = నాలుగును, ఐన = అయినట్టి, మహాద్వారభూములు = గొప్పవాకిలి ప్రదేశములు, అపవర్గశ్రీన్ = మోక్షలక్ష్మిని, (మోక్షోఽపవర్గం - అమ) ఈనఁగన్ = కలిగింపఁగా, ఈనగరాద్ధరు = ఈపర్వతరాజ (గోవర్ధన) ధారియొక్క (హరియొక్క) విట్ఠలునియొక్క, నగరు = గుడి-పాండురంగదేవాలయము, మునీంద్రా= ఇంద్రునివంటి ముని-శ్రేష్ఠుఁడయిన మునీ! (ఓనారదా!-అనుట) అగణిత విభూతిన్ = లెక్కలేనియైశ్వర్యమును, చెందున్ = పొందును.

అలం :— యమకము (3 పా)

వ॥ అని మఱియు నక్కఱియవేల్పునవల్పగుణప్రకటన పరుండై హరుండిట్లనియె. 34

వ్యా :— అని = ఇట్లు పలికి, మఱియున్ = వెండియు, అకఱియవేల్పు = అనల్లదేవరయొక్క - అవిట్ఠలునియొక్క, అనల్ప = అధికమయిన, గుణ = సద్గుణములయొక్క, ప్రకటన = వెల్లడించుటయందు, పరుండై = ఆసక్తిగలవాఁడై, హరుండు = ఈశ్వరుఁడు, ఇట్లు = ఈప్రకారముగా, అనియెన్ = పలికెను.

---

35 ప :- 1 దెలిచె - ర, గొ; దెలచె - అ.

## ధర్మరాజు పౌండరీకమునకేగుట

చ॥ అభిముఖతత్త్వశాలి, సుకృతాఢ్యుఁడునౌ, చతురాస్యమానస
ప్రభువుఁడు, శిష్యసంఘములపారము గొల్వఁగఁదొల్లియొక్కనాఁ
డిభపురనాథుఁగౌరవకులేశ్వరు ధర్మజుఁగానఁబోవ, భూ
విభుఁడతఁడాతనిం 1 దెలచె వేయివిధంబులసాధుపూజలన్. **35**

వ్యా :— అభిముఖతత్త్వశాలి = సమ్ముఖమయిన బ్రహ్మముచే నొప్పువాఁడును. సుకృతాఢ్యుఁడున్ = పుణ్యసంపన్నుఁడును, ఔ = అగు, చతురాస్య = బ్రహ్మయొక్క. మానస = మనస్సువలన, ప్రభవుఁడు = జననముగలవాఁడు (బ్రహ్మమానసపుత్రుఁడు). సనందనుఁడు (చూ 44) తొల్లి = పూర్వము, ఒక్కనాఁడు = ఒకదినము, అపారము = అంతులేని, శిష్యసంఘములు = ఛాత్రసమూహములు, కొల్వఁగన్ = సేవింపఁగా, ఇభపురనాథున్ = హస్తినాపురాధీశ్వరుఁడును, కౌరవకులేశ్వరున్ = కౌరవవంశరాజును, అగు, ధర్మజున్ = ధర్మరాజును కానఁబోవన్ = చూడనేగఁగా, భూవిభుఁడతఁడు = అక్ష్మాపతి - ఆధర్మరాజు, అతనిన్ = అతనిని - ఆసనందనుని, సాధుపూజలన్ = యోగ్యములయిన యర్చనలచేత, వేయివిధంబులన్ = వేయిరీతులను, (పెక్కుభంగులననుట) తెలచెన్ = సేవించెను.

ఇభపురము - హస్తినాపురము. హస్తియనురాజు నిర్మించుటచే నీపేరు గలిగెను.

---

35 ప ౹- 1 దెలిచె - ర, గొ, దెలచె - ర, అ.

క॥ అహితాహితకారణ 1 వి
గ్రహులును, సదనుగ్రహప్రగల్భులు 2 నగునా
గహనగృహవాసచర్యా
మహితతపోధనుల సంగమము పొగడొందెన్. 36

వ్యా:— అహిత = ప్రతికూలురకు, (అహితః = ప్రతికూలః-శబ్దక) అహితకారణ = అనిష్టసాధకమయిన, విగ్రహులును = దేహముగలవాఁడును - అని సనందన పక్షమునకర్థము. (శరీరంవర్ష్మవిగ్రహః-అమ) అహిత = శత్రువులకు, అహితకారణ = అనిష్టసాధనమయిన, విగ్రహులును = యుద్ధముగలవాఁడును - అనిధర్మజపక్షమునకర్థము. (రణః కలహవిగ్రహౌ - అమ) సత్ = బ్రహ్మముయొక్క, (ఓంతత్సదితినిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః - భ. గీ) అనుగ్రహ = ప్రసాదముచేత, ప్రగల్భులు = ప్రౌఢుఁడు - అని సనందనపక్షమునకర్థము సత్ = పూజనీయుల యొక్క, (సత్యే సాధౌ విద్యమానే ప్రశస్తేభ్యర్హితేచ సత్-అమ) అనుగ్రహ = ప్రసాదముచేత, ప్రగల్భులు = ప్రౌఢుఁడు - అనిధర్మజపక్షమునకర్థము. అగు = అయిన, అగహనగృహవాస = అయరణ్యనివాసముయొక్కయు, నాగేహనివాసముయొక్కయు, చర్యా = నియమానుసరణముచేత, [చర్యాత్వీర్యాపథస్థితిః - అమ] మహితులు = పూజింపఁదగినవారగు, తపోధనుల = తపస్సేధనముగాఁగలవాని యొక్కయు - అని సనందనపక్షమునకర్థము; ధర్మమే ధనముగాఁగలవాని యొక్కయు - అని ధర్మరాజపక్షమునకర్థము. [తపోలోకాంతరేపిచ, చాంద్రియణాదౌధర్మేచ - మే. ని] సంగమము = సమాగమము [సనందనధర్మనందనుల సమాగమము - అనుట] పొగడొందెన్ = వినుతికెక్కెను.

---

36 ప:- 1 దుష్ప్రహులు - ప, విగ్రహులు - ర, అ. 2 నగరా - గ; నగునా - ర, అ.

గహనగృహావాసచర్యామహితతపోధనులు - సనందనుఁడరణ్య వాసియగుతపోధనుఁడు. ధర్మజుఁడుగృహావాసియగు తపోధనుఁడు [=ధర్మముధనముగాఁగలవాఁడు] "ప్రప్రచ్ఛకుశలంరాజ్యే, రాజ్యాశ్రమమునింమునిః" [రఘు 1-58] అనురీతివ్యవహారము.

సనందనుఁడు బ్రహ్మమానసపుత్రుఁడని భాగవతాదులు.

**అలం :—** ప్రకృతశ్లేష.

ఉ॥ తమ్ములుఁదానునప్పుడు పృథాప్రథమాత్మజుఁడంతరంగమున్
గ్రమ్మినశోకవహ్నిహతిఁగందుచుఁగేలుఁ 1 మొగుడ్చి, బ్రహ్మచి
త్తమ్మునఁగల్గుసంయమివతంసముఁబల్కెఁ, ఖరాంశుతాపత
ప్తమ్మగుతేనియంజినుకుతమ్ములఁబోలసబాష్పనేత్రముల్. **37**

వ్యా :— పృథా = కుంతీదేవియొక్క, ప్రథమాత్మజుఁడు = మొదటికొడుకు (జ్యేష్ఠకుమారుఁడు) - ధర్మరాజు, అప్పుడు = ఆ సమయమునందు, తమ్ములున్ = అనుజులును, తానున్ = తానును. అంతరంగమున్ = మనస్సును, క్రమ్మిన = ఆవరించిన. శోకవహ్ని = దుఃఖాగ్నియొక్క, హతిన్ = దెబ్బచేత, కందుచున్ = తాపము నొందుచు, కేలు = చేతులు, మొగుడ్చి = జోడించి, సబాష్ప=(వెచ్చని) కన్నీళ్లతోఁగూడుకొనిన, నేత్రముల్ = కన్నులు: ఖరాంశు = తీక్ష్ణములయిన కిరణములుగలవానియొక్క - సూర్యునియొక్క, తాప = వేఁడిమిచేత, తప్తమ్మగు = మఱిఁగింపఁబడినదగు, తేనియన్ = మధువును, చినుకు = బొట్టులుగారాల్చు, తమ్మలన్ = పద్మములను, పోలన్ = సరిపోలఁగా, బ్రహ్మ = పరబ్రహ్మము, చిత్తమ్మునన్ = మనస్సునందు కల్గు = కలిగిన, సంయమివతంసమున్ = మునిశ్రేష్ఠునిగూర్చి - సనందనునిగూర్చి, పల్కెన్ = [ఇట్లు] వచించెను.

---

37 ప :- 1 మొగిడ్చి - ర, అ, మొగుడ్చి - గొ.

సూర్యునివేఁడికి మఱిఁగిన తేనెను బిలుకు పద్మములవలె వేఁడి కన్నీటితోఁగూడిన కన్నులొప్పఁగా, ధర్మరాజు సనందనునుద్దేశించియిట్లు వచించెననుట.

వ్యా॥ :— కేలు - జాత్యేకవచనము. "సామాన్యస్యవివక్షాయా మేకత్వమపిసమ్మతమ్" [విక్ర] అవతంసము = వతంసము. "వష్టి వాగురిరల్లోపమవాప్యోరుపసర్గయోః" [సి.కౌ.] మొగుడ్చి-ము.కౌ.క్రియా

అలం :— ఉపమ.

క॥ ఏభీరువనై వేఁడెద
నో భద్రప్రద! ప్రసాదమొసఁగుము నాకున్
1 నీభావంబునఁబొడమని
దీభువనత్రియమునందు నింతయుఁగలదే? 38

వ్యా ;— ఓభద్రప్రద = ఓశుభములనొసఁగువాఁడా! ఏన్ = నేను, భీరువనై = భయశీలుఁడనై. వేఁడెదన్ = అర్థింతును. నాకున్ = నాకు, ప్రసాదమొసఁగుము = అనుగ్రహమునిమ్ము (నన్ననుగ్రహింపు మనుట) నీభావంబునన్ = నీయొక్క మనస్సునందు, [భావస్సత్తా స్వభావాభిప్రాయచేష్టాత్మజన్మసు - అమ] పొడమనిది = గోచరింపనిది ఈభువనత్రియమునందున్ = ఈలోకములమూఁడింటియందు, ఇంత యున్ = కొంచెమయినను, కలదే = ఉన్నదా! లేదనుట

భువనత్రయము - స్వర్గమర్త్యపాతాళలోకత్రియము.

శా॥ చింతాకంతయువెన్కదియ్యక, కురుక్షేత్రంబునంబాప సం
క్రాంతస్వాంతుఁడనై, సుహృత్సుతపితృభ్రాత్రాదులంజంపి, య
త్యంతద్రోహమొనర్చియుందిరిగెదన్ బ్రాణంబుతోమత్సముం
డంతర్వాణివతంస! యెవ్వఁడుగలండాహా! వితర్కింపఁగన్. 39

---

38 ప :- 1 మీ - ర; నీ - అ, గౌ.

వ్యా :— చింతాకంతయున్ = చింతాకంతయయినను - కొంచెమయినను, వెన్కదియ్యక = వెనుదీయక, కురుక్షేత్రంబునన్ = కురుక్షేత్రమునందు, పాప = అఘముచేత, సంక్రాంత = సంప్రాప్తమయిన, స్వాంతుండనై = మనస్సుగలవాఁడనయి, సుహృత్ = మిత్రులు, సుత = కుమారులు, పితృ = తండ్రులు, భ్రాతృ = సోదరులు, ఆదులన్ = మొదలగువారిని, చంపి = వధించి, అత్యంత= మిక్కిలియధికమయిన, ద్రోహము = హింస, (ద్రోహము = హింస - సూ. ని.) ఒనర్చియున్ = ఆచరించియు, ప్రాణంబుతోన్ = అసువులతో, తిరిగెదన్= సంచరింతును. అంతర్వాణివతంస = శాస్త్రజ్ఞశ్రేష్ఠుఁడా! ఓసనందనా! (అంతర్వాణిస్తుశాస్త్రవిత్ - అమ) మత్సముండు = నాతో సమానమయినవాఁడు (నావంటిపాపాత్ముఁడనుట) అహో = అయ్యో! వితర్కింపఁగన్ = బాగుగా నాలోచింపఁగా. ఎవ్వఁడు = ఎవఁడు, కలండు = ఉన్నాఁడు? (ఎవ్వఁడును లేఁడనుట)

కురుక్షేత్రము - చూ 2-212 వ్యాఖ్య.

వ్యాక :— "కురుణా - ఉపార్జితం క్షేత్రమ్. శాకపార్థివాదిత్వాత్ మధ్యమపదలోపః" (శబ్దక) కాని, కురోః క్షేత్రమ్= కురుక్షేత్రమ్ అనిషష్ఠీతత్పురుషమే చెప్పఁదగును. కురువునకు క్షేత్రమునకు వేఱేసంబంధముపొసఁగకుండుటచే, నుపార్జితమనునదిగమ్యమగును.

క॥ వంగడపువెదురుఁగోపపు
టింగలమున నేర్చికనినయీసిరి, నిండా
సంగతిఁబొగ 1 సూరినత
ద్భంగురమౌక్తికము 2 దీనిపసిమియుఁగలదే? **40**

---

40 ప :- 1 సూరెను - ముద్రి (అ); చూరెనుద - ర; సూరిన - అ.
2 దీనఁబసి - ముద్రి (అ), ర; దీనిపసి - అ, గొ.

వ్యా :— వంగడపువెదురు = వంశమనెడు వెదురును, కోపపు టింగలమునన్ = కినుకయనెడునగ్నితో, ఏర్చి = దహించి, కనిన = పొందిన, ఈసిరి = ఈసంపద, సింవా = గర్హణముయొక్క, సంగతిన్ = సంసర్గముచేత, పొగ + చూరిన = పొగపట్టిన, తద్వంగురమౌక్తికము = ఆనాశమునందునడియగు ముత్యము, దీని = దీనియొక్క - ఈ సంపద యొక్క, పసిమియున్ = ఒప్పిదమును, కలదే = నిలిచియుండునదియా? ఉండునదికాదనుట.

వెదురునందు ముత్యములు పుట్టును - చూ 1-165 వ్యాఖ్య.

అలం :— రూపకము.

మ॥ అసిధారా 1 దళితాత్మబంధుభుజమధ్యస్వైరనిర్యద్వసన్
2మసకైలెపట్టిన 4యమ్మహాదురితమున్ 5 మన్నెట్టియున్, వాజిమే
ధసమిద్ధానలభూతి 6 చేనుసిమియున్ దప్పింపలేనైతి, నీ
కనకెప్పాటఁదొలంగు? నెట్టులగుదున్ గళ్యాణకల్యాత్ముఁడన్. **41**

వ్యా :— అసిధారా = కత్తివాదర (పదను) చేత, దళిత = చీల్పఁబడిన, ఆత్మబంధు = స్వకీయబాంధవులయొక్క, భుజమధ్య = రొమ్ములవలన, (నుండి), స్వైర = స్వచ్ఛందముగా, నిర్యత్ = నిర్గమించుచున్న, వసన్ = క్రొవ్వుచేత, (మేదస్తువపావసా) - అమ; "శుద్ధమాంసస్యయః స్నేహః సావసాపరికీర్తితా" శు(శుత - శబ్దక.) మసకై = మురికియయి, పట్టిన = విడువకుండనంటుకొనిన, అమ్మహా దురితమున్ = ఆగొప్పదయినపాపమును, మన్నెట్టియున్ = 'దానము

---

41 ప :- 1 వధితాత్మ - డ, ద, బ; దళితాత్మ - ర, అ. 2 మసరై -క, మసకై - ర, అ. 3 పుట్టిన - ముద్రి (అ). ర; పట్టిన - అ. 4 యిమ్మ - ర, యమ్మ - అ. 5 మప్పెట్టి - త; మన్నెట్టి-ర; మమ్మట్టి-గొ; మన్నెట్టి - అ. 6 మేనుసి - చ; చేనుసి-ర,అ.

చేసిన) భూమియనెడు మన్ను పెట్టితోమియు. వాజిమేధ = అశ్వమేధ యాగమునందు, సమిద్ధ = రగుల్పఁబడిన. (సమిద్ధః = ప్రదీప్తః-శబ్దర) అనల = అగ్నియొక్క; భూతిచేన్=బూదిచేత. ఉసిమియున్= తోమియు, తప్పింపలేనైతిన్ = పోఁగొట్టలేకపోయితిని, ఈకసటు = ఈపాపమనెడు మలినపదార్థము (కసటునాఁబాపంబుగాఁదనర్చు- ఆం. భా) ఎప్పాటున్= ఏవిధముగా, తొలంగున్ = పాయును? కళ్యాణ = శుభముచేత, కల్య= సంసిద్ధపఱుపఁబడిన, (కల్య = సజ్జీభూతే - శబ్దస్తో) అత్ముఁడన్ = మనస్సుగలవాఁడను. ఎట్టులు = ఏప్రకారముగా, అగుదున్=కాఁగలను?

మన్ను పెట్టితోమినను, బూదిపెట్టితోమినను, ముఱికితొలఁగిపోవును. కాని బంధువధజనితపాపము భూదానమువలనను, నశ్వమేధయాగము వలనను దొలఁగలేదనుట.

అలం :— శ్లేషమూలకశ్లిష్టపరంపరిత రూపకము.

క॥ కర్మముఁ 1 గర్మాంతర 2 హృతి
కర్మఠమగుదానిఁ 3 బూనఁగానము; నిరయాం
తర్మజ్జనాభిముఖుని
దుర్మదుఁబడనీకనిలుపు; ద్రుహిణప్రభవా ! **42**

వ్యా :— ద్రుహిణప్రభవా = బ్రహ్మవలని జననముగల వాఁడా ! - ఓసనందనా! కర్మాంతర = వేఱేకర్మముయొక్క, హృతి = హరణమునందు, కర్మఠమగుదానిన్ = కర్మశూరమగునట్టి (కర్మశూరస్తు కర్మఠః - అమ) కర్మమున్ = కర్మమును, పూనన్ = అవలం బించుటకు, కానము = ఎఱుగము. (కర్మహరణసమర్థమగుకర్మమును

---

42 ప ; 1 ముకర్మాం-ముద్రి (అ). ర; కర్మముఁగర్మాం - అ. 2 హృత్క ర్మఠ - ముద్రి (అ), ర; హృతికర్మద - గౌ; హృతికర్మఠ-అ.

వెలువేర్పఁగలకర్మమేదో యవలంబించుటకు, మాకుఁదెలియుట లేదని యర్థము. బంధువధవలనఁగలిగిన కర్మఫలమును నశింపఁజేయఁగలకర్మ మేదోయాచరింతమన్నట్టి కర్మమేదోతెలియుట లేదనిభావము) నిరయ= నరకముయొక్క, అంతర్మజన = మధ్యమునందు మునుఁగుటకు. అభిముఖున్ = సమ్ముఖుఁడయిన, ఈదుర్మదున్ = ఈదుష్టమయినగర్వము గలవానిని, పడనీక = పతనముకానీయక - నరకమధ్యమునఁగూల నీయక, నిలుపు = కాపాడుము.

ధర్మరాజుబంధువులను వధించుటవలనఁబాపముకలిగెను. భూదానాశ్వమేధములవలనఁబుణ్యము కలిగెనేగాని బంధువధజనిత పాపము నశింపలేదు. పాపపుణ్యములువిడివిడిగా ననుభవయోగ్యములేగాని యొకదానినుండి యొకటితీసివేయుటకువీలుపడదు. అట్లుకాక, యొకకర్మము వలన లభించుపాపమును హరింపఁగలకర్మమేదయినఁదెలుపుమని ధర్మరాజు ప్రశ్నించెను. అట్టి కర్మాంతరహరణకర్మరమగు కర్మమున్నచోఁ దానుదానినవలంబించి పాపపరిహారముచేసికొనుననన్నమాట.

క॥ మావంటివారలకుఁ 1 బా
పావిలదృక్కులకు, ధర్మమారయనియన
ద్భావులకు, భవాదృశులగు
శ్రీవైష్ణవ 2 వరులదిక్కు, చిత్పూర్ణమతీ! **43**

వ్యా :— చిత్పూర్ణమతీ! = జ్ఞానముచేతనిండిన బుద్ధిగలవాఁడా! - ఒసనందనా! పాప = అఘముచేత, అవిల = కలుషమైన, దృక్కులకున్ = బుద్ధిగలవారును, (దృక్స్త్రియ్యాందర్శనేనేత్రేబుద్ధౌచ త్రిషువీక్షకే - మే. ని) ధర్మమారయుని = ధర్మమునాలోచింపని,

---

43 ప :- 1 కుభావావిల - క; కుఁబాపావి - ర, అ. 2 వరులె - ర, అ; వరుల – గొ.

అసత్ = దుష్టమయిన, భావులకున్ = స్వభావముగలవారును, అగు, మావంటివారలకున్ = మాదృశులకు, భవాదృశులగు = మీవంటి వారయిన, శ్రీవైష్ణవవరుల = విష్ణుభక్తాగ్రగణ్యులే, దిక్కు = శరణము.

వ్యాక :— మావంటివారలకున్ - అనువిశేష్యముషష్ఠ్యంతమయి యుండుటచే, విశేషణములకుషష్ఠికలిగెను. (బా. కారక 19)

సీ॥ అనియుధిష్ఠిరుఁడు 1 వల్కిన సనందనుఁడాత్మ
నలరియిట్లనునమ్మహాత్ముతోడ
సీపాలశాంబరీగోపాలుఁడు 2 గలాఁడు
పరమవైష్ణవధర్మపరతమెలఁగు
సీమోముగనుఁగొన్న నిఖిలాఘ 3 ములుఁబోవు
4 సెకదాఁకియడఁగుతూలికలలీల
హరిభక్తియనుగంగకడ్డమే ? 5 కలుషపు
టిసుకచేఁగట్టినయసదుఁగట్టు

తే॥ దురితరాశి 6 మునిఁగియు శ్రీవరునిభటుఁడు
తోయపద్మదళచ్ఛాయఁబూయఁబడఁడు
రేయుఁబగలు వృథాచింతసేయనీవు
ప్రాకృతుండవె? భూలోక 7 పాకవిమత! 44

---

44 ప :- 1 వల్కిన-గౌ; పల్కిన-ర, అ. 2 గలండు-త, గౌ; గలాఁడు-ర,అ. 3 ములువోవు-ర, గౌ; ములుఁబోవు — అ. 4 సెగ...తూనిఁగల-ర, సెక...తూనిక-ప; మాలిక - బ; తూనికల - గౌ; సెక...తూలి కల - అ. 5 కలుషంపుటిసుకచే, వెసగంగపుట్టినయసదుగట్ట-గౌ; కలుషపు...ఁగట్ట-అ; కలుషపు...కట్ట-ర. 6 మునింగి-ముద్రి (అ), ర; మునిఁగియు - అ. 7 పాలవినుత - డ, ద, బ; పాక విమత — ర, అ, గౌ.

వ్యా :— అనియుధిష్ఠిరుఁడు వల్కనన్ = అని ధర్మరాజు వచింపఁగా, సనందనుఁడు = సనందనముని, ఆత్మన్ = మనస్సునందు, అలరి = సంతోషించి, అమ్మహాత్ముతోడన్ = ఆమహాశయునితో - ఆ ధర్మరాజుతో, (ఉదాత్తోదీర్ణమహాశయాః, మహామనామహాత్మాచ-అభి చిం.) ఇట్లు = ఈప్రకారముగా, అనున్ = పలికెను. నీపాలన్=నీయెడ, శాంబరీగోపాలుఁడు=మాయాలయాలకాపరి-శ్రీకృష్ణుడు,కలాఁడు=కలఁడు పరమవైష్ణవధర్మపరతన్ = ఉత్కృష్టమయిన వైష్ణవధర్మమునందలి యాసక్తితో. మెలఁగు = ప్రవర్తించు, నీమోమున్ = నీముఖమును, కనుగొన్న న్ = చూచినచో, నిఖిల = సమస్తములయిన. అఘములు = పాపములు, సెక = అగ్ని, తాఁకి = అంటుకొని, అడఁగు= నశించు, తూలికలలీలన్ = దూదిపింజలవలె, పోవున్ = నశించును. హరిభక్తి = విష్ణుభక్తి, అను = అనెడు. గంగకున్ = గంగానదికి, కలుషపు టిసుకచేన్ = పాపమనెడుఇసుముచేత, కట్టిన = నిర్మించిన, అసదుఁ గట్టు = అల్పమయినగట్టు, అడ్డమే = నిరోధకమా? (నిరోధకము కాదనుట) దురితరాశిన్ = పాపపుఁబోగువునందు, మునిఁగియున్ = మగ్నమయ్యును, శ్రీవరుని=లక్ష్మీపతియొక్క-హరియొక్క, భటుఁడు= సేవకుడు - హరిభక్తుఁడు, తోయపద్మదళచ్ఛాయన్ = నీరుతామరాకు వలె, పూయఁబడడు = (పాప) సంసర్గమునందఁడు. భూలోకపాకవి మత = ఓ భూలోకదేవేంద్రుఁడా! - ఓధర్మరాజా! రేయున్ = రాత్రి యును, పగలున్ = దివాభాగమును, వృథాచింతసేయన్ = వ్యర్థ మయిన యాలోచనచేయుటకు, నీవు = ఈవు, ప్రాకృతుండవె = పామరుఁడవా? (వివర్ణఃపామరోనీచః ప్రాకృతశ్చపృథగ్జనః - అమ)

తోయపద్మదళచ్ఛాయ - "పద్మపత్రమివాంభసా" (భ. గీ) ఛాయ - ఇవార్థకము. (నటుదిశానశిరస్తటుతు ట్టితరత్నచ్ఛాయఁగల్లో లినీ, విటమధ్యంబునవార్లెనభ్రమణి - వసు 4-10.

వ్యాక :— యుధిష్ఠిరుఁడు = యుద్ధమునందుస్థిరుఁడు - సప్తమ్యలుక్సమాసము.

అలం ;— ఉపమారూపకములు.

ఉ॥ కర్తవుగావుహర్తవునుగా వభిరక్షివిఁగావునీవు స
త్కీర్తి 1 ధురీణ! యంతకును గృష్ణుడెమూలము, గాన, పుణ్యవి
స్ఫూర్తియుఁబాపవైకృతముఁబూరుషుఁబొందునెయస్వతంత్రతన్
వర్తిలు 2 చున్కిఁ, బ్రెద్దునకువచ్చునె? 3 పాకగుణాగుణావళుల్.

**45**

వ్యా ;— సత్కీర్తిధురీణ = మంచియశస్సును వహించువాఁడా! - ఓధర్మరాజా! అంతకును = సమస్తమునకు, కృష్ణుఁడె = హరియే, మూలము = మూలాధారము. కాన = ఇట్లగుటచేతనే, నీవు = ఈవు, కర్తవుగావు = కార్యమునుజేసినవాఁడవుకావు. (యుద్ధకృత్యముచేసినవాఁడవుకావనుట) హర్తవునుగావు = సంహారకర్తవునుగావు. (బంధువధచేసినవాఁడవునుగావనుట) అభిరక్షివిఁగావు = కాపాడువాఁడవునుగావు. అస్వతంత్రతతన్ = పరాధీనతతో, వర్తిలుచున్కిన్ = నడచుకొనుచుండుటచేత, పుణ్య = సుకృతముయొక్క, విస్ఫూర్తియున్ = తోఁచుటయు, పాప = అఘముయొక్క, వైకృతము = వికృతత్వము (రోఁత) పూరుషున్ = పురుషుని, పొందునె = చెందునా? (చెందవనుట) పాక = వంటయొక్క, గుణాగుణావళుల్ = సుగుణనిర్గుణములవరుసలు (బాగోగులు-అనుట) తెడ్డునకున్ = దర్వికి, వచ్చునె = చెందునా? చెందవనుట)

45 ప :- 1 ధురీణుఁడింతకును - ప: ధురీణయింతకును - ర, అ; ధురీణ యంతకును-గౌ. 2 చున్నదెడ్డు - క; చున్కిఁబ్రెద్దు - ర, అ. 3 పాప - గౌ; పాక - ర, అ.

ట్రెడ్డు - తద్రూశబ్దభవము. "శ్రీవిశాలాక్షి బంగారు తెర్డునందు" భీమ 2 - 115

వ్యాక :— కాన - కాన్+అ. అగు+నుజి = కాను - బా.క్రియా 91. అ - అవధారణార్థకము." కా 1 నతగన్ - ఉద్యో 1 358

అలం :— అర్థాంతరన్యాసము. (వికస్వరమని మతాంతరము)

క॥ పరులకతంబుననేనియు
హరినొకమరిదలఁపభద్రమగుఖలులకుఁద
న్నిరతస్మరణా 1 దరణా
స్ఫురణాఢ్యులునిత్యపదవిఁబొందుటయరుదే? **46**

వ్యా :— పరులకతంబుననేనియున్ = అన్యులకారణమున నైనను, హరిన్ = కృష్ణుని, ఒకమరి = ఒకసారి, తలఁపన్= ధ్యానింపఁగా, ఖలులకున్ = దుర్జనులకును, భద్రమగున్ = శుభమగును. తత్ = అతనియొక్క - హరియొక్క, నిరతస్మరణా = సంతత ధ్యానము యొక్క, ఆదరణా = పాటించుటయొక్క, స్ఫురణా = స్ఫూర్తిచేత, ఆఢ్యులు = సంపన్నులయినవారు, నిత్యపదవిన్ =శాశ్వత పదమును - మోక్షమును, పొందుట = ప్రాపించుట, అరుదే = వింతయా? (వింతకాదనుట)

తే॥ ధారుణీవల్లభులకంటెఁదక్కుచోట
నశ్వమేధంబునిష్ఫలంబగువిధమున
నర్థవంతంబుగాదు సత్యా 1 కళత్రు
2 సేవనలమానిసేయుపాచితముశతము. **47**

---

46 ప :- 1 చరణ - ముద్రి [అ], ర; దరణ - చ; దరణా - అ, గౌ.

47 ప :- 1 కళత్ర-ర; కళత్రు-అ. 2 సేవకిల-ముద్రి [అ], ర; సేవకుం బూని-త; సేవకులబూని-క; చ; సేవకులఁబూని-గౌ, సేవకుల బూ [పూ?] ని - అ.

వ్యా :— ధారుణీవల్లభులకంటెన్ = భూపతులకంటె-సార్వభౌములకంటె, తక్కుచోటన్ = తక్కినవారివిషయమునందు, (సార్వభౌమేతరులవిషయమునందు - అనుట) అశ్వమేధంబు = అశ్వమేధయాగము, నిష్ఫలంబు = ప్రయోజనములేనిది, అగువిధముననన్ = అగునట్లు, సత్యాకళత్రు = సత్యభామ, భార్యగాఁగలవానియొక్క-కృష్ణునియొక్క, సేవనలన్ = సేవలను, మాని = విడిచి, చేయ = ఆచరించు, పాచితము = పాప్రియశ్చిత్తముయొక్క, శతము = నూఱు-అనేకము, అర్థవంతంబుగాదు = సార్థకముకాదు.

సార్వభౌములుకానివారి విషయమున నశ్వమేధయాగమునిష్ఫలమగునట్లు, కృష్ణునిసేవలను మానియాచరించు పాయశ్చిత్తశతము సార్థకముకాదు.

అశ్వమేధము - ఇది సార్వభౌములేచేయవలసినయాగవిశేషము.

"రాజాసార్వభౌమః అశ్వమేధేనయజేత, నాప్యసార్వభౌమః" - లేపస్తంబః [శబ్దక]

కలియుగమున నశ్వమేధమునిషిద్ధము.

"దీర్ఘకాలంబ్రహ్మచర్యం, నరమేధాశ్వమేధకా
మహాప్రస్థానగమనం, గోమేధశ్చతథామఖమ్
ఇమాన్ధర్మాన్కలియుగే, వర్జ్యానాహుర్మనీషిణః"
(బృహన్నారదీయే)

"నరాశ్వమేధౌమద్యంచ, కలౌవర్జ్యాద్విజాతిభిః" [బ్రహ్మ] - శబ్దక.

అశ్వమేధ విధానము —

"గోక్షీరసమవర్ణంచ, కుందేందుహిమసన్నిభమ్,
పీతపుచ్ఛంపీతకర్ణం, సర్వతోగతిముత్తమమ్.

శ్యామంచాపిమహీపాల, యజ్ఞేస్మింస్తురగంవిదుః
చైత్రిమాసస్యకాకాయాం, మోచ్యోయంతురగోనృప
వర్షమాత్రం రక్షణీయః, సర్వయోధైర్మహాబలైః
పుత్రోవాబాంధవఃశూరో, రక్షణార్థంనియోజ్యతే
స్వయంయః కురుతేయజ్ఞ, మసిపత్రవ్రతంచరేత్
లలాటేతురగస్యాపి, పత్త్రం సంలిఖ్యకాంచనమ్
బద్ధ్వాస్వనామసంయుక్తం, స్వప్రతాపసమన్వితమ్
కథనీయమిదంవాక్యం, మయాయంతురగోత్తమః
విముక్తోస్తినృపఃకశ్చిత్, ప్రతిగృహ్ణాతుచేద్బలీ
యస్తుతంప్రతిగృహ్ణాతి, సజేతవ్యోబలాత్స్వయమ్
అనేనవిధినావీర, క్రతుశేషప్రజాయతే"

[జై. భా. 1 అ 42-45; 50-52 అనువాదము. చూ - జై. భా. 1 అ. 75-78]

అశ్వమునకువపయుండదుగాన వపాస్థానీయమగు తేజనిని [హృదయమాంసమును] హోమముచేయుదురు.

"నాశ్వస్యవపావిద్యతే" - "నాన్యేషాంపశూనాంతేజస్యా అవద్యంతి అవద్యంత్యశ్వస్య" [శ్రు]

పాచితము - ప్రాయశ్చిత్తము, పాపక్షయసాధనమగు కర్మము "ప్రాయస్యపాపస్యచిత్తంవిశోధనంయస్మాత్, యదుక్తం, స్మృతౌ-ప్రాయఃపాపంసముద్దిష్టం, చిత్తంతస్యవిశోధనమ్" [శబ్దక]

ధారుణీ - ధరుణమనఁగా జలము "ధరుణః సమ్మతేనీరేస్వర్లోకే పరమేష్ఠిని" మే.ని. ధరుణమువలనఁగలిగినది ధారుణి, "అద్భ్యఃపృథివీ" [శ్రు] ఇట్లు ధారుణీ - అను ఉత్పమధ్యముసాధువగును.

"ధారుణి పత్రిజగూర్పఁగావిగతరోముఁడవై" ( ఆది 7-128 )
సంస్కృత నిఘంటువులలో ధారణీ, ధారిణీశబ్దములేగాని ధారుణీశబ్దము కానరాదు.

వ్యాక :— సత్యా = సత్యభామ. చూ 2-15 వ్యాఖ్య

అలం :— ఉపమ.

క॥ భ్రాతృవధ పితృవధాదు 1 లఁ
బాతకములురావు విష్ణుపదభక్తులకున్
దైతేయసూనులిరు 2 వుర
యేతద్వ్యవహారసాక్షులిభపురనాథా ! **48**

వ్యా :— భ్రాతృవధపితృవధాదులన్ = సోదరులనుజంపుట తండ్రిలను జంపుటమొదలగువానిచేతను, విష్ణు = హరియొక్క, పద భక్తులకున్ = పాదములు, రావు = ప్రాపింపవు, ఇభపురనాథా = ఓహస్తినాపురాధీశ్వరా! - ఓధర్మరాజా ! దైతేయ = దైత్యులయొక్క - రావణహిరణ్యకశిపులయొక్క. సూనులు = తమ్ముఁడును, కుమారుఁడును, "సూనుఃపుత్రేఽనుజేఽర్కే - మే. ని" - విభీషణప్రహ్లాదులు, ఇరువుర = ఇద్దఱే. ఏతద్వ్యవహార = ఈవ్యవహారమునకు, (భ్రాతృవధ పితృవధాదులచేతఁబాతకములు విష్ణుభక్తులకు రావనుటకు) సాక్షులు = ప్రత్యక్షనిదర్శనములు.

భ్రాతృవధకుఁగారకుఁడయిన విభీషణునకును, పితృవధకుఁగారకుఁడయిన ప్రహ్లాదునకును బాపములంటకపోవుటచే, నీపాతకములు విష్ణుభక్తులనంటవనుటకు వీరుసాక్షులనుట.

అలం :— ప్రకృతశ్లేష.

---

48 ప :- 1 లపాతకములు - ర. లపా[ఁబా?] తకములు - అ; లుబాతకములు - గౌ. 2 పురునేత - ర; పురయేత - అ, గౌ.

శా॥ అకంసారిపశ్రంసనీమదినుదీర్ణావిష్కృతిందాల్పఁ, బె
ల్లాకంపించితొలంగుఁగాక నినుడాయన్నేర్చునేపాతకా
నీకంబుల్, రవిఁగప్పుచీకటులనెందేఁగంటిమే? వింటిమే?
క్ష్మాకాంతాధిప ! లోకసంగ్రహమనీషంజేసితీ 1 ప్రశ్నమున్ 49

వ్యా :— అకంసారి = అకంసవైరియొక్క - అకృష్ణుని యొక్క, ప్రశంస = ప్రసక్తి, నీమదిన్ = నీయొక్కమనస్సునందు, ఉదీర్ణ = గొప్పదయిన, అవిష్కృతిన్ = అవిష్కారమును, తాల్పన్ = వహింపఁగా, పెల్లు = మిక్కుటముగా, అకంపించి = సంచలించి, పాతక = పాపములయొక్క, అనీకంబుల్= సమూహములు, తొలంగుఁగాక = అపసరిల్లునుదప్ప, నినున్ = నిన్ను, డాయన్నేర్చునే = సమీపింపఁజాలునా? ఎందేన్ = ఎక్కడనయిన. రవిన్ = సూర్యుని, కప్పు= అచ్ఛాదించు, చీకటులన్ = తమస్సులను, కంటిమే = చూచితిమా? వింటిమే = అకర్ణించితిమా? క్ష్మాకాంతాధిప = భూకాంతకధిపతి యయినవాఁడా - ఓధర్మరాజా! సంగ్రహమనీషన్ = ప్రజలుగ్రహింపవలెననుబుద్ధితో. (భ్రాతృవధపితృవధాదులవలనఁదనకుపాపములేదని ప్రజలుగుర్తింపవలెననుబుద్ధితో-అనుట) ఈప్రశ్నమున్ = ఈప్రశ్నను చేసితి = వేసితివి, (అడిగితివి)

అలం :— దృష్టాంతము.

క॥ అటులేనియుఁజెప్పెద; నీ
పొటిపొటితలపోఁతలెల్లఁబోవనడువు! మా
రటముడుగు; నెమ్మనము 1 నొ
క్కటిగానొనరించిగట్టిగా వినుమధిపా ! 50

49 ప :- 1 ప్రశ్నముల్ - క; ప్రశ్నముఁ - ర, అ.

50 ప :- 1 నెక్కటి - ర; నొక్కటి - అ, గొ.

వ్యా :— అటులేనియున్ = అట్లయినను - నీకుభ్రాతృపితృవధాదులవలనఁబాపమువచ్చియుండకపోయినను, చెప్పెదన్ = చెప్పుచున్నాను. ఈపొటిపొటితలపోఁతలెల్లన్ = ఈయత్యల్పములయినయాలోచనలన్నింటిని, పోవనడువుము = త్యజింపుము, అరటము = సంతాపమును, ఉడుగు = మానుము. అధిపా = ఓరాజా - ఓధర్మరాజా నెమ్మనమున్ = నిండుహృదయమును, ఒక్కటిగాన్ = స్థిరమయినదిగా (నిశ్చలమయినదిగా) ఒనరించి = చేసి, గట్టిగాన్ = సావధానముగా వినుము = ఆకర్ణింపుము.

సీ॥ తలఁపింపనేదేవుతనువునందఖిలాండ
 ములు పయోనిధిభంగవిలసనముల
నేదేవుమహిమకు నింతయు 1 దంతీంద్ర
 పద 2 మగ్నతదితరపదసమాన
మేదేవునిజమాయ నెవ్వాఁడుఁ 3 గడచన
 నేరఁడుతనమేని 4 నీడఁబోలె
నేదేవుఁడింతకు నింతయైయంతకు
 నంతయైగుటిలేక యతిశయిల్లు

తే॥ నాజగత్కర్త దుష్టసంహరణబుద్ధి
5 విట్టులుండనధరనుద్భ 6 వించి, క్షేత్ర
పాలుఁడునుబుండరీకుండు బలసికొలువ
నుండుక్షేత్రంబునకు నేగుముదయశాంక. **51**

వ్యా :— ఏదేవు = ఏదైవముయొక్క, తనువునందున్ =

---

51 ప :- 1 దంతిప్రపద - ప, ర, గౌ: దంతీంద్రపద - అ. 2 లగ్న-ర; మగ్న - ర, అ. 3 గడసన - ర; గడచన - అ, గౌ. 4 నీడపోతె - ర (పా); నీడఁబోలె - అ, గౌ. 5 విష్ణ - గౌ; విట్టు-ర, అ. 6 వించె - ముద్రి (అ), ర; వించి - అ.

శరీరమునందు, అఖిల = సమస్తములయిన, అండములు = బ్రహ్మాండములు, పయోనిధిభంగ = సముద్రపుఁగెరటములయొక్క, విలసనములన్ = విలాసములను, తలఁపించున్ = వ్యక్తముచేయునో.

పరమాత్మ, తనువుననంతకోటి బ్రహ్మాండములుగలవు.

"జలయంత్రస్థఘటమాలికా జాలవన్మహా విష్ణోరేకైకరోమకూపాంతరేష్వనంతకోటిబ్రహ్మాండానిసావరణానిభ్రమంతి" (నారాయ)

2) ఏదేవు = ఏదైవముయొక్క, మహిమకున్ = గొప్పతనమునకు, ఇంతయున్ = ఈసర్వమును, దంతీంద్ర = శ్రేష్ఠమయినయేనుఁగుయొక్క, పద = అడుగునందు, మగ్న = మునిఁగిన, తత్ = దానికంటె - ఏనుఁగుకంటె ఇతర = అన్యమయిన - అన్యజంతువుయొక్క, పద = అడుగుతో, సమానము = తుల్యమో !

అన్ని జంతువుల పాదములునేనుఁగుపాదములలో నడఁగునట్లుగా సర్వమును విష్ణుమూర్తి మహిమలోనడఁగునునుట,

"ఏనుంగుపాజ్జలోనెల్లసత్త్వంబుల,
పాజ్జలునడఁగినయట్లపోలె" (శాంతి 2_239)

అనుదానికిదియనుస్మృతి.

3) ఏదేవు = ఏదైవముయొక్క, నిజ = స్వకీయమయిన, మాయన్ = అవిద్యను, ఎవ్వాఁడున్ = ఎవఁడును, తనమేని = తనదేహముయొక్క, నీడఁబోలెన్ = ఛాయనువలె, కడచననేరఁడు = అతిక్రమింపఁజాలఁడో !

మాయ — చూ 2-34 వ్యాఖ్య.

4) ఏదేవుఁడు = ఏదైవము, ఇంతకునింతయై = అల్పమునకల్పమయి, అంతకునంతయై = అధికమునకధికమయి, గుటిలేక = పరిమితిలేకుండ, అతిశయిల్లున్ = మించునో !

ఇంతకునింతయై, యంతకునంతయై - "అణోరణీయాన్మహతో మహీయాన్" (శ్రు)

ఆజగత్కర్త= ఆలోకనిర్మాత - అవిష్ణువు, దుష్టసంహరణబుద్ధిన్= దుర్జనులనువధించుతలంపుతో, విట్ఠలుండనన్ = విట్ఠలుఁడనఁగా, ధరన్= భూమియందు, ఉద్భవించి = పుట్టి - అవతరించి, క్షేత్రపాలుఁడును= కాలభైరవుఁడును, పుండరీకుండున్ = పుండరీకుఁడును. బలసి = పరివేష్టించి, కొలువన్ = సేవింపఁగా, ఉండు = నివసించు, క్షేత్రంబునకున్= పుణ్యస్థలమునకు - పౌండరీకమునకు, ఉదయకాంక్షన్ = అభ్యుదయాపేక్షతో, ఏగుము = అరుగుము.

జగత్కర్త — దేవుఁడు సృష్టికి నిమిత్తోపాదానకారణము.

మాయ — చూ 4_16. విట్ఠల - చూ 1_213

వ్యాక :— తలఁపించున్, సమానము, నేరఁడు, అతిశయిల్లు- అనుచోట్లఁ - అధ్యాహార్యము. (ప్రౌ. వాక్య 13)

అలం :— ఉపమ.

క॥ ఏగిమహానదివారిం
దోఁగి 1 హరింగొలువు; నిఖిలదురితశ్రేణుల్
కాఁగినయినుమామిషమని
మూఁగికొనిన మక్షికాసమూహంబులగున్. 52

వ్యా :— ఏగి = (పౌండరీకమునకు) అరిగి, మహానది = (అచ్చటఁగల) గొప్పనదియొక్క - భైమీనదియొక్క, వారిన్ = నీటియందు, తోఁగి = మునిఁగి, (స్నానముచేసి) హరిన్ = కృష్ణుని -

52 ప :- 1 నహరిఁగొలు - ప; దోఁగిహరి – అ, గొ.

విట్ఠలుని, కొలువు = సేవింపుము. నిఖిల = సమస్తములయిన, దురిత శ్రేణుల్ = పాపపంక్తులు, కాఁగిన = ఎఱ్ఱఁగాఁగాలిన, ఇనుము = కాలాయసమును, (ఇనుపముక్కననుట) ఆమిషమని = మాంసమనుకొని, మూఁగికొనిన = ముసరిన, మక్షికా = ఈఁగలయొక్క, సమూహంబులగున్ = సముదాయములగును.

వ్యాక :— మూఁగికొనిన - స్వార్థమున 'కొను' ధాతువు. మూఁగికొను = మూఁగు.

అలం :— నిదర్శన

తే॥ బ్రాహ్మణునిఁదల్లిఁదండ్రిని భ్రాత 1 దాత
గురుజనం 2 బుల 3 హింసించు క్రూరుఁడైన
4 సీధుపానాభిరతుఁడుదుశ్శీలుఁడైనఁ
బాండురంగాధిపతిఁగాంచి 5 పరమునొందు. 53

వ్యా :— బ్రాహ్మణునిన్ = పాఱుని, తల్లిన్ = జననిని, తండ్రిన్ = జనకుని, భ్రాతన్ = సోదరుని, దాతన్ = త్యాగిని, గురుజనంబులన్ = గురుజనులను (ఉపాధ్యాయుఁడులోనగువారిననుట) హింసించు = వధించు, క్రూరుఁడైనన్ = క్రూరాత్ముఁడయినను; సీధుపాన = మద్యపానమునందు, అభిరతుఁడు = అధికమయిన ప్రీతిగలవాఁడగు, దుశ్శీలుఁడైనన్ = దుష్టస్వభావుఁడయినను, పాండురంగాధిపతిన్ = పాండురంగక్షేత్రనాథుని - పాండురంగవిట్ఠలుని, కాంచి = దర్శించి, పరమున్ = మోక్షమును, (కైవల్యమమృతంపరమ్ - ఇతి రత్నావళి - శబ్దక) ఒందున్ = ప్రాపించును.

53 ప :- 1 ధాత - చ; దాత - ర, అ. 2 బును — చ; బుల - ర; అ. 3 హింసించి - ర (పా) హింసించు - ర, అ, గౌ. 4 శీధు - ర; సీధు — గౌ; శీధు — అ. 5 పదము - గౌ; పరము - ర, అ.

సీధు - "సీధుః = శీధుః. పృషోదరాదిత్వాత్ శస్యసః. మద్యమ్ - ఇతిశబ్దరత్నావళీ.

"శీధురిక్షురసైఃపక్వైః, రపక్వైరాసవోభవేత్
మైరేయంధాతకీపుష్ప, గుడధాన్యాంబుసంయుతమ్"
(మాధవుఁడు) - గురుబాల

క॥ నావిని ధౌమ్యాదిమహీ
దైవతములుఁదమ్ముఁగమియుఁదనుఁగొలువఁ 1 గ, శో
కావహమతిభవదగ్రజు
దీవనగొనిచనియెనయ్యుధిష్ఠిరుఁడెలమిన్. 54

వ్యా ,— నాన్ = అనఁగా, విని = ఆకర్ణించి, ధౌమ్యాధి = ధౌమ్యుఁడుమొదలుగాఁగల, మహీదైవతములున్ = భూసురులును, (బ్రాహ్మణులును) తమ్ముఁగమియున్ = అనుజసమూహమును (భీమార్జున నకులసహదేవులును - అనుట) తనున్ = తన్ను, కొలువఁగన్ = సేవింపఁగా, శోక = దుఃఖమును, అవహ = కలిగించునదియగు, మతిన్ = బుద్ధితో, అయ్యుధిష్ఠిరుఁడు = ఆధర్మరాజు, భవత్=నీయొక్క (నారదునియొక్క_అనుట, నారదుఁడు-శ్రోత) అగ్రజు = అన్నయొక్క సనందనునియొక్క, దీవనఁగొని = ఆశీస్సునుపొంది, ఎలమిన్ = ప్రీతితో చనియెన్ = (పౌండరీకమునకు) అరిగెను.

వ్యాక :— యుధిష్ఠిరుఁడు = యుద్ధమునందు స్థిరుఁడు, సప్తమ్యలుక్సమాసము. "గవియుధిభ్యఃస్థిరః" (8-3-95) "అపదాంతస్య మూర్ధన్యః" (8-3-55) యుధి+స్థిరః = యుధిష్ఠిరః.

---

54 ప ;- 1 నశో - చ, త; గశో - ర, అ.

ఉ॥ ఆకుముదాప్తవంశవిభుఁడంతకనుంగొనియెన్, వసుంధరా
నాకము, 1 నాకుపాకశుకనాసశుకాదికసన్మునిస్తుత
శ్లోకము, శోకకర్దమవిశోషణ 2 కోకహితప్రభాసము
త్సేకముఁ, దాపవహ్ని జలశీకర 3 సేకముఁబౌండరీకమున్. 55

వ్యా :— ఆకుముదాప్తవంశవిభుఁడు = అచంద్రవంశపురాజు-అధర్మరాజు, అంతన్ = అప్పుడు, వసుంధరానాకమున్ = భూలోక స్వర్గమయినదియు, నాకుపాక = పుట్టనినుగు - వాల్మీకి, (పాకఃపచన శాబకౌ - త్రి. వి) శుకనాస = శుకనాసుఁడు, శుక = శుకుఁడు, ఆదిక = మొదలుగాఁగల, సన్ముని = మంచిమౌనులచేత, స్తుత =పొగడఁబడిన, శ్లోకము = యశస్సుగలదియు, (పద్యేయశసిచశ్లోకః - అమ) శోక = దుఃఖమనెడు, కర్దమ = బురదయొక్క, విశోషణ = బాగుగా శుష్కింపఁజేయుటయందు, కోకహిత = చక్రవాకబాంధవునియొక్క-సూర్యునియొక్క, ప్రభా = కాంతియొక్క, సముత్సేకమున్ = అతిశయముగలదియు, తాపవహ్ని = తాపమనెడునగ్నికి, జలశీకర = నీటితుంపురులయొక్క, సేకమున్ = చల్లుటగలదియు, అగు; పౌండరీకమున్ = పౌండరీకక్షేత్రమును, కనుగొనియెన్ = దర్శించెను.

ఛం :— ద్విప్రాసము

అలం :— రూపకము.

లయగ్రాహి :—

కంబువు, నరాళచికురంబులు, గటీకృతక
రాంబురుహయుగ్మ, మలికాంబకము, నగ్న

55 ప :- 1 నాక - గౌ; నాకు - ర, అ; లోక - ర; కోక - అ. 3 సైక
ము - గౌ; సేకము - ర, అ.

త్వంబుఁబసిరొప్పు వెదురుం, 1 బెరుఁగు 2 నడ్డ 3 పొదు
లుం, బదములంబలుకుచుంబొదలు 4 మువ్వల్
జంబుఫలజిద్రుచిభరంబు, మకరాకృతిఁగ
రంబమరుకుండలములుఁబరఁగఁబంచా
బ్దంబులఁదలిర్చు నిసువుఁబతిభజించెఁద్రిజ
గంబులకు రోహణనగంబగునగణ్యున్. 56

వ్యా :— కంబువున్ = శంఖమును - పాంచజన్యమును, అరాళచికురంబులు = వక్రములయిన శిరోజములును, కటీ = మొల యందు, కృత = చేయఁబడిన - ఉంచబడిన. కరాంబురుహయుగ్మము = పద్మములవంటిచేతులజంటయు, అలికాంబకము = నొసటికన్నును, (ఫాలనేత్రమును) నగ్నత్వంబున్ = దిగంబరత్వమును, పసిన్ = ఆలమందను, రొప్పు = అదలించు, వెదుఁరున్ = వెదురుకఱ్ఱయు (వేణుదండమును) పెరుఁగు = వర్ధిల్లు, అడ్డపొదులున్ = అడ్డతిత్తులును, (అడ్డతీఁగలతో నల్లినతిత్తులును - చూ 2-33) పదములన్ = పాదములయందు, పలుకుచున్ = మ్రోగుచు, పొదలు = ఒప్పు, మువ్వల్ = గజ్జెలును, జంబుఫలజిత్ = నేరెడుపండ్లయొక్క గెలుపరియగు (సరిపోలునదియగు) రుచిభరంబున్ = కాంత్యతిశయమును, మకర = మొసలియొక్క; ఆకృతిన్ = ఆకారముతో, కరంబు = మిక్కిలి, అమరు= ఒప్పు, కుండలముల్ = కుండలములనెడు కర్ణాభరణ విశేషములును, (మకరకుండలములును - అనుట) పరఁగన్ = ఒప్పఁగా, త్రిజగంబులకున్ = ముల్లోకములకు, రోహణనగంబు = విదూరపర్వతము, (రోహణః = విదూరాద్రిః - ఇతిజటాధరః - శబ్దక) అగు = అయిన

56 ప :- 1 బెరగు - త; బెరుగు - ర, అ, గౌ. 2 నుండ - గౌ; నుడ్డ-ర,అ. 3 పాడ - ర; పాడు – గౌ; పాదు – అ. 4 పువ్వల్ – గౌ; మువ్వల్ - ర, అ.

అగణ్యున్ = గణింపశక్యముకానివాఁడగు, పంచాబ్దంబులనిసువున్ = ఐదేండ్లశిశువును - విట్ఠలుని. (విట్ఠలుఁడుబాలకృష్ణుఁడు) పతి = రాజు ధర్మజుఁడు, భజించెన్ = సేవించెను.

అలికాంబకము - విట్ఠలునకుఫాలనేత్రముండుట విశేషము. చూ 4-133 వ్యాఖ్య.

వ్యాక :— జంబుఫలజిత్ చూ 1 .... వ్యాఖ్య.

క॥ పుష్కరణిఁదీర్థమాడియుఁ
బుష్కరదళనయనుమూర్తిఁబూజించియునా
విష్కృతశుభోన్నతియునతి
నిష్కలష్మమతియునయ్యెనృపతి, మునిపతీ! **57**

వ్యా :— పుష్కరణిన్ = కోనేటియందు, (పుష్కరిణ్యాంతు ఖాతంస్యాత్ - అమ; నెగడుఁబుష్కరణికోనేరనంగ - ఆం భా ) తీర్థమాడియున్ = స్నానముచేసియు, పుష్కరదళనయను = పద్మపత్రములవంటినేత్రములుగలవానియొక్క - విట్ఠలునియొక్క, మూర్తిన్ = ప్రతిమను, ("మూర్తిః = ప్రతిమా - ఇతి హేమచంద్రః" - శబ్దక) పూజించియున్ = అర్చించియు, నృపతి = రాజు - ధర్మజుఁడు, ఆవిష్కృత = ఆవిష్కరింపఁబడిన, శుభ = మంగళములయొక్క, ఉన్నతియున్ = ఔన్నత్యముగలవాఁడును, అతినిష్కల్మష = మిక్కిలి నిర్మలమయిన, మతియున్ = బుద్ధిగలవాఁడును, అయ్యెన్= ఆయెను.

పుష్కరిణి - చూ 3-137 వ్యాఖ్య.

క॥ దానంబునఁబిత్రృగురుసఖి
దానంబునసైన కీడుదలఁగిహరికృపా
దానంబు 1 నందెఁగురుపతి
దానంబునరుద్భవంబు 2 దనకుంగలదే? **58**

---

58 ప :- 1 సెందె - ర (పా) నందె - ర, అ, గొ; దానికి - ముద్రి (అ), ర, దనకుం - అ, గొ.

వ్యా :— దానంబునన్ = త్యాగముచేతను, పితృ= తండ్రుల యొక్కయు, గురు = గురువులయొక్కయు, సఖి = మిత్రులయొక్కయు దానంబునన్ = ఛేదనముచేతను - వధించుటచేతను, దానంగజమదే త్యాగే, పాలనచ్ఛేదశుద్ధిషు - విశ్వ ఐన = ప్రాపించిన, కీడు = పాపము, తలఁగి = నశించి, హరికృపా = విఠ్ఠలునియొక్కదయతోఁ గూడిన, ఆదానంబున్ = స్వీకారమును, కురుపతి = కురునాథుఁడు- ధర్మరాజు, అందెన్ = పొందెను. దానన్ = దానిచేత, పునః = మరల, ఉద్భవంబు = జన్మము - పునర్జన్మము, తనకున్ = తనకు, కలదే = ఉన్నదా ? లేదనుట.

ఛం :— త్రిప్రాసము.

అలం :— యమకము.

వ్యాక :— కురుపతి - కురూణాంపతిః కురువు-చూ5-55 వ్యాఖ్య.

అలం :--- యమకము.

తే॥ ఆయతీందుప్రిందు 1 ఋత్విజుండయ్యె; వేది
యయ్యెశ్రీపౌండరీకమహాస్థలంబు
పాపపశువుల విశసించి భక్తి 2 చరువు
పాండురంగాగ్నిలో వేల్చుపాండవునకు. **59**

వ్యా :— పాప = అఘములనెడు, పశువులన్ = జంతువులను, విశసించి = వధించి, భక్తిచరువున్ = భక్తియనెడు వేల్వఁదగిన పక్వాన్నమును. (హవ్యపాకేచరుఃపుమాన్ - అమ) పాండురంగ = పాండురంగఁడనెడు, అగ్నిలోన్ = వహ్నిలోపల, వేల్చు=హోమము

---

59 ప :- 1 ఋత్విజుం - గౌ; ఋత్విజుఁడయ్యె - ర; ఋత్విజుండయె-అ.
2 వరపు - గౌ, చరువు - ర, అ.

చేయు, పాండవునకున్ = పాండుపుత్రునకు - ధర్మరాజునకు, అయ తిందుఁడు = శ్రేష్ఠుఁడగునయాయతి - అసనందనమహర్షి, ఋత్విజుండయ్యెన్ = యాజకుఁడయ్యెను. యజ్ఞముచేయించువాఁడయ్యెను. (ఋత్విజోయాజకాశ్చతే - అమ) శ్రీపౌండరీక = శ్రీపౌండరీకమనెడు మహాస్థలంబు = గొప్పప్రదేశము - క్షేత్రము, వేదియయ్యెన్ = (యజ్ఞ) వేదికయయ్యెను.

పాపములనెడు పశువులను విశసనముచేసి, భక్తియనుచరువును బాండురంగవిఠ్ఠలుఁడను నగ్నిలోపల హోమముచేయు ధర్మరాజునకు, సనందనమహర్షి యాజ్ఞకుఁడయ్యెను పౌండరీకక్షేత్రము యజ్ఞవేదిక యయ్యెను.

ఋత్విజుఁడు —

"అగ్న్యాధేయంపాకయజ్ఞా, నగ్నిష్టోమాదికాన్మఖాన్
యఃకరోతివృతోయస్య, సతస్యర్త్విగిహోచ్యతే" [మ. స్మృ]

"అగ్నిధ్రాదయష్షోడశయాజకఋత్విక్ఛబ్దవాచ్యాఃతేచ, బ్రహ్మ ఉద్గాతా, హోతా, అధ్వర్యుః, బ్రాహ్మణాచ్ఛంసీ, ప్రస్తోతా, మైత్రావరుణః, ప్రతిప్రస్థాతా, పోతా, ప్రతిహర్తా, అచ్ఛావాకః; నేష్టా, అగ్నిధ్రః సుబ్రహ్మణ్యః, గ్రావస్తుత్, ఉన్నేతాచేతి" [గురుబాల]

అలం :- రూపకము

వ॥ ఇవ్విధంబున నవ్విధువంశవతంసంబు కంసమర్దన సాక్షాద్దర్శనంబు నిజదురిత కర్శనంబునాపాదించుటఁగృతార్థుండై, పౌండరీకవాస్తవ్యులగు పుండరీకాది విద్వత్పుండరీకంబుల 1 నొండండకీర్తించు

---

60 ప :- 1 నొండొండఁగీ - డ, ద, బ, ర; నొందొండకే - అ.

చుం 2 బ్రివర్తితకతిపయదివస ప్రిచారుండై యచ్చటనుండి నిజా నుజద్విజసనాథంబుగా గజపురంబునకుం జనుదెంచి సుఖంబుండె; నట్లగుటంజేసి.

**60**

వ్యా :— ఇవ్విధంబునన్ = ఈప్రికారముగా, అవ్విధువంశ వతంసంబు= అచంద్రవంశశిరోభూషణము, అచంద్రవంశశ్రేష్ఠుఁడనుట అధర్మరాజు, కంసమర్దన = కృష్ణునియొక్క - విఠ్ఠలునియొక్క, సాక్షాత్కారదర్శనంబు = ఇంద్రియగోచరమగు దర్శనము, నిజ = తన దయిన, దురిత = పాపముయొక్క, కర్శనంబున్ = కృశత్వమును, ఆపాదించుటన్ = కలిగించుటచేత, కృతార్థుండై = చరితార్థుఁడై, పౌండరీకవాస్తవ్యులు = పౌండరీకక్షేత్రినివాసులు, అగు = అయిన పుండరీక = పుండరీకుఁడు, ఆది = మొదలుగాఁగల, విద్వత్పుండరీకంబులన్ = శ్రేష్ఠులయినపండితులను, (వ్యాఘ్రిపుండరీకాః స్యురుత్తరపదేవ్యాఘ్రి -- పుంసిశ్రేష్ఠార్థగోచరాః - అమ) ఒండొండ = వరుసగా (యథాక్రిమముగా) కీర్తించుచున్ = స్తుతించుచు, ప్రివర్తిత = ప్రివర్తింపఁబడిన, కతిపయదివస = కొన్నిదినములయొక్క, ప్రిచారుండై = సంచారముగలవాఁడయి, (కొన్నిదినములు సంచరించినవాఁడై- అనుట) అచ్చటనుండి = అక్కడనుండి - పౌండరీకమునుండి, నిజ = తనవారయిన. అనుజ = తమ్ములతోడను, ద్విజ = బ్రాహ్మణులతోడను, సనాథంబుగాన్= కూడుకొన్నవాఁడుగా, గజపురంబునకున్= హస్తినాపురమునకు, చనుదెంచి = వచ్చి, సుఖంబుండెన్ = సుఖముతో నుండెను. అట్లగుటంజేసి= అట్లగుటచేత, (మీఁదిపద్యముతోనన్వయము)

క॥ 1 అదియుమహాఫలమని తన
హృదయంబునఁబౌండరీకమెవ్వఁడెఱుఁగఁడా

---

2 బ్రవర్తించి- ప; య, ర. బ్రవర్తిత - అ, గౌ.

61 ప :- 1 అదియె - ర, అ; అడియ - గౌ.

2 మెదుకచను 3 నిదియుముక్తి
ప్రదమని పెరతీర్థమునకు; బహునిగమనిధీ ! 61

వ్యా :— బహు = అనేకములయిన - సమస్తములయిన, నిగమ = వేదములకు, నిధీ = గనియయినవాఁడా - ఓ నారదా! అదియ = అదే, మహాఫలమని = గొప్పప్రయోజనమని, తన = తన యొక్క, హృదయంబునన్ = మనస్సునందు, ఎవ్వఁడు = ఎవఁడు, పౌండరీకము = పౌండరీకక్షేత్రమును, ఎఱుఁగఁడు = తెలిసికొనఁడో ఆమెదుక = ఆమందుఁడు, ఇదియున్ = ఇయ్యదియు, ముక్తిప్రదమని = మోక్షదాయకమని, పెరతీర్థములకున్ = అన్యక్షేత్రములకు, చనున్ = అరుగును,

వ్యాక :— ఎఱుఁగఁడు = ఎఱుఁగఁడో. ఓ - అధ్యాహార్యము. ప్రౌ. వాక్య 13

క॥ వాలినదప్పి వియజ్ఝర
కూలంబుననుయ్యిదవ్వుకు మతిగలిగినన్
శ్రీలలనావిభుఁడుండని
నేలయుక్షేత్రమని 1 యరుగునీచుఁడుగలుగున్. 62

వ్యా :— వాలిన = అతిశయించిన, దప్పిన్ = పిపాసచేత, వియజ్ఝర = ఆకాశజలప్రవాహముయొక్క - గంగానదియొక్క, కూలంబునన్ = ఒడ్డునందు, నుయ్యి = కూపము, త్రవ్వు = త్రవ్వేడు, కుమతి = కుత్సితమయిన బుద్ధిగలవాఁడు, కలిగినన్ = ఉన్నచో, శ్రీలలనావిభుఁడు = లక్ష్మీకాంతావల్లభుఁడు హరి - విఠ్ఠలుఁడు,

---

2 మెదక - గ; మెదుక-ర, అ. 3 నిదియ-గ;చ,ర; నిదియు-అ.
62 ప :- 1 యెఱుఁగు - గ, చ, గొ; యరుగు - ర, అ.

ఉండని = వసింపని, నేలయున్ = ప్రదేశమును, క్షేత్రము ని = పుణ్య స్థలమని, అరుగు = ఏగెడు, నీచుఁడు = అధముఁడు, కలుగున్=ఉండును.

అలం :— నిదర్శనము.

చ॥ మసనమునందునైనఁబురమార్గమునంబడియైన నింటనై
న, సకలగర్హితస్థలమునన్ బ్లవగేహమునందునైన, నా
కసమున, నీట, నేలపయిఁగంకటిమీఁదునన్నైన మానవుం
డసువులఁబాసి, నిష్కలుషుఁడై హరి యగునమ్మహాస్థలిన్. 63

వ్యా :— మానవుండు = మనుష్యుఁడు, మసనము నందునైనన్ = శ్మశానమునందయినను, పురమార్గమునన్ = పట్టణమార్గమునందు, పడియైనను = మూర్ఛిల్లియయినను, ఇంటనైనన్ = గృహమునందయినను, సకలగర్హితస్థలమునన్ = ఎల్లరచేతనిందింపఁబడినప్రదేశమగు, ప్లవ = చండాలునియొక్క, "చండాలప్లవమాతంగదివాకీర్తిజనంగమాః - అమ) గేహమునందునైనన్ = గృహమునందయినను, ఆకసమునన్ = ఆకాశమునందు, నీటన్ = నీటియందు, నేలపయిన్ = భూమిమీఁద, కంకటిమీఁదనన్ = మంచముపైని, ఐనన్ = అయినను, అమ్మహాస్థలిన్ = ఆగొప్ప ప్రదేశమునందు - ఆపాండురంగ క్షేత్రమునందు, అసువులన్ = ప్రాణములను, పాసి = విడిచి, నిష్కలుషుఁడై = పాపములులేనివాఁడయి, తాన్ = తాను, అసువులన్ = ప్రాణములను, పాసి = వదలి, (మరణించి - అనుట) హరి = విష్ణువు, అగున్ = అగును, విష్ణుసారూప్యమునందుననుట.

సారూప్యము - చూ 5-151 వ్యాఖ్య.

వ్యాక :— ఆకసమునసీట నేలపయిఁగంకటిమీఁదునన్నైనన్ - ఇట 'ఐనన్' అనునది పెక్కుచోట్ల కొక్కటేయన్వయించుచున్నది. (ఆకసమునన్నైననీటనైన నేలపయినైనఁగంకటిమీఁదునన్నైన) - ఇది వాక్యన్యాయసిద్ధము.

క॥ విను, పతితుఁడైనఁగాని
చనితత్ క్షేత్రంబునందుఁ 1 జానోఁచిపున
ర్జననంబుగనఁడు; గావున
**జనులకు నాస్థలము 2 నందచనుఁదను 3 వూడ్చన్. 64**

వ్యా :— విను = (నారదా!) ఆకర్ణింపుము. పతితుఁడైనన్= స్వధర్మభ్రష్టుఁడయినను, **కాని** = కానిమ్ము. చని = అరిగి, తత్ క్షేత్రంబునందున్ = అపుణ్యస్థలమునందు - అపౌండరీకమునందు, చానోఁచి = చక్కునదృష్టమునకుఁబాత్రుఁడయి, పునర్జననంబు = మరల జన్మించుటను, కనఁడు = పొందఁడు. (ముక్తుఁడగునని యట) **కావునన్**= కాబట్టి, జనులకున్ = లోకులకు, అస్థలమునందు = అచోటనే - అపౌండరీకమునందే, తనువు = శరీరమును, ఊడ్చన్ = విడుచుట, చనున్ = తగును.

పతితుఁడు —

"స్వధర్మంయఃసముచ్ఛిన్న, పరధర్మంసమాశ్రయేత్

అనాపది న విద్వద్భిః, పతితః పరికీర్తితః" (మార్కం)

వ్యాక :— చావన్ = చాన్ - బా. క్రియా 95.

---

64 ప ।- 1 జానోపి - డ, ద, బ; జానోఁచి - అ; జానోచి - ర. 2 నందచను - గౌ; నందుఁజను - ర, అ. 3 వూడ్వ౽? - ముద్రి (అ), ర; వూడ్చన్ - అ.

ఉ॥ అద్రిభృ 1 దుత్తరాశశతహస్తమితావనినున్న వాఁడు బో
ధిద్రుమమూర్తియై నృహరితీర్థనివాసులఁగాచుపూన్కి, నో
భద్రవిచార ! యాభువన భర్తకునుత్తరభాగమూఁదియ
క్షుద్ర 2 శుభోన్నతిన్ వెలయుఁగుండలతీర్థముతీర్థరాజమై. 65

వ్యా :— అద్రిభృత్ = పర్వతధారియొక్క (గోవర్ధనోద్ధారి యొక్క - కృష్ణునియొక్క) - విట్ఠలునియొక్క, ఉత్తరాశన్ = ఉత్తర దిక్కునందు, శతహస్తమిత = నూఱుమూరల పరిమితిగల, (ప్రకోష్ఠే విస్తృతకరేహస్తః-అమ) అవనిన్ = ప్రదేశమునందు, (నూఱుమూరల దూరములో - అనుట) తీర్థనివాసులన్ = క్షేత్రమునందు నివసించు వారిని, కాచు = రక్షించు, పూన్కిన్ = దీక్షతో. నృహరి = నరసింహ స్వామి, బోధిద్రుమమూర్తియై = అశ్వత్థరూపుఁడై (రావిచెట్టు రూప మున) ఉన్న వాఁడు = ఉన్నాఁడు. ఓభద్రవిచార = ఓమంగళప్రదమైన యాలోచనగలవాఁడా! - ఓ నారదా ! అభువనభర్తకున్ = ఆలోక నాథునకు - అవిట్ఠలునకు, ఉత్తరభాగమున్ = ఉత్తరప్రదేశమును; ఊఁది = ఆశ్రయముగాఁజేసికొని, కుండలతీర్థము = కుండలమను పేరు గల తీర్థము, తీర్థరాజమై = తీర్థశ్రేష్ఠమై, అక్షుద్ర = అధికమయిన, శుభ = మంగళములయొక్క, ఉన్నతిన్ = ఔన్నత్యముతో, వెల యున్ = ఒప్పును.

హస్తము - చూ 2-116 వ్యాఖ్య.

---

65 ప ;- 1 దంతరాళ - క; దుత్తరాశ - ర, అ. 2 సుఖోన్న - ముద్రి (అ), ర, శుభోన్నతిఙ - ర, అ.

క॥ 1 విందుఁదనతొడుగుమణిమయ
కుండలయుగ 2 మచటుదాఁచెఁగొండగొడుగుగా
నుండునతఁడనఁగఁదద్గుణ
కుండలపరిపూర్ణకర్ణకుహరుఁడనగుచున్. 66

వ్యా ;— కొండ = పర్వతము - గోవర్ధనపర్వతము, గొడుగుగాన్ = ఛత్రముగా, ఉండునతఁడు = ఉండువాఁడు (గోవర్ధనపర్వతమును గొడుగుగానెత్తినవాఁడు-కృష్ణుఁడు)-విఠ్ఠలుఁడు, తనతొడుగు = తానుధరించు, మణిమయకుండలయుగము = రత్ననిర్మితమగుకుండలములజత, అచటన్ = అక్కడ - అకుండలతీర్థమునందు, దాఁచెన్ = భద్రపఱిచెను. అనఁగాన్ = అనునట్లు - అని, తత్ = అతనియొక్క అవిఠ్ఠలునియొక్క, గుణ = సద్గుణములనెడు, కుండల = కుండలములచేత, పరిపూర్ణ = నిండిన, కర్ణకుహరుఁడను = గుహవంటిచెవులుగలవాఁడను, అగుచున్ = అగుచు, విందున్ = ఆకర్ణింతును.
వ్యాక ;— విందున్ = విందున్ - బా క్రియా 59 తనతొడుగు = తానుతొడుగు - ప్రౌ. కారక 15

సీ॥ అకుండలాఖ్యతీర్థాంబుధారలనాడి
నరకేసరిభజించునరుఁడ రాజ
సూయఫలంబొందుఁజూవె ! యావేలుపు
తేలికఁజుట్టిరానేనుచేతు
ల వెడల్పునేలవాలాయంబుగాఁగస
పూడ్చియుల్క 1 భజించుచున్నజనుల
చేతఁబూజలు 2 గొనుఁబూతనాభూతనా
రీహర్త, బహుజనశ్రేణులందు

66 ప :- 1 విందు-డ. ద. బ. ర; విందుముతనతొడు—గొ; విందుఁదన-అ.
2 మట్లు - గొ; మచట - ర. అ.
67 ప :- 1 భజింపు - గొ; భజించు – ర, అ. 2 గొనుపూత - ముద్రి (అ).ర; గొనుఁబూత - అ. పూతనాదికహర్త, శ్రీభర్త – గొ.

తే॥ వారుముక్తులు ధరజీవవంతులయ్యు
వారిపితరులు తృప్తులైవఱలువారు
వారిచరి 3 యించుచున్నయుర్వ 4 రయల్లతె
దీవి; వారల పలుకులుదేవకథలు. 67

వ్యా :— అకుండలాఖ్య = అకుండలమను పేరుగల, తీర్థ = పుణ్యజలాశయముయొక్క, అంబుధారలన్= జలధారలయందు, ఆడి = స్నానముచేసి, నరకేసరిన్ = నృసింహస్వామిని, భజించు = సేవించు, నరుఁడు = మానవుఁడు, రాజసూయఫలంబు = రాజసూయయాగ ఫలమును, బొందుఁజూవె = పొందునుజుమా! ఆవేలుపుటేలికన్=ఆదేవతాధీశుని - ఆనృసింహస్వామిని, చుట్టిరాన్ = చుట్టివచ్చునట్లు - ప్రదక్షిణించునట్లు, ఏనుచేతులవెడల్పునేలన్ = ఐదుమూరల, 120 అంగుళముల వెడల్పుగలప్రదేశమునందు, వాలాయంబుగాన్ = నిరంతరముగా, ఎల్లప్పుడు కసవు = పెంటను, ఊడ్చి = తుడిచి, అల్కి = పేఁడతోరాచి, భజించుచున్న, జనులచేతన్ = నరులచేత, పూతనా = పూతనయనెడు, భూతనారీ = పిశాచకాంతయొక్క, హర్త = సంహారకర్త - పూతనయనెడు పిశాచకాంతను సంహరించినవాఁడు -కృష్ణుడు విట్ఠలుఁడు, పూజలుగొనున్ = అర్చనలుపొందును, బహుజనశ్రేణులందున్ = నానాజనసమూహములయందు, వారు = అట్లు విట్ఠలుని సేవించువారు, ధరన్ = భూమియందు, జీవవంతులయ్యున్ = జీవించుచున్న వారయినను, ముక్తులు= మోక్షముపొందినవారు. (జీవన్ముక్తులు- అనుట) వారి = వారియొక్క, పితరులు = పితృదేవతలు, తృప్తులై = తనివిచెందినవారయి, వఱలువారు = ఒప్పువారు. వారు = వారలు, చరించుచున్న = తిరుగుచున్న, ఉర్వరయ = భూమియే - ప్రదేశమే, తెల్లదీవి = శ్వేతద్వీపము, (వైకుంఠము) వారల = వారియొక్క, పలుకులు = మాటలు, దేవకథలు = దేవతాచరిత్రలు.

---

3 యింపు - గొ; యించు - ర; అ. 4 రయు.త; రయ- ర, అ.

తెల్లదీవి - 7 శ్వేతదీపః = సచవైకుంఠాఖ్యవిష్ణుధామ" రాజ సూయః = రాజ్ఞాలతాత్మకః సోమః సూయతేఽత్ర - ఇత్యమరటీకా. రాజకర్తవ్యయజ్ఞవిశేషః" [శబ్దక] చేయి = హస్తము-5-65 వ్యాఖ్య.

తే॥ అన్నృకేసరిభజియింతురమరకన్య
లెన్నఁబెక్కండ్రుహారతులిచ్చియిచ్చి
వారిఁగొల్వక 1 గర్వించువారుక్షేత్ర
మండలమున సుఖస్థితినుండలేరు. 68

వ్యా :— అన్నృకేసరిన్ = అనరసింహస్వామిని, అమర కన్యలు = దేవకాంతలు - అప్సరసలు, ఎన్నన్ = గణింపఁగా, పెక్కండ్రు = పలువురు, హారతులిచ్చియిచ్చి = నీరాజనములనొసఁగి యొసఁగి, భజియింతురు = సేవింతురు. వారిన్ = వారలను - అయప్స రసలను, కొల్వక = సేవింపక, గర్వించువారు = గర్వపడువారు. క్షేత్రమండలమునన్ = క్షేత్రప్రదేశమునందు - పౌండరీకమునందు, సుఖస్థితిన్ = సౌఖ్యస్థితితో, ఉండలేరు = నివసింపలేరు.

హారతి - ఆరాత్రికాశబ్దభవము - అరతి, అచ్ఛికపదములలోఁ గొన్నింట అకారమునకు హకారము వ్యవహారసిద్ధమై రూపాంతరము లేర్పడును. అట్టివానిలో 'హారతి' శబ్దమొకటి.

ఉ॥ అనరసింహుమోహలమ్మృతులై కులకోటి సమన్వితంబుగా
మానవులూర్ధ్వలోకసుఖమగ్నతఁజొక్కుదురెల్లకాలమున్
దానికిఁ 1 గప్పయైన 2 ప్రియుతప్రియపుత్రుఁడెసాక్షి, యచ్చటన్
గానితెలం 3 గులన్మెలఁగుకష్టమతుల్ నిరయైకసంగతుల్. 69

---

68 ప :- 1 గల్పించు - గౌ, గర్వించు - ర, అ.
69 ప :- 1 గర్వియై - డ, ద, బ; గష్టయై - త; గప్పయై - ర, అ.
2 యయుత - గౌ; "వ్రాతప్రతులందును 'ర' తప్ప తక్కినముద్ర ణములన్నింటను 'అయుత అనియే" - 'అ' - అధోజ్ఞాపిక - య (ప్రి?) యుత - అ. 3 గునన్ - గౌ; గులజ్ - ర, అ.

వ్యా :— ఆనరసింహు = ఆనరసింహస్వామియొక్క, మ్రోలన్ = సమీపమునందు, మృతులై = మరణించినవారై, మానవుల్ = మనుష్యులు, కులకోటిసమన్వితంబుగాన్ = అసంఖ్యాకములగు తమవంశములతో సహితముగా, ఊర్ధ్వలోక = స్వర్గముయొక్క, (స్వర్గోనాకస్సురావాస ఊర్ధ్వలోకః ఫలోదయః - వై. ని.) సుఖ = సౌఖ్యమునందలి, మగ్నతన్ = మునుగుటచేత, ఎల్లకాలమున్ = ఎల్లప్పుడు, చొక్కుదురు = పరవశింతురు. దానికిన్ = అందులకు; కప్పయైన = మండూకముగామాఱిన, ప్రియుత = ప్రియుతునియొక్క, ప్రియాపుత్రుఁడె = ప్రియనందనుఁడె - అయుతుఁడె, సాక్షి = ప్రత్యక్ష నిదర్శనము. అచ్చటన్ = అక్కడ - ఆకుండలతీర్థము, కాని తెలంగులన్ = అయుక్తమార్గములందు, మెలఁగు = వర్తించు, కష్టమతుల్ = దుష్టబుద్ధులు. నిరయైకసంగతుల్ = కేవలమునరకసంసర్గముగలవారు (నరకమునకే పోవువారనుట)

పుత్రి - ఏకతకారకమునుగలదు. చూ 1 - 9

## పద్మ తీర్థము

పంకజపత్రనేత్రునకుఁబశ్చిమదిక్కున నుండునానమ
త్పంకరుహాసనాద్యమర 1 పాలనలోలముపద్మతీర్థ, మో
పంకవిదూర! కేలఁగలపద్మమునచ్చట 2 దాఁచినాఁడు చ
క్రాంకుఁడుమున్ త్రిదంష్ట్రమనుజాశననాశనహేతు 3 కంబుగన్. **70**

---

70 ప :- 1 పాలమలోలము - ర, అ; పాలనలోలము - గౌ. 2 దాఁచి - ర, అ; దాఁచి - గౌ. 3 కంబుగాఁ - ర; కంబుగన్ - అ, గౌ.

వ్యా :— పంకజపత్రనేత్రునకున్ = కమలపత్రాక్షునకు-విఠ్ఠలునకు, పశ్చిమదిక్కునన్ = పడమటిదెసను, అనమత్ = నమస్కరించుచున్న, పంకరుహాసన = బ్రహ్మ, ఆది = మొదలుగాఁగల, అమరపాలన = దేవతలను బాలించుటయందు, లోలము = మిక్కిలియాసక్తిగలదియగు, పద్మతీర్థము = పద్మమనుపేరుగల తీర్థము, ఉండున్ = ఉండును. ఓపంకవిదూర = ఓపాపములకు మిక్కిలి దవ్వయినవాఁడా!- ఓనారదా! చక్రాంకుఁడు = (సుదర్శన) చక్రము చిహ్నముగాఁగలవాఁడు - విఠ్ఠలుఁడు, మున్ = పూర్వము, త్రిదంష్ట్రి = త్రిదంష్ట్రుఁడనెడు, మనుజాశన = మానిసిడిండి (దైత్యుని) యొక్క, నాశనహేతుకంబుగన్ = వినాశనకారణముగా, అచ్చటన్ = అక్కడ - ఆపద్మతీర్థమునందు. కేలన్ = (తన) చేతియందుఁగల, పద్మమున్ = కమలమును, డాఁచినాఁడు = భద్రపటిచినాఁడు.

క॥ ఆతీర్థతనువునకు ల
క్ష్మీతరుణీవల్లభుండుజీవము; వృజినో
పేతుఁడు ననవధి సవనో
ద్ఘాతఫలంబందునందుబొందివిడిచినన్. **71**

వ్యా :— ఆ తీర్థతనువునకున్ = ఆ (పద్మ) తీర్థమనెడు శరీరమునకు; లక్ష్మీతరుణీవల్లభుండు = రమాకాంతాపతి - విఠ్ఠలుఁడు, జీవము = ప్రాణము. అందున్ = అక్కడ - ఆపద్మతీర్థమునందు, వృజిన = పాపములతో, ఉపేతుఁడున్ = కూడుకొన్నవాఁడును, బొందిన్ = దేహమును. విడిచినన్ = త్యజించినచో, (మరణించినచో) అనవధి = హద్దులేని, సవన = యజ్ఞమువలన, ఉద్ఘాత = కలిగిన, ఫలంబు = ఫలితమును, అందున్ = పొందును.

ఉ॥ పాపదురాపరూపమగు పద్మసమాహ్వయతీర్థమౌళిని
రేపురుషుండు గ్రోలునొకయించుక 1 యెన్నఁడయేని, వానికిన్
బాపములభ్రపుష్పములు, బంధనముల్ శశశాబశృంగము
2 ల్తాప వికారముల్ మరుజలంబులు, పుట్టువులశ్మతైలముల్. **72**

వ్యా :— పాప = అఘములకు, దురాప = పొందరానిదగు రూపము = ఆకారముగలది, అగు = అయిన, పద్మసమాహ్వాయ = పద్మమనుపేరుగల. తీర్థమౌళిన్ = తీర్థముఖ్యముయొక్క, నీరు=జలము, ఏపురుషుండు = ఏనరుఁడు, ఎన్నఁడేని = ఏయొక్కనాఁడయినను, ఒకయించుక = ఒకకొంచెము, గ్రోలున్ = త్రావునో. వానికిన్ = అతనికి, పాపములు = అఘములు, అభ్రపుష్పములు = గగనకుసుమములు, బంధనముల్ = ప్రతిబంధకములు, శశశాబశృంగముల్ = కుందేటిపిల్లయొక్కకొమ్ములు, తాపవికారముల్ = సంతాపవికృతులు, మరుజలంబులు = నిర్జలదేశమునందు నీళ్లు, పుట్టువులు = జన్మములు, అశ్మతైలముల్ = ఱాతియందునూనెలు.
వ్యాక:- గ్రోలున్ = త్రాగునో. ఓ - అధ్యాహార్యము. ప్రౌ. వ్యాక 13

## సుశర్మోపాఖ్యానము

క॥ ఒకఁడు సుశర్మాఖ్యుఁడు షా
1 తుకుఁడు గలఁడు, కల్లుఁ దాగుఁదునుము ధరామ
ర్త్యకులుల 2 నఱదలఁచున్ గురు
నకుఁగనకము దొంగిలున్ 3 దినమునజప్రతా! **73**

---

72 ప :- 1 యెన్నఁడునేని - ముద్రి [అ], ర; యెన్నఁడయేని — అ, గౌ.
2 పాప - త; తాప - ర, అ.

73 ప :- 1 తకుఁడు - గౌ (యతిభంగము) తుకుఁడు - ర, అ. 2 నఱుదలఁచుగురు - త; నఱుదలఁచుగుడు - చ; నఱదలచును - గౌ; నఱదలఁచుం - ర; నఱదలఁచున్ - అ. 3 దినమునజపుత్రా - ర, అ; దినదినముఁబుత్రా — గౌ.

వ్యా :— సుశర్మాఖ్యుఁడు = సుశర్మయనుపేరుగలవాఁడగు, ఘాతుకుఁడు = హింసచేయువాఁడు, ఒకఁడు = ఒకానొకఁడు, కలఁడు = ఉండును. కల్లు = సురను, త్రాగున్ = పానముచేయును. ధరామర్త్య కులులన్ = భూసురవంశముగలవారిని, తునుమున్ = చంపును. గురు నకున్ = తండ్రికి, అఱదలఁచున్ = ద్రోహముతలపెట్టును. అజపుత్రా = ఓబ్రహ్మయొక్క కుమారుఁడా! – ఓనారదా! దినమున్=ప్రతిదినమును, కనకము = బంగారము, దొంగిలున్ = ముచ్చిలును.

దినము = ప్రతిదినము - చూ 4.144

సురాపానము బ్రహ్మహత్యస్వర్ణస్తేయము పంచమహాపాతకము లలోనివి. గురుద్రోహచింతగురుతల్పగమనేచ్ఛకావచ్చును.

పుత్ర - ఏకతకారకమునుగలదు. చూ 1-9

క॥ అవృషలీపతియావ
జ్జీవంబుగనంతనంతఁజేసిననానాం
హోవిసరంబులు పటమునఁ
గోవలువడవ్రాసిచిత్రగుప్తుఁడుదాఁచెన్. **74**

వ్యా :— అవృషలీపతి = అశూద్రస్త్రీయొక్కభర్త, యావ జ్జీవంబుగన్ = ప్రాణమున్నంతకాలము – బ్రతికియున్నంతకాలము, అంతంతన్ = అప్పుడప్పుడు, చేసిన = ఆచరించిన, నానా = అనేకము లయిన, అంహః = పాపములయొక్క, (అంహోదురితదుష్కృతమ్ - అమ) విసరంబులు = సమూహములు, పటమునన్ = వస్త్రమునందు_ వ్రాఁతకుపయోగించుజిగురుగలిపిన మసిపూసిన వస్త్రమునందు (కడితపు గుడ్డయందు) కోవలువడవ్రాసి = పూసగుచ్చినట్లు లిఖించి, చిత్ర గుప్తుఁడు = యమునియొద్దనుండు చిత్రగుప్తుఁడనుగణకుఁడు, (చిత్ర గుప్తస్తుపుంసిస్యాద్యమేతస్యచలేఖకే - మే.ని.) దాఁచెన్ = భద్రపఱిచెను.

వృషలుఁడనక వృషలీపతి - అనుటచే సుశర్మ భ్రష్టబ్రాహ్మణుఁడని యూహింపనగును.

చిత్రగుప్తుఁడు - "చిత్రాణాంజీవకృతపాపపుణ్యాది విచిత్రాణాం గుప్తంగోపనంరక్షణం యస్మాత్, యద్వా, చిత్రం విచిత్రం గుప్తం ధర్మస్యరక్షణం యస్య" [శబ్దక]

శా॥ ఆనీచుండొకనాఁడు, వాఁడిమిఁజతుర్వ్యాధాన్వితుండై, పెనుం
గానందెర్వులుగట్టియేగు ప్రజలం 1 గట్టిండియై దోఁచి, నీ
రానన్ రోయుచు 2 నుండెదప్పిగొని మధ్యాహ్నాతపా 3 పాతజ
గ్లానిందత్సమయార్తకాసరముఁబోలంజాలి 4 నల్దిక్కులన్ 75

వ్యా :— ఆనీచుండు = అయధముఁడు, ఒకనాఁడు = ఒక దినము, వాఁడిమిన్ = తీవ్రతతో. చతుర్వ్యాధ = నలుగురు కిరాతులతో అన్వితుండై = కూడుకొన్నవాఁడయి, పెనుంగానన్ = పెద్దయరణ్యమునందు, తెర్వులుగట్టి = త్రోవలనరికట్టి, ఏగు ప్రజలన్ = అరుగు జనులను - బాటసారులను, కట్టిండియై = నిర్దయుఁడై, దోఁచి = కొల్లగొట్టి, మధ్యాహ్న = పట్టపగలింటిదయిన, ఆతప = ఎండయొక్క ఆపాత = పడుటవలన, జ = కలిగిన, గ్లానిన్ = బడలికచేత, దప్పిగొని = దప్పికపొంది, (పిపాసనొంది) తత్సమయ = ఆకాలమునందు - మధ్యాహ్నకాలమునందు, ఆర్తపీడితమయిన, కాసరమున్ = మహిషమును, పోలఁజాలి = ఎనయఁగలిగి, (సరిపోలఁగలిగి) ఆనన్ = త్రాగుటకు, నల్దిక్కులన్ = నాలుగుదెసలయందును, నీరు = జలమును; రోయుచునుండెన్ = వెదకుచుండెను.

అలం :— ఉపమ.

---

75 ప :- 1 గట్టాడి - ప: గట్టిండి - ర, అ, గౌ. 2 నుండి - గౌ; నుండె - ర, అ. 3 వాత - గౌ; పాత - ర, అ. 4 నల్దిక్కులఁ - ముద్రి (అ), ర, గౌ; యాదిక్కునఁ - అ.

ఆ॥ అంతఁబద్మతీర్థమటవాఁడుగని, యందుఁ
జెమట 1 వాయమునిఁగి, విమలవారిఁ
గ్రోలి, రావిమొదలఁగూర్చుండి, యొకయింత
నిలిచి, యింటికరిగెవలయురీతి. **76**

వ్యా :— అంతన్ = ఆసమయమునందు, అటన్ = అక్కడ, వాఁడు = అతఁడు - అనుశర్మ, పద్మతీర్థము = పద్మమను పేరుగల తీర్థమును, కని = చూచి, అందున్ = దానియందు - అపద్మతీర్థమునందు, చెమట = ఘర్మము; పాయన్ = తొలఁగునట్లు, మునిఁగి = స్నానముచేసి, విమల = స్వచ్ఛమయిన, వారిన్ = నీటిని, క్రోలి = పానముచేసి, రావి = అశ్వత్థవృక్షముయొక్క; మొదలన్ = ప్రకాండమునందు, కూర్చుండి = ఆసీనుఁడయి; ఒకయింత = కొంచెముసేపు నిలిచి = ఆఁగి; వలయురీతిన్ = తగువిధమున; ఇంటికిన్ = గృహమునకు; అరిగెన్ = ఏగెను.

క॥ ఆవిషముమేననూని, త
దావిర్భవదఘచయంబు 1 నఱుగఁగఁగాచెన్
బోవఁగ; నలసంక్రాంతమ
హావిషధరవిషముఃకలిలయము 2 సేయుక్రియన్. **77**

వ్యా :— అవిషము = ఆజలము - అపద్మతీర్థజలము, (విషమప్పుచ - అమ) మేనన్ = దేహమునందు, ఊని = పూనుకొని; పోవక = విడువక; తద్ = వానియొక్క - అనుశర్మయొక్క; ఆవిర్భవత్ =

76 ప :- 1 వాయమునిఁగె - గౌ; వాయమునిఁగి - ర; అ, వోవమునిఁగి-త.

77 ప :- 1 కరఁగఁగ - య [యతిభంగము] నరుగఁగ-ర; నఱుగఁగ అ.
2 చేయు - ర, అ; సేయు - గౌ.

పుట్టుచున్న, అఘ = పాపములయొక్క, చయంబున్ = సమూహ
మును, నల = నలచక్రవర్తియందు, సంక్రాంత = సంక్రమించిన;
మహావిషధర = గొప్పసర్పముయొక్క-కర్కోటకునియొక్క, విషము =
గరళము, కలిన్ = కలిపురుషుని, లయముచేయుక్రియన్ = వినాశ
మొనర్చునట్లు (లయోవినాశేసంశ్లేషే - మే. ని.) అఱుగఁగరాచెన్ =
అఱుగఁదీసెను - హరించెను.

కర్కోటకుని విషముచే నలునాశ్రయించిన కలి, నిరంతరము
దగ్ధుఁడుకావలసివచ్చెను.

"అహివిషంబుచేతననయంబుదగ్ధుండ
నైతినింకనాకు నలుగవలదు" [అరణ్య 2-180]

క్రియన్ - ఇవార్థకము [తెనుఁగునవే]

అలం :— ఉపమ.

ఆ॥ అంతఁగొంతకాలమరుగంగ, మృత్యుగో
చరతనున్నయానుశర్మకడకు
లిఖితతత్కృతాఘ లిపియైనపటముఁదె
ప్పించిచిత్రగుప్తుఁడెంచిచూచి. 78

వ్యా :— అంతన్ = ఆపిమ్మట, కొంతకాలము = కొంత
పరిమితిగల సమయము, అరుగంగన్ = కడవఁగా, మృత్యు = మృత్యు
దేవతయొక్క, గోచరతన్ = ప్రత్యక్షీభూతవిషయత్వమునందు, ఉన్న =
ఉన్నట్టి - మరణమునొందియున్నట్టి, ఆనుశర్మకడకున్ = ఆనుశర్మ
యొద్దకు, లిఖిత = వ్రాయఁబడిన, తత్ = వానిచేత - ఆనుశర్మ
చేత, కృత = చేయఁబడిన, అఘ = పాపములుగలలిపియైన పటము=
లిఖితాక్షరములుగల కడితపుగుడ్డను [చూ 5-74] తెప్పించి = తెచ్చు
నట్లుచేసి, చిత్రగుప్తుఁడు = యమునిగణకుఁడు, ఎంచి = పరిశీలించి,
చూచి = కని (మీఁదిపద్యముతో నన్వయము)

క॥ దురితశతకోటులంద
క్షరమొకటియుఁగానలేక 1 కంపవికృతిభం
గురతాయుతుఁడై జముకడ
కరిగితగంబలుకునతఁడు ప్రాంజలియగుచున్. **79**

వ్యా :— దురిత = పాపములయొక్క, శతకోటులందున్ = నూఱుకోట్లయందు-అసంఖ్యాకములయినపాపములయందు, అక్షరము= వర్ణము, (అక్షరం బ్రహ్మవర్ణయోః - మే. ని.) ఒకటియున్ = ఒక్క టియు, కానన్ = చూచుటకు, లేక = లేకుండుటచేత, కంప = వణఁకుయొక్క, వికృతి = వికారముచేత, భంగురతాయుతుఁడై =మెలి కలు తిరిగినవాఁడయి, జముకడకున్ = యమునియొద్దకు, అరిగి = చని, అతఁడు = ఆతఁడు - చిత్రగుప్తుఁడు; ప్రాంజలియగుచున్ = మోడ్చినచేతులుగలవాఁడగుచు, తగన్ = యుక్తముగా, పలుకున్ = "ఇట్లు" వచించెను.

వ్యాక :- పలుకున్ = పలికెను. భూతమున లాట్టు - బా. క్రియా 22

ఉ॥ 1 డక్కఁగ వ్రాసితిన్ మునుపటమ్మునయందు సుశర్మపాపముల్
లెక్కలెఱుంగరాదులవలేశము 2 వానికి; నట్టివ్రాఁతయం
దక్కజమిప్పుడొక్కటియునక్షరరూపములేద; దేవ! నేఁ
డక్కడితంబుగట్టియుడినట్టులయున్నది కప్పుదేఱుచున్. **80**

వ్యా :— మును = పూర్వము, పటమ్మునయందున్ = వస్త్రమునందు - కడితపు గుడ్డయందు, సుశర్మ = సుశర్మయొక్క

---

79 ప :- 1 కంక - య; కంప - ర. అ.
80 ప :- 1 దక్కఁగ - ర(పా) డక్కఁగ - ర, అ, గౌ. 2 దానికి - డ,ద,బ.

పాపముల్ = అఘములు, డక్కఁగన్ = చెడిగిపోకుండ నిలుచునట్లు, వ్రాసితిన్ = లిఖించితిని, వానికిన్ = అవ్వానియందు - అపాపముల యందు, లవలేశమున్ = లేశమునందు లేశమయినను-స్వల్పాంశమ యినను, (లవః = లేశః - శబ్దర) లెక్కలెఱుంగరాదు = లెక్కలు పెట్టశక్యముకాదు. (లెక్కపెట్టలేనన్ని పాపములుచేసెననుట) దేవ = ఓస్వామీ (దేవః = రాజా - శబ్దర)-ఓయమధర్మరాజా! అక్కజము = ఆశ్చర్యము, అట్టివ్రాఁతయందున్=అటువంటిలేఖనమునందు, ఇప్పుడు= ఇపుడు, అక్షరరూపము = అక్షరములస్వరూపము, ఒక్కటియున్ = ఒకటియయినను, లేదు = కలుగదు - కనఁబడదు. నేఁడు= ఈనాఁడు, అక్కడితంబు = అఘట్టితము (గుడ్డమీఁదజిగురుతోఁగలిపిన మసిపూసి నల్లపటిచియట్టులుగాఁజేసివానితోనేర్పఱిచిన లెక్కలపుస్తకము) గట్టియిడి నట్టుల = అక్షరములుతుడిచివేయుటకుఁ జిగురుతోఁగలిపిన మసిపూసినట్లే కప్పుదేఱుచున్ = నల్లఁబాఱుచు, ఉన్నది = ఉన్నయది.

వ్యా :— డక్కు = దక్కు - బా. ప్రకీర్ణ 14. పటు మ్మునయందు - ప్రౌ. శబ్ద 21. వానికిన్ = వానియందు -ప్రౌ కారక 13. దేవ - రాజార్థకమునకు సంబోధనమునసే ప్రయోగము; డుఙ్ లోపము - ము. కౌ.

ఆ॥ హతలతాంతమైన యారామమునుబోలె
విగతతారమైన విన్నుఁబోలె
గళిత వర్ణ 1 మగుటఁగడితంబు; దీనికి
2 మీరతెలియవలయుఁగారణంబు. **81**

వ్యా :— గళితవర్ణమగుటన్ = చ్యుతమయిన (పోయిన)

---

81 ప :- 1 మైనకళి - ప; మైనకడితం - ర; మగుటగడితంబు-గౌ; మగు టుఁగళితంబు - అ. 2 మీర - గౌ, మిర - ర, అ.

యక్షరములుగలదియగుటచేత, కడితంబు = కవిలె, (చూ 5-80) హాత = నాశనముచేయఁబడిన - రాల్పఁబడిన, లతాంతమైన = పువ్వులుగలదియయిన, ఆరామమును = ఉపవనమును, పోలెన్ = ఎనసెను (సరిపోలెను) విగతతారమైన = పోయిన (అదృశ్యమయిన) నక్షత్రములు గలదియగు, విన్నున్ = ఆకాశమును, పోలెన్ = ఎనసెను. (సరిపోలెను) దీనికిన్ = ఇట్లగుటకు, కారణంబు=హేతువు, మీరు+ఆ = మీరే, తెలియవలయున్ = ఎఱుంగవలెను,

వ్యాక :— విన్ను + పోలెన్. పోలె - పరమగుచో దు్రిత పూర్వకత్వము - ప్రౌ. సమాస 39

అలం :— ఉపమ.

క॥ అనిపల్కునమ్మహామతిఁ
గనిజముఁడిట్లనియెనీదు కవిలియనీ వ్రా
సినలిపియున్నదొ! లేదో!
కనుఁగొనుమీసారి లెస్సగా గణకవరా! 82

వ్యా :— అని పల్కు = అనివచించు, అమ్మహామతిన్ = ఆగొప్పదైనబుద్ధిగలవానిని - ఆచిత్రగుప్తుని, కని = చూచి, జముఁడు యముఁడు, ఇట్లు = ఈప్రకారముగా, అనియెన్ = పలికెను. గణకవరా = లెక్కలువ్రాయువారియందు శ్రేష్ఠుఁడా! - ఓచిత్రగుప్తా! నీదు కవిలియన్ = నీయొక్కకడితమునందు. నివ్రాసిన = నీయొక్క లిఖించిన - నీవు లిఖించిన, లిపి = లేఖనము, ఉన్నదొలేదో = కలదో లేదో! ఈసారి = ఈపర్యాయము, లెస్సగా = బాగుగా, కనుఁగొనుము = చూడుము. (పరికింపుమనుట)

కవిలియ - "కవిలెలోనున్నప్రకారంబు ప్రజపాప, పుణ్యముల్ చిత్రగుప్తుండు తెలుప (ఉ. రా. 3-316)

ఆ॥ అనుడునట్లకాకయని చిత్రగుప్తుండు
దండధరునియాజ్ఞ వెండినేగి
పటము ప్రతి 1 పుటంబుఁబరికించి, యందు 2 వీ
క్షించెఁజక్రపాణిచేతివ్రాఁత 83

వ్యా :— అనుడున్ = అన్నయనంతరము - (యముఁడిట్లు పల్కినయనంతరము) అట్లకాకయని = సరేయని, చిత్రగుప్తుండు = చిత్రగుప్తుఁడు, దండధరుని = యమునియొక్క, అజ్ఞన్ = అనతిచేత, వెండిన్ = మఱియును, (మరల - అనుట) ఏగి = అరిగి, పటము = వస్త్రముయొక్క - కడితపుగుడ్డయొక్క, (చూ 5-74 వ్యాఖ్య) ప్రతి పుటంబు= పొరటుపొరటు (ప్రతిపుట) పరికించి = పరిశీలనచేసి, అందున్= దానియందు - అకడితమునందు, చక్రపాణి = విష్ణుమూర్తియొక్క, (విఠ్ఠలునియొక్క - అనుట) చేతివ్రాఁత = హస్తలేఖనము, ఈక్షిం చెన్ = కనుఁగొనెను.

ప్రతిపుటంబు - పటశబ్దభవము, "పుటము" ములోపముచేత, పుటశబ్దమేర్పడియుండును.

వ్యాక :— ప్రతిపుటంబు - ప్రాదితత్పురుషము, మిశ్రము- ము. కౌ. సమాస.

*ఉ॥ ఈతఁడుపద్మతీర్థమున కేగియొకానొకనాఁడు తత్పయో
ధౌతనిజాంగుఁడైచనుకతంబున విప్రవధాదిపాతక
వ్రాతముఁదొంటిపుట్టువులఁబ్రాప్తములైన యఘంబులున్, మరు
ద్ధూతఘనాఘనావళులతోసరియై, సరిపోయెనన్నియున్. 84

83 ప :- 1 పటంబు – ర: పుటంబు -అ. 2 వీక్షించె–ర; నీక్షించె- అ, గౌ.
84 ప :- 1 'గౌ' ప్రతిలో నీపద్యములేదు.

**వ్యా :—** ఈతఁడు = ఇతఁడు - సుశర్మ, ఒకానొకనాఁడు= ఒకానొకదినము, పద్మతీర్థమునకున్ = పద్మమను పేరుగల తీర్థమునకు, ఏగి = అరిగి, తత్ = దానియొక్క-ఆపద్మతీర్థముయొక్క, పయః= నీటిచేత, ధౌత = కడుగఁబడిన, నిజాంగుఁడై = తనదయిన శరీరము గలవాఁడయి, చనుకతంబునన్ = అరిగినకారణమున, విప్రవధ = బ్రహ్మహత్య, ఆది = మొదలుగాఁగల, పాతక = పాపములయొక్క, వ్రాతమున్ = సమూహమును, తొంటిపుట్టువులన్ = పూర్వజన్మముల యందు, ప్రాప్తములైన = పొందఁబడినవియయిన, అఘంబులున్ = పాపములును మరుత్ = గాలిచేత, ధూత = ఎగురఁగొట్టఁబడిన, ఘనాఘన = వర్షించుమేఘములయొక్క, (వార్షుకాబ్దో ఘనాఘనః - అమ) ఆవళులతోన్ = శ్రేణులతో, సరియై = సమానమై, అన్నియున్= సర్వమును, సరిపోయెన్ = తొలఁగెను.

గాలిచే నెగురఁగొట్టఁబడిన వార్షుకమేఘములతో సమానములై పాపములన్నియుఁదొలఁగిపోయెననుట.

**అలం :—** ఉపమ.

*క॥ అనునర్థంబులుగలలిపిఁ
గనిచనిజముఁబల్కునతఁడు, గానఁబడదునే
మును వ్రాసినయది, యన్యము
కనుపట్టెడునేలిఖితమొకాని వినఁదగున్. **85**

**వ్యా :—** అను = అనెడు - పద్మతీర్థమునమునుఁగుటచే నితనిపాపములు నశించెననెడు, అర్థంబులుగల = శబ్దార్థములుగలిగిన, లిపిన్ = లేఖనమును, కని = చూచి, చని = అరిగి, జమున్ =

---

85 ప :- 1 'గా' లో, నీపద్యములేదు.

యమునిగూర్చి, అతఁడు = అతఁడు - చిత్రగుప్తుఁడు, పల్కున్ = (ఇట్లు) వచించెను. నేన్ = నేను, మును = పూర్వము, వ్రాసినయది = లిఖించినది, కానఁబడదు = కనఁబడదు. అన్యము = ఇతరము - వేఱే లిపి, కనుపట్టెడున్ = కనఁబడును, ఏలిఖితమొకాని = ఏలిపియోకాని, వినఁదగున్ = ఆకర్ణింపఁదగును.

*ఉ॥ ఈతఁడు పద్మతీర్థమునకేగియొకానొకనాఁడు తత్పయో
ధౌతనిజాంగుఁడై చనుకతంబున విప్రవధాది పాతక
వ్రాతముఁదొంటిపుట్టువులఁ బ్రాప్తములైనయఘంబులున్, మరు
ద్ధూతఘనాఘనావళులతో సరియైసరిపోయెనన్నియున్. 86

వ్యా :— చూ - 84 వ్యాఖ్య.

సీ॥ అనియొప్పు కౌతుకజనకాక్షరశ్రేణి
వీక్షించివచ్చితి, విద్వదింద్ర!
యిదిమీరలెఱిఁగింపుఁడే నాఁటు సకృదవ
గాహనంబునమహాకలుషరాశి
వలనఁ 1 బూరుషు చెఱదలఁగుపుణ్యాపుఁదీర్థ
మెన్నఁడుఁగనవిన, నీ 2 మదుక్త
లిపిపంక్తినేకవారపయోఽ 3 భిమజ్జన
మాత్రి 4 చే నణఁచిన మహిమగలుగు

86 ప :- *'గా' లో నీపద్యములేదు.

87 ప :- 1 బూరుషుఁజేర-ముది (అ), ర; బూరుషుచెఱ-అ. 2 మదుప్త-జ.ర.గౌ; మదుక్తిపః మదుక్త-అ. 3 విమజ్జన - గ. ర; భిమజ్జన-అ. గౌ. 4 నణంచిన - గౌ; నడంచిన - క, త; చేనణఁచిన-ర, అ.

తే॥ దివ్యతీర్థంబువైభవమవ్యయప్ర
సాదమేదురమాన సౌజ్జ్వల్య 5 కల్య
వచనరచనల వివరింపవలయు, 6 నోపప్ర
పన్నదైన్యలతాదాత్ర ! భానుపుత్ర ! 87

వ్యా :— అని = ఈప్రకారముగా, ఒప్పు = తనరెడు; కౌతుకజనక = కుతూహలమునుగలిగించు, అక్షరశ్రేణిన్ = వర్ణపంక్తిని వీక్షించి = కని, వచ్చితిన్ = అరుదెంచితిని. ఇది = ఇయ్యది, మీరలు= ఎఱిఁగింపుఁడు = తెలుపుఁడు. ఏనాఁటన్ = ఏకాలమునందయినను, సకృత్ = ఒకపర్యాయమయిన (సకృత్సహైకవారే - అమ) అవగాహ నంబునన్ = స్నానముచేత (ఒకమాఱుస్నానముచేయుటచేత-అనుట) మహాకలుషరాశివలనన్=గొప్పపాపములప్రోవువలన (నుండి) పూరుష= పురుషునియొక్క, చెఱ = నిర్బంధము, తలఁగు = తొలఁగించు, పుణ్య పుఁదీర్థము = పుణ్యతీర్థమును, ఎన్నఁడు = ఏనాఁడును, కనన్ = చూడలేదు. వినన్ = ఆకర్ణింపలేదు. ఈమదుక్త = ఈనాచేతఁజెప్పఁ బడిన, లిపిపంక్తిన్= లిఖితాక్షరములవరుసచేత, ఏకవార=ఒక్కపర్యాయ మయిన, పయః = జలమునందలి, అభిమజ్జనమాత్రచేన్ = మునుఁగుట మాత్రముచేత, అణఁచిన=(పాపములను) పోఁగొట్టిన, మహిమ = మహ త్త్వము,కలుగు = కలిగిన, దివ్య=లోకాతీతమయిన, తీర్థంబు = తీర్థము యొక్క, వైభవము = అతిశయమును - (వైభవమ్= అతిశయః-శబ్దక) ఓపప్రపన్న = ఓశరణాగతులయొక్క, దైన్య = దీనత్వమనెడు, లతా = తీఁగకు, దాత్ర = కొడవలియయినవాఁడా! భానుపుత్ర = సూర్య నందనా - ఓయమధర్మరాజా!, అవ్యయ = నాశములేని - శాశ్వత మయిన, ప్రసాద = అనుగ్రహముచేత, మేదుర = మిక్కిలిస్నిగ్ధమయిన,

---

5 కల్ప - గౌ; కల్య-ర, అ. 6 నప్రపన్నదైత్య -ముద్రి (అ),ర; నోపప్రపన్నదైన్య - అ.

మానస = మనస్సుయొక్క, ఔజ్జ్వల్య = ఉజ్జ్వలత్వమునకు, కల్య = సమర్థమయిన, (కల్యో--నీరోగదక్షేమ, కళ్యాణవచనేపిచ - మే. ని.) వచన = పలుకులయొక్క, రచనలన్=కూర్పులతో, వివరింపవలయున్ = స్పష్టపఱుపవలెను.

భానుపుత్రి - యముఁడు, సూర్యునివలన సంధ్యాదేవియందు జన్మించినవాఁడు.

పుత్రి - ఏకతకారకమునుగలదు. చూ 1-9

వ్యాక :— తలఁగు = తలఁగించు. అంతర్భావితప్రేరణము ప్రౌ. క్రియా 34

వ॥ అనిన నప్పద్మమిత్రపుత్రుండు చిత్రగుప్తునకిట్లనియెన్. 88

వ్యా :— అనినన్ = అనఁగా, అప్పద్మమిత్రపుత్రుండు = ఆసూర్యసుతుఁడు - ఆయముఁడు, చిత్రగుప్తునకున్ = చిత్రగుప్తునకు, ఇట్లు = ఈప్రకారముగా, అనియెన్ = పలికెను.

శా॥ ప్రాశ్యస్స్యంబు వహించుదండకమహారణ్యంబు 1 పుణ్యర్ధిఁబం
చాశత్కోటివిశాలభూమి, ఖలదుష్ప్రాపప్రభావోదయ
శ్రీ 2 శుద్ధిన్నగు 3 దానిగౌతమి, గుణోత్సేకంబుకల్మిన్ వ్యాపి
కేశావాసముపొండరీకనిలయంబీరెంటిగెల్చుందుదిన్. 89

వ్యా :— పంచాశత్కోటి = ఏఁబదికోట్ల (యోజనముల) విశాలభూమిన్ = విస్తృతిగలదగుధరిత్రియందు, దండకమహారణ్యంబు=

---

89 ప :- 1 పుణ్యార్థిపం - ముద్రి (అ), ర; పుణ్యార్థిబం - త; పుణ్యార్ధి (ణ్యర్థి) - అ. "చ-త - పాఠముల దృష్టితో పైనవరణ సూచితము"-అ-అధోజ్ఞాపిక. పుణ్యర్ధిబం - గౌ. 2 శుద్ధుల్గను-ముద్రి (అ). ర; శుద్ధిన్నగు - అ, త; శుద్ధిన్గను - గ. 3 దాని - ర; దాన - ర, దాని- అ.

దండకయను పేరుగల గొప్పకాననము, పుణ్య = సుకృతముయొక్క, బుద్ధిన్ = సంపదచేత, ప్రశస్త్యంబువహించున్ = శ్రేష్ఠత్వమును బొందును. దానిన్ = దానిని - ఆదండకారణ్యమును, గౌతమి = గోదావరీనది, ఖల = దుర్జనులకు, దుష్ప్రాప = పొందరాని - తెలియ శక్యముకాని, ప్రభావ = మాహాత్మ్యముయొక్క, ఉదయశ్రీశుద్ధిన్ = అభ్యుదయసంపత్తియొక్క పరిశుద్ధిచేత, నగున్ = హాసించును (సరిపోలుననుట) గుణ = సద్గుణములయొక్క, ఉత్సేకంబుకల్మిన్ = అతిశయముకలిగియుండుటచేత, హృషీకేశ = హరియొక్క -విట్ఠలుని యొక్క, ఆవాసము = నిలయమగు, పౌండరీకనిలయంబు=పౌండరీక క్షేత్రము, తుదిన్ = చివరను - చివరగా, ఈరెండింటిని -దండకారణ్యమునుగోదావరీనదిని, గెల్చున్ = జయించును.

దండకారణ్యము - దండుఁడనురాజుయొక్కరాజ్యము శుక్రునిశాపముచేమట్టివానకురిసినాశనముకాఁగానీయరణ్యమేర్పడెను. (ఉ. రా.)

గౌతమి - గౌతముఁడు గోహత్యాపాపపరిహారార్థము తెచ్చిన నదిగాన, గౌతమియను పేరుగలిగెను.

పంచాశత్కోటి -భూమిపై వైశాల్యము ప్రాచీనకాలమున, 50 కోట్ల యోజనములుండెడిది. చూ 1-16 వ్యాఖ్య

సీ॥ అర్కుండు వెలుఁగుట, యనిలుండువీచుట
యింద్రుండు వర్షించు, టిలజలముల
మునుఁగకతిరమౌటయు నెసంగునేవిష్ణు
1 నాజ్ఞప్తిచే, నెవ్వఁడఖిలజగము
బ్రహ్మయైసృజియించుఁ బద్మాక్షుఁడై ప్రోచు
మదనారియైత్రుంచు, మత్రుప్రభృతుల

90 ప :- 1 నాజ్ఞాప్తి - త; నాజ్ఞప్తి - ర, అ.

లోకపాలకుఁ నేలో కేశుకరుణాక
టాక్షఁ బెయధికృతియందునిలుపు

తే॥ నావిభుండెందునుఁ ర్కు మర్త్యమునఁబుట్టి
భూతకోటిననుగ్రహంబున 2 బెనుచుచు
3 నెందుఁగుశ్రింకిసుశర్మయుఁ 4 జెందెముక్తి
దానికెనవచ్చుతీర్థ 5 మిద్ధరణిఁగలదె? **90**

వ్యా ;— అర్కుండు = సూర్యుఁడు, వెలుఁగుట = ప్రకాశించుట, అనిలుండు = వాయువు, వీచుట = ప్రసరించుట, ఇల= భూమి, జలములన్ = నీళ్లయందు, మునుఁగక = మగ్నముకాక, తిరమౌటయున్ = స్థిరమగుటయు, ఏవిష్ణు = ఏహరియొక్క, ఆజ్ఞప్తిచేన్ = అనతిచేత, ఎసంగున్ = ఒప్పునో! ఎవ్వఁడు = ఎవఁడు, అఖిల జగమున్ = సమస్తలోకమును, బ్రహ్మయై = చతుర్ముఖుఁడై, సృజియించున్ = సృష్టించునో! పద్మాక్షుఁడై = విష్ణువై, ప్రోచున్ = రక్షించునో, మదనారియై = మన్మథవైరియై - ఈశ్వరుఁడై, త్రుంచున్ = నశింపఁజేయునో! మత్ప్రభృతులన్ = నేనుమొదలగాఁగల లోకపాల, కులన్ = దిక్పతులను, (ఈశానుఁడులోనగుదిక్పతులనుట) ఏలోకేశు = ఏజగదీశ్వరునియొక్క, కరుణాకటాక్షంబె = దయతోఁగూడిన క్రీఁగంటి చూపే. అధికృతియందున్= అధికారమునందు-దిక్పాలకపదవులయందు; నిలుపున్ = ప్రతిష్ఠించునో, ఆవిభుండు = ఆస్వామి, మర్త్యమునన్= భూమియందు, పుట్టి = జన్మించి - అవతరించి, భూతకోటిన్ = ప్రాణులయొక్క శతలక్షసంఖ్యను - అసంఖ్యాకప్రాణులను, అనుగ్రహంబునన్ = దయచూపుటతో, పెనుచుచున్ = కాపాడుచు, ఎందున్ =

---

2 బెనుపు - డ, ద, బ, గౌ; ననుచుచు-జ, బెనుచుచు-ర, అ.
3 నందు - త, గౌ. నెందు-ర, అ: 4 నొందు — చ; నందె - గౌ, జెందె — ర, అ. 5 మిద్ధరణి — గౌ, మీధరణి - ర; అ.

ఏస్థలమునందు, ఉండున్ = వసించునో, సుశర్మయున్ = సుశర్మయు, దేనియందు, త్రుంకి = మునిఁగి, ముక్తిన్ = మోక్షమును, చెందెన్ = పొందెనో! దానికిన్ = అద్దానికి - అపద్మతీర్థమునకు; ఎనవచ్చు = సాటియగు, తీర్థము = ఋషులు... -ాదులు నిర్వర్తించిన పుణ్యజలాశయము, (తీర్థం -- ఋషిజుష్టాంభః-విశ్వ) ఇద్ధరన్ = ఈభూమియందు, కలదె = ఉన్నదా? (లేదనుట)

లోకపాలకులు - చూ 4-289 వ్యాఖ్య.

వ్యాక :— సృజియించున్ - మున్నగుచోట్ల, ఓ - అధ్యాహార్యము - ప్రౌ. వాక్య 13. ఈ+ధరణి = ఇద్ధరణి - ధకారము నకుదకారము - ము. కౌ. సమాస.

వ॥ అనిపద్మతీర్థంబు [1]తీర్థచరణ విహారణచరితార్థంబగుదాని నానా గుణంబులునగణితప్రభావంబులనికొనియాడి. **91**

వ్యా :— అని = ఈప్రకారముగా, పద్మతీర్థంబు = పద్మ మను పేరుగల తీర్థము, తీర్థచరణ = పుణ్యోదకము (=గంగానది) పాద మునందుఁగలవానియొక్క (హరియొక్క)-విట్ఠలునియొక్క, విహరణ= విహారముచేత, చరితార్థంబు = కృతార్థము, అగున్ = అగును, దానియొక్క = అపద్మతీర్థముయొక్క, నానాగుణంబులున్ = బహుసద్గుణములును, అగణిత = లెక్కలేని, ప్రభావంబులని = మహిమగలిగినవియని, కొనియాడి = ప్రశంసించి.

క॥ పెనుఁగృపసుశర్మఁగనుఁగొని
తనువునిమిరియాదరించి దండధరుఁడు చం
ద్రునిలీలఁ [1]జల్లనై చం
దనభూషణవసన మాల్యతర్పితుఁజేసెన్. **92**

---

91 ప :- 1 తీర్థా - గౌ; తీర్ధ - ర, అ

92 ప :- 1 జల్లనగు -ముద్రి (అ); ర, జల్లనై - గౌ, అ.

వ్యా :— దండధరుఁడు = యముఁడు, పెనుఁగృపన్ = అధికమయిన కరుణతో, సుశర్మన్ = సుశర్మను, కనుఁగొని = చూచి, తనువునిమిరి = శరీరమును వాత్సల్యమునఁజేతితో స్పృశించి, ఆదరించి= మన్నించి, చంద్రునిలీలన్ = ఇందునివలె. చల్లనై = చల్లనివాఁడయి- ప్రసన్నుఁడయి. చందన = మంచిగంధముచేతను (మలయజముచేతను) భూషణ = ఆభరణములచేతను, వసన = వస్త్రములచేతను, మాల్య = పూలదండలచేతను, తర్పితున్ = తృప్తినొందింపఁబడిన వానినిగా, చేసెన్ = ఒనర్చెను.

యముఁడు పుణ్యులయెడఁ బ్రసన్నరూపుఁడగును. "పుణ్యవంతుల, కనఘాశమనుండు సౌమ్యమగునాకారం, బునను౦డు - కాశీ 3-150

క॥ ఈగతిఁగృతాంతుకృపఁ 1 గని
సాగిచనియెనతఁడుగగనచరయానమునన్
నాగనరయక్షసురపు
న్నాగానీకములు గొలువనాకంబునకున్. **93**

వ్యా :— ఈగతిన్ = ఈవిధముగా, కృతాంతు = యముని యొక్క, కృపన్ = దయను, కని = పొంది, అతఁడు = అతఁడు- అసుశర్మ. గగనచర = ఆకాశమునఁ జరించువారియొక్క - దేవతల యొక్క, యానమునన్ = ప్రయాణసాధనమునందు - విమానము నందు, నాగ = సర్పములయొక్కయు, నర = మానవులయొక్కయు, యక్ష = యక్షులయొక్కయు, సురపున్నాగ = పున్నాగముల(=పాండు వర్ణముగలయేనుఁగుల) వంటి, దేవతలయొక్కయు - శ్రేష్ఠులయిన దేవతలయొక్కయు, పున్నాగస్తు -- నరశ్రేష్ఠే పాండునాగేద్రుమాంతరే- మే ని. స్యురుత్తరపదేవ్యాఘ్ర -- కుంజరాః - శ్రేష్ఠార్థగోచరాః-అమ)

93 ప :- 1 ఁగొని - గొ; ఁగని - ర, గని - అ.

**అనీకములు** = సమూహములు, కొలువన్ = సేవింపఁగా, నాకంబునకున్ = స్వర్గమునకు, సాగిచనియెన్ = (యమలోకమునుండి) సాగిపోయెను.

మ॥ అమరాధీశుఁడు గౌరవంబెసఁగఁదన్నర్ధాసనాసీనుఁజే
యు, మరుద్భోగములెల్లఁగాంచి ధరయందగ్రాన్వయోద్భూతుఁడై
కమలావల్లభుఁబౌండరీకపతిసాక్షాద్బ్రహ్మముంగొల్చి, ని
త్యముఁదన్మందిరరాడలంకృతియెచేయం1జాలెనేలెన్ధృతిన్ 94

వ్యా :— అమర = దేవతలయొక్క, అధీశుఁడు = అధిపతి-ఇంద్రుఁడు, గౌరవంబు = సమ్మానము, ఎసఁగన్ = ఒప్పఁగా, తన్నున్= తన్ను, అర్ధాసన = సగముపీఠమునందు - సింహాసనార్ధమునందు, ఆసీనున్ = కూర్చున్నవానినిగా, చేయన్ = ఒనర్పఁగా, మరుత్ = దేవతలయొక్క, భోగములు = సుఖములు - స్వర్గలోకసుఖములు, ఎల్లన్ = సర్వమును, కాంచి = పొంది, ధరయందున్ = భూమియందు అగ్రాన్వయ = అగ్రకులమునందు - బ్రాహ్మణవంశమునందు; ఉద్భూతుఁడై = పుట్టినవాఁడై, కమలావల్లభున్ = లక్ష్మీపతియు, సాక్షాద్బ్రహ్మమున్ = ప్రత్యక్షపరబ్రహ్మమును, అగు, పౌండరీకపతిన్ = పౌండరీక (క్షేత్ర) నాథుని - పాండురంగవిట్ఠలుని, కొల్చి = సేవించి, నిత్యము = ఎల్లప్పుడు, తత్ = అతనియొక్క - పాండురంగ విట్ఠలుని యొక్క, మందిరరాట్ = గృహరాజముయొక్క - పాండురంగాలయము యొక్క, అలంకృతియె = అలంకారమే, చేయంజాలెన్= ఒనర్పఁగలిగెను ధృతిన్ = ధైర్యమును, ఏలెన్ = చేకొనెను.

పుణ్యక్షయముకాఁగానే జీవుఁడు స్వర్గమునుండి భూలోకమున జన్మించును "క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశంతి" శ్రు॥

---

94 ప :- 1 జాల - డ, ద, బ; జాలె - ర, అ, గౌ.

శా॥ అపంచత్వముగాఁగనిట్లుహరిగేహక్షోణి సమ్మార్జనం
బాపాదింపఘటిల్లుపుణ్యమునఁ జంద్రావాసముంజొచ్చి, హ
ర్షాపూర్ణస్థితిఁబెక్కుభోగముల 1 బెక్కబ్దావళుల్గాంచి, ధా
త్రీపాలోత్తముఁడై, సుకీర్తియనసుర్విం 2 బుట్టుచేపట్టుచున్. **95**

వ్యా :— ఇట్లు = ఈప్రకారముగా, హరి = కృష్ణునియొక్క విట్ఠలునియొక్క, గేహక్షోణి = గృహప్రదేశముయొక్క - పాండురంగాలయముయొక్క, సమ్మార్జనంబు = తుడుచుట, అపంచత్వము గాఁగన్ = మరణపర్యంతముగా (ఆఙ్ + పంచత్వ - ఆఙీషదర్థేఽభివ్యాప్తౌ సీమార్థేధాతుయోగజః, స్యాత్పంచకాలధర్మః - అమ. పంచతా = పంచత్వ) ఆపాదింపన్ = ఒనర్పఁగా, ఘటిల్లు = సమకూడిన, పుణ్యమునన్ = సుకృతముచేత, చంద్ర = ఇందునియొక్క, ఆవాసమున్= నిలయమును - సూర్యమండలమునకుఁబైనిగల చంద్రలోకమును, చొచ్చి = ప్రవేశించి, హర్ష = సంతోషముయొక్క, ఆపూర్ణ = మిక్కిలినిండిన, స్థితిన్ = ఉనికిచేత; పెక్కుభోగములన్ = అనేక సుఖములను, పెక్కు = అనేకములయిన, అబ్ద = సంవత్సరములయొక్క అవళుల్ = పరంపరలు, కాంచి = పొంది, (అనుభవించి - అనుట) ధాత్రీపాలోత్తముఁడై = రాజులయందు శ్రేష్ఠుఁడై, సుకీర్తియనన్= సుకీర్తియనఁగా, ఉర్విన్ = భూమియందు, పుట్టు = జన్మమును, చేపట్టుచున్ = ధరించుచు, (మీఁదిపద్యముతోనన్వయము)

చంద్రావాసమును జొచ్చిపునర్జన్మనందుట ధూమాది మార్గమునఁ గలిగిన గమనాగమనములను దెలుపును.

సగుణబ్రహ్మోపాసకులకు దేవయానము, కర్మనిష్ఠులగు జీవులకుఁ బితృయాణము, నుపనిషత్ప్రతిపాదితములు.

---

95 ప :- 1 బౌక్కద్యావముల్ - క; బెక్కబ్దావళుల్ - ర, అ. 2 బెంపు నంబుట్టుచుః - ముద్రి (అ), ర, బుట్టిచేపట్టుచుః - గొ; బట్టు చేపట్టుచున్ - అ.

"ద్వౌస్రుతీ అశృణవం పితౄణా
మహందేవానాముతమర్త్యానామ్
తాభ్యామిదంవిశ్వమేజత్సమేతి
యదంతరాపితరం మాతరంచ" [ఋగ్వే]

పైమంత్రమునను సరించి బృహదారణ్యకచ్ఛాందోగ్యతైత్తిరీయోపనిషత్తులు దేవయానపితృయాణములను నిరూపించెను. ఈ రెండును సూర్యమార్గమగు క్రాంతివృత్తమునందు (Eclipse) రెండు భాగములు

ఒకొక్క గ్రహమునకు, మూడేసి పథములుగలవు. ఒకొక్క పథమునకు మూడేసి నక్షత్రముల చొప్పున మూడేసి వీధులు గలవు.

| నక్షత్రములు | వీధులు | పథములు |
|---|---|---|
| అశ్విని, భరణి, కృత్తిక | నాగవీథి | ఐరావతపథము ఉత్తరమార్గము |
| రోహిణి, మృగశిర, ఆర్ద్ర | గజవీథి | |
| పునర్వసు, పుష్యమి, ఆశ్లేష | ఐరావతవీథి | |
| మఘ, పూ ఫ; ఉ ఫ | వృషభవీథి | జారద్గవపథము / మధ్యమమార్గము |
| హస్త, చిత్త, స్వాతి | గోవీథి | |
| విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ | జారద్గవవీథి | |
| మూల, పూ.ఆషాఢ, ఉ ఆషాఢ | అజవీథి | వైశ్వానరపథము / దక్షిణమార్గము |
| శ్రవణము, ధనిష్ఠ, శతభిషము | మృగవీథి | |
| పూ.భా. ఉ భా, రేవతి | వైశ్వానరవీథి | |

నాగవీథికుత్తరముగా, సప్తర్షులకు దక్షిణముగానున్న సూర్యుని యుత్తరమార్గము, దేవయానము. వైశ్వానరపథమునకు వెలుపల, నగస్త్యునకుత్తరముగా, నజవీథకి దక్షిణముగా, బితృయాణము.

"నాగవీథ్యుత్తరంయశ్చ, సప్తర్షిభ్యశ్చదక్షిణమ్
ఉత్తరః సవితుఃపంథా, దేవయానశ్చసస్మృతమ్"
"ఉత్తరంయదగస్త్యస్య, అజవీథ్యాశ్చదక్షిణమ్
పితృయాణంసవైపంథా, వైశ్వానరపథాద్బహి"
(వి. పు. & వాయు)

బ్రహ్మలోకమునకుఁబోవుదారి పేరు, దేవయానము. దీనినర్చిరాది మార్గమనియునందురు. అర్చిరభిమానిదేవతాస్థానము > అహరభిమాని దేవతాస్థానము > శుక్లపక్షాభిమానిదేవతాస్థానము > ఉత్తరాయణదేవతా స్థానము > సంవత్సరాభిమానిదేవతాస్థానము > దేవలోకము.

ఆదిత్యలోకమునకుఁబైనున్న చంద్రలోకమునకుఁబోవుదారి పేరు, పితృయాణము. దీనిని ధూమాదిమార్గమనియునందురు.

"అథయఇమేగ్రామ ఇష్టాపూర్తేదత్తమిత్యుపాస్యతేతే
ధూమమభిసంభవంతిధూమాద్రాత్రిగ్ం రాత్రేరపరపక్ష
మపరపక్షాద్యాన్ షడ్దక్షిణైతిమాసాగ్ంస్తాన్
సంవత్సరమభిప్రాప్నువంతి, మాసేభ్యఃపితృలోకం
పితృలోకాదాకాశమాకాశాచ్చంద్రమసమేషసోమో
రాజాతందేవాభక్షయంతి'' (ఛాందో)

ధూమాభిమానిదేవతాస్థానము > రాత్ర్యభిమానిదేవతాస్థానము > కృష్ణపక్షాభిమానిదేవతాస్థానము > దక్షిణాయనదేవతాస్థానము > మాసాభిమానిదేవతాస్థానము (సంవత్సరాభిమానిదేవతాస్థానము) > పితృలోకం (ఇటుజీవులు పితృదేవతలగుదురు. వీరికొఱకు శ్రాద్ధములుద్దిష్టములు) > ఆకాశము > చంద్రలోకము (ఇది సూర్యలోకమునకుఁబైనిగలదు. "ఆదిత్యాచ్చంద్రమసమ్"-ఛాందో. ఈచంద్రుఁడు, నక్షత్రము. నక్షత్రాణాం యథాశశీ" - భ. గీ. నిర్ధారణషష్ఠివాడుటచే నీచంద్రుఁడు, నక్షత్రమని గ్రహింపవలెను ఇతనికిరణములు దేవతలకాహారము.

పై ధూమాది మార్గమున, సుశర్మయాదిత్య మండలమునకుఁబైని గలసోమలోకమునుబొందిపాండురంగాలయసమ్మార్జనమువలనఁగలిగిన పుణ్యఫలమున ననుభవించెను. పుణ్యక్షయము కాఁగానే భూలోకమునఁదిరిగి సుకీర్తియను రాజుగాఁబునర్జన్మము నందెను. ("క్షీణేపుణ్యేమర్త్యలోకం విశంతి" శ్రు) కర్మనిష్ఠులగు జీవులయాగమనమునుగూర్చి యిట్లు చెప్పఁబడెను.

"తస్మిన్ యావత్సంపాతముషిత్వాఽథైతమే వాధ్వానంపునర్నివర్తంతే యథేతమాకాశమాకాశాద్వాయుంవాయుర్భూత్వాధూమో భవతి ధూమోభూత్వాభ్రంభవతి. అభ్రంభూత్వామేఘోభవతి మేఘోభూత్వా ప్రవర్షతి, తఇహవ్రీహియవాఓషధివనస్పతయస్తిలమాషాఇతిజాయంతేఽతోవైఖలు దుర్నిష్ప్రపతరంయో యోహ్యన్నమత్తియో రేతస్సించతితద్భూయ ఏవభవతి" (ఛాందో)

చంద్రలోకము > ఆకాశము వాయువు > ధూమము > అభ్రము > మేఘము > వర్షరూపమున భూప్రవేశము > ధాన్యాదిరూపాశ్రయము > ఆహారరూపము > రేతోరూపము > గర్భరూపము > శిశురూపము.

పైక్రమమున సుశర్మభూలోకమున, సుకీర్తిగాజన్మించెను.

క॥ అతఁడధికభక్తితో నా
యతకీర్తిస్ఫూర్తివరియై వెలసి, జగ
త్పతినుచితపూజనంబులఁ
బ్రితిఘనప్రముఁ 1 దెలచు 2 భక్తి 3 పరతంత్రమతిన్. 96

వ్యా :— అతఁడు = ఆతఁడు _ ఆసుకీర్తిగాఁబుట్టినసుశర్మ; అధికభక్తితోన్ = ఎక్కువభక్తితో. ఆయత = విస్తృతమయిన, కీర్తి=

96 ప :- 1 దెలుచు – గ, దెలచు - ర, అ, గౌ. 2 భక్త - త, గౌ; భక్తి - ర, అ. 3 పరతంత్రుండై - ముద్రి (అ), ర; పరతంత్రమతిన్ – అ, గౌ.

యశస్సుయొక్క, స్ఫూర్తిన్ = స్ఫురణమునందు, వర్తియై = వర్తించువాఁడయి, వెలసి = ప్రసిద్ధికెక్కి. జగత్పతిన్ = లోకేశ్వరుని - విట్ఠలుని; ఉచిత = యోగ్యములయిన, పూజనంబులన్ = అర్చనలచేత, భక్తిపరతంత్రమతిన్ = భక్తికధీనమయిన బుద్ధితో, ప్రతిఘస్రము = ప్రతిదినమును, (ఘస్రోదినాహనీ - అమ) తెలచున్ = సేవించును.

ఆ॥ అతఁడు సన్న్యసించె నఖిలభోగంబులు
నిండువయసునాఁడయుండియుండి
నందనందనాంఘ్రినాళీకసేవోప
యోగరాగభోగ మొకటిదక్క. 97

వ్యా :— నందనందన = నందగోపసుతునియొక్క (కృష్ణుని యొక్క) - విట్ఠలునియొక్క, అంఘ్రినాళీక = పద్మములవంటి పాదములయొక్క, సేవ ఉపయోగ = భజనాచరణముయొక్క, రాగభోగము = ప్రీతిరూపమయిన సుఖము, ఒకటిదక్క = ఒక్కటితప్ప, అతఁడు = ఆతఁడు - అనుకీర్తిగా జన్మించిన సుశర్మ, ఉండియుండి = ఉన్నట్లుండి - అకస్మికముగా, నిండువయసునాఁడ = నిండుజవ్వనపుఁగాలమునందే, సన్న్యసించెన్ = కామ్యకర్మలను బరిత్యజించెను.

సీ॥ నిలువుననొలిపించె విలువంగడమునెల్ల
శరములయాయంబుఁ [1] బొరయుటుడిపెఁ
దగశబ్దమాత్రపాత్రముచే సెగుణలత
[2] ప్రమాఁకునఁగట్టించె మౌలబలముఁ
గంచుకివశముగావించె సేనానాథుఁ

98 ప :- 1 బొడయుడుడిపె - త; బొరయుటుడిపె - ర, అ. 2 ప్రమాఁకుల- ర, త; మ్రాఁకున - అ, గౌ. 3 గొట్టించె - త,

3 గమరించె సహచరుఁగటికి యెండఁ
ప్రతిపక్షభావసంగతుఁడనిహితుఁజూచె
వరకేతనము కీర్తిభరము 4 డులిపె

తే॥ ధర్మనిర్మలబుద్ధినుశర్మఁగదిసి
గెలువఁగాలేక చనికోప 5 గించిమదనుఁ
డులకతనవారలతనికి నోడుమనిరె?
పతికిఁగీడౌటుబంట్లపాపంబుగాదె? 98

వ్యా :— ధర్మ = స్వభావముచేత, (ధర్మాఃపుణ్యయమ న్యాయ స్వభావాచారసోమపాః - అమ) నిర్మల = స్వచ్ఛమయిన, బుద్ధిన్ = మతిగలవాఁడగు. సుశర్మన్ = సుశర్మను-సుకీర్తిగా జన్మించిన సుశర్మను, కదిసి = ఆక్రమించి, గెలువఁగాలేక = జయింపఁజాలక, చని = అరిగి, కోపగించి = కోపించి, మదనుఁడు = మన్మథుఁడు —

(1) విలువంగడమునెల్లన్ = ధనుస్సుయొక్క వంశమునంతటిని నిలువునన్ = పైనుండి క్రిందికి, ఒలిపించెన్ = ఒలువఁజేసెను.

నిలువుననొలిపించుట యొక శిక్షాభేధము. నేరముచేసినవానినేగాక యాకులమువారినందఱనుబట్టి శిక్షించువిధానముగూడనుండును. కాన విలువంగడమునెల్ల - అనుట

విలువంగడమునెల్లన్ = ధనుస్సుయొక్క వంశమునంతటిని - చెఱకుజాతినంతటిని, నిలువునన్ = పైనుండిక్రిందికి, ఒలిపించెను = ఒలువఁజేసెను. చెఱకుఁగఱ్ఱలనునిలువుననేయొలిచితిందురు. అదే నిలువున నొలిపించుశిక్షాభేదముగఁ జమత్కరింపఁబడెను. మన్మథునివెల్లుచెఱకు.

---

4 గట్టించె డ, ద, బ; గమరించె - ర,అ, 5 లుడిపె -త, గౌ; డులిపె-ర,అ.

శరములన్ = బాణములను, అయంబున్= రాబడిని, పొరయుట= పొంకుట, ఉడిపెన్ = అఁపెను. జీతమునీయక యాఁపివేయుటయొక శిక్షాభేదము.

శరములన్ = బాణములను - పువ్వులను, అయంబున్ = మర్మస్థానమును, పొరయుట = చొచ్చుట, ఉడిపెన్ = ఉడిగించెను. పువ్వులు కోమలములగుటచే మర్మచ్ఛేదముచేయకుండుట సహజము. మన్మథుని బాణములు పువ్వులు (చూ....

2) గుణలతన్ = తీఁగవంటి వింటినారిని, "మౌర్వీజ్యాశింజినీగుణః-అమ" తగన్ = యుక్తమగునట్లు, శబ్దమాత్రపాత్రముచేసెన్ = 'గుణలత' అన్న శబ్దమునకు మాత్రము భాజనమగునట్లుచేసెను. పేరికి గుణలత యన్నమాటయేగాని దానికిఁబ్రాముఖ్యము తగ్గించి వేసెననుట. ఉన్న పదవిలోనే నామమాత్రముగానుంచి ప్రాముఖ్యమును దగ్గించివేయుట యొకశిక్షాభేదము.

గుణలతన్ = తీఁగవంటినారిని-తుమ్మెదలబారును, తగన్= యుక్తమగునట్లు, శబ్దమాత్రపాత్రముచేసెన్ = ఝుంకారధ్వని చేయుటకు మాత్రమేపాత్రములగునట్లుచేసెను తుమ్మెదలుశబ్దముచేయుటసహజము.

మౌలబలమున్ = మూలబలమును, (ప్రధాన సైన్యమును) మ్రాఁకునన్ = వృక్షమునందు, కట్టించెన్ = బంధింపఁజేసెను. చెట్లకు బంధింపఁజేయుటయొకశిక్షాభేదము. (మూలఏవమౌలః)

మౌలబలమున్ = మూలబలమును - కోకిలలను; మ్రాఁకునన్ = వృక్షమునందు, కట్టించెన్ = బంధింపఁజేసెను - తప్పవిసరిగా నివసింపఁజేసెను. కోకిలలువృక్షములపైనివసించుట సహజము.

3) సేనానాథున్ = సేనానాయకుని, కంచుకివశముగావించెన్ = అంతఃపురరక్షణాధికారియధీనముచేసెను. (సౌవిదల్లాఃకంచుకినః-అమ)

లోనికివచ్చిదర్శనము చేసికొనునవకాశమునీయక ద్వారమునందేనిలిచి యుండఁజేసెననుట. దర్శనమునీయకపోవుటయొక శిక్షాభేదము.

సేనానాథున్ = సేనానాయకుని - మలయపవనుని, కంచుకి = కంచుకము (కుబుసము) గలదానియొక్క - సర్పముయొక్క (కంచుకీ= సర్పః - ఇతిరాజనిర్ఘంటుః -శబ్దక) వశముగావించెన్ = అధీనముచేసెను సర్పమునకాహారముగాలి కావుననే, పవనాశనమనఁబడును.

సహచరున్ = సహాయుని, కటికితీక్ష్ణమయిన, ఎండన్ = ఆతప మునందు, కమరించెన్ = తాపమునొందించెను. ఎండలోనిలఁబెట్టుట యొకశిక్షాభేదము.

సహచరున్ = సహాయుని - వసంతుని, కటికి = తీక్ష్ణమయిన ఎండన్ = ఆతపమునందు కమరించెన్ = తాపమునొందించెను - ఎండాకాలములో వర్తించునట్లు చేసెను. చైత్రవైశాఖమాసములు వసంతర్తువు, ఇది యెండాకాలములోనేవచ్చును. ఇదేయెండలోఁగమ రించుటయను శిక్షాభేదముగాఁజమత్కరింపఁబడెను.

4) హితున్ = మిత్రుని; (మిత్రంసపుంతిమిస్నిగ్ధవయస్యేష్టహిత ప్రియాః - వై. ని.) ప్రతిపక్ష = శత్రువుయొక్క, భావ = అభిప్రా యముతో, సంగతుఁడని = కూడుకొన్నవాఁడని, చూచెన్ = ఎంచెను.

హితున్ = సహాయుని (హితప్రియాః - సహాయస్సుద్రుచిస్సఖా- వై.ని.)-చంద్రుని, ప్రతిపక్ష=శుక్లకృష్ణపక్షములయందలి,భావ =ఉనికితో (భావస్సత్తా-అమ)సంగతుఁడని=కూడుకొన్నవాఁడని,చూచెన్=ఎంచెను

పక్షములు - (1) శుక్లపక్షము = ప్యాఢమి మొదలు పూర్ణిమ వఱకు (2) కృష్ణపక్షము = పాఢ్యమిమొదలుగ నమావాస్యవఱకు.

వర = శ్రేష్ఠమయిన, కేతనము = టెక్కెముయొక్క, కీర్తి భరమున్ = యశస్సుయొక్క యతిశయమును. డులిపెన్ = పాపెను. మన్మథుఁడు త్రిలోకములను జయించెనన్న కీర్తినివహించుటెక్కెము నకాకీర్తి లేకుండఁజేసెననుట.

జయముసాధించినప్పుడిచ్చిన బిరుదములనోటమి కలిగినప్పుడు తీసివేయుటయొక శిక్షాభేదము. టెక్కెమునకులభించిన కీర్తిభారము నోటమిరాఁగానే తొలఁగించివేయుట యట్టిశిక్షయన్నమాట.

వర = శ్రేష్ఠమయిన, కేతనము = టెక్కెముయొక్క-మీనము యొక్క, కీర్తిభరమున్ = బురదయొక్క యతిశయమును - చిక్కని బురదను, (కీర్తిః -- కర్దమేపిచ - విశ్వ) డులిపెన్ = వదలించెను. మీనమునుబట్టుకొన్నప్పుడు దానియొడలికంటిన బురదనువదలించుట సహజము మన్మథునికేతనము. మీనము.

తనవారలు = స్వజనులు; ఉఱక = ఊరక (ప్రతీకారము చేయక) అతనికిన్ = అతనికి - మన్మథునకు, ఓడుము = ఓటమి పొందుము, అనిరె = అన్నారా? (అనలేదు - అనుట) పతికిన్ = ఏలికకు, కీడౌట = హానికలుగుట, బంట్ల = సేవకులయొక్క, పాపంబు గాదె = అఘముకదా!

**అలం :—** శ్లేష, అర్థాంతరన్యాసము

క॥ అరాజర్షి పదంపడి
1క్షీరోదన్యాయమున విచిత్రగతిన్ ల
క్ష్మీరమణుఁగదిసియేకా
కారంబున నలరెముజ్జగంబులు వొగడన్. **99**

---

99 ప :- 1 కీరయుగ - గౌ; క్షీరోద - ర, అ.

వ్యా :— ఆరాజర్షి = ఆఋషివంటిరాజు పదంపడి = పిమ్మట క్షీరోదన్యాయమునన్ = క్షీరనీరన్యాయమున, (ఉదమ్ = జలమ్ - ఇతి శబ్దరత్నావళీ - శబ్దక.) విచిత్రగతిన్ = మిక్కిలి యద్భుతరీతిని, లక్ష్మీరమణున్ = రమాపతిని - విష్ణువును. కదిసి = చేరి, ముజ్జగంబులు = మూఁడులోకములు, పొగడన్ = ప్రశంసింపఁగా, ఏకఆకారంబునన్ = ఏకరూపమున, అలరెన్ = ఒప్పెను.

ముజ్జగములు - స్వర్గమర్త్యపాతాళలోకములు. క్షీరోదన్యాయమనుటచే సాయుజ్యముసూచితము. చూ. 5-151 వ్యాఖ్య.

క్షీరోద - ఉదశబ్దమేయిటఁబ్రయుక్తము. చూ - 421. (ఉదకమ్ దకమ్-కమ్ : జలవాచకములే.)

వ్యాక :— రాజర్షి - రాజాఋషిరివ (శబ్దస్తో) ఋషివంటిరాజు-ఉపనోత్తరపదకర్మధారయము.

క॥ వినుమఖిలదురితకుల భం
జన [1] మ్మంజనమమృతనిధి వశంబగుటకుఁగా
వున సర్వజనోపాస్యం
బనూనమతీర్థరాజమనుపమనఘా ! **100**

వ్యా :— వినుము = (ఓనారదా!) ఆకర్ణింపుము. అఖిల = సర్వములయిన, దురిత = పాపములయొక్క, కుల = సజాతీయ సమూహమునకు, భంజనము = భంజించునది, అమృతనిధి = మోక్షమనెడు నిధానము, వశంబగుటకున్ = అధీనమగుటకు. అంజనము = కాటుక, కావున = కాఁబట్టి. అనఘా = ఓసుకృతీ! అతీర్థరాజము = అతీర్థశ్రేష్ఠము - అపత్యతీర్థము, సర్వజన = ఎల్లజనులచేతను, ఉపా

---

100 ప :- 1 మజ్జన - ముద్రి (అ), ర, మంజన - అ.

స్యంబు = ఉపాసింపఁదగినది. అనూనము = గొప్పది; అనుపమము = సాటిలేనిది.

అంజనమువేసి నిధులున్నచోటుతెలిసికొందురు. చూ2-144వ్యాఖ్య.

అలం :— రూపకము.

ఉ॥ భూరిసుఖానుషంగములు పూరుషుఁబొందవు సోమపానకై
దారజలోపయోగ 1 ములఁదత్కలనన్ బసరెక్కనెత్తికిన్
బేరుశిలా 2 కృతుల్ జఠరపేటిక, 3 నత్తెవులేల? యెందునె
వ్వారికిఁబద్మతీర్థపతివారికిఁజేరినఁగల్గుసౌఖ్యముల్. **101**

వ్యా ,— సోమపాన = సోమరసమును (గోలుటచేతను, కైదార = కేదారక్షేత్రమునకు సంబంధించిన, జల = నీటియొక్క, ఉపయోగములన్ = ఉపయోగించుటలచేతను, (క్రోలుటచేతను-అనుట) భూరి = అధికములయిన, సుఖ = సౌఖ్యములయొక్క, అనుషంగములు = కూడికలు, పూరుషున్ = పురుషుని, పొందవు = చెందవు, తద్ = వానియొక్క - సోమరసముయొక్కయు, కేదారక్షేత్రమునందలి తీర్థోదకముయొక్కయు, కలనన్ = గ్రహించుటచేత, (పానముచేత - అనుట) పసరు = (సోమలతయొక్క) రసము, నెత్తికిన్ = తలకు, ఎక్కన్ = ప్రసరించును. (సోమలతయొక్కరసముతలకెక్కననుట) జఠరపేటికన్ = పెట్టెవంటికుక్షియందు, శిలాకృతుల్ = ఱాళ్లయొక్క యాకారములు, పేరున్ = ఘనీభవించును. (కేదారక్షేత్రమునందలి

---

101 పః- 1 ములుతత్కల-ర, గౌ; ములుత (లఁదవ?) త్కల-అ. 2కృతిన్ అ కృతుల్ - ముద్రి (అ), ర, గౌ. 3 కత్తెవు - ముద్రి. (అ) ర, సత్తెవు - గౌ; సత్తెవు - అ.

తీర్థజలమును గ్రోలుటవలన(గడుపులో శిలలేర్పడుననుట) అత్తైవులేల = ఆరోగములెందుకు(దెచ్చుకొనుట. ఎందున్ = ఎక్కడనయినను, ఎవ్వారికిన్ = ఎవరికయినను, పద్మతీర్థపతి = పద్మమనెడుతీర్థరాజముయొక్క వారికిన్ = జలమునకు, చేరినన్ = సమీపించినచో, సౌఖ్యముల్ = సుఖములు, కల్గున్ = ప్రాప్తించును.

సోమరసపానముచే(బసరుతలకెక్కును. కేదారక్షేత్రమునందలి తీర్థజలపానముచే(గుక్షియందు శిలలేర్పడును, ఆతెగుళ్లుతెచ్చుకొననేల? పద్మతీర్థజలపానమెవరికయినను సుఖకరము.

సోమపానము - చూ 4-258 వ్యాఖ్య.

కేదారతీర్థజలపానమువలన( గుక్షియందు శివలింగములేర్పడును

"కడుపులోమూ(డు శంభులింగంబులుండు(

దొయ్యలికి జ్ఞానవాపికాతోయసేవ(

గలశసంభవ ! కేదారసలిలములును

గాశిశివతీర్థజలములింగత్వమొందు" [కాశీ 5-147]

శివలింగములేర్పడుటయే శిలాకృతులుపేరుకొనుటగా నిట(జెప్పబడెను.

కడుపులో శిలలేర్పడుటయను రోగవిశేషమునుగలదు

అలం :— యథాసంఖ్యము.

# త్రిదంష్ట్రుని కథ

చ॥ కృతమున నేకదంష్ట్రుఁడయి క్రీడయొన 1ర్చుచుఁ ద్రేతదంష్ట్రికా
ద్వితయముచే వెలుంగుచు, మదించి త్రిదంష్ట్రలతోడ ద్వాపరం
బుతటిఁ జరించు నొక్క దితిపుత్త్రుఁడు; వృత్రుఁడు వానిఁ బోలఁడ
ద్భుతజనక ప్రతాపమున భూరిబలంబున మాయ పెంపునన్. **102**

వ్యా :— కృతమునన్ = కృతయుగమునందు, ఏకదంష్ట్రుఁడయి = ఒక్కకోఱగలవాఁడయి, క్రీడయొనర్చుచున్ = క్రీడించుచు, త్రేతన్ = త్రేతాయుగమునందు, దంష్ట్రికా = కోఱలయొక్క. ద్వితయముచేన్ = రెంటిచేత, వెలుంగుచున్ = ఒప్పుచు, మదించి = క్రొవ్వి, (పొగరెక్కి) త్రిదంష్ట్రలతోడన్ = మూఁడుసంఖ్యగలకోఱలతో (మూఁడుకోఱలతో) ద్వాపరంబుతటిన్ = ద్వాపరకాలము (యుగము) నందు, ఒక్క = ఒకానొక, దితిపుత్త్రుఁడు = దైత్యుఁడు, చరించున్= సంచరించును. అద్భుతజనక=ఆశ్చర్యమునుగలిగించు, ప్రతాపమునన్= పరాక్రమమునందును, భూరి = అధికమయిన, బలంబునన్ = శక్తి యందును, మాయ = కపటోపాయములయొక్క, పెంపునన్ = అతిశయమునందును, వానిన్ = అతనిని - ఆదైత్యుని, వృత్రుఁడున్ = వృత్రాసురుఁడును, పోలఁడు = ఎనయఁడు. [సరిపోలఁడు]

వృత్రుఁడు - త్వష్టకొడుకు, ఇంద్రునిచే నిహతుఁడయ్యెను. ఇది ఖగోళదృశ్యము. జ్యేష్ఠానక్షత్రమిందుఁడు, జ్యేష్ఠానక్షత్రోదయమున మృగశిరయస్తమించుట వృత్రవధకుఁ బ్రతీక. (జ్యోతిర్వే)

---

102 ప :- 1 ర్చుచు - గౌ; ర్చుచు - ర, అ.

వ్యాఖ్య;— త్రిదంష్ట్రిలు = త్రిసంఖ్యాకములగు దంష్ట్రిలు - మధ్యమపదలోపిసమాసము.

క॥ అహారిహయారి, పార్ష్ణి
గ్రాహియనహిరణ్యకశిపుగాదిలిసుతుఁడై
1 బాహాబలశిఖిఁద్రిజగ
ద్దాహంబొనరించె నేకదంష్ట్రయుఁదానున్. 103

వ్యా :— అహారిహయారి = అయింద్రి వైరి - అద్దైత్యుఁడుఁ పార్ష్ణిగ్రాహియనన్ = పార్ష్ణిగ్రాహియనఁగా, హిరణ్యకశిపు = హిరణ్యకశిపుని యొక్క, గాదిలిసుతుఁడై = ప్రియనందనుఁడయి, ఏకదంష్ట్రియుఁదానున్ = ఒంటికోఱయునుదాను, బాహాబల = భుజశక్తియనెడు శిఖిన్ = అగ్నిచేత, త్రిజగత్ = ముల్లోకములయొక్క, దాహంబు = కాల్చుట, ఒనరించెన్ = చేసెను.

ఏకదంష్ట్రియుఁదానున్ - ఇదియొకనుడికారము.

“బాచాబూచులలోపల
బాచన్నే పెద్దబూచిపండ్లును దానున్
బూచన్న రాత్రివెఱతురు
బాచన్నను జూచిపట్టపగలే వెఱతుర్” (అడిదము-చాటువు)

పండ్లునుదానున్ అనుటవంటిదే యేకదంష్ట్రయుఁదానున్-అనునది

103 ప ।- 1 బాహుబల - త; బాహాబల - ర, అ.

క॥ అయొంటిపంటి వేలుపు
దాయంబొలియించె నృహరి, దంభోళికటు
చ్ఛాయలనూయెలలూపున
ఖాయుధముల, 1 వఱడుఁజీరువ్యాఘ్రము 2 ముఁబోలెన్. 104

వ్యా :— నృహరి = నృసింహస్వామి, అయొంటి పంటి వేలుపదాయన్= అయేకదంష్ట్రిగలిగినదేవతావైరిని_అయేకదంష్ట్రుఁడగు దైత్యుని, వఱడున్ = ముసలినక్కను, చీరు = చీల్చు, వ్యాఘ్రముఁ బోలెన్ = బెబ్బులివలె. దంభోళి = వజ్రాయుధముయొక్క, కటు = తీక్ష్ణమయిన, ఛాయలన్ = కాంతులను, ఊయలలూపు = ఉయ్యాల లూఁగించు - అతిక్రమించు, నఖాయుధములన్ = శస్త్రములవంటిగోళ్లతో పొలియించెన్ = వధించెను.

అలం :— ఉపమ.

ఉ॥ వెండియు రావణాబ్ధిఁ బ్రభవించెఁ ద్రిలోకహాలాహలాకృతిన్
మండుచుదంష్ట్రికాయుగమునన్ బెడఁగై, యతికాయనామమా
తండుధరించిత్రేతఁ, దలఁదర్పోఁదదుగ్రనిశాటుఁబట్టి వి
ష్ణుండసిరాముఁడై 1 విలయసూర్యకరోగ్రశరాగ్రధారలన్. 105

వ్యా :— వెండియున్ = మఱియును ఆతండు = అతఁడు - ఆదైత్యుఁడు, త్రేతన్ = త్రేతాయుగమునందు, అతికాయనామము = అతికాయుఁడనెడు పేరు, ధరించి = తాల్చి, రావణాబ్ధిన్ = రావణుఁడనెడు సముద్రమునందు త్రిలోక = ముజ్జగములకు (స్వర్గమర్త్యపాతాళలోక

104 ప :- 1 హరుఁడు - ప; వఱడు - ర, అ. 2 మపోలెః - గౌ; ముఁబోలెః - ర, అ.

105 ప :- 1 వెలయు - త, వెలయు - ర, అ.

ములకు) హలాహలా కృతిన్ = కాలకూటవిషమువంటి యాకారము గలవాఁడై, మండుచున్ = విజృంభించుచు; దంష్ట్రికా = కోఱల యొక్క, యుగమునన్ = జంటతో, బెడఁగై = అతిశయించినవాఁడయి, పరిభవించెన్ = జన్మించెను. తదుగ్రనిశాటు = ఆభయంకరరాక్షసుని, పట్టి = గ్రహించి, విష్ణుండు = విష్ణుమూర్తి, రాముఁడై = శ్రీరామ చంద్రుఁడై, అనిన్ = యుద్ధమునందు, విలయసూర్య = ప్రళయ కాలమునాఁటి రవియొక్క, శర = కిరణములవలె, ఉగ్ర = తీక్ష్ణము లయిన, శర = బాణములయొక్క, అగ్ర = కొనలయొక్క, ధారలన్= వాదరఁ చేత, తల = శీర్షమును, తర్వెన్ = ఖండించెను. అతికాయుని = లక్ష్మణుఁడు వధించెనని వాల్మీకి రామాయణము. ఇటు రాముఁడు వధించె ననుటయెట్లు? "కల్పభేదంనమాధాయకథాభేదంజగాదవా" (పద్మ) అను దానికిఁ గుంభకర్ణవధను బద్మపురాణముదృష్టాంతముగాఁ జెప్పినది. అతి కాయుని రాముఁడు సంహరించెననుట కాధారమున్మృగ్యము. కానఁ గల్పభేదమును జెప్పుట నిర్మూలప్రసంగమగును. "ధేనుకాసురుని బల రాముఁడు వధించినను బలరాముని ద్వారమున ధేనుకాసుర వధనిర్వ ర్తించినవాఁడు కృష్ణుడేయన్న వివక్షచే, ధేనుకసూదనుఁడన్న వ్యవహా రము కృష్ణునకుఁ గలిగినది అట్లే లక్ష్మణునిద్వారమున నతికాయ వధ నిర్వర్తించినవాఁడు రాముఁడేయన్న వివక్షచే, లక్ష్మణకృతమగునతికాయ వధ, రామకృతముగాఁజెప్పఁబడినది.

ఉ॥ 1 వ్యాపృత బద్ధవైరిమతినంతటఁ బోవకవాఁడు పెండియున్
ద్వాపరవేళనిద్ధరఁదరిదంష్ట్రుఁడునానుదయించి, యాదిల
క్ష్మీపతిఁబౌండరీకవిభుఁజేరి కనుంగొనిపల్కు, మిక్కిలిన్
గోపముపర్వుటన్ గొలిమిగూఁడులయాడునఁగన్నులుబ్బఁగన్. **106**

---

106 ప :- 1 అపిత–డ,ద,బ, వ్యాపృత – ర, అ, గౌ.

వ్యా :— అంతటఁబోవక = అంతతోవదలక, వ్యాపృత = వ్యాప్తమును, బద్ధ = స్థిరమునునగు, వైరమతిన్ = విరోధబుద్ధితో, వాఁడు = అతఁడు - ఆదైత్యుఁడు, వెండియున్ = మఱియును, ద్వాపర వేళన్ = ద్వాపరకాలమున (యుగమున) ఇద్ధరన్ = ఈభూమియందు త్రిదంష్ట్రుఁడునాన్ = త్రిదంష్ట్రుఁడనఁగా, ఉదయించి = పుట్టి. ఆది లక్ష్మీపతిన్ = ఆదిలక్ష్మియొక్క భర్తయగు, పౌండరీకవిభున్ = పౌండరీక క్షేత్రాధిపతిని - పాండురంగవిఠ్ఠలుని, చేరి = సమీపించి, మిక్కిలిన్ = అధికముగా, కోపము = ఆగ్రహము, పర్వుటన్ = కలుగుటచేత, కొలిమిగూఁడుల = గూఁడులవంటి, కమ్మరిలోహములు కాల్చుటకు నిప్పునుంచు గుంటలయొక్క, ఈడునన్ = పోలికతో, (కొలిమి గూఁడులవలె-అనుట) కన్నులు = నేత్రములు, ఉబ్బఁగన్ = అతిశ యింపఁగా, కనుఁగొని = చూచి, పల్కెన్ = (ఇట్లు) వచించెను.

వ్యాక :- ఇద్ధరన్ - ఈ+ధరన్. చూ. 1-47 వ్యాఖ్య.

అలం :— ఉపమ.

ఉ॥ ఎక్కడికేగుదెంచి 1 తివి హీనవిహార ! చికిత్సనీకు నేఁ
జక్కనొనర్చెదన్ బెలుచఁజంపితిదొంగిలిమున్ మదీయులన్
రక్కసులన్, నినుంబొదివిప్రాణముఁగొందుఁ 2 గడంగి, సాదవై
3 తుక్కిడియున్నఁబోవిడువఁదొల్లిటి 4 తుళ్లిఁకఁజెల్లదిచ్చటన్ **107**

107 పః- 1 తివహీన - ముద్రి (అ), ర; తివిహీన - అ. 2 నణంగి - గౌ; గడంగి - ర, అ. 3 త్రుక్కిఁడి - డ. ద. బ; తుక్కిడి-ర. అ; మ్రొక్కిడి - గౌ. (యతిభంగము) త్రుక్కిరి - గ. 4 తుళ్లులు చెల్లలిచ్చటఁ - క; త్రుళ్లుట - గ; తుళ్లుట చెల్లనిత్తునే - గౌ; త్రుళ్లిఁకఁజెల్లదిచ్చటన్ – ర, అ.

వ్యా:— హీనవిహార = నింద్యమయిన సంచారముగలవాఁడా! (హీనన్యూనావూనగర్హ్యా. అమ) ఇక్కడికిన్ = ఇచ్చటికి, ఏగుదెంచితివి= వచ్చితివి, నీకున్ = నీకు, నేన్ = నేను; చికిత్స = రోగప్రతిక్రియ, చక్కన్ = బాగుగా, ఒనర్చెదన్ = చేసెదను మున్ = పూర్వము, దొంగిలి = వంచించి, మదీయులన్ = నాకుసంబంధించినవారగు, రక్కసులన్ = రాక్షసులను, పెలుచన్ = క్రూరముగా, చంపితి = వధించితివి. నినున్ = నిన్ను, పొదివి = ఆక్రమించి, కడంగి = కవిసి, (తలపడి) ప్రాణముఁగొందున్ = అసువులు హరింతును, (వధింతును) సాదవై = సాధువయినవాఁడవై, త్రుక్కిడియున్నన్ = గర్వమువిడిచి యున్నను, పోవిడువన్ = (నిన్ను) విడిచిపెట్టను, తొల్లిటితుల్లి = మునుపటి విజృంభణము. ఇఁకన్ = ఇటుపైని, ఇచ్చటన్ = ఇక్కడ, చెల్లదు = సాగదు.

మ॥ అనిసింహంబునకల్గు నక్కక్రియనట్లాక్షేపముల్ పల్కి, య
ద్దనుజుండంతకదండభీషణగదాదండంబునన్ వ్రేయ, వం
చనఁదూలించెఁదదుగ్రసాధనముఁగంసధ్వంసి, తద్ఘోరతా
డనవేగంబున భగ్నమయ్యెఁగటివేల్లత్ క్షుల్లకాశిక్యమున్ 108

వ్యా :— అని = ఈప్రకారముగా, సింహంబునకున్ = సింగమునకు, అల్గు = కోపించు, నక్కక్రియన్ = జంబుకమువలె, అట్లు = ఆవిధముగా, ఆక్షేపముల్ = అధిక్షేపవాక్యములు, పల్కి = పలికి, అద్దనుజుండు = ఆదానవుఁడు - అత్రిదంష్ట్రుడు, అంతకదండ= యమునికాలదండంబునన్ = దండమువంటిగదతో, వ్రేయన్ = ప్రహరింపఁగా (కొట్టఁగా) తదుగ్రసాధనమునన్ = ఆభయంకరమయిన యుపకరణమును (గదను) కంసధ్వంసి = కంసుని నాశముచేసినవాఁడు (కృష్ణుఁడు) - విట్ఠలుఁడు వంచనన్ = యుక్తితో, తూలించెన్ = పడఁగొట్టెను. తద్ఘోర = ఆభయంకరమయిన, తాడన = కొట్టుటయొక్క,

వేగంబునన్ = వడిచేత, కటి = మొలయందు, వేల్లత్ = కదలుచున్న-వ్రేలాడుచున్న. క్షుల్ల = లఘువయిన, కాశిక్యముః = చిఱుచిక్కము ను. భగ్నమయ్యెన్ = విఱిగెను.



క్షుల్లకాశిక్యమున్ - చూ. 2-103 వ్యా.

ఛం ;— లడయతి - 4 పా. తాలితశబ్దమునుబట్టి తాడనశబ్ద పర్యాయము తాలనశబ్దముగలదినియూహ్యము. ఇట్టి రూపాంతరములున్న చోట్లనే, లడయతి చెల్లును.



శా॥ అత్తార్క్ష్యధ్వజుఁడప్పుడాగ్రహ 1 రసవ్యగ్రాత్ముఁడై దానవున్
మొత్తెన్ మెత్తనివీఁకదక్షిణకరాంభోజంబునన్, దానన
మ్మత్తుండుంగడతేఱె నెత్తురులు గ్రమ్మన్ ముక్కునన్ వాతఁబె
న్మొత్తంబుల్‌కొని ప్రస్తుతించిరమరుల్ మోదించిదామోదరున్.



**109**

వ్యా :— అత్తార్క్ష్యధ్వజుఁడు = ఆగరుడకేతనుఁడు - ఆవిట్ఠలుడు, అప్పుడు = ఆసమయమునందు, ఆగ్రహరస = కోపరసముచేత, వ్యగ్ర+ఆత్ముఁడై = వేగిరపాటుతోఁగూడినమనస్సుగలవాఁడయి, దానవున్ = దైత్యుని - త్రిదంష్ట్రుని, మెత్తనివీఁకన్ = కొలఁదిపాటిపూనికతో దక్షిణకర+అంభోజంబునన్ = పద్మమువంటి కుడిచేతితో, మొత్తెన్ = తాడించెను. దానన్ = దానిచేత - ఆతాడనముచేత, అమ్మత్తుండున్ = ఆమదోద్ధతుఁడును, (మత్తః = మదోద్ధతః - ఇతిజటాధరః - శబ్దర) నెత్తురులు= రక్తములు, ముక్కునన్ = నాసికమునందుండియు, వాతన్= నోటియందుండియు, క్రమ్మన్ = కాఱఁగా, కడతేఱెన్ = చచ్చెను. అమరుల్ = దేవతలు, మోదించి = సంతోషించి, పెన్మొత్తంబుల్‌కొని= పెద్దగుంపులుగానేర్పడి, దామోదరున్ = కృష్ణుని - విట్ఠలుని, ప్రస్తుతించిరి = కొనియాడిరి.



తార్క్ష్యధ్వజుఁడు = ఇది ఖగోళదృశ్యమునకుఁబ్రతీక-చూ 1-3 వ్యాఖ్య

109 ప :- 1 సహ - డ, ద, బ; రస - ర, అ, గౌ.

తార్క్ష్యుఁడు = తార్క్షునియొక్క యపత్యము. తృక్షుఁడు = కశ్యపుఁడు తృక ఏవ తార్క్షః - స్వార్థేఽణో, "పశ్యతాం సర్వలోకానాం తార్క్ష్య పుత్రః సుధామివ" (భాగ.)

క॥ ఆయెడమదిక్కుఁ జిక్కం
బోయతివర! 1 కానవచ్చియున్నది భగ్నం
బై యిపుడు, మంత్రవర్ణ
శ్రీయుతవక్షస్స్థలునకు జితదైత్యునకున్. 110

వ్యా :— ఓయతివర = ఓయతిశ్రేష్ఠా - ఓనారదా! ఆయెడమ దిక్కుఁ జిక్కంబు = అవామపార్శ్వమునందలియుట్టి, ఇపుడు = ఇప్పుడు, భగ్నంబై = విఱిగినదై, మంత్రవర్ణ = మంత్రాక్షరములతోను, శ్రీ = లక్ష్మీదేవితోను, యుత = కూడుకొనిన, వక్షస్స్థలునకున్ = ఉరఃప్రదేశము (ఱొమ్ముభాగము) గలవాఁడగు, జితదనుజునకున్ = జయింపఁబడిన దానవులుగలవానికి (హరికి)-విఠ్ఠలునకు. కానవచ్చియున్నది = చూడనయియున్నది.

## సిద్ధమంత్రస్వరూప ప్రభావములు

ఉ॥ ఆకమలేక్షణుండు తనయక్కునఁ దాల్చిన సిద్ధమంత్రమున్
నా 1 కెఱిఁగించినాఁడు మునునాయెడఁగల్గినకూర్మి పేర్మి; నే
లోకమునందు నెవ్వరికిలోఁబడనేరదు నాకెకానిత
ద్వ్యాకృతి; నావుడుం బలుకుఁ బ్రాంజలియై యతఁడిందుశేఖరున్. 111

110 ప :- 1 దానవచ్చి - క: కానవచ్చి - ర, అ.
111 ప :- 1 నాక - గౌ; నాకె - ర, అ,

వ్యా :— అక్రమలేక్షణుండు = అపద్మాక్షుఁడు - అవిట్టులుడు, తన = తనయొక్క, అక్కునన్ = వక్షమునందు, తాల్చిన = ధరించిన సిద్ధమంత్రమున్= సిద్ధిదాయకమగు మంత్రమును, మును = పూర్వము నాయెడన్ = నావిషయమున, కల్గిన = ఉన్న, కూర్మిపేర్మిన్ = ప్రేమాతిశయముచేత, నాకున్ = నాకు, (శివుఁడు - వక్త) ఎఱిఁగించి నాఁడు = తెలిపినాఁడు. తద్ = దానియొక్క, వ్యాకృతి = వివరణము, నాకె కాని = నాకేతప్ప, ఏలోకమునందున్ = ఏజగత్తునందును, ఎవ్వరికిన్ = ఎవరికిని, లోఁబడనేరదు = వశముకాఁజాలదు. నావుడున్ = అన్నయనంతరము, అతఁడు = ఆతఁడు - నారదుఁడు. ప్రాంజలియై = చేతులుమోడ్చినవాఁడయి, ఇందుశేఖరున్ = చంద్రుఁడు శిరోభూషణముగాఁగలవానినిగూర్చి - శివునిగూర్చి, పలుకున్ = ఇట్లు (వచించెను)

మంత్రము — "మననాత్త్రాయతే యస్మాత్తస్మాన్మంత్రః ప్రకీర్తితః" (శబ్దక)

వ్యాక :— పలుకున్ = పలికెన్. భూతమునలాట్టు - బా, క్రియా 22

చ॥ పశుపతి! మమ్ముఁబోలిన ప్రపన్నులపైఁగృపచాలియున్కి త్వా
దృశులకునైజమౌట, వసుదేవతనూభవదత్తమంత్రమున్
విశదముగాఁగనాకొసఁగవే! నినువేఁడెద; దానఁజేసిదుః
ఖశరధి 1 ద్రెవ్వ 2 నీదెద; నఖండసుఖస్ఫురణంబునొందెదన్. **112**

వ్యా :— పశుపతి = ఓశివా! మమ్ముఁబోలిన = మావంటి, ప్రపన్నులపైన్ = శరణాగతులమీఁద, కృపచాలియున్కి = దయకలిగియుండుట, త్వాదృశులకున్ = నీవంటివారికి, నైజమౌటన్ =

112 పః- 1 ద్రివ్వ - గ; ద్రెవ్వ - ర. అ. 2 నీదయు - డ, ద, బ, ర, నీఁదెద - అ, గౌ; నీఁఔదయుఖం - త.

సహాజమగుటచేత, వసుదేవతనూభవ = వసుదేవనందనునిచేత (కృష్ణుని చేత) - విట్ఠలునిచేత, దత్త = ఈయఁబడిన, మంత్రమున్ = మంత్రమున్ = మంత్రమును. నాకున్ = నాకు, విశదముగాఁగన్ = స్పష్టముగా, ఒసఁగవే = ఉపదేశింపవా - ఉపదేశింపుము. నినున్ = నిన్ను, వేఁడెదన్ = అర్థింతును. దానఁజేసి = దానిచేత - ఆమంత్రముచేత, దుఃఖశరధి = శోకమను సముద్రమును, త్రెవ్వఁదేఁడెదన్ = పూర్ణముగాఁ దరింతును. అఖండ = సంపూర్ణమయిన, సుఖ = సౌఖ్యముయొక్క, స్ఫురణంబున్ = స్ఫూర్తిని, ఒందెదన్ = పొందెదను.

మంత్రము — చూ 5-111 వ్యాఖ్య.

ఉ॥ నావినిశూలిపల్కు, మునినాయక! యీమనువెందుగోప్యమై
తావిలసిల్లు, దీనిదురితప్రవణాత్ములకున్, మురారిసే
వావిముఖప్రచారులకు, వైష్ణవమార్గముగాని 1 హీనపుం
ద్రోవఁజరించు సజ్జనవిరోధులకుందగదింతదెల్పఁగన్. **113**

వ్యా :— నాన్ = అనఁగా, (నారదుఁడిట్లుపలుకఁగా) విని = ఆకర్ణించి, శూలి = ఈశ్వరుఁడు, పల్కున్ = (ఇట్లు) వచించెను. మునినాయక = ఓమౌనినాథా! ఈమనువు = ఈమంత్రము, ఎందున్ = ఎచ్చటనైనను, గోప్యమై = దాఁపఁదగినదై, (గోపనీయమై) తాన్ = తాను, విలసిల్లున్ = ప్రకాశించును దీనిన్ = దీనిని - ఈమంత్రమును, దురిత = పాపమునందు, ప్రవణ = ఆసక్తమయిన, ఆత్ములకున్ = మనస్సులుగలవారికి, మురారిసేవా = విష్ణుసేవయందు, విముఖప్రచారులకున్ = ప్రతికూలమయిన సంచరించుటగలవారికి, వైష్ణవమార్గముగాని = విష్ణుభక్తికి సంబంధించిన త్రోవకుఁజెందని, హీనపుందోవన్ = అధమమార్గమునందు, చరించు = సంచరించు, సజ్జనవిరోధులకున్ = సజ్జనవైరులకు, (దుర్మార్గులకు) ఇంత = కొంచెమయినను, తెల్పఁగన్ = ఎఱిఁగించుట, తగదు = యుక్తముకాదు.

---

113 ప :- 1 దానవ్వుం - గ; హీనపుం - ర, ఆ,

క॥ నీవు హరిభక్తియుతుఁడవు
గావున, నాకెపుడుఁగూర్తుగావున, విజ్ఞా
నావాసపూర్ణబుద్ధివి
గావున 1 వినుపింతువినుము, కలుషవిదూరా! **114**

వ్యా :— కలుషవిదూరా = ఓపాపములకు మిక్కిలిదవ్వయినవాఁడా! - ఓనారదా! నీవు = ఈవు, హరిభక్తియుత్తుఁడవు = విష్ణుభక్తితోఁగూడుకొన్నవాఁడవు, కావునన్ = కాఁబట్టి, నాకున్ = నాకు (వక్త - శివుఁడు) ఎపుడున్ = ఎప్పుడును, కూర్తు = ఇష్టుఁడవగుదువు. కావునన్ = కాఁబట్టి, విజ్ఞాన = విశేషమయినజ్ఞానమునకు ఆవాస = నిలయమయిన, పూర్ణబుద్ధివి = సమగ్రమయినమతిగలవాఁడవు, కావునన్ = కాఁబట్టి, వినుపింతున్ = వినుతును, వినుము = ఆకర్ణింపుము.

శ్లో॥ 1 స్పర్శాద్యంసత్యనామాద్యం, షష్ఠషష్ఠం నదీర్ఘకమ్,
షష్ఠంషష్ఠాదినత్యంతం, సమానంతం విదుర్బుధాః **115**

---

114 ప :- 1 వినిపింతుఁ — ర, అ, వినుపింతున్ – గౌ.

115 శ్లో:- 1 స్పర్శాద్యంసత్యనామాద్యం, షష్ఠషష్ఠసదీర్ఘకమ్. సగుణంషష్ఠాధినత్యంతం - త; షష్ఠషష్ఠసదీర్ఘికమ్, షణషష్ఠాదినత్యంతం, సమానంతవిదుర్మ్మధా - త, షష్ఠషష్ఠాదిసత్యాంతం - డ.ద.ప; సర్పాద్యం నత్యానామాద్యం, షష్ఠషష్ఠనదీర్ఘకమ్, షష్ఠాంషష్ఠాదిసత్యాంతం. సమారంతం విదుర్బుధాః; స్పర్శాద్యం సత్యనామాద్యం, షష్ఠసదీర్ఘకమ్, షష్ఠషష్ఠాదినత్యాంతం, సమారంతం విదుర్బుధాః - ర. అ. "ఈశ్లోకము సాధుపాఠమునకై చేసిన ప్రయత్నము ఫలింపలేదు' 'ర' ప్రతిటీకలోని వివరణము తృప్తికరముగాలేదు." 'అ' - అధోజ్ఞాపిక.

వ్యా :— స్పర్శ = స్పర్శవర్ణము, (కకారము మొదలు మకారమువఱకుఁగలహల్లులు, స్పర్శవర్ణములు) ఆద్యమ్ = ఆదివర్ణముగాఁగలదియు, (కకారమాదివర్ణముగాఁగలదియు అనుట - కకారము స్పర్శము) సత్యనామ = సత్యనామము, ఋతగ్ంసత్యమ్ -అను శ్రుతిననుసరించి ఋతశబ్దమునందలి ఋకారము) ఆద్యమ్ = ఆదివర్ణముగాఁగలదియు, (కకారఋకారములాద్యవర్ణములనుట - క్ + ఋ = కృ) షష్ఠషష్ఠమ్ = ఆఱవవర్గముయొక్క యాఱవవర్ణముగలదియు, (కచటతపయ - వర్గములలోనాఱవదియవర్గము య-ర-ల-శ-ష-స-హ-ళ, అను యవర్గములో నాఱవవర్ణము- షకారము. కాన, షకారముగలదియు అని తాత్పర్యము) నదీర్ఘకమ్ = నకారదీర్ఘముగలదియు, (న్ + ఆ = నా; షకారముతో 'నా' వర్ణము జోడింపఁగా - "ష్ + నా" అనియగును. రషాభ్యాంనోణఃసమానపదే - అనుపాణినీయముచే, నకారమునకు ణకారమగును - ష్ + ణా = ష్ణా) షష్ఠమ్ = ఆఱవ వర్ణము, షష్ఠాది = ఆఱవవర్గమునందలి యాదివర్ణముగాఁగలదియు, (ఆఱవది, యవర్గము యవర్గమునకాదివర్ణము, యకారము. ఇది యాఱవయక్షరము. క్ ఋ ష్ ణ్ అ-అనునవియైదువర్ణములు, యవర్ణమాఱవవర్ణమన్న మాట) నతి=నమస్కారము. అంతమ్ = చివరగాఁగలదియు, ('నమః' అనునదిచివరగాఁగలదియుఅనుట) అగు. తమ్= దానిని-అమంత్రమును, సమాసమ్= సంక్షేపముగా, (సమాస = సంక్షేపే - శబ్దస్తో) బుధాః = పండితులు, విదుః = తెలిసికొందురు.

కాఁగా, క్ + ఋ + ష్ + ణా + య + నమః = కృష్ణాయనమః - అనునది మంత్రమన్న మాట.

విత్తులుఁడు బాలగోపాలుఁడు. (చూ 4-134) ఇది బాలగోపాల మంత్రము.

"బాలగోపాలస్య - ఓంక్లీంకృష్ణాయ" (శబ్దక)

క॥ కృష్ణుఁడు 1 ఋషిగాఁగ, మహా
విష్ణుఁడుదేవతగఁ 2 బొల్చివేమాఱులు, త
న్నిష్ణాతబుద్ధిఁ బేర్కొను
వైష్ణవులకు నీమనువుధ్రువస్థితియొసఁగున్. **116**

వ్యా :— కృష్ణుఁడు = హరి - విఠ్ఠలుఁడు, ఋషిగాఁగన్ = ఋషిగాను, (మంత్రద్రష్టగాను) మహావిష్ణుఁడు = గొప్పవాఁడయిన విష్ణుమూర్తి - ఆదివిష్ణువు, దేవతగన్ = దేవతగాను, పొల్చి = ఒప్పి, వేమాఱులు = వెయ్యిపర్యాయములు, తద్ = దానియందు - ఆ మంత్రమునందు, నిష్ణాత = ప్రవీణమయిన; బుద్ధిన్ = మతితో, పేర్కొను = పారాయణముచేయు, "జపించు" వైష్ణవులకున్ = విష్ణుభక్తులకు, ఈమనువు = ఈమంత్రము, ధ్రువ = శాశ్వతమయిన, స్థితిన్ = స్థానమును - మోక్షమును, ఒసఁగున్ = ప్రసాదించును.

పాఠ :— రుషి - 'గొ' పాఠము. రుషిశబ్దము సర్వశబ్దసంబోధినిలోఁగలదు గానియిది యప్రసిద్ధము. నిర్వాహకస్థలమునందును లేదు. కాన ఋషి' అను 'అ' 'ప్రతి' పాఠమేగ్రహింపఁబడినది. రుషి-లేఖనసంప్రదాయముచేనేర్పడియుండవచ్చును.

ఉ॥ ఎవ్వఁడు పౌండరీమునకేగి, మహానదిఁదీర్థమాడి, తా
నవ్విధులెల్లఁదీర్చి, కమలాక్షునకున్ బ్రణమిల్లి, నూఱుమా
ర్లివ్వరమంత్రమర్థిఁబఠియించునతండఖిలాఘపంకముల్
దవ్వుననంగసంగఁడు 1 తత్వమహత్త్వముసత్వరంబుగన్ **117**

---

116 పః - 1 రుషి — గొ; ఋషి - ర, అ. 2 గొ (బొ?) లిచి — గొ; బొల్చి - ర, అ.

117 పః- 1 తత్త్వ — ర, అ; తత్వ - గొ.

వ్యా :— పౌండరీకమునకున్ = పౌండరీక క్షేత్రమునకు, ఎవ్వఁడు = ఎవఁడు, ఏగి = అరిగి, మహానదిన్ = గొప్పనదియందు-భైమీనదియందు, తీర్థమాడి = స్నానముచేసి, తాన్ = తాను; అవ్విధు లెల్లన్ = ఆవేదోక్తకర్మములన్నింటిని, తీర్చి = నెఱవేర్చి, కమలాక్షునకున్ = హరికి - విఠ్ఠలునకు, ప్రణమిల్లి = నమస్కరించి, ఇవ్వర మంత్రమున్ = ఈశ్రేష్ఠమయిన మంత్రమును, అర్థిన్ = ప్రీతితో, నూఱుమార్లు = నూఱుపర్యాయములు, పఠియించున్ = చదువునో, అతండు = అతఁడు, అఖిల = సర్వములయిన, అఘపంకముల్ = బురదవంటి పాపములు, దవ్వుచనన్ = దూరముపోఁగా - నశింపఁగా, తత్వ = పరమాత్మయొక్క, మహత్త్వమున్ = గొప్పతనమును, సత్వరంబుగన్ = వేగముగా, కనంగలఁడు = తెలియఁజాలును.

తత్వ - ఏకతకారకమునుగలదు. చూ 1-208 వ్యాఖ్య.

వ్యాక :— పఠియించున్ = పఠియించునో.

ఓ - అధ్యాహార్యము (పౌ. వాక్య 13)

క॥ [1]విధిమంతంబుగవిధుస
న్నిధినిచ్చలునేఁబఠింతునిఖిలభవతమో
వధవిధివధువగుదీనిన్
విధినందన! తత్ప్రసాదవిభవాపేక్షన్. 118

వ్యా :— విధినందన = ఓబ్రహ్మయొక్క కుమారుఁడా - ఓనారదా ! విధిమంతంబుగన్ = శాస్త్రయుక్తముగా, విధు = విష్ణువుయొక్క-విఠ్ఠలునియొక్క, (విధుర్విష్ణౌచంద్రమసి - అమ) సన్నిధిన్ = సన్నిధానమునందు, నిఖిల = సర్వములయిన, భవ = జన్మములనెడు,

118 ప :- 1 విధివంతంబు - ముద్రి (అ). ర: విధుమంతం - త, విధివన్మతముగ - గొ; విధిమంతంబుగ - అ

తమః = చీకటియొక్క, వధవిధిన్ = మారణవిధానమువందు, విధువు= చంద్రుఁడు, అగు = అయిన, దీనిన్ = ఇద్దానిని - ఈమంత్రమును, (కృష్ణాయనమః - అనుమంత్రమును - 115 శ్లో) తద్ = అవిద్దులుని యొక్క; ప్రసాదవిభవ = దయాసంపత్తియందలి, అపేక్షన్ = కోరిక చేత, నిచ్చలున్ = ఎల్లప్పుడు, ఏన్ = నేను, (శివుఁడు - వక్త) పఠింతున్ = చదువుదును. (పారాయణము చేయుదుననుట)

పాఠ :— విధివంతంబు, విధుమంతంబు - లిపికర్ప్రమాద జనితములగు నపపాఠములు. విధివంతమను నపపాఠము అది 7-87 వచనమున ముద్రితము. ఇది "విధివత్" శబ్దతత్సమమనికొందఱు పరిశోధకులనుట యపరిజ్ఞానమూలకము. విధివన్మతముగ - అను 'గౌ' పాఠమును నిర్దుష్టము.

వ॥ సిద్ధేశ్వరాహ్వాయంబున సిద్ధలింగంబవైయెందేని నీవుండుదువాదక్షిణ1 ద్వారంబునధిష్ఠించి యీమంత్రంబు ననుష్ఠించు నిష్ఠాగరిష్ఠులకు నిష్ఠారసిద్ధికరతల స్ఫటికఘుటికయగుట నిగమార్థంబు. తొల్లితీర్థ యాత్రాచరణ నిపుణుండగు నీలాంబరుండు నిఖిలతీర్థంబు 2 లును దర్శిం 3 చుచువచి వచ్చి పౌండరీకంబు సొత్తెంచి, యుత్తుంగతరంగ డోలారూఢ కలహంసకుల 4 కలకలారావఘుమఘుమిత బ్రహ్మాండ కుహరక్రోడంబగు భీమరథీనీరంబునన్ గృతస్నానుండై, యనూన మహిమాభిరామంబగు నాక్షేత్రంబునం గల 5 విచిత్రంబులన్నేత్ర ప్రీణ 6 నంబునాచరిం 7 చుచు, నచ్చోటు 8 సాక్షరుండగుపుండరీ

119 వ :- 1 భాగంబు - గ; ద్వారంబు - ర, అ, గౌ. 2 లను - ర; లును- అ, గౌ. 3 పుచు - గౌ; చుచు - ర, అ. 4 కలకలనాద - జ; కలకలరవ-ర, కలకలారావ - అ, గౌ. 5 విశేషంబులు-ర (పా) విచిత్రంబులు - ర, అ. 6 నంబుగానా - ర; నంబునా - అ, గౌ. 7 పుచు - గౌ; చుచు - ర, అ. 8 సాక్షాత్కరుండగు - గౌ;

శాక్షు 9 వీక్షించి, వెఱఁగంది, తదక్షరలక్షణంబు తెలియఁగనేరక 10 యూరకయుండియుండియు, నయ్యేకకుండలుండు, 11 చలపకారి తనంబున నవ్వర్ణంబులు నిర్ణయింపనుద్యుక్తుండై. **119**

వ్యా ;— సిద్ధేశ్వర = సిద్ధేశ్వరమనెడు, అహ్వాయంబునన్= పేరుగలదానియందు, సిద్ధేశ్వరమునందు - చూ 5-9 సిద్ధలింగంబవై= పవిత్రమయిన శిలాకృతివై, ఎందేని = ఎచ్చోటు, నీవు = ఈవు, ఉండుదువు = వసింతువో, ఆదక్షిణద్వారంబున్ = ఆదక్షిణపువాకిటిని, అధిష్ఠించి = ఆశ్రయించి, ఈమనువున్ = ఈమంత్రమును, అనుష్ఠించు = ఆచరించు - జపించు, నిష్ఠాగరిష్ఠులకున్ = ధర్మాచరణమున శ్రద్ధగలవారియందు గురుతములకు, ఇష్టార్థ = కోరినప్రయోజనముల యొక్క, సిద్ధి = లాభము, కరతల = అఱచేతిచొందలి. స్ఫటిక ఘుటిక = పటికపుగుళిక, అగుట = కావుట - ప్రత్యక్షగోచరముగుట, నిగమార్గంబు = వేదప్రతిపాదితవిషయము. తొల్లి = పూర్వము, తీర్థయాత్రాచరణ = పుణ్యక్షేత్రగమనమునొనర్చుటయందు, నిపుణుండగు = నేర్పరియగు, నీలాంబరుండు = బలరాముడు, నీలాంబరోరౌహిణేయస్తాలాంకోముసలీహలీ-అమ) నిఖిల=సర్వములయిన, తీర్థంబులును= పుణ్యక్షేత్రములును, దర్శించుచున్=దర్శనముచేయుచు, వచ్చివచ్చి=అరుదెంచియరుదెంచి, పౌండరీకంబు = పౌండరీకక్షేత్రము, చొత్తెంచి = ప్రవేశించి, ఉత్తుంగ = ఎత్తయిన, తరంగ = కెరటములనెడు, డోలా = ఉయ్యాలలను, ఆగూఢ = ఎక్కిన, కలహంసకుల = ధూమ్రవర్ణముగల ముక్కు కాళ్లుఱెక్కలు గలిగిన హంసలసజాతీయ సమూహముయొక్క, (కాదంబఃకలహంస్స్యాత్ - అమ; ధూమ్రవర్ణములైన ముక్కు కాళ్లు

---

సాక్షరుండగు - ర, అ. 9 వీక్షించు - గౌ; వీక్షించు - ర, అ. 10 కుండెనుండియు - ర; యుండియుండియు - అ. 11 చలపాదితచలపాది - గౌ; చలపకారి - ర, అ.

ఱెక్కలుగలిగిన హంసపేళ్లు - గురుబాల) కలకలారావ = కలకల నినాదముచేత, ఘుమఘుమిత = ఘుమఘుమధ్వనిగల, [ఘుమఘుమ - ధ్వన్యనుకరణ - శబ్దము) బ్రహ్మాండకుహార క్రోడంబు = గుహావంటి బ్రహ్మాండముయొక్క లోపలిభాగముగలదియగు, భీమరథి = భైమీ నదియొక్క, నీరంబునన్ = జలమునందు, కృతస్నానుండై = చేయఁ బడినమజ్జనముగలవాఁడయి, అనూన = ఊనముకాని - అధికమయిన, మహిమ = మహత్త్వముచేత, అభిరామంబగు = ఒప్పిదమయినదగు, ఆ క్షేత్రంబునన్ = ఆతీర్థమునందు- ఆపౌండరీకమునందు, కల =ఉన్న, విచిత్రంబులన్ = వింతలచేత, నేత్రప్రీణనంబున్ = కన్నులవేడుకను, ఆచరించుచున్ = చేయుచు, అచ్యుతున్ = అచ్చుట, స+అక్షరుండగు= అక్షరములతోఁగూడుకొన్నవాఁడగు(సిద్ధమంత్రాక్షరములతోఁగూడుకొన్న వాఁడగు - అనుట. చూ 5-111; 115) పుండరీకాక్షున్ = కృష్ణుని - విట్ఠలుని, వీక్షించి = చూచి, వెఱఁగొంది = ఆశ్చర్యమునొంది, తదక్షర లక్షణంబులు= ఆయక్షరములయొక్క విశేషచిహ్నములు, ఎఱుంగనేరక = తెలిసికొనలేక, ఊరకయుండియుండియున్ = ఊరకుండియూరకుండియు అయ్యేకకుండలుండు = ఆబలరాముఁడు (ఏకకుండలఆఖ్యాతో బలభద్రే ధనాధిపే - మే. ని) చలపకారితనంబునన్ = అభినివేశముతో, (పట్టు దలతో) అవ్వర్ణంబులు = ఆయక్షరములు, నిర్ణయింపన్ = నిర్ధారణ చేయుటకు, (ఆవర్ణములు చదువుటకు - అనుట) ఉద్యుక్తుండై= ఉద్యో గించినవాఁడయి. (మీఁదిపద్యముతో నన్వయము)

మ॥ కరముల్మీఁదికిఁజాఁచి, యూఁగుపులుబిగ్గంబట్టియంతా రిపూ
త్కరముంబోవనదల్చి, యట్టిశటిఁబద్మంబట్టుమోమొప్పఁగాఁ
జరణాంగుష్ఠనఖావలంబనముతోఁ జండాంశుఁగన్గొంచు భా
స్వరనిష్ఠందపమాచరించెనొకమాసంబన్నపర్ణంబుగన్. 120

---

120 ప :- 1 యంతన్ - ముద్రి (అ). ర; యంతా - అ, గౌ. 2 వర్జ్యంబు -ముద్రి (అ). ర; వర్జంబు - అ, గౌ.

వ్యా :— కరముల్ = చేతులు, మీఁదికిన్ = పైకి, చాఁచి= చాఁగఁజేసి, చేతులుపైకెత్తి - అనుట ఊపుపులు = శ్వాసములు, బిగ్గంబట్టి = నిరోధించి, అంతర్ = లోపలివగు, రిపు = శత్రువులను- అంతశ్శత్రువులను కామక్రోధలోభమోహమద మాత్సర్యములనెడు వరిషడ్వర్గమును - అనుట పోవనదల్చి = పోఁద్రోలి - విసర్జించి, అట్టితఱిన్ = అట్టిసమయమున, పద్మంబట్లు = కమలమువలె, మోము = ముఖము, ఒప్పఁగాన్ = ప్రకాశింపఁగా, చరణ = పాదముయొక్క, అంగుష్ఠనఖ = బొటనవ్రేలిగోరియొక్క, అవలంబనముతోన్=ఊఁతతో చండాంశున్ = వేఁడివెలుఁగును (సూర్యుని) కన్గొంచున్ = వీక్షించుచు, భాస్వర = ప్రకాశమానమయిన, నిష్ఠన్ = ధర్మాచరణమునందలిదీక్షతో, ఒకమాసంబు = ఒకనెల, అన్నవర్జంబుగన్ = ఆహారముయొక్క విసర్జనముతో, (ఆహారమును విసర్జించి - అనుట) తపము= తపస్సును, ఆచరించెన్ = ఒనర్చెను.

వ్యాక :— అంతర్ + రిపు = అంతారిపు. రేఫలోపసంధి. చూ 3-33 వ్యాఖ్య.

తే॥ దానఁబ్రియ 1 మందిదానవధ్వంసియొసఁగెఁ
గూర్మియన్నకుధర్మైకనిర్మలునకు
నమ్మహామంత్ర², మాతండునంతనుండి
యదియజపియింపఁదొణఁగెగాయత్రివోలె. 121

వ్యా :— దానన్ = దాసిచేత - ఆతపసు చేత, ప్రియ మంది = ప్రీతిపొంది, దానవధ్వంసి = కృష్ణుఁడు, ధర్మైకనిర్మలునకున్=

---

121 ప :- 1 మొందిర (పా?): మంది - ర. అ, గౌ. 2 గాయత్రిఁబోలె- ర; గాయత్రివోలె - అ, గాయత్రిఁబోలి - గౌ.

పుణ్యముచేత ముఖ్యమయిన పరిశుద్ధిగలవాఁడగు, కూర్మియన్నకున్ = ప్రియాగ్రజునకు - బలరామునకు, అన్మహామంత్రము = అగొప్పమంత్రమును, ఒసఁగెన్ = ఇచ్చెను - ఉపదేశించెను. అతండున్ = అతఁడును - ఆబలరాముఁడును, అంతనుండి = అప్పటినుండి, అదియ = అదే - ఆ మంత్రమునే, గాయత్రివోలెన్ = గాయత్రీమంత్రమువలె, జపియింపఁ దొణఁగెన్ = జపముచేయమొదలిడెను.

"గాయత్రీ - సాతుత్రిపాదాష్టాక్షరచ్ఛందోయుక్తమంత్రాత్మికా వేదమాతా --- గాయంతంత్రాయతేయస్మాత్ గాయత్రీత్వంతతః స్మృతా" (శబ్దక)

క॥ భూరిగుణరత్నరాశిఁగు
1 మారుఁగనంగొనఁగఁదివురుమమకారము, లో
నారసి, యొసంగెమున్నా
నీరజనాభుండురుక్మిణికి 2 నామనువున్, **122**

వ్యా:- భూరి=అధికమయిన, గుణరత్న=గుణములనెడుమణులయొక్క, రాశిన్=ప్రోకయగు,కుమారున్=కొడుకును,(మన్మథుననుట) కనుంగొనఁగన్=పడయుటకు, తివురు = యత్నించు, మమకారమునన్ = మమతను (ప్రేమను), లోన్= లోపల-మనస్సులో, అరసి = తెలిసికొని, మున్ను= పూర్వము, అనీరజనాభుండు = అకృష్ణుఁడు, రుక్మిణికిన్ = రుక్మిణీదేవికి, అమనువున్ = అమంత్రమును, ఒసంగెన్ = ఇచ్చెను -ఉపదేశించెను.

నీరజనాభుఁడు - పద్మమునాభియందుఁగలవాఁడు - ఇదిఖగోల దృశ్యమునకుఁబ్రతీక. (చూ 1-3 వ్యాఖ్య)

---

122 ప :- 1 మారుంగనఁ-గొ; మారుఁగనుం - ర, అ. 2 నీమ- డ,ద,బ, మనువుదగ - గొ; నామ - అ.

క॥ జపయించె నేనుదివసము
లుపవాసపురస్సరముగ నుగ్మలి నిష్ఠా
నిపుణమతిన్, బతిచే నిటు
లుపదిష్టంబయిన మంత్రముత్సుకమొదవన్. 123

వ్యా ;— ఉగ్మలి = (ఆ) కాంత - అరుక్మిణీదేవి, నిష్ఠా = ధర్మాచరణమునందలి, నిపుణమతిన్ = నేర్పరితనముతోఁగూడినబుద్ధితో; ఇటు = ఇట్లు, పతిచేన్ = భర్తచేత, ఉపదిష్టంబయిన = ఉపదేశింపఁబడినదియగు, మంత్రము = మనువు, ఉత్సుకమొదవన్ = (ఇష్టవస్తుప్రాప్తికొఱకగు) తహతహకలుగఁగా, ఉపవాసపురస్సరముగన్ = ఉపవాసముముందుకలదిగా, ఏనుదివసములు = ఐదుదినములు, జపియించెన్ = జపముచేసెను.

జపము —

ఉచ్చరేదర్థముద్దిశ్య, మానసః సజపస్స్మృతః
జిహ్వోష్ఠౌచాలయేత్కించి, ద్దేవతాగతమానసః
కించిచ్ఛ్రవణయోగ్యఃస్యా, దుపాంశుఃసజపస్స్మృతః
మంత్రముచ్చారయేద్వాచా; వాచికః సజపఃస్స్మృతః
ఉచ్చైర్జపాద్విశిష్టఃస్యా, దుపాంశుర్దశభిర్గుణైః
జిహ్వాజపఃశతగుణః, సాహస్రోమానసః స్మృతః [అగ్ని]

ఉ॥ విన్ముమదీయనేత్రశిఖివేగమునన్ జముఁగూడఁజన్నయ
మ్మన్మథుఁడిందుబింబసుకుమారుఁడు, భోజతనూజయందుఁబు
ట్టెన్మధువైరిదెల్పినకడింది జపంబునెపంబునన్, బున
ర్జన్మమునొందెరాగరససంపదపెంపుయువద్వయీమతిన్. 124

వ్యా ;— విన్ముఁ = ఓనారదా! ఆకర్ణింపుము. మదీయ= నాదయిన, నేత్రశిఖివేగమునన్ = నయనాగ్నియొక్క వడిచేత,

జమున్ = యమును, కూడన్ = కలియుటకు, చన్న = అరిగిన (మరణించిన - అనుట) ఇందుబింబనుకుమారుఁడు = చంద్రబింబము వలెఁగోమలమయినవాఁడగు, అమ్మన్మథుఁడు = ఆమదనుఁడు, మధువైరి = మధువిరోధి - కృష్ణుఁడు, తెల్పిన = ఎఱిఁగించిన - ఉపదేశించిన కడింది = గొప్పదయిన, జపంబునెపంబునన్ = మంత్రోచ్చారణవ్యాజమున, భోజతనూజయందున్ = భోజదేశాధిపతియొక్క (భీష్మకుని యొక్క) పుత్త్రికయందు - రుక్మిణీదేవియందు, పుట్టెన్ = జన్మించెను. యువద్వయీ = పడుచుజంటలయొక్క, మతిన్ = బుద్ధియందు, రాగరససంపద పెంపు = అనురాగరససంపత్తియొక్కయతిశయము, పునర్జన్మము నొందెన్ = మరలఁబొందమెను.

సీ॥ బలభిదారామసంభవలతాంతశ్రేణిఁ
బన్నుము నాకొక్క చిన్నతేరు
కాళికెంగేలిచిల్కలరాజుఁగొని తెచ్చి
నావెంటఁబడివాగెనడవఁబనుపు
గగనచరద్రాశిగణవర్తిమకరంబు
బిరుదుకెక్కెెముగ వేగిరమొనర్పు
మదనగోపాలుండు మాతండ్రిచేనాకుఁ
జెఱకుచేమలిపించుకఱకు విల్లు

తే॥ వనజహితువేఁడితమ్మితూపునకుఁదెమ్ము
దివ్యములఁగానిసాధింపఁదీఱదీశు
నంబ! నీవంచురుక్మిణినట్టు 1 నిట్టుఁ
2 దిగుచుశైశవచాపలార్దితుఁడు మరుఁడు. 125

125 ప:- 1 లిట్టు - గౌ; నిట్టు - ర, అ. 2 దిరుగు - ముద్రి (అ), ర; దిగుచు - అ, గౌ.

వ్యా :— అంబ = అమ్మా! నీవు = ఈవు, బలభిత్ =ఇంద్రుని యొక్క, ఆరామ = ఉపవనమునందు, (నందనవనమునందు-అనుట) సంభవ = పుట్టిన, లతాంత = పువ్వులయొక్క, శ్రేణిన్ = పంక్తితో, చిన్న తేరు=చిన్న రథమును, నాకున్=నాకు; పన్ను ము=నిర్మింపఁజేయుము

(2) కాళి = పార్వతీదేవియొక్క, ("కాలః శివః తస్యపత్నీ -- కాళికా" శబ్దక) కెంగేలి చిల్కలరాజున్ = ఎఱ్ఱనిచేతియందలి శుక శ్రేష్ఠుని, తెచ్చి = తీసికొనివచ్చి, నావెంటన్ = నావెంబడిని, పడివాగె = రథమువెంటవచ్చు గుఱ్ఱముగా (వాహనముగా - అనుట) నడవన్ = నడచునట్లు, పనుపు = నియోగింపుము.

పడివాగె = వీరుఁడు రథాదులపైనేగునప్పుడువెంటవచ్చుగుఱ్ఱము

"పంచవన్నెలతేజి పడివాగెనడవఁ

బంచబాణుఁడు విజృంభణ వృత్తిమెఱసి" (పరమ సూ. ని.)

పార్వతీదేవిచేతిపైఁజిలుకయుండును. (చూ 4 236)

(3) గగన = ఆకాశమునందు, చరత్ = సంచరించుచున్న, రాశి = రాశులయొక్క (మేషాది ద్వాదశరాశులయొక్క - అనుట) గణ = సమూహమునందు, వర్తి = వర్తించునదియగు, మకరంబున్ = మకరరాశిని, వేగిరము = వేగముగా, బిరుదుటెక్కెముగన్ = శౌర్య చిహ్నమగు కేతనముగా, ఒనర్పు = చేయుము.

రాశులు (12) —

"మేషవృషమిథునకర్కట, సింహాః కన్యాతులాథవృశ్చికభమ్,

ధనురథమకరఃకుంభో, మీనఇతిచరాశయః కథితాః"

— ఇతిరాశికథనమ్. [శబ్దక]

ద్వాదశరాశుల ప్రసంగము ఋగ్వేదమునందే కలదు. "ద్వాదశ ప్రధయః చక్రమేకమ్; ద్వాదశారం నహితజ్జరాయ, వర్వర్తి చక్రం పరిద్యామృతస్య" [ఋగ్వే] ద్వాదశరాశులు గ్రీకులనుండి భారతీయులు గ్రహించిరనుట శకారభాషితము.

అశ్విన్యాదినక్షత్రములిరువదేడును ద్వాదశరాశులుగా విభజింపఁ బడినవి. ప్రతినక్షత్రమునకు నాలుగు పాదములుండును. కనుక 27 × 4=108 పాదములు. ఒకొక్కరాశి 108/12=9 పాదములు.

మకరరాశి = ఉత్తరాషాఢ 2, 3, 4 పాదములు (3పా) + శ్రవణము (4పా) + ధనిష్ఠ 1. 2 పాదములు (2పా) కలిసి మకరరాశియగును.

ధనూరాశిమన్మథునిధనుస్సు. దానిపైనుండుమకరరాశిమన్మథుని కేతనము. మకరరాశిపుచ్ఛాగ్రమునుబట్టి మన్మథునకు మీనకేతనుఁ డనియువ్యవహారముకలిగెను. మకరమీనములకైక్యముకవిసమయము. "కామకేతనే మకరమత్స్యయోరైక్యమ్ --- కవిసమయః" (కా.మీ) "గగనచరదారాశిగణవర్తి మకరంబు" అనుట మకరధ్వజవ్యవహారము ఖగోళదృశ్యమునకుఁ బ్రతీకయనుటకుఁ దార్కాణము.

(4) మదనగోపాలుండు = భక్తులకుఁజిత్తోన్మాదము కలిగించుం గోపాలుఁడగు, మాతండ్రిచే = నాజనకునిచేత, నాకున్ = నాకు, కఱకువిల్లు = దృఢమయిన ధనుస్సును; చెఱకుచేన్ = ఇక్షువుచేత, మలిపించు = నిర్మింపఁజేయుము.

మదనగోపాలుఁడు – "మదనశ్చాసౌగోపాలశ్చేతి భక్తచిత్తోన్మాదకారిత్వాదస్యతథాత్వమ్ యథా – వందేమదనగోపాలం, కైశోరాకారమద్భుతమ్, ఇతిపాద్మే" (శబ్దక)

వనజహితున్ = సూర్యుని, వేఁడి = అర్థించు, తమ్మి = పద్మమును, తూపునకున్ = బాణమునకు, తెమ్ము = తీసుకొనిరమ్ము.

సూర్యునిచేతులందుఁబద్మద్వయ ముండును. "తథాచశారదా యామ్ --- తతోధ్యానమ్ ---

"రక్తాబ్జయుగ్మాభయదానహస్తమ్ ---" [శబ్దక]

"పద్మాసనః పద్మకధరః, పద్మగర్భసమద్యుతిః

సప్తాశ్వస్సప్తరజ్జుశ్చ, ద్విభుజస్స్యాత్సదారవిః"

(హ. న - అధోజ్ఞాపిక 53 పుట)

పద్మపాణిపద్మలాంఛనశబ్దములు సూర్యవాచకములయియున్నవి.

కాలకృత్పద్మపాణిఃఖమణిః - త్రి. ని.

"స్యాత్పద్మలాంఛనోలోకేశ్వరే(బహ్మణిభాస్కరే" - మే. ని

"తమ్మిదాల్చినవానిఁదమ్మిదొల్చినవానిఁ

దమ్మిమొల్చినవానిఁదారసించు" (నరస 1-64)

(తమ్మిదాల్చినవాఁడు = సూర్యుఁడు)

"వచ్చికమలధరాన్వయేశ్వరుని బలికి, రి. (హ న 2-14)

(కమలధరాన్వయ = సూర్యవంశమునందలి - టీక)

దివ్యములఁగాని = లోకాతీతములయినవానిచేతఁదప్ప, ఈశున్ = ఈశ్వరుని, సాధింపఁడీఁబదు = జయింపశక్యముకాదు. అంచున్ = అని, శైశవచాపల = శిశుత్వమువలని చపలత్వముచేత, అర్దితుఁడు = పీడితుఁడగు-(పేరిపఁబడినవాఁడగు, మరుఁడు = మన్మథుఁడు, రుక్మిణిన్= రుక్మిణీదేవిని, ఇట్టునట్టున్ = ఈవైపునకాపునకు, (ఇటునటు) తిగుచున్ = లాగును.

మన్మథుఁడురుక్మిణీదేవియందుఁబ్రద్యుమ్నుఁడను పేరజనించెనని పురాణోక్తి

చ॥ పలుచనిలేఁత కెంజిగురు 1 బత్తళికంబెకలించితేనియం
గొలిపిన 2 తాటసంబుగల క్రొవ్విరి తూపులనిక్షుచాపుఁడే
గెలుపొనగూర్చెనా గెలుపుకృష్ణుని పట్టపుదేవిరుక్మిణీ
లలనజపించుమంత్రముబలంబునసైదిగా నెఱుంగుమీ. **126**

వ్యా :— పలుచని = సన్ననిదియు, లేఁత = తరుణమును నగు, కెంజిగురుబత్తళికన్ = ఎఱ్ఱనిపల్లవరూపమగు నమ్ములపొదినుండి పెకలించి = పైకిలాగి, తేనియన్ గొలిపిన = తేనెపట్టించిన (బాగుగాఁదేనెపూసిన) తాటసంబుగల = మెఱుఁగుపట్టుటగలిగిన, క్రొవ్విరి తూపులన్ = పుష్పబాణములచేత, ఇక్షుచాపుఁడు = చెఱకువిలుకాఁడు, (మన్మథుఁడు) ఏగెలుపు = ఏజయమును, ఒనగూర్చెన్ = కలుఁగజేసెనో, ఆగెలుపు = ఆజయము, కృష్ణునిపట్టపుదేవి = కృష్ణునియొక్క పట్టపురాణియగు, రుక్మిణీలలన = రుక్మిణీకాంత, జపించు= పారాయణముచేసిన, మంత్రముబలంబునన్ = మంత్రశక్తిచేత, ఐనదిగాన్ = అయినట్టిదిగా, [ప్రాప్తించినట్టిదిగా] ఎఱుంగుమీ = తెలిసికొనుము.

## భీమరథీనదీ యావిర్భావము

క॥ సరసిజభవ 1 వరవాయు
స్ఫురితములై, త్రిపురదహనములు త్రిజగములన్
బురికొనినీరసయవసాం
కురసఖముగనేర్చెమున్నకుంఠితశక్తిన్. **127**

---

126 ప :- 1 బత్తడిగెం - గ, గౌ, బత్తళికెం - త, బత్తళిక - ర, అ. 2 తాస టంబు - ర; బాసటంబు - అ, గౌ; తాటసంబు -చి. ని. (సూ.ని.)

127 ప :- 1 భవ - ముద్రి (అ), ర; వర - అ.

వ్యా :— సరసిజభవ = బ్రహ్మయొక్క, వర = వరమనెడు, వాయు = గాలిచేత, స్ఫురితములై = కదలికగలవైన - ప్రేరింపఁబడిన వైన, త్రిపురదహనములు = త్రిపురములనెడునగ్నులు, పురికొని = క్రమ్మి, మున్ను = పూర్వము. అకుంఠితశక్తిన్ = మొక్కవోని బలముతో, నీరస = ఎండిన, యవస = కసపు (గడ్డి) యొక్క, అంకుర= మొలకతో, సఖముగన్ = మిత్రముగా - సమానముగా; త్రిజగములన్= ముల్లోకములను, ఏర్చెన్ = దహించెను.

బ్రహ్మవరమనెడు వాయువుచేఁ బ్రేరింపఁబడిన త్రిపురములనెడు నగ్ను లెండినగడ్డిమొలకనువలె ముల్లోకములను దహించెను.

దహనములు - అగ్నులుమూఁడు. గార్హపత్యము, నాహవనీయము, దక్షిణాగ్ని. త్రిపురములుమూఁడు. లోకములు మూఁడు. అవి స్వర్గమర్త్యపాతాళములు.

వ్యాక:— త్రిజగములు-కర్మధారయము (చూ 4_56 వ్యాఖ్య)

అలం :— రూపకము, ఉపమ.

సీ॥ పెనుఁగ 1 గ్రంపతొడుగులీడ్చిన మొల్కసిసియయ్యె
గగనంబుతోరాయుకాననములు
కదులావుమూనిసి 2 కాలశాచినచీను
చాలయ్యెఁబశ్వాదిజంతుపంక్తి
3 బడిగండ్లులొంటిమ్మైఁబడిన విఘ్నేశవా
హములయ్యెహరిదంతహస్తిపతులు

---

128 ప :- 1 గంప - ర; గ్రంప - అ. 2 కాళ్ళ - గౌ: కాల - ర, అ. 3 బడిగండ్లుమింటిపై - త, బడిగుండమెట్టవెంబడిన - క; బడిగండ్లుమిట్టపై - గ; బడెగండ్లనొంటిపై - ర; బడిగండ్లనొంటిమై (డులొంటిపై?) అ; వడిగండ్లుమిట్టపై - గౌ.

వనపాలురడుసులో(జన(గు క్రూర శాళీఫ
లాకృతులయ్యె(గులాచలములు

తే॥ మృదులగోమయపిండసమ్మిళితకార
వేల్లఫలబీజసమమైరివీళ్లప్రజలు
కమలసంభవ వరదానగర్వితాసు
రవరపట్టణనిర్భరాక్రమణవికృతి. 128

వ్యా :— కమలసంభవ = తమ్మిచూలియొక్క, (బ్రహ్మయొక్క), వరదాన = వరమునిచ్చుటచేత, గర్విత = దర్పితులయిన అసురవర = దైత్యశ్రేష్ఠులయొక్క, పట్టణ = నగరములయొక్క-త్రిపురములయొక్క, నిర్భర = అధికమయిన, ఆక్రమణ = ఆక్రమించుటయొక్క, వికృతిన్ = వికారముచేత, (మాఱుపాటుచేత) -

[1] గగనంబుతోన్ = ఆకాశముతో, రాయు = ఒరయు, కాననములు = అరణ్యములు, పెను(గ్రింపతొడుగులు = (సేద్యగాండ్రు, చల్లినగింజలు కప్పువడుటకై పొలముపై(బెట్టియీడ్చెడు) పెద్దముండ్ల కంపలకట్టలు, ఈడ్చిన = తిగిచిన, [లాగిన] మొల్కసని = అంకురించిన సస్యము, అయ్యెన్ = అయెను. (అడవులు తుడిచిపెట్టుకొని పోయినవనుట)

[2] పశు+ఆది = గోవులుమున్నగు, జంతుపంక్తి = చతుష్పాత్తులవరస, కడున్ = మిక్కిలి, లావుమానిసి = బలిష్ఠు(డైన మనుష్యు(డు, కాలన్ = కాలితో, రాచిన = నల(గ(జేసిన, చీమచాలయ్యెన్ = పిపీలికలవరుసయయ్యెను.

లావుమానిసి కాలరాచినచీమచాలు - "భీష్ముండు — పాంచాల బలంబుల బారిసమరునప్పుడు బలుమానిసి చలిచీమల(గాలంజముకు చందంబుదోచె" [భీష్మ 3.270]

[3] హరిత్ = దిక్కులయొక్క, అంత = తుదళ్ళఁగల (దిశస్తు కకుభః కాష్ఠాఆశాశ్చహరితశ్చతాః - అమ) హస్తి పతులు = గజనాథులు- (అష్ట) దిగ్గజములు, బడిగండ్లులు = ఎలుకలను జంపుటకు నిర్మించిన బడిగండ్ల నెడుఊతిసాధనములు, ఒంటిమైన్ = శరీరముమీఁద, పడిన= కూలిన, విఘ్నేశవాహములయ్యేన్= వినాయకునివాహనములయ్యెను- ఎలుకలయ్యెను.

బడిగల్లు - "బడిగల్లు - అనఁగా, వెడలుపైన పెద్దబండ. అట్టి బండను కొక్కులనుచంపుటకుపయోగింతురు. ఎట్లనగా, ఆబండనొకపుల్ల సహాయమున, ఏటవాలుగానిలువబెట్టి, దానిక్రింద ఎరఉంతురు. ఆపుల్ల కొకపొడుగైనదారముకట్టియుండును. వేటకాడాదారముపట్టుకొని దూరముగా కూర్చుండియుండును కొక్కుబండక్రిందికి వచ్చుటకనిపెట్టి, త్రాడులాగును. బండకొక్కుపైబడును. అదియణగియప్పచ్చియగును." శ్రీ. దీ. పి - 'అ' ఉపోద్ఘాతము] ప్రయోగాంతరములు -

[i] వడిఁగొఅకునకేగిబడిగంటుఁజావఁ
బడినమూషికములభంగివట్రిల్లె [బసవ 545 పు]

[ii] "కొఅకుకుఁ, బోవబడిగల్లువడియెనోపాలతియనియె" [కళా 3-105]

[iii] కొఅకునకుఁబోవబడిగ, ల్లుఅకపయిఁబడినకరణి --
ఉద్భటా 1-108

వ్యాక :— బడిగల్లు+లు = బడిగండులు : బడిగండ్లు - (బా. అచ్ఛిక 16, 12 సూ) బడిగండ్లు+లు = బడిగండ్లులు -- (బా. అచ్ఛిక 17) అష్టదిగ్గజములు - చూ 1-113 వ్యాఖ్య.

[4] కులాచలములు = కులపర్వతములు, వనపాలురు = తోఁటమాలులు, అడుసులోన్ = బురదలో, చనఁగ్రుక్కు = చొచ్చునట్లదుము,

తాళీఫలాకృతులు = తాడిపండ్లవంటి యాకారములుగలవి, అయ్యెన్ = అయెను.

కులపర్వతములు - చూ. 2-144 వ్యాఖ్య.

వీళ్ల పత్రిజలు = పురజనులు, మృదుల = మెత్తనయిన, గోమయ పిండ = పేడముద్దయందు, సమ్మిళిత = కూడుకొనిన - అద్దిన, కార వేల్లఫలభీజ = కాకరకాయ విత్తులతో, (కారవేల్లః కటిల్లకః - అమ) సమము = సమానము, ఐరి = అయిరి.

కాకరవిత్తనములను పేడకద్దినిలువయుంతురు.

అలం :— రూపకము, లుప్తోపమ.

క॥ ఈరీతిఁ గొంతకాలము
కూరగతిన్ సోఁకుమూకకుడిదలయూళుల్
గారింపఁ నేనంతట
వారింపఁగఁ గణఁగితిన్ భువనహితబుద్ధిన్. **129**

వ్యా :— ఈరీతిన్ = ఈవిధముగా, కొంతకాలము = కొంత పరిమాణముగలకాలము, (కొన్నాళ్లు) క్రూరగతిన్ = నిర్దయమార్గమున, సోఁకుమూఁక = రాక్షససమూహముయొక్క, కుడిదల = ఉనికి పట్టులయిన, ఊళుల్ = ఊళ్లు - త్రిపురములు, కారింపఁగన్ = బాధింపఁగా, అంతటన్ = అసమయమున, (అప్పుడు) ఏన్ = నేను, భువనహితబుద్ధిన్ = లోకములకు మేలుగోరుతలంపుతో, వారింపఁగన్ = నివారించుటకు (లోకములకుఁ దిత్రిపురములవలనఁగలుగు బాధను నివారించుటకు - అనుట) కణఁగితిన్ = ఉద్యమించితిని.

"కుడిదల = Substustence, Living land-(బా.) ఈ పదము శ. ర. సూ. ని. లలో లేదు.

వ్యా :— కడఁగు = కణఁగు - బా. పత్రికీర్ణక 13.

"కఱఁగివసుంధరగిరులును. ఫణిపతిపైఁబడియెఁగమఠపతిపైఁబడియెన్" వీర 4-81 (సూ. ని.)

చ॥ అపుడుపినాకమున్ బవినిభాస్త్రములుంగొనియేయఁబూనిత
త్త్రిపురములొక్కటన్ నిటలదృష్టికిలక్ష్యముచేయుచోట, మ
ద్వపురుదితంబులైనశ్రమవారి 1 కణంబులు 2 డిగ్గజాటియు
ర్వపయిఁగడున్ వడిందొరఁగి వెల్లువచూపెనదీత్వమొందుచున్.

**130**

వ్యా :— అపుడు = ఆసమయమునందు. పవి = వజ్రముతో-వజ్రాయుధముతో, నిభ = సమానములయిన, అస్త్రములన్ = ప్రయోగయోగ్యములగు నాయుధములును - బాణములును, కొని = ధరించి, ఏయఁబూని = కొట్టనుద్యమించి, (బాణప్రయోగముచేయనుద్యమించి) తత్త్రిపురములు = అమూఁడుపురములు "అముప్పోళ్లు" ఒక్కటన్= ఏకకాలమున, నిటలదృష్టికిన్ = నొసటికంటికి, లక్ష్యముచేయుచోటన్= శరవ్యముగానొనర్చుసమయమునందు, మత్ = నాయొక్క, వపుః = శరీరమువలన (నుండి) ఉదితంబులైన = పుట్టినవగు, శ్రమవారికణంబులు = చెమటబిందువులు, డిగ్గజాటి = దిగజాటి, (క్రిందికి స్రవించి) ఉర్విపయిన్ = భూమిమీఁద, కడున్వడిన్ = మిక్కిలివేగముతో, తొరఁగి = పడి, నదీత్వమొందుచున్ = తరంగిణీత్వమునుబొందుచు; వెల్లువచూపెన్ = ప్రవాహమాకట్టెను.

"అస్త్రమ్ = క్షేపణయోగ్యబాణాది - ఇతిరాయముకుటః" శబ్దార్థ

క॥ మున్నేనుమేసనలఁదిన
పన్నినిభసితంబునణఁచిశ్రమవారికడున్

---

130 ప:- 1 జలంబులు – ర; కణంబులు - అ, గౌ. 2 దిగ్గ-గౌ; డిగ్గ- ర,అ

1 జెన్నె సఁగె, మంచుమల 2 మం
చున్నాఁచికొని ప్రవహించుసురనది పగిదిన్. 131

వ్యా :— మున్ను = ముందు, ఏను = నేను (వక్త-శివుఁడు) మేనన్ = శరీరమునందు, అలఁదిన = పూసిన. ప్రన్నని భసితంబున్ = దట్టమయిన విబూదిని, అణఁచి = అడఁగునట్లుచేసి, (అంతర్గతముచేసికొని) శ్రమవారి = స్వేదము (చెమట) మంచుమల = హిమాలయ పర్వతముయొక్క, మంచున్ = హిమమును, నాఁచికొని = ఆక్రమించి, ప్రవహించు = పాఱు, సురనది పగిదిన్ = దేవనదివలె - గంగానదివలె, కడున్ = మిక్కిలి, చెన్నెసఁగెన్ = ఒప్పెను.

హిమాలయపర్వతముయొక్క మంచునులోఁగొని పాఱుగంగానదివలె, శివునిమేనిస్వేదముమేనికిఁబూసికొన్నవిబూదినిలోఁగొనిపాఱెను.

శివుఁడు, హిమాద్రి. బూది, మంచు, శ్వేతగణములోనివి.
చూ 1-50 వ్యాఖ్య.

అలం :— ఉపమ.

క॥ భీమాహ్వయమున వర్తిలు
నామేనంబుట్టువంది 1 నదియదివెలసెన్
భూమిన్భై మియనందగి
భీమరథియనంగమాఱుపేరెసఁగంగన్. 132

వ్యా :— భీమ = భీమఁడనెడు, (వ్యోమకేశోభవోభీమః - అమ) ఆహ్వయమునన్ = నామముతో, వర్తిల్లు = వర్తించు, నామేనన్ =

---

131 ప :- 1 జెన్నెసఁగి- గౌ; జెన్నెసఁగె - ర, అ. 2 సంచుణ - ఠ,ద.బ; మంచున్నడఁచికొన్ని - ర; మంచున్నాచి - అ; మంచున్నాఁచి- గౌ.
132 ప :- 1 నదియై - ముద్రి (అ), ర; నదియిది - చ, త; నదియది - అ.

నాశరీరమునందుండి, పుట్టువంది = జన్మించి, నదియట = అయేఱు, భూమిన్ = పుడమియందు, భైమియనఁదగి = భైమియను పేరనొప్పి, భీమరథియనంగన్ = భీమరథియనఁగా, మాఱుపేరు = నామాంతరము; ఎసఁగుంగన్ = ఒప్పుఁగా, వెలసెన్ = తనరెను.

వ్యాక :— మేనంబుట్టువందు - మేనివలనన్ + ఉం + పుట్టువందు = మేననుండి + పుట్టువందు (బా. కారక 11) = మేనఁబుట్టువందు (ప్రౌ. కారక 11)

శా॥ అభైమీనది విశ్వమున్నిజకృపీటార్ద్రింబుగావిం 1 చుచున్
శ్రీభామావిభుక్షేత్రమండలముడాసెన్; డాసినన్ వీచిరే
ఖాభీలంబగుదానిపెంపుగనిమున్నందుండుప్రాణుల్ మహా
క్షోభోద్విగ్నమనస్కులై పెలుచనాక్రోశించుచుంబెంపఱన్. **133**

వ్యా :— అభైమీనది = అభీమరథీతరంగిణి, విశ్వమున్ = జగత్తును, నిజ = తనదయిన, కృపీట = నీటిచేత, (కబంధముదకం పాథః -- కృపీటంకాండమస్త్రియామ్ - అమ) అర్ద్రింబుగావించుచున్ = తడిసినదిగాఁజేయుచు, (తడుపుచు) శ్రీభామావిభు = లక్ష్మీకాంతాపతి యొక్క - విట్ఠలునియొక్క, క్షేత్రమండలమున్ = తీర్థప్రదేశమును - పాండురంగక్షేత్రమును, డాసెన్ = సమీపించెను. డాసినన్= సమీపింపఁగా, వీచిరేఖా = కెరటములవరుసచేత, అభీలంబగు = భయంకరమయినదగు, దాని = దానియొక్క - అభైమీనదియొక్క, పెంపు = అతిశయమును, కని = చూచి, మున్ను = పూర్వము, అందుండు = అచ్చటునివసించు, ప్రాణుల్ = జీవులు (మానవులనుట) మహాక్షోభ = గొప్పకలఁతచేత, ఉద్విగ్న = వ్యాకులపడిన, మనస్కులై = హృదయము గలవారయి, పెలుచన్ = అధికముగా, ఆక్రోశించుచున్ = (రక్షణమునకై) బిగ్గరగా నఱచుచు, పెంపఱన్ = అతిశయమునశింపఁగా. (మీఁదిపద్యముతో నన్వయము)

---

133 ప :- 1 పుచుఙ - గొ, చుచుఙ - ర, అ.

క॥ భూరిభయార్దితులై చని
భైరవు, మదరాగరుచికృపాపూరితదృ
కైౡరవుఁబలుకుదురమృతా
హారులుహరిఁబలుకుక్రియఁగృతాంజలులగుచున్. **134**

వ్యా :— భూరి = అధికమయిన, భయ = భీతిచేత, అర్దితులై = పీడింపఁబడినవారయి, చని = అరిగి, మద = మత్తతచేతను, రుచి = కాంతిచేతను, కృపా = దయచేతను, పూరిత = నింపఁబడిన దృకైౡరవున్ = తెల్లకలువలవంటి కన్నులుగలవాఁడగు, భైరవున్ = క్షేత్రపాలునిగూర్చి, (చూ 4-292) కృత = చేయఁబడిన, అంజలులగుచున్ = చేమోడ్పులుగలవారగుచు, అమృతాహారులు = సుధాంధసులు (దేవతలు) హరిన్ = విష్ణువునుగూర్చి, పలుకుక్రియన్= వచించునట్లు, పలుకుదురు = వచించిరి.

అలం :— ఉపమ.

ఉ॥ మిక్కుటమైన 1 పంకమున 2 మిన్నుల గర్భముగాఁగఁ బొంగినేఁ
డొక్కమహాస్రవంతి 3 యిదె యుత్తరదిక్కునక్షేత్రసీమపై
నిక్కలయాబ్ధిఁ 4 బోలియిటునిల్వఁగనోపమునాగహార! మే
మెక్కడికేగువారమిఁక నెద్దితెఱంగిటుమీఁదనావుడున్. **135**

వ్యా ;— మిక్కుటమైన = అధికమయిన, పంకమునన్ = బురదతో, మిన్నులగర్భముగాఁగన్ = ఆకాశముత్పత్తిస్థానములుగా, పొంగి = ఉబ్బి, నేఁడు = ఇప్పుడు, ఒక్కమహాస్రవంతి = ఒకగొప్ప నది, ఇదె = ఇదిగో, ఉత్తరదిక్కునన్ = ఉత్తరదిశయందు, క్షేత్రసీమ

---

135 ప :- 1 పొంక - క.ర; పంక - అ. 2 మిన్నల - ర; మిన్నుల-అ, గౌ; 3 యట - గౌ. యిదె - ర, అ. 4 బోలెనిట - ముద్రి (అ), బోలియిట - అ, గౌ.

పైన్ = (పౌండరీక) క్షేత్రముయొక్క పొలిమేరమీఁద, లయాబ్ధిన్ = ప్రళయసముద్రమును, పోలి = ఎనసి, (సరిపోలి) నిక్కెన్ = విజృంభించెను. నాగహార = ఓదేవయోనులగు సర్పములు హారములుగాఁగల వాఁడా! - ఓకాలభైరవా! ఇటన్ = ఇచ్చట, నిల్వఁగనోపము = ఉండలేము. మేము = ఏము, ఎక్కడికిన్ = ఎచ్చోటికి, ఏగువారము = అరుగువారము. ఇటుమీఁదన్ = ఇటుపైని, ఎద్దితెఱంగు = ఏదికర్తవ్యము? నావుడున్ = అన్నయనంతరము - ఇట్లుక్షేత్రవాసులు వచ్చి పలికినయనంతరము. (మీఁదిపద్యముతో నన్వయము) (మీఁదిపద్యముతో నన్వయము)

మిన్నులు - ఏకవచనార్థమునవాడఁబడునని, సూ. ని.
"అకట! మిన్నులువడ్డచోననదవోలె
దిక్కుమాలినప్రేతనై తిరుగవలసె" [కాశీ 3-124]
పాఱవైచితెమిన్నులువడ్డచోట [మను 2-17]

సీ॥ కాలరాత్రిప్రస్తనాగరికృతావకాశమై
యురము 1 వెల్మిడిపూఁతయొప్పు 2 వెనుప
శిథిలత్వమొందినచెంగావిజడముడి
చిలుకూడినెలపువ్వుచెంప 3 నంటఁ
గంగాళమనుబుద్ధిఁగరమున జందెంపుఁ
జిలువఁబట్టిన నదిజలదరింప
నెచ్చటఁ 4 బ్రవహించెనేటెద్దియని పల్కు
సరభసోక్తుల 5 జగజ్జంతు 6 లులుకఁ

---

136 ప :- 1 ప్రేలిడి - క: వెల్మిడి ర, అ. 2 పెనుప - గౌ: వెనుప ర, అ. 3 వట్టు - క: నంట - ర, అ. 4 బ్రభవించె - ముద్రి (అ). ర; బ్రవహించె - అ. 5 జగజంతు - అ; జగజ్జంతు - ర, గౌ. 6 లలుక - ర; లులుక - అ, గౌ.

తే॥ బాణిపుటశీధుపాత్రింబుఁబాఱవైచి
కుఱువుపైనున్న 7 కిన్నెరయుఱకత్రోచి
యతిరహఃకేళినుండియునరుగుదెంచె
భూరిజయగౌరవుఁడుకాలభైరవుండు. 136

వ్యా :— కాళరాత్రి = కాళరాత్రియనుపేరుగలదుర్గయొక్క, స్తనాగ్ర = చనుమొనచేత, కృత = చేయఁబడిన, అవకాశమై = ఎడము గలదై, ఉరమువెల్మిడిపూఁత = ఱొమ్మునందలి విబూదిపూఁత, ఒప్పు వెనుపన్ = శోభనతిశయింఁజేయఁగా.

కాళరాత్రికౌఁగిలించుకొన్నప్పుడామెస్తనాగ్రస్పర్శచేఁగొంత తుడుచుకొనిపోవుటవలన నెడమేర్పడిన, ఱొమ్మునందలివిబూదిపూఁత, శోభనతిశయింపజేయఁగా, ననుట.

కాళరాత్రి —
"సాదుర్గాశక్తిభిఃసార్ధం, కాశీంరక్షతిసర్వతః
తాఃప్రయత్నేనసంపూజ్యాః; కాళరాత్రిముఖానరైః" (కాశీ)

(2) శిథిలత్వమొందిన = బిగువుసడలిన, చెంగావి = ఇంపయిన యెఱ్ఱరంగుగల, జడముడి = జటాబంధముయొక్క, చిలుకు = ముడి, ఊడి = పీడి, నెలపువ్వు = పుష్పమువంటి చంద్రుఁడు. చెంపన్ = కపోలమును, అంటన్ = తాఁకఁగా.

(3) కంకాళము = అస్థిపంజరము, అను = అనెడు, బుద్ధిన్ = తలంపుతో, కరమునన్ = చేతితో, జందెంపుఁజిలువన్ = యజ్ఞోపవీత మ యిన సర్పమును, పట్టినన్ = పట్టుకొనఁగా, (చేతితోగ్రహింపఁగా) అది = అయ్యది - ఆసర్పము, జలదరింపన్ = కంపరపడఁగా.

చిలువ - చిలు+వా (యి) = విషధరము.

**అలం :—** భ్రాంతి

(4) ఎచ్చటన్ = ఎక్కడ, ప్రవహించెన్ = పాఱెను? ఏఱు = నది, ఎద్ది = ఏది? (ఎక్కడనున్నది?) అసిపల్కు = అనివచించు, సరభస = ఉద్రేకముతోఁగూడిన, ఉక్తులన్ = వచనములచేత, జగత్ = లోకమునందలి, జంతులు = ప్రాణులు. (ప్రాణీతుచేతనో జన్మజంతు జన్యుశరీరిణః - అమ) ఉలుకన్ = భయపడఁగా.

పాణిపుట = దొప్పవంటిచేతియందలి, శీధుపాత్రంబు = మద్యము త్రాగుపానపాత్రమును, పాఱవైచి = దూరముగావిసరివేసి, కుఱువు పైన్ = తొడమీఁద, ఉన్న = ఉన్నట్టి, కిన్నెర = కిన్నెరయను పేరు గల వీణావిశేషమును, ఉఱక = ఊరక, మాఱుమాటాడక, త్రోచి = త్యజించి, అతిరహఃకేళినుండియున్ = మిక్కిలిరహస్యక్రీడయందుండియు, భూరి = అధికమయిన, జయ = గెలుపుయొక్క, గౌరవుఁడు = గురుత్వముగలవాఁడగు, కాలభైరవుండు = క్షేత్రపాలుఁడు, (చూ 4-292) అరుగుదెంచెన్ = వచ్చెను. ఇదిక్షేత్రపాలుని, దీనరక్షణబుద్ధికి నిదర్శనము.

ఆ॥ అరుగుదెంచియమ్మహానది 1 నీక్షించి
చేతులెత్తి 2 బిట్టుచిట్టమిడిచి
ఘోరకోపవేగధిరోక్తులులియుంగఁ
బలుకునిట్లుక్షేత్రపాలకుండు **137**

**వ్యా :—** అరుగుదెంచి = వచ్చి, అమ్మహానదిన్ = ఆగొప్ప యేటిని, ఈక్షించి = చూచి, చేతులెత్తి = కరములుపైకెత్తి బిట్టు =

137 ప :- 1 వీక్షించి - ర; నీక్షించి - అ, గౌ. 2 బెట్టు - గౌ, బిట్టు - అ,ర.

బిగ్గరగా, చిట్టమిడిచి = అంగుళిస్ఫోటనముచేసి, (చిటికవేసి) ఘోర = భయంకరమయిన, కోప = అగ్రహముయొక్క, వేగ = వడిచేత, ధీర = గంభీరమయిన, ఉక్తులు = పలుకులు, ఉలియంగన్ = మ్రోయఁగా క్షేత్రపాలకుండు = కాలభైరవుఁడు, (చూ 4-291) ఇట్లు = ఈప్రకారముగా, అనున్ = వచించెను.

వ్యా :— బిట్టు = బిట్టుగా - ప్రౌ క్రియా 22

చ॥ నిలునిలుతుంగభద్రవగునిన్నుఁగనుంగొని సాధ్వసాతివి
హ్వాలమతులైరి క్షేత్రతలవాసులు, దానికిఁగోపఁ 1 గించెనిన్
వలమూరి 2 తాల్పుఁడింకనిటువచ్చుట మానుముమచ్చెకంటి! నా
నిలిచినుతించునన్నది వినిశ్చితకార్యగతిన్ జగత్పతిన్. **138**

వ్యా :— నిలునిలు = ఆఁగుమాఁగుము, తుంగభద్రవు = ఔన్నత్యముచేత శ్రేష్ఠవు (ఎత్తయిన కెరటములుగలదానవనుట) అగు= అయిన, నిన్నున్ = నిన్ను, కనుంగొని = చూచి, క్షేత్రతలవాసులు= క్షేత్రప్రదేశనివాసులు -పౌండరీకనివాసులనుట- సాధ్వస = భయముచేత, (సాధ్వసంభయమ్ - అమ) అతివిహ్వాలమతులు = మిక్కిలి వ్యాకులపడిన బుద్ధిగలవారు, ఐరి = అయిరి, దానికిన్ = అద్దానికి - అందులకు. నిన్ = నిన్ను, వలమురితాల్పుడు = దక్షిణావర్తశంఖమును (పాంచజన్యమును) ధరించువాఁడు - విట్ఠలుఁడు, కోపగించెన్=కోపించెను. మచ్చెకంటి = ఓనదీకాంతా! ఇంకన్ = ఇటుపైని, ఇటున్ = ఇందు, వచ్చుట = అరుదెంచుట - ప్రవహించుట, మానుము = ఉడుగుము, నాన్ = అనఁగా, అన్నది = అయేఱు, నిలిచి = ఆఁగి, వినిశ్చిత = బాగుగానిర్ణయింపఁబడిన, కార్యగతిన్ = కార్యజ్ఞానముగలవాఁడగు -గతిః = జ్ఞానమ్ - శబ్దక- జగత్పతిన్ = లోకేశ్వరుని- విఠ్ఠలుని, నుతించున్ = -ఇట్లు- కొనియాడెను.

---

138 ప:- 1 గించినన్ - త, ప, గౌ; గించెనిఁక - ర, అ, 2 తారుడింక - త; తాలుపింక - ర; తాల్పుఁడింక - అ; తాల్పుడింక- ర,(పా)

వ్యాఖ :- వలమురితాల్పుడు - చూ. పాకతాల్పుడు 1-199 వ్యా. మచ్చెకంటి ;- 2-130 వ్యా. మచ్చెములు దేనికిఁగన్నులోయది - అని నదీపక్షమునఁజెప్పవచ్చును.

సీ॥ జగదుద్భవస్థితిక్షయహేతువెవ్వఁడా
దేవాదిదేవుండు దిక్కునాకు
1 గ్రాహనిగ్రహమీఁగికరిఁగాచెనెవ్వఁడా
త్రిభువనాధీశుండు దిక్కునాకుఁ
2 దుదిపదంబునొసంగి ధ్రువుఁగాచెనెవ్వఁడా
దృఢదయామయమూర్తి దిక్కునాకు
3 ద్రౌపదిబన్నంబు 4 దలఁగించెనెవ్వఁడా
దీనమందారుండుదిక్కునాకు

తే॥ నెవ్వనిపదాబ్జమున జనియించుజలము
మజ్జనకుఁడైన శివుఁడాత్మమౌళినిలిపె
నమ్మహావిష్ణుఁడాకృష్ణుఁడాగుణాబ్ధి
దేవకీనందనుఁడెయెందుదిక్కునాకు. **139**

వ్యా :— జగత్ = లోకముయొక్క, ఉద్భవ = పుట్టుకకు, స్థితి = ఉనికికి, క్షయ = నాశమునకు, ఎవ్వఁడు = ఎవఁడు. హేతువు = కారణమో! ఆదేవాదిదేవుండు = ఆదేవులకు దేవుఁడు, నాకున్ = నాకు, దిక్కు = రక్షకుఁడు.

వ్యాఖ: — హేతువు = హేతువో - ఓ - అధ్యాహార్యము.

---

139 ప :- 1 గ్రహనిగ్రహముఁనీఁగి - చ, త, గా; గ్రాహనిగ్రహమీఁగి - ర,అ.
2 "క, త - ప్రతులలో 3. 4 పాదములు వ్యత్యస్తములు" — అ; ఇట్లే 'గా' ప్రతిలోను వ్యత్యస్తములు. 3 ద్రోవది-ర; ద్రౌపది -అ.
4 దొల — ర; చల - అ.

[2] గ్రాహ = నక్రరాజముయొక్క, నిగ్రహము = నిరోధమును, ఈఁగి = తొలఁగించి. కరిన్ = ఏనుఁగును [గజేంద్రుని]. ఎవ్వఁడు = ఎవఁడు, కాచెన్ = రక్షించెనో, అత్రిభువనాధీశుండు = అమూఁడులోకముల సమూహారమునకు నధినాథుఁడైనవాఁడు, నాకున్ = నాకు, దిక్కు = రక్షకుఁడు.

గ్రాహము — చూ 5-318 వ్యా.

గజేంద్రమోక్షముకథభాగవతప్రసిద్ధము. తామసమన్వంతరమున హరిమేధుఁకుహారిణియందు హరియను పేరనవతరించిన విష్ణుమూర్తి గజేంద్రుని రక్షించెను (భాగ. 8-18) వైకుంఠమునుండి విష్ణువువచ్చి రక్షించెనను. నాంధ్రభాగవతముప్రామాదికము. పూర్వోత్తరవిరుద్ధము.

వ్యాక :— కాచెన్ = కాచెనో. ఓ - అధ్యాహార్యము. త్రిభువనమ్ - చూ 4-44.

[3] తుదిపదంబున్ = అగ్రస్థానమును, ఒసంగి = ప్రసాదించి, ఎవ్వఁడు = ఎవఁడు, ధ్రువున్ = ధ్రువుని, కాచెన్ = రక్షించెనో, అదృథదయామయమూర్తి = అగాధమయిన కృపామయస్వరూపుఁడు, నాకున్ = నాకు, దిక్కు = రక్షకుఁడు.

ధ్రువచరిత్రభాగవత ప్రసిద్ధము. ఇది ఖగోళ విజ్ఞానమునకు సంబంధించినకథ.

[4] ద్రౌపది = ద్రుపదపుత్రియొక్క, బన్నంబు = పరాభవమును, ఎవ్వఁడు = ఎవఁడు, తలఁగించెన్ = తొలఁగించెనో! అదీనమందారుండు = అదీనులకుమందారవృక్షమయినవాఁడు, నాకున్ = నాకు, దిక్కు = రక్షకుఁడు.

మందారము - దేవతావృక్షములలోనొకటి. చూ 1-62 వ్యాఖ్య. కృష్ణుఁడక్షయవస్త్రములనొసఁగి ద్రౌపదీమానసంరక్షణచేయుట భారతప్రసిద్ధము.

ఎవ్వని = ఎవనియొక్క, పద+అబ్జమునన్ = పద్మమువంటి పాదమునందు, జనియించు = పుట్టు, జలమున్ = నీటిని, మత్ = నాయొక్క, జనకుఁడైన = తండ్రియగు, శివుఁడు - ఈశ్వరుఁడు, ఆత్మమౌళిన్ = తనదైనశిరస్సునందు, నిలిపెన్ = ధరించెనో, అమ్మహావిష్ణుఁడు = ఆగొప్పవాఁడయినసర్వవ్యాపకుఁడును, అకృష్ణుఁడు = ఆదైత్యులనుగర్షణచేయువాఁడును, అగుణాబ్ధి = అసద్గుణసముద్రుఁడును, అగు దేవకీనందనుఁడె = దేవకీసుతుఁడే, (విఠ్ఠలుఁడే - అనుట) నాకున్ = నాకు, దిక్కు = రక్షకుఁడు.

విష్ణుఁడు - "విశ్వం వేవేతివ్యాప్నోతీతివిష్ణుః" [గురుబాల]
కృష్ణుడు - "దైత్యాన్ కర్షతీతి" [గురుబాల]

గంగ; విష్ణుపాదోద్భవయు శివజటాజూటవాసినియునను పురాణోక్తి ఖగోళదృశ్యము. చూ 4.82 వ్యాఖ్య.

తే॥ శరణమవుగమ్మ! మద్భయజ్వరము 1 నుడుపు
భగ్నమతినైతిఁ 2 గుర్కుర భర్తకతన
నింక నెయ్యది దిక్కు చక్రాంక! నన్నుఁ
బ్రోవుమనిపల్కఁగృపఁబల్కు దేవుఁడేటి. **140**

వ్యా :— చక్రాంక = (సుదర్శన) చక్రముచిహ్నముగాఁగలవాఁడా! శరణమవుగమ్ము = రక్షకుఁడవగుము. మత్ = నాయొక్క, భయజ్వరమున్ = వెఱవేఁకిని, ఉడుపు = పోఁగొట్టుము. కుర్కురభర్తకతనన్ = కాలభైరవునికారణమున, భగ్నమతినైతిన్ = శిథిలమయినబుద్ధిగలవాఁడనయితిని, ఇంకన్ = ఇటుపైని, దిక్కు = రక్షణ ఎయ్యది = ఏది?

---

140 ప :- 1 నొడుపు - త; నుడుపు - ర, అ. 2 ఘుర్కుర - త, గౌః గుర్కుర - అ, ర.

నన్నున్=నన్ను, ప్రోవుము = రక్షింపుము. అనిపల్కన్= అనినుడువఁగా, దేవుఁడు = భగవంతుఁడు - విఠలుఁడు, కృపన్ = దయతో, ఏటిన్ = నదినిగూర్చి, పల్కెన్ (ఇట్లు) వచించెను.

కుక్కురభర్త - భైరవుని వాహనముకుక్కురము (శ్వానము) ఖగోళమునశ్వానము (కేనిస్‌మేజర్) పూర్వశ్వానమము (=ప్రోశ్యాన్, కేనిస్‌మైనర్) నను రెండు కుక్కురాకార నక్షత్రములుగలవు. వీనిలో శ్వానముభైరవునివాహనమునకుఁబ్రతీక.

ఉ॥ రమ్ముగరమ్ముదొరఁచిమధురప్రియభాషిణినన్నుఁగన్నమీఁ
2 దంమఱియున్‌భయమ్ముగలదా! వలదాతురవృత్తి, మన్నియో
3 గమ్మునన్నీప్రదేశమునఁ 4 గ్రమ్మినమజ్జనజన్మజాడ్యపా
5 శమ్ములఁదెంపునింపుమనిశమ్ము శుభమ్మునుభూతకోటికిన్. **141**

వ్యా :— మధురప్రియభాషిణి = తీయనివియుఁబ్రీతికరము లయినవియునగు మాటలుగలదానా ! - ఓనదీకాంతా! గరమ్ముదొరఁచి= నెగులు (దుఃఖము) విడిచి, (గరము = రోగము - దుఃఖము) రమ్ము = అరుగుదెమ్ము. నన్నున్ = నన్ను, కన్నమీఁదన్ = చూచిన పిమ్మటను, మఱియున్ = ఇంకను, భయమ్ము = భీతి, కలదా = ఉన్నదా? (లేదనుట) అతురవృత్తి = ఉత్కంఠతోఁగూడినస్థితి, వలదు = అక్కఱ లేదు. మాత్ = నాయొక్క, నియోగమ్మునన్ = ఆనతిచేత, ఈ ప్రదే శమునన్ = ఈస్థలమునందు - ఈపౌండరీకమునందు, క్రమ్మి = ప్రవ హించి, నమత్ = నమస్కరించుచున్నవారగు, జన = ప్రజలయొక్క, జన్మ = జననములయొక్క, జాడ్య = జడత్వములనెడు - రోగము

---

141 ప :- 1 రంమ్ము - గౌ; రమ్ము - ర, అ. 2 దంమ్మఱియుఁ - గౌ; దమ్మఱియుఁ - ర, అ. 3 గంమ్మున - గౌ; గమ్మున - ర,అ. 4 గ్రమ్మ ప; గ్రమ్మి - ర, అ. 5 శంమ్ముల -గౌ; శమ్ముల-ర,అ.

లనెడు. పాశమ్ములన్ = తాళ్లను; త్రెంపు = ఖండింపుము. భూత కోటికిన్ = ప్రాణులసమూహమునకు. అనిశమ్మున్ = ఎల్లప్పుడు, శుభమ్ములు = మేళ్లు, నింపుము = కలిగింపుము.

ఛం :— అనునాసికప్రాసము [అప్పక 3-340]

వ్యాక :— మీఁదన్ + మఱియున్ = మీఁదంమఱియున్ ఇలమకారాదేశవిధానము. [ప్రౌ. సంధి] సరికాదు. చూ. ప్రౌ. ఘంటా 298 301 పు; ము కౌ.

క॥ అస్మత్ క్షేత్రస్థితి, భవ
భస్మాంగజ! గంగకంటెఁబావనివగుచున్
భస్మీకరింపులోకా
పస్మారప్రాయదురితబాధా 1 శతమున్. **142**

వ్యా :— భవ = శివునియొక్క, భస్మాంగజ = బూదితోఁ గూడినశరీరమువలన (నుండి) జన్మించినదానా!-ఓభైమీనదీ! అస్మత్= నాయొక్క, క్షేత్రస్థితిన్ = క్షేత్రమునందలియునికిచేత, గంగకంటెన్= భాగిరథికంటెను, పావనివగుచున్ = పవిత్రవగుచు, లోక = జనుల యొక్క. (లోకస్తుభువనేజనే - అమ) అపస్మారప్రాయ = మూర్ఛ రోగమువంటి, (ప్రాయోవయసిబాహుళ్యేతుల్యానశనమృత్యుషు-వై.ని.) దురితభాధా = పాపపీడనముల యొక్క, శతమున్ = నూటిని-బహు సంఖ్యాకములగు పాపపీడనములను, భస్మీకరింపు = భస్మముచేయుము.

చ॥ అనివనజాక్షుఁడీకరణినానతి యిచ్చినఁదత్కృపారసం
బనుపెనువాననుబ్బినకిరియన్, రయమారఁగఁదత్ప్రదే 1 శమన్
ధనువునవారియై 2 నిగిడె, దానిశరంబుగరంబుదాఁకినన్
దునుఁగుఁజినుంగుపిలుఁగడుఁదూలుజగజ్జనజన్మలక్ష్యముల్ **143**

---

142 ప:- 1 శతముల్ - గౌ; శతమున్ - ర, అ.

143 ప :- 1 శమ్మున్ - గౌ, శమున్ - ర, అ. 2 నిగిడి - గౌ; నిగిడె-ర, అ.

వ్యా :— అని = ఈప్రకారముగా, వనజాక్షుఁడు = కృష్ణుడు-విఠ్ఠలుఁడు, అనతియిచ్చినన్= అజ్ఞాపింపఁగా, తత్ = అతనియొక్క, కృపారసంబు = దయారసము, అను = అనెడు, పెనువానన్ = పెద్దవర్షముచేత,ఉబ్బినక్రియన్=పొంగినదోయనునట్లు, రయమారఁగన్= వేగమతిశయింపఁగా, తృతదేశము = అస్థలము - అపౌండరీకక్షేత్రము, అన్ = అనెడు, ధనువునన్ = చాపమునందు, నారియై = మౌర్వియై (వింటియల్లెత్రాడై) నిగిడెన్ = అతిశయించెను. దాని = దానియొక్క అభైమీనదియొక్క, శరంబు = నీరనెడుబాణము. (శరోదధ్యగ్రి బాణయోః, శరంనీరే - విశ్వ) కరంబు = అత్యంతము, తాఁకినన్ = తగిలినచో, జగజ్జన = లోకమునందలి జనులయొక్క, జన్మలక్ష్యముల్= పుట్టుకలనెడు శరవ్యములు. తునుఁగున్ = తెగును, చినుంగున్ = ఛిన్నమగును. వ్రీలున్ = భేదిల్లును, కడున్ = మిక్కిలి, తూలున్ = ప్రాలును.

అలం :— రూపకానుప్రాణితమగునుత్ప్రేక్ష; రూపకము.

క॥ ఎందుఁబ్రవహించు నస్మ
న్నందనయత్తీర్థవిభువునరసింహాఖ్యన్
జెందియదునందనాత్మా
1 నందనమగుఁబద్మగర్భనందన! వింటే! **144**

వ్యా :— అస్మద్ = నాయొక్క, నందన = తనయ-భైమీనది, (వక్త-శివుఁడు) ఎందున్ = ఎచ్చట, ప్రవహించున్ = పాఱునో, అత్తీర్థవిభువు = అతీర్థరాజము, నరసింహాఖ్యన్ = నరసింహాతీర్థమను పేరును, చెంది = పొంది, యదునందన = కృష్ణునియొక్క-విఠ్ఠలుని యొక్క, ఆత్మ = మనస్సునకు, ఆనందనమగున్ = సంతోషము కలి

---

144 ప :- 1 నందనమగుపద్మ - గొ; నందమగుఙ -, బద్మ - ర, అ.

గించునదియగును, పద్మగర్భ = తమ్మిచూలియొక్క (బ్రహ్మయొక్క) నందన = కుమారుఁడా - ఓనారదా! వింటే = ఆకర్ణించితివా! (ఇది శ్రోతకుఁజేయుహెచ్చరికవాక్యము)

యదునందనుఁడు = "యదూన్‌యదువశంసంభూతాన్ నందయతీతియదునందనః" యదువంశసంభూతులను నందింపఁజేయువాఁడు.

పద్మగర్భుఁడు - ఖగోళదృశ్యము. చూ 1-3 వ్యాఖ.

వ్యాక :— ప్రవహించున్=ప్రవహించునో. ఓ - అధ్యాహార్యము.

క॥ అదిమొదలుగా సరస్వతి
తుదగాఁగలతీర్థములకు దొరయై 1 నడుమన్
బొదలుఋషి వృషభసేవిత
పదుఁడగుహరిమెచ్చుతీర్థపతిమౌనిపతీ! 145

వ్యా:- మౌనిపతి = మునీశ్వరా - ఓనారదా! అదిమొదలుగాన్ = అదియాదిగా - భైమీనదిమొదలుకొని, సరస్వతి = సరస్వతీతీర్థము (చూ 2-158 ప) తుదగాన్ = చివరిదిగా, కల = ఉన్న, తీర్థములకున్= తీర్థములకు, దొరయై = ఏలికయై, ఋషిఋషభ = వృషభములవంటి ఋషులచేత - శ్రేష్ఠులయిన ఋషులచేత, (స్యురుత్తరపదేవ్యాఘ్రపుంగవర్షభకుంజరాః, సింహశార్దూలనాగాద్యాఃపుంసిశ్రేష్ఠార్థగోచరాః - అమ) సేవిత = సేవింపఁబడిన, పదుఁడు = పాదములుగలవాఁడు, అగు = అయిన, హరి = కృష్ణుఁడు - విఠ్ఠలుఁడు, మెచ్చు = ప్రియుపడు. తీర్థపతి = తీర్థరాజము - నరసింహతీర్థము, నడుమన్ = మధ్యభాగమునందు, పొదలున్ = వర్ధిల్లును.

---

145 ప :- 1 నడుపన్ - అ; నడుమఁ - ర, గొ.

క॥ సాక్షాత్కరించి పద్మద
ళాక్షుఁడు వేంచేసి యునికి నత్తీర్థకులా
ధ్యక్షము మసారతరళా
లక్షితముక్తా 1 మణీలలంతిం బోలున్. **146**

వ్యా :— పద్మదళాక్షుఁడు = తామరఱేకులవంటి కన్నులు గలవాఁడు-విష్ణుమూర్తి (నరసింహుఁడనుట), సాక్షాత్కరించి = ప్రత్యక్షమయి, వేంచేసియునికిన్ = వెలసి (వసించి) యుండుటచేత, అత్తీర్థకులాధ్యక్షము = ఆతీర్థముల సజాతీయసమూహమున కాధిపత్యము వహించునది - ఆనరసింహతీర్థము, మసారతరళ = ఇందనీలమణిమయమగు (మసారః = ఇంద్రనీలమణిః, ఇతిశబ్దరత్నావళీ - శబ్దక) నాయకమణిచేత, (తరళోహారమధ్యగః - అమ = నాయకమణి = గురుబాల) ఆలక్షిత = బాగుగాఁజూడఁబడిన, ముక్తామణీలలంతిన్ = మౌక్తికమణులతో (ముత్యాలతో) నిర్మించిన, మెడనుండి నాభివఱకు వ్రేలాడుహారమును, (లలంతికా = స్యాద్లేకన్. నాభిలంబకంఠికాదిః - శబ్దక) పోలున్ = ఎనయును. [సరిపోలును]

నరసింహమూర్తి వెలయుచుండుటచే, నానరసింహతీర్థము, నీలము నాయకమణిగాఁగల లలంతికనుబోలుననుట. నరసింహునకు నీలమణిమయమగు నాయకమణికి, నరసింహతీర్థమునకు లలంతికకుసామ్యము.

అలం :— ఉపమ.

---

146 ప :- 1 వళీ - ముద్రి (అ), ర; మణీ - అ, గౌ.

క॥ వెన్నుఁడు ప్రత్యక్షంబై
యున్న యెడకుదక్షిణాశనొకపులినతలం
1 బున్నది మిన్నది కడగను
2 సున్నతిఁదన్నతిశుభంబులొసఁగంబొసఁగున్. **147**

వ్యా ;— వెన్నుఁడు = విష్ణువు - విట్ఠలుఁడు, ప్రత్యక్షంబై = నేత్రగోచరమయి, ఉన్నయెడకున్ = ఉన్నస్థలమునకు, దక్షిణాశన్ = దక్షిణదిక్కునందు, ఒకపులినతలంబు = ఒకయిసుకతిన్నె, మిన్నది కడగను = ఆయాకాశముయొక్క చివరను జూచెడు (ఆయాకాశము నంటెడు) ఉన్నతిన్ = ఔన్నత్యముతో, ఉన్నది = కలదు. తద్ = దానియొక్క, నతి = నమస్కారము - దానికిఁజేయునమస్కారము. శుభంబులు = మంగళములు, ఒసఁగన్ = ఇచ్చుటకు, పొసఁగున్ = సమర్థమగును.

ఆ॥ ముందునందగోపుమందయందుఁజరించు
రూపధన్యయోర్తుగోపకన్య
విష్ణు 1 భుక్తముక్త, కృష్ణుఁడచ్చటనుని్కి
యెఱిఁగి 2 యరుగుదెంచియెఱుకమించి. **148**

---

147 ప :- 1 బన్నదిమన్నది కడగను-క; బున్నదిమిన్నది కడగను - ర, అ.
2 నున్నదితన్నతిశుభంబులొసఁగుఁబొసగుఁ-క, నున్నతిఁగన్నది శుభంబులొసఁగన్‌బొసఁగన్-ముద్రి (అ) నున్నతిదన్నతిశుభంబులొసఁగున్‌బొసఁగున్-గౌ;నున్నతిఁదన్నతిశుభంబులొసఁగున్‌బొసఁగున్-అ
148 ప :- 1 భక్త- ప, ర, గౌ. 2 యేఁగుదెంచెనెఱుక - ముద్రి (అ) యేఁగుదెంచియెఱుక - ర, గౌ; యరుగుదెంచి – అ.

వ్యా :— ముందు = పూర్వము, నందగోపు = నందగోపుని యొక్క, మందయందున్ = గొల్లపల్లెయందు - వ్రేపల్లెయందు, చరించు = సంచరించు, రూపధన్య = సహజసౌందర్యముచేతఁబొగడఁ దగినదియు, విష్ణు = కృష్ణునిచేత, భుక్తముక్త = అనుభవింపఁబడిన పిమ్మట విడువఁబడినదియునగు, గోపకన్య = గొల్లపడుచు - గోపిక ఓర్తు = ఒకత్తె, కృష్ణుఁడు = గోపాలుఁడు, అచ్చటన్ = అక్కడ - పౌండరీకమునందు, ఉన్కి = ఉండుట, ఎఱిఁగి = తెలిసికొని, అరుగుదెంచి = వచ్చి, ఎఱుకమించి = జ్ఞానమతిశయించి, (మీఁదిపద్యముతో నన్వయము)

రూపము -- 2-47 వ్యా.

క॥ విప్ర 1 వధూచితశుచివే
షప్రథితశరీర 2 యయ్యెఁజకప్రస్తని, సా
భిప్రాయ 3 స్మితవికసిత
దీప్రనిజకపోలయగుచు దేవునిమ్రోలన్. **149**

వ్యా :— దేవునిమ్రోలన్ = భగవంతునిముందు - విట్ఠలుని ముందు, చకప్రస్తని = ఆకాంత - ఆగోపిక, సాభిప్రాయ = రత్యాది భావసహితమయిన, స్మిత = చిఱునవ్వుచేత, వికసిత = వికసించిన, దీప్ర = ప్రకాశించునట్టి, నిజ = స్వకీయమయిన, కపోలయగుచున్ = చెక్కిలిగలదియగుచు, విప్రవధూ = బ్రాహ్మణకాంతకు, ఉచిత = యోగ్యమయిన, శుచివేష=శుద్ధమయినవస్త్రభూషణాద్యలంకారములచేత ప్రథిత = ప్రసిద్ధమయిన, శరీర = దేహముగలది, అయ్యెన్ = ఆయెను.

---

149 ప :- 1 కులోచిత - ప, ర; వధూచిత - అ; మతోచిత - చ; మతోషిత మునిశుచిప్రథిత - త. 2 మయ్యె - గౌ; యయ్యె - ర, అ, 3 స్థిత - ముద్రి (అ); ర; స్మిత - అ, గౌ.

వ్యాక :— చక్రిస్తని = చక్రములవంటి (=చక్రవాకముల వంటి) స్తనములు దేనికిఁగలదోయది - స్త్రీ

సీ॥ జలధరశ్యామకుంతలకలాపమునకుఁ
బాటింప 1 మియెనవప్రసవకలన
దళితనీలోత్పలదళచంచదక్షుల
కామిాల 2 నంబె కాలాంజనంబు
కుంభికుంభస్థూలకుచమండలికిజ్ఞాన
ముద్రికరమె 3 ముత్యములసరంబు
గగనసోదరవలగ్న ప్రదేశమున 4 కో
డ్యాణబంధంబెయొడ్డాణమిడుట

తే॥ గాఁగఁదపమాచరించునక్కలువకంటి
యంగలతిక నిదాకల్పయయ్యె 5 నమరె
6 శారదారంభవిమలాభ్రసరణికరణిఁ
బ్రకృతిమధురంబులకు వేషరచనలేల? 150

వ్యా :— జలధర = మేఘమువంటి, శ్యామ = నల్లనిదైన, (శ్యామో - కృష్ణహరితోః - మే. ని.) కుంతలకలాపమునకున్ = కేశపాశమునకు, (కలాపోభూషణేబర్హే తూణీరేసంహతావపి -అమ) పాటింప మియె = సంస్కరించుకొనకపోవుటయే, (దువ్వుకొనకపోవుటయే - అనుట) నవప్రసవకలన = క్రొవ్విరులయొక్కకూర్పు - క్రొవ్విరులు ముడుచుకొనుట.

---

150 ప :- 1 మియు - గౌ; మియె - ర, అ. 2 నంబు - గౌ; నంబె-ర, అ. 3 ముత్తెముల-ర; ముత్యముల-అ, గౌ. 4 కోద్యాన-త, కోడ్డాణ-గ; కోడాణ - ర, అ, గౌ. 5 నలరె - ర; నమరె - అ, గౌ,ర,(పా) 6 శ్యామలా - క; శారదా - ర, అ.

ఆమె కేశసంస్కారము చేయనిక్కురులు, కేశసంస్కారము చేసి పువ్వులు ముడుచుకొన్నప్పటివలె నందముగానున్న వనుట.

2 దళిత = వికసించిన, నీలోత్పలదళ = నల్లకలువరేకులవంటి చంచత్ = ఒప్పుచున్న, అక్షులకున్ = కన్నులకు, అమీలనంబె = అరమోడ్పుటయే, కాలాంజనంబు = నల్లని కాటుక.

కాటుక పెట్టుకొన్నప్పుడెంతయందముగ నుండునో యరమోడ్చి నప్పుడామె కన్నులంతయందముగనున్న వనుట.

అంజనము - చూ 3-141 వ్యాఖ్య

3 కుంభికుంభ = ఏనుఁగుకుంభస్థలములవంటి, స్థూల = పీవర మయిన, (లావయిన) కుచ = స్తనములయొక్క, మండలికిన్ = ప్రదేశమునకు, జ్ఞానముద్రా = జ్ఞానముద్రయనెడు జపకాలమునందలి యంగుళివిన్యాసవిశేషముతోఁగూడిన, కరమె = హస్తమే, ముత్యముల సరంబు = ముత్యాలహారము.

ముత్యాలహారముధరించినప్పుడు కుచమండలమెంతయందముగ నుండునో జ్ఞానముద్రధరించినప్పుడంతయందముగ నున్నదనుట.

జ్ఞానముద్ర- "కుడిచేతిబొటనవ్రేలి కొననుచూపుడువ్రేలికొనను ఒక్కటిగాఁజేర్చి, రొమ్ముపైనుంచియెడమచేతిని ఎడమమోఁకాలిచిప్ప పయినిడునట్టియొకముద్ర.

శ్లో॥ 'తర్జన్యంగుష్ఠకౌసక్తా, వగ్రతోవిన్యసేద్హృది
వామహస్తాంబుజంవామ, జానుమూర్ధని విన్యసేత్
జ్ఞానముద్రాభ వేదేషా, రామచంద్రస్య ప్రేయసీ'
—తంత్రసారః (వాచ) - సూ. ని.

[4] గగన = ఆకాశమునకు, సోదర = తోఁబుట్టువయిన, వలగ్న= నడుముయొక్క, ప్రదేశమునకున్ = స్థలమునకు, ఓడ్యాణబంధంబె = ఓడ్యాణమనెడు యోగసాధకబంధమే, ఒడ్డాణము = ఒడ్డాణమనెడు నడుమునస్త్రీలు ధరించునాభరణవిశేషమును, ఇడుట = ధరించుట.

ఓడ్యాణము - ఓడ్యాణజాలంధరయోగబంధైః [యోగతా]-సూ.ని.

వ్యాక ;— వలగ్న = అవలగ్న. "వష్టిభాగురిరల్లోపమవాప్యో రుపసర్గయోః" [సి. కౌ.]

కాఁగన్ = కాఁగా, తపమాచరించు = తపస్సుచేయు, అక్కలువ కంటి = అకువలయాక్షియొక్క - అగోపికయొక్క, అంగలతిక = తీఁగవంటిశరీరము, నిరాకల్ప = వేషరచనలేనిది, ఆభరణాద్యలంకార ములులేనిది, [ఆకల్పవేషౌనైపథ్యమ్ - అమ] అయ్యున్ = అయిన ప్పటికి, శారదా = శరత్కాలసంబంధమయిన, ఆరంభ = ప్రారంభము నందలి, విమల = స్వచ్ఛమయిన, అభ్ర = మేఘములయొక్క, సరణికరణిన్ = పంక్తివలె, [సరణిఃపంక్తివర్త్మనోః - విశ్వ] అమరెన్= ఒప్పెను. ప్రకృతిమధురంబులకున్ = సహజస్వభావముచేతనే మనో హరములయినవానికి, వేషరచనలు = వస్త్రభూషణాద్యలంకారముల కూర్పులు; ఏల = ఎందులకు? అక్కఅలేదనుట.

ఈపద్యము - సరసిజమనువిద్ధంశైవలేనాపిరమ్యమ్. (అభిజ్ఞా) అనుశ్లోకమును దలఁపింపఁజేయుచున్నది.

అంగలతిక - అభ్రసరణికరణి ఇటువచనవ్యత్యాసములేదు. సము దాయవాచక, మేకవచనమేయగును. పద్మాయతాక్షి -- మేఘపంక్తి వోలె" [శివరా 2-51]

అలం :— ఉపమ, అర్థాంతరన్యాసము.

శా॥ లోకేశ 1 స్థితిలోకవాసకృతి సాలోక్యంబు, నర్చింపల
క్ష్మీకాంతాంఘ్రియుగంబుఁజేరు 2 తటిసామీప్యంబు, 3 సద్భక్తర
క్షాకారిందనరూపుగా 4 నిలుపుటన్ సారూప్యమున్, బుద్ధినా
కౌకశ్శేఖరుఁగూర్చియున్కి 5 సతిసాయుజ్యంబునొందుందుదిన్.

**151**

వ్యా :— లోకేశ = జగన్నాథునియొక్క - విట్ఠలునియొక్క, స్థితి = ఉనికిగల, లోక = జగత్తునందు - పాండురంగక్షేత్రమునందు, వాసకృతి = నివసించుకృత్యముచేత, సాలోక్యంబున్ = సాలోక్యమను మోక్షభేదమును, (భగవంతుఁడు నివసించులోకమున నివసించుట సాలోక్యమోక్షము) లక్ష్మీకాంత = రమాపతియొక్క-విట్ఠలునియొక్క అంఘ్రియుగంబున్ = పాదద్వయమును, అర్చింపన్ = పూజించుటకు, చేరుతటిన్ = సమీపించుసమయమునందు, సామీప్యంబున్= సామీప్యమను మోక్షభేదమును, [భగవత్సామీప్యము నందుండుట సామీప్యమోక్షము] సద్భక్తరక్షాకారిన్=మంచిభక్తులనురక్షించువానిని-విట్ఠలుని, తనరూపుగాన్ = తనకుసంబంధించినయాకారముగా, నిలుపుటన్ = మనస్సులగ్నముచేయుటచే, సారూప్యమున్ = సారూప్యమోక్షమును (భగవంతునితో సమానమయిన రూపమును బడయుట సారూప్యమోక్షము) నాకౌకశ్శేఖరుఁగూర్చి = దేవతాశ్రేష్ఠునుద్దేశించి, బుద్ధి = మతి, ఉన్కిన్ = ఉండుటచేత, సాయుజ్యంబున్ = సాయుజ్యమనుమోక్షభేదమును, [భగవంతునితోఁగూడుకొనియుండుట సాయుజ్యము] సతి = [అ] కాంత - ఆగోపిక, తుదిన్ = చివరిదశయందు, ఒందున్ = పొందును.

---

151 ప :- 1 స్థిత - ము[ద్రి - (అ). ర: స్థితి - అ, గౌ. 2 తమి-ము[ద్రి (అ). ర: తటి - అ. 3 సద్భక్తి - ఉ, ద, బ; సద్భక్త-ర, అ; గౌ. 4 ననుపుటన్ - ప; నినుచుటన్ - గౌ; నిలుపుటన్ - అ. 5 పతి - క; సతి - ర, అ.

సాలోక్యాదులు మోక్షభేదములు. "సాలోక్యసార్ష్టిసామీప్యసారూప్యై కత్వమప్యుత" భాగ 3-29-13 = "సాలోక్యంమయాసహ ఏకస్మిన్ లోకేవాసమ్, సార్ష్టింసమానైశ్వర్యమ్, సామీప్యంనికటువర్తిత్వమ్, సారూప్యంసమానరూపతామ్, ఏకత్వంసాయుజ్యమ్" (శ్రీధ)

శా॥ స్నానానుక్రమవాసితాచలఝరీసాంద్రాంబువుల్, 1 ధ్యానసం
ధానాధీనవపుర్విలోకన నితాంతప్రీతసారంగ సం
తానంబుల్, మృదుపాదపల్లవతలోద్యత్కాంతిలాక్షారస
శ్రీనద్ధాచలతుంగశృంగములు, మించెందత్తపస్సంగముల్. **152**

వ్యా :— స్నాన = మజ్జనముయొక్క, అనుక్రమ = క్రమానుసరణముచేత, వాసిత = ప్రసిద్ధికెక్కిన, అచలఝరీ = కొండవాగుయొక్క సెలయేటియొక్క - అనుట సాంద్ర = సమృద్ధములయిన, అంబువుల్ = నీళ్లుగలవియు, (అమెసెలయేటినీళ్లలోక్రమము తప్పకస్నానములుచేయుచుండెననుట) ధ్యాన = భగవంతునే కాగ్రతతోఁజింతించుటకు, అధీన = లోఁబడిన, వపుః = శరీరముయొక్క, విలోకన = చూచుటచేత, నితాంత = అత్యంతము, ప్రీత = ప్రీతినొందిన, సారంగ = లేళ్లయొక్క, సంతానంబుల్ = వంశములు గలవియు, (భగవద్ధ్యానములోనున్న గోపికదేహమునుజూచి లేళ్లుప్రీతినందుచున్నవనుట) మృదు = కోమలములయిన, పాదపల్లవతల = చిగుళ్లవంటిచరణప్రదేశములవలన (నుండి) ఉద్యత్ = నిర్గమించుచున్న కాంతి = దీప్తియనెడు, లాక్షారస = అలక్తద్రవముయొక్క, (లత్తుకరసముయొక్క) శ్రీ = శోభచేత, నద్ధ = కూర్పఁబడిన, అచల = పర్వతముయొక్క, తుంగ = ఎత్తయిన, శృంగములు = శిఖరములు

---

152 ప :- 1 దాస్య - త; ధ్యాన - ర, అ. 2 శృంగముల్ - క; స్సంగముల్ - ర, అ.

గలవియు, నగు, తత్ = ఆమెయొక్క - ఆగోపికయొక, తపస్సంగ ముల్ = తపస్సబంంధమయిన యాసక్తులు, మించెన్ = అతిశయించెను, (ఆమె చిగుళ్లవంటి పాదములకాంతియనెడు లాక్షారసశోభ, పర్వతశృంగ ములకుఁగలుగుచున్న దనుట)

ఉ॥ ఆభగవంతుఁడంతఁ గరుణార్ద్రమతిన్ సతిమ్రోల 1 నిల్చెన
భ్రాభ, మదభ, 2 మభ్రమ, మనంతము, 3 శాంతము, కాంతిమంత, మ
క్షోభ, మలోభ, మప్రతిమశోభనశోభియునైన మేను నా
నాభరణంబులన్ గుసుమి 4 తాజరభూజమునోజరాజిలన్. **153**

వ్యా :— అంతన్ = అసమయమునందు - అప్పుడు, ఆభగ వంతుఁడు, = ఆదేవుఁడు - ఆవిట్టలుఁడు, అభ్రి = మేఘమువలె, ఆభము= ప్రకాశించుచున్నదియు, అదభ్రము = అనల్పమును, అభ్రమము = భ్రాంతిలేనిదియు, అనంతము = అంతములేనిదియు. శాంతము = ప్రశాంతమయినదియు, కాంతిమంతము = ద్యుతిగలదియు, అక్షోభము= కలఁతలేనిదియు, అప్రతిమ = సాటిలేని, శోభన = శోభచేత, శోభి యున్ = ప్రకాశించునదియు, ఐన = అయినట్టి, మేను = శరీరము, నానా = అనేకములయిన, ఆభరణంబులన్ = భూషణములచేత, కుసు మిత = పువ్వులుగల, అజరభూజము = దేవతావృక్షము యొక్క, ఓజ= వికాసము, రాజిలన్ = ప్రకాశింపఁగా, కరుణా = దయచేత, ఆర్ద్రము = తడిసిన - స్నిగ్ధమయిన, మతిన్ = బుద్ధితో, సతి = ఆకాంతయొక్క- ఆగోపికయొక్క, మ్రోలన్ = ఎదుట, నిల్చెన్ = నిలువఁబడెను.

ఆభరణములతో నొప్పువిట్ఠలుని శరీరము పువ్వులతోఁగూడిన సురభూజమువలెఁబ్రకాశించెననుట.

అలం :— ఉపమ,

---

153 ప :- 1 నిల్చినన్ - గౌ; నిల్చె - ర, అ. 2 మభ్భ్రమ - డ, ద, బ; మభ్రమ - ర, అ. 3 కాంతము - గౌ; శాంతము - ర, అ.
4 తామర - ముద్రి (అ), ర; తాజర - అ, గౌ.

ఉ॥ ఆశరదిందుబింబసదృశానన, సూనశరాసకోటి సం
కాశు, రమేశు, రాగరసకశ్మల 1 నేత్రయు, నస్త్రస్తనేత్రియున్
పేశలబంధకైశికయు, భీతిముదశ్రునిపాతముఖ్యచే
ష్టాశబలత్వసక్తతనుకంపయునైకనుమంపుదాల్చుచున్. **154**

వ్యా :— ఆ, శరత్ = ఆశరత్కాలమునందలి, ఇందుబింబ = చంద్రబింబముతో, సదృశ = సమానమయిన, ఆనన = ముఖము గలది - ఆగోపిక, సూనశరాస = ననవిలుకాండ్రయొక్క, కోటి = నూఱులక్షలసంఖ్యతో - అసంఖ్యాకమన్మథులతో, సంకాశున్ = సమానమయినవాఁడగు; రమేశున్ = లక్ష్మీకాంతుని - విట్ఠలుని, రాగరస = అనురాగరసముచేత, కశ్మల = మలినమయిన, నేత్రయున్=కన్నులు గలదియు, స్రస్త= జాఱిన, నేత్రియున్ = వస్త్రముగలదియు, (నేత్రం మథిగుణేవస్త్రేతరుమూలేవిలోచనే - విశ్వ) పేశలబంధ = మృదువయిన (వదులయిన) ముడిగల, కైశికయున్ = తలవెండ్రుకల సమూహము గలదియు, (తద్వృన్దేకైశికంకైశ్యమ్-అమ) భీతి = భయము, ముదశ్రు= సంతోషబాష్పములయొక్క, నిపాత = పడుట, ముఖ్య = మొదలయిన, చేష్టా = శారీరక (కాయిక) వ్యాపారములయొక్క, (చేష్టా= ఆత్మజన్యాభవేదిచ్ఛా, ఇచ్ఛాజన్యాభవేత్కృతిః, కృతిజన్యావేచ్ఛేష్టే త్యుక్తేకాయికేవ్యాపారే - శబ్దస్తో) శబలత్వ = వేఱువేఱుభావముల కలయికచేత, (చిత్రంకిర్మీకల్మాషశబలైతాశ్చకర్బురే - అమ = నానావర్ణములుగలసిన వన్నెపేళ్లు - గురుబాల. ఇట నానాచేష్టకలయిక - లక్షణార్థము.) సక్త = కూడుకొనిన, తనుకంపయున్ = అనురాగ జన్యమగు శరీరవేపథువనెడు సాత్త్వికభావముగలదియు, (రాగద్వేష

---

154 ప :- 1 గాత్రయు - ముద్రి (అ), ర; నేత్రియు స్రస్తనేత్రియుఙ-క; నేత్రయుస్రస్తనేత్రయుఙ - అ.

శ్రీమాదిభ్యఃకంపోగాత్రస్యవేపథుః) ఐ = అయి, కనుమంపు = (అతిలోకసౌందర్యదర్శనముచేఁగలిగిన) కంటిమైకమును, తాల్చుచున్ = వహించుచు. (మీఁదిపద్యముతో నన్వయము)

తే॥ పృథుల విజ్ఞానరసపూర్ణ భృగుశుకాది
భావనాదీర్ఘికలయందుఁబరిణమించు
జలజదళనేత్రుశ్రీపాదాంబు 1 జములుగేల
భీతమృగపోతలోచన బిగియఁబట్టె. 155

వ్యా :— భీత = భయపడిన, మృగపోత = లేడిపిల్లవంటి లోచన = కన్నులుగలది - అగోపిక, పృథుల = పెద్దదయిన - గొప్పదయిన, విజ్ఞాన = విశిష్టమయిన జ్ఞానమనెడు, రస = నీటిచేత, పూర్ణ= నిండిన, భృగుశుకాది = భృగుమహర్షి శుకమహర్షి మొదలగువారియొక్క భావనా = ధ్యానములనెడు, దీర్ఘికలయందున్ = దిగ్గియలయందున్ (నడబావులయందు) పరిణమించు = పరిణామముచెందు-పద్మములుగా రూపాంతరమునందు, జలజదళనేత్రు = పద్మదళాక్షునియొక్క-విఠ్ఠలుని యొక్క, పాదాంబుజములు = పద్మములవంటి చరణములను, బిగియబట్టెన్ = గట్టిగాఁబట్టుకొనెను.

భృగుశుకాదిమహర్షుల ధ్యానములనెడు నడబావులయందుఁబద్మములుగాఁబరిణామముచెందు విఠ్ఠలుని పాదపద్మములనాగోపికగట్టిగాఁజేతితోఁబట్టుకొనెను. అలం :— రూపకము.

క॥ కరకలితనిజపదాబ్జయు
విరళతరశ్రీపయునై నవిధుబింబముఖిన్
1 గర 2 నంభావితఁజేసెన్
గరుణాగుణహారిశౌరి, కన్నులనగుచున్. 156

---

155 ప :- 1 జములఁ - ర. జములు — అ, గౌ.
156 ప :- 1 కర - గౌ: దర - త; వర - ర, అ. 2 సంఛాదితఁ - డ, ద, బ; సంచారిత . ప; సంఛాదిత - త;

వ్యా :— కర = చేతులచేత, కలిత = కూర్పఁబడిన (పట్టుకొనఁబడిన) నిజ = తనదైన, పదాబ్జయున్ = పద్మములవంటి పాదములుగలదియు, విరళతర = మిక్కిలియల్పమయిన, త్రపయున్= సిగ్గుగలదియు, ఐన = అయినట్టి, విధుబింబముఖిన్ = చంద్రమండలమువంటి మోముగలదానిని - ఆగోపికను, కరుణాగుణ = దయాగుణముచేత, హారి = మనోజ్ఞుఁడగు, శౌరి = కృష్ణుఁడు - విఠలుఁడు, కన్నులన్= నేత్రములతో, నగుచున్ = నవ్వుచు, కర = చేతితో-అభయహస్తముతో, సంభావితన్= ఆదరింపఁబడినదానినిగా, చేసెన్ =ఒనర్చెను

సీ॥ తనుఁజూచి శిథిలబంధశిరోజయగుటన
యత్యతివకుముక్త 1 కేశ్యాహ్వాయంబు
దయచేసి, తత్ప్రార్థితములైనవర 2 ముల
నొసఁగి, యప్పసి 3 గాపుటసరుబుద్ధి
చిఱుగుబ్బ 4 లాఁడిఁదత్ క్షేత్రరాజమునకు
నీశానుదిక్కున నిరవు 5 పఱిచె
వెన్నుండు, 6 తనునదివేర్పపల్లెలో రాక
7 తక్కించుదోష్యంబుదలఁచినగుచు

తే॥ దానికరములచేఁబీడితంబులైన
పాండురంగేశు శ్రీపాదపల్లవ 8 ముల
నంగుళీమధ్యతలరేఖలంటియుండు
గంగ 9 ప్రవహించునీటిడొంకలునుబోలె. 157

---

157 ప :- 1 కేశాహ్వ - ముద్రి (అ), ర; కేశ్యా - అ, గౌ. 2 ములు-గౌ; ముల - ర, అ. 3 గాఁపుటసద – ర; గాపుటసర – అ; గాఁపుటసర-గౌ. 4 లానిత - ర,గౌ; లానిత (లాఁడిఁద?)–అ. 5 పరిచి-క, పఱిచె-ర, అ. 6 తనువది-చ. త: తనువంది - గౌ; తనునది-ర,అ. 7 తర్కించు-ముద్రి (అ), ర; తక్కించు - అ 8 వంబులంగుళితలరేఖలనంటి –చ, త; ములనంగుళితమధ్యరేఖలునంటి – గౌ; ములనంగుళీమ్యధతను - ర; ములనంగుళిమధ్యతం – అ. 9 బ్రవ – ర; ప్రవ - అ.

వ్యా :— తనున్ = తన్ను, [illegible] = కని [illegible] థిలబంధ = వదలినముడిగల, శిరోజ = కేశములుగలది, [illegible] = అగుటచేత, అయ్యాతివకున్ = ఆకాంతకు - [illegible] ముక్తకేశి = ముక్తకేశి అని యనెను, (ముక్త = విడువబడిన, కేశీ = కేశములు [illegible] - ఆహ్వా యంబు = పేరు. దయచేసి = [illegible] (ముక్తకేశి యను నామ కరణముచేసి - అనుట) [illegible] = [illegible] చేత - [illegible], ప్రార్థిత ములైన = వేడఁబడిన, వరములన్ = [illegible], [illegible] = ఇచ్చి- ప్రసాదించి, అప్పసిగాపు = ఆగో[illegible] [illegible] తికిఁజెందిన, అసరుబుద్ధిన్ = అపరిపక్వమయిన జ్ఞాన[illegible] చిఱుగుబ్బ లాఁడిన్ = లేఁతవయినప్రశస్తములగుస్తన[illegible]లేజవ్వనిని వెన్నుండు = విష్ణువు - విఠ్ఠలుఁడు, తనున్ = తన్ను, [illegible] = అమె- ఆగోపిక, ప్రేపల్లెలోన్ = వ్రేపల్లెయందు, రాక = అరుదేరక, తక్కించు= వంచించిన, దౌష్ట్యంబు = గడుసుఁదనమును, తలఁచి = స్మరించి, నగు చున్ = నవ్వుచు; తత్ క్షేత్రరాజమునకున్ = ఆక్షేత్రశ్రేష్ఠమునకు - ఆపౌండరీకమునకు, ఈశానుదిక్కునన్ = ఈశాన్యదిశయందు, ఇరవు పటిచెన్ = పాదుకొలిపెను. దాని = దానియొక్క - ఆగోపికయొక్క, కరములచేన్ = చేతులచేత. పీడితంబులైన = పీడింపఁబడినవగు, పాండు రంగేశు = పాండురంగనాథునియొక్క - విఠ్ఠలునియొక్క, శ్రీపాద పల్లవములన్ = చిగుళ్లవంటి పూజ్యచరణములయందు, గంగ = గంగా నది, ప్రవహించు = పాఱు, నీటిడొంకలునుబోలెన్ = జలమార్గములో యనునట్లు (మార్గంబుతెరువుతోవ -- అంగుళీమధ్యతలరేఖలు = వ్రేళ్ల నడిమిప్రదేశములగీఁతలు, అంటియుండున్ = అంటుకొనియుండును.

గంగ, విష్ణుపాదమునుండి జన్మించినది. కాన, గోపికవేళ్ళ నడిమిరేఖలు విఠ్ఠలునిపాదములపై గంగప్రవహించిన జలమార్గములో యనునట్లుండుననుట.

అలం :— ఉత్ప్రేక్ష.

క॥ అముక్త 1 కేశిదర్శన
మోమునికుల సార్వభౌమ! యొసఁగునసేక
శ్రీమూర్తిదానఫలమా
భామినిశ్రీమూర్తి 2 గాఁగఁ 3 బాటింపఁగున్. 158

వ్యా :— ఓమునికుల సార్వభౌమ = ఓమౌనుల సజాతీయ సమూహమునకుఁ జక్రివర్తియయినవాఁడా - ఓనారద! అముక్త కేశి దర్శనము = అముక్త కేశియను గోపికయొక్క సందర్శనము, అనేక శ్రీమూర్తి = పెక్కులక్ష్మీ ప్రతిమలయొక్క, (మూర్తిః = ప్రతిమా - ఇతి హేమచంద్రః - శబ్దక.) దానఫలము = త్యాగఫలమును, ఒసఁగున్= ఇచ్చును. అభామినిన్ = అకాంతను - అముక్త కేశిని, శ్రీమూర్తి గాఁగన్ = లక్ష్మీస్వరూపనుగా, పాటింపఁదగున్ = పరిగణించుట యుక్తమగును.

తే॥ అనుడు వేలుపుఁదాపసియాసుశీల
పుత్రులేచందమున మోక్షమునకుఁజనిరి?
ప్రియుతనందనుఁడెవ్వఁడేపగిదినతఁడు
నృహరికృపఁగాంచెననఁబల్కునీలగళుఁడు. 159

వ్యా :— అనుడున్ = అన్నయనంతరము; వేలుపుఁదాపసి = దేవర్షి - నారదుఁడు, అసుశీలపుత్రులు = అసుశీలయొక్క తనయులు, ఏచందమునన్ = ఏవిధముగా, మోక్షమునకున్ = ముక్తికి, చనిరి = అరిగిరి? ప్రియుతనందనుఁడు = ప్రియుతునియొక్క కుమారుఁడు, ఎవ్వఁడు = ఎవఁడు? (చూ 5 69 పద్యము) అతఁడు = అతఁడు -

158 ప :- 1 కేశ - ముద్రి (అ). ర: కేశి - అ, గౌ. 2 నాఁగ-శా: గాఁగ ర,అ.
3 బాలింప — ప; బాటింప — ర, అ, గౌ.

ఆపత్రియుతనందనుఁడు, ఏపగిదిన్ = ఏవిధముగా, నృహరి = నరసింహ స్వామియొక్క, కృపన్ = దయను, కాంచెన్ = పొందెను? అనన్ = అనఁగా, నీలగళుఁడు = శివుఁడు, పల్కెన్ = (ఇట్లు) వచించెను.

వ్యాక :— పుత్రి - ఏకత కారకమునుగలదు. చూ 1-9 వ్యాఖ్య.

పల్కెన్ - భూతమునలాట్టు - బా. క్రియా 22

తాపసి - తాపసశబ్దముసంస్కృతసమము. (ము. కౌ.)

## సుశీల పుత్రుల కథ

క॥ మునివర! వినుమత్యద్భుత
జనకచరితయైన జననిచనినపిదపఁద
త్తనయులు మురభిత్పద 1 ద
త్తనయులుగురువాక్యకరణతత్పర 2 బుద్ధిన్, **160**

వ్యా :— మునివర = ఓమౌనిశ్రేష్ఠా - ఓనారదా! వినుము = ఆకర్ణింపుము. అత్యద్భుత = మిక్కిలియాశ్చర్యమును, జనక = కలిగించు, చరిత = నడవడిగలది, ఐన = అయినట్టి, జనని = తల్లి-సుశీల, చనినపిదపన్ = మరణించినపిమ్మట, మురభిత్ = మురభేదియొక్క-కృష్ణునియొక్క (విట్ఠలునియొక్క - అనుట) పద = పాదముల చేత, దత్త = ఈయఁబడిన, నయులు = ఊఱటగలవారగు, (భగవత్పదారాధనచే మాతృవియోగజనితతాపము తీఱియూఱటపొందినవార

160 ప :- 1 వత్తన - డ, ద, బ; దత్తన - ర, అ. 2 బుద్ధుల్ - గౌ; బుద్ధిన్ - ర, అ.

నుట) తత్ = ఆమెయొక్క - అనుశీలయొక్క, తనయులు = కుమారులు, గురు = తల్లియొక్క, వాక్యకరణ = వచనము నెఱవేర్చుట యందు, తత్పర = ఆసక్తమయిన, బుద్ధిన్ = మతితో, (మీఁది పద్యముతోనన్వయము)

శా॥ భైమీతీర్థనివాసు, రాసకుశలున్, బద్మేక్షణున్, యాదవ
స్వామిన్, సామజవత్సలుంగొలిచి, యైశ్వర్యంబునంబొల్చి, వా
రామీఁదన్ సకళత్రపుత్రముగ 1 దివ్యన్మూర్తులైతత్తనూ
గ్రామంబెక్కిరి నావుడున్ మఱియునాబ్రహ్మర్షిపల్కన్ శివున్.

**161**

వ్యా :— భైమీతీర్థనివాసున్ = భైమీతీర్థమువాసస్థానము గాఁగలవాఁడును, రాసకుశలున్ = రాసక్రీడయందు నేర్పరియు, పద్మేక్షణున్ = కమలములవంటి కన్నులుగలవాఁడును, సామజవత్సలున్ = గజేంద్రునియందు వాత్సల్యముగలవాఁడును, అగు, యాదవస్వామిన్= యాదవనాథుని - కృష్ణుని (విఠ్ఠలుననుట) కొలిచి = సేవించి, సకళత్ర పుత్రముగన్ = భార్యాసుతసహితముగా, ఐశ్వర్యంబునన్ = సంపదతో, పొల్చి = వర్తించి, అమీఁదన్ = అటుపిమ్మట, దివ్యన్మూర్తులై = ప్రకాశించుచున్న యాకృతులుగలవారయి, వారు = వారలు - అనుశీల పుత్రులును, తత్ = వారియొక్క, తనూ = కాంతలయొక్క-అనఁగా, భార్యలయొక్క, గ్రామంబు = సమూహము, (శబ్దాదిపూర్వోబృందేపి గ్రామః - అమ) ఎక్కిరి = అధిరోహించిరి - మోక్షపదవి నధిరోహించిరి నావుడున్ = అన్నయనంతరము, మఱియున్ = వెండియు, అబ్రహ్మర్షి అబ్రహ్మఋషి - అనారదుఁడు, శివున్ = ఈశ్వరునిగూర్చి, పల్కన్= ఇట్లు వచించెను.

---

161 ప :- 1 దీప్యత - ర; దీవ్యత్ - అ, గా.

తనూ - "తనుః = స్త్రీ - ఇతిరాజనిర్ఘంటుః" శబ్దక. తనుశబ్ద పర్యాయమగుటచేఁదనూశబ్దమునుస్త్రీవాచకమగును ప్రయోగాంతరము

"కొనిపోయెనాత్మీయతనువు మగుడ" (రాఘవ 3-120)

"ఆత్మీయతనువున్ = నిజస్త్రీని. 'బహ్వాదిభ్యశ్చ' అను సూత్రమున జీప్పువికల్పము గనుకఁదన్వియన్నట్టు తనుశబ్దమును స్త్రీవాచకముగాఁబ్రయోగించినాఁడు. ఇందుకుఁబ్రయోగమునలోదయమందు -

"తనుచ్ఛటోత్తమాలయా, తయాభవోత్తమాలయా

అహోనిశీతమాలయా, నిలావధుతమాలయా"

అనుశ్లోకమునందుఁదనుచ్ఛటాశబ్దము స్త్రీసమూహమని వ్యాఖ్యానమందుఁజెప్పఁబడినది," (రాఘవ 3-120 టీక - భారతార్థమున.)

వ్యాక :- సకళత్రపుత్రముగ, ఐశ్వర్యంబునంబొల్చి, అమ్మీఁదన్, దివ్యమూర్తులై, వారు, తత్తనూగాత్రమంబెక్కిరి - అనియన్వయము. (బా. కారక 37)

పుత్ర - ఏకత కారకమునుగలదు. చూ - 1-9 వ్యాఖ్య.

ఉ॥ హాళిమనంబునంబెరుఁగనాలయిబిడ్డయిబంటుఁబైదయై
మూలధనార్జనంబునిలుమూంగిలియై, గళదష్పుదర్పతన్
1 వాలెడువారికెట్టులపవర్గముభర్గ! ముకుందుఁడిచ్చె? నిం
కేలకళానమేలజడలేల 2 కమండలువేలదండమున్. 162

వ్యా :— భర్గ = ఓశంకరా! హాళి = ఆసక్తి, మనంబునన్ = హృదయమునందు, పెరుఁగన్ = వర్ధిల్లఁగా, అలయి = భార్యకలిగి,

---

162 ప :- 1 వాలిన - ముద్రి ర, అ. వాలెడు - అ, గౌ. 2 కమండల-చః కమండలువేల - ర, అ.

బిడ్డయి = సంతానముకలిగి, బంటుఁబైదయై = బాలుఁడయినభృత్యుఁడు గలిగి, మూలధనార్జనంబునిలుముంగిలియై = మూలద్రవ్యార్జనమును గృహాంగణముఁనుగలిగి, గళదఘ్న = కుత్తుకబంటియయిన, దర్పతన్= గరువతనము తో, వాలెడువారికిన్ = విఱ్ఱవీఁగువారికి, ముకుందుఁడు = కృష్ణుఁడు - విఠ్ఠలుఁడు, ఎట్టులు = ఏప్రకారముగా, అపవర్గము = మోక్షము, ఇచ్చెన్ = ఒసఁగెను? ఇంకన్ = ఇట్లు జరిగినమీఁదట; కళాసము=చర్మము, ఏల=ఎందులకు? జడలు=జటలు, ఏల=ఎందులకు కమండలువు=జలకుండిక,దండమున్=త్రిదండమును, ఏల =ఎందులకు?

గృహస్థులకే విఠ్ఠలుఁడు మోక్షమిచ్చినచోఁ జర్మము, జడలు, కమండలువు, త్రిదండముదాల్పనేల? అనఁగా సన్న్యసించుట యనావశ్యకముగదా! యనుట.

పాఠ :— కమండలము - చప్రతిపాఠము. ఇట్టి పాఠములితరత్రగలవు. [ఉ. హ. 4-71] ఇవి లేఖకప్రమాదములు.

కమండలంబు - హంస 5-12. ఇది భ్రాంతిమూలకము,

క॥ వారలయిగాక కారణ
పూరుషులై యట్టి సతికిఁబుట్టు 1 టనో ! తుదిన్
జేరిరిగృహస్థులయ్యును
సారసదళనయనుమేని సాయు 2 జ్యంబున్. **163**

వ్యా :— అటుగాక = అట్లుకాకుండ, వారలు = వారు - అనుశీలపుత్రులు, కారణపూరుషులై = పూర్వజన్మకర్మము హేతువులుగానయిన పురుషజన్మములనెత్తినవారయి, అట్టిసతికిన్ = అటువంటి పతివ్రతకు - అనుశీలవంటి పతివ్రతకు, పుట్టుటనో = జన్మించుట

163 ప :- 1 టను - గౌ; టనొ - ర, అ. 2 జ్యంటుల్ - గౌ; జ్యంబున్-ర,అ.

చేతనో, గృహస్థులయున్= గృహస్థాశ్రమమునాశ్రయించినవారయినను సారసదళనయను = పద్మాదళాక్షునియొక్క - విట్ఠలునియొక్క, మేని సాయుజ్యంబున్ = దేహైక్యమును, చేరిరి = ప్రాపించిరి.

కాకి, హంస, చిలుక, పాము, తేనెటీఁగయనునవి సుశీల పుత్రిల పూర్వజన్మములు. అపూర్వజన్మములలో నతర్కితముగా వానికి విట్ఠలుని సేవించిన పుణ్యము ప్రాప్తించి సుశీలపుత్రిలుగాఁ బుట్టుటజరిగినది. కావునఁగారణపురుషులనుట.

వ॥ అనిన 1 నగిజగదీశ్వరుండు సుర 2 మునీశ్వరునితో వెండియు నిట్లనియె. 164

వ్యా :— అనినన్ = అనఁగా, నగి = నవ్వి, జగదీశ్వరుండు = లోకనాథుఁడు - సురమునీశ్వరునితోన్ = దేవతామౌనిపతితో - నారదునితో, వెండియున్ = మఱియును, ఇట్లు = ఈప్రకారముగా, అనియెన్ = పలికెను.

ఉ॥ హారివిచార! నీవనినయట్లపురాకృతపుణ్య సంపదన్
వారలకావహిల్లె మునివల్లభదుర్లమయ్యునయ్యమ
ర్త్యారివిదారిమేనఁగలయంగల 1 పూనిక, వారయేల? యె
వ్వారుగృహస్థధర్మవశవర్తులువారలసౌమ్యముక్తియున్. 165

వ్యా :— హారివిచార = ఒప్పిదమయినయాలోచనగలవాఁడా! నీవనినయట్ల = నీవన్నట్లే, వారలకున్ = వారికి - అసుశీలపుత్రిలకు, పురాకృత = పూర్వముచేయఁబడిన - పూర్వజన్మమునజేయఁబడిన,

164 ప :- 1 నాజగ-డ, ద, బ; నగిజగ - ర, అ. 2 మునితో = గ; మునీశ్వరునితో - అ; మునీశ్వరుతో - గౌ.

165 ప :- 1 పూనికి - గౌ; పూనిక - అ.

పుణ్య = సుకృతముయొక్క, సంపదన్ = సంపత్తిచేత, మునివల్లభ దుర్లభము = మునీశ్వరులచేతను బొందరానిది, అయ్యున్ = అయినను. అత్యమర్త్యారి = అదేవతావిరోధుల యొక్క - అదైత్యులయొక్క, విదారి = హంతయొక్క - అదైత్యాంతకునియొక్క (హరియొక్క), మేనన్ = శరీరమునందు, కలయంగలపూనిక = ఏకీభవించుటకర్తవ్య మయినదీక్ష (అహరితోసాయుజ్యరూపమోక్షమువందుదీక్ష - అనుట) ఆవహిల్లెన్ = కలిగెను. వారయేల = వారేయెందులకు? ఎవ్వారు = ఎవరు; గృహస్థధర్మ = గృహస్థాశ్రమమునాశ్రయించువారియొక్క ధర్మమునకు, (గార్హస్త్యధర్మమునకు) వశవర్తులు = అధీనులో; ముక్తి యున్ = మోక్షమును, వారలసొమ్ము = వారియొక్క యధీనము నందున్న వస్తువు.

వ్యాక :— వశవర్తులు = వశవర్తులో. ఓ - అధ్యాహార్యము.

పౌ్రి. వాక్య. 13

సీ॥ 1 పరిణీతయగునింతి ప్రతికూలకాదేని
తనయుండు తనయాజ్ఞ దాఁటఁడేని
నిజసహోదరులు వినీతులై 2 మనిరేని
కోడలోరుపుదక్కి గొణఁగదేని
కూఁతు 3 రీలువునందుఁగొదవచూపదయేని
ఋణమనుపాతకం 4 బెనయదేని
తేజోగరిమపరాధీనతఁజెడదేని
నిందాంధకారంబు 5 నెరయదేని

---

166 ప:- 1 పరిణత - క, చ. త డ. ద, బ, గౌ; పరిణీత - ర, అ. ర (పా)
2 చని - క. త; మని - ర, అ. 3 రిలువడియందు - క; రీలువ యందు - గౌ, రీలువునందు - ర, అ. 4 బెనఁగ - క, చ. త; బెనయ - ర, అ. 5 నెఱయ - ర; నెరయ - అ, నెనయ - గౌ.

తే॥ న్యాయమున మొల్లముల పెల్లుడాయునేని
యతిథిసంతర్పణంబింటనమరునేని
సముచితాచార 6 ములుగొన 7 సాగునేని
కలదె? గృహమేధి 8 ధర్మంబుకంటె మేలు. 166

వ్యా :— పరిణీత = వివాహమాడినది, అగు = అయిన, (పెండ్లాడిన) ఇంతి = కాంత - (ధర్మపత్ని - అనుట) ప్రతికూల = విపరీతాచరణముగలది, కాదేని = కానిపక్షమున, తనయుండు = కుమారుఁడు, తన = తనయొక్క, ఆజ్ఞన్ = అనతిని, దాఁటఁడేని = ఉల్లంఘించినవాఁడుకానిపక్షమున, నిజ = స్వకీయులయిన, సహోదరులు = తోఁబుట్టువులు, వినీతులై = అడఁకువగలవారయి, మనిరేని = నడచుకొనువారయినపక్షమున, కోడలు=స్నుష, ఓరుపుదక్క=సహనము విడిచి, గొణఁగఁదేని = గొణుఁగునది కానిపక్షమున. (ఎదుటివారికివినబడకుండనోటిలోమాటలనుచ్చరించునదికానిపక్షమున) కూఁతురు= కుమార్తె ఈలువునందున్= సత్ప్రవర్తనమునందు, కొదవచూపదిదయేని= కొఱతకనబఱచునదికానిపక్షమున ఋణం= అప్పు, అను = అనెడు. పాతకంబు= పాపము, ఎనయ దేని = ప్రాపించునదికానిపక్షమున, పరాధీనతన్ = అస్వతంత్రతచేత, తేజః = అవమానాసహిష్ణుతయొక్క, (తేజస్ = అధిక్షేపాపమానాదేః ప్రయుక్తస్యపరేణయత్, ప్రాణాత్యయేఽప్యసహనంతత్తేజః సముదాహృత, మిత్యుక్తేఅపమానాదేరసహనే - శబ్దస్తో) గరిమ = ఆధిక్యము, చెడదేని = నశించునదికానిపక్షమున (నశింపనిపక్షమున) నిందా = అపవాదమనెడు, అంధకారంబు = చీకటి, నెరయదేని = ముసురుకొనునదికానిపక్షమున (వ్యాపింపనిపక్షమున) న్యాయమునన్ = ధర్మముతో, (ధర్మావిరుద్ధముగా - అనుట) మొల్లముల పెల్లు =

---

6 ములుగొన - గౌ; మునుగొన - ర, అ. 7 సాగె - గ; సాఁగు-అ. సాగు - ర, గౌ. 8 కర్మం - ప; ధర్మం - ర, అ, గౌ.

ధనములయొక్కయాధిక్యము, (అధికధనములు - అనుట) డాయునేని= ప్రాప్తించుపక్షమున, అతిథిసంతర్పణంబు= భోజనాపేక్షతోవచ్చినయాగంతకులను సంతృప్తినొందించుట, ఇంటన్ = గృహమునందు, అమరునేని = ఒప్పుపక్షమున, సముచిత = యోగ్యములయిన, ఆచారములు = పరంపరగావచ్చువాడుకలు, కొనసాగునేని = అవిచ్ఛిన్నముగాఁ ప్రవర్తిల్లుపక్షమున, గృహమేధిధర్మంబుకంటెన్ = గృహస్థధర్మముకంటె మేలు = శ్రేష్ఠమయినది, కలదె? = ఉన్నదా? లేదనుట.

అతిథి - చూ. 3.24 వ్యాఖ్య.

వ్యు :— కోడలు - ఇంటిలోఁగ్రొత్తగావచ్చిచేరినస్త్రీ. కొలు = నూతనము. కొడుమ్ - క. అలు = స్త్రీ. కొడుకు + అలు - అను 'శ ర' సరికాదు. క్రొత్తభార్యయను వ్యుత్పత్తియుసరికాదు. కూఁతురు - కూన + తు = కూంతు + రు = కూంతురు; కూఁతురు.

## అయుతనియుతోపాఖ్యానము

క॥ ఏనోహారమొక్కయుపా
ఖ్యానముఁగలదేతదర్థమడియును 1 వినినన్
మౌనివర! నీమనంబున
నూనినజడనుడుగుననుచుమ్రుగుఁడుపలుకున్. 167

వ్యా :— ఏనః = పాపములను, (ఏనోఘమ్ - అమ) హారము = హరించునదియగు, ఒక్క = ఒక, ఉపాఖ్యానము =

---

167 ప :- 1 వినియున్ - గౌ; వినినన్- ర, అ.

(ప్రధానకథలోవచ్చెడు) అవాంతరకథ, ఏతదర్థము = దీనినిమిత్తము-గృహస్థధర్మవశవర్తులు మోక్షముపొందుదురనువిషయమును నిరూపించుట కొఱకు, కలదు = ఉన్నది. అదియును వినినన్ = దానినిగూడవిన్నచో, మౌనివర = ఓమునిశ్రేష్ఠా - ఓనారదా ! నీమనంబునన్ = నీహృదయమునందు, ఊనిన = కలిగిన, జడను = సందేహము, ఉడుగున్ = తీఱును, అనుచున్ = అని, ఉగ్రుఁడు = ఈశ్వరుఁడు, పలుకున్ = (ఇట్లు) వచించెను.

తే॥ వింధ్యమమరాద్రి 1 మాఁడికికివివిధతార
2 కములుమొలపూసలుగఁబెరుఁగమదిఁదలఁచె
నెన్నఁ, డటు 3 మున్నుకాశిలోనన్నుఁగొలిచి
ఘటజమగుతేజమింపొందునుటజమునను. 168

వ్యా :— వింధ్యము = వింధ్యపర్వతము, అమరాద్రి = వేల్పుఁగొండయొక్క - మేరుపర్వతముయొక్క, మాఁడికిన్ = పోలికకు, (మేరుపర్వతముతోసాటియగుటకు) వివిధతారకములు = నానానక్షత్రములు, మొలపూసలుగన్ = మొలత్రాటియందుఁగట్టెడు పూసలుగా, ఎన్నఁడు = ఏనాఁడు, పెరుఁగన్ = ఎత్తునందు వర్ధిల్లుటకు, మదిన్ = మనస్సున, తలఁచెన్ = ఉద్దేశించెనో, అటమున్ను = అంతకుఁబూర్వము (వింధ్యపర్వతము పెరిఁగియాకాశమునకవరోధము కల్పింపక పూర్వమనుట) కాశిలోన్ = వారణాసిలో, నన్నున్ = నన్ను (శివుఁడు-వక్త) కొలిచి = సేవించి, ఘటజమగుతేజము = కుండయందుఁగలిగిన తేజస్సు - కుంభసంభవుఁడు (అగస్త్యుఁడు) ఉటజమునను = పర్ణశాలయందు, (మునీనాంతుపర్ణశాలోటజః-అమ) ఇంపొందున్=ఒప్పును.

---

168 ప :- 1 పోటికి — ర; మాద్రికి - అ, గొ. 2 కలుమొలపూసలుబెరుగ కలదలంచె-త; కములుమొలపూసలుఁగఁబెరుగమదిదలఁచె-ర, అ. 3 మున్న - గొ: మున్ను — ర, అ

అగస్త్యుఁడు కాశియందుండగా వింధ్యపర్వతము విజృంభించెను. వింధ్యపర్వత విజృంభణమున ణంచుటకు దేవతల ప్రార్థనపైనగస్త్యుఁడు కాశినుండి దక్షిణమునకు వచ్చెననుట భారతాదిప్రసిద్ధము.

వ్యాక :— తలఁచెన్ = తలఁచెనో. ఓ - అధ్యాహార్యము, [ప్రౌ. వాక్య. 13]

అలం :— రూపకము.

వ॥ అస్తంభ 1 తపోనుభావ విజృంభితుండగు నకుంభసంభవునకు నజస్రశుశ్రూషావికస్వర హృదయంబగు శిష్యసహస్రంబుగల దందుఁబ్రయుతుండను మునితనయులయుతనియుతులను వారల ప్పారికాంక్షికిం 2 బ్రేమా 3 స్పదంబులయియుండి 4 రొక్కకాలం బుననమ్మునిలోకపాకశాసనుండు నిజాంతర్గతంబుననిట్లనివితర్కించు 169

వ్యా :— అస్తంభ = స్తంభించుటలేని - అంతరాయములేని, తపః = తపస్సుయొక్క, అనుభావ = ప్రభావముచేత, విజృంభితుండగు = అతిశయించినవాఁడగు, అకుంభసంభవునకున్ = అఘటజన్మునకు - అయగస్త్యునకు, అజస్రశుశ్రూషా = నిత్యపరిచర్యచేత, వికస్వర = వికసించిన, హృదయంబగు = మనస్సుగలదియగు, శిష్యసహస్రంబు = ఛాత్రులయొక్క వేయి, (వేయిమంది శిష్యులనుట) కలదు = ఉన్నది. అందున్ = దానియందు - అశిష్యసహస్రమునందు, ప్రయుతుండను = ప్రయుతుఁడనెడు. ముని = మౌనియొక్క, తనయులు = కుమారులు, అయుతనియుతులనువారలు = అయుతుఁడును

---

169 ప :- 1 తపోధనభా - డ, ద, బ; తపోనుభా - ర, అ. 2 బ్రియా-గౌ, బ్రేమా-ర, అ. 3 స్పదులయి - డ, ద, బ; స్పదంబులయి- ర,అ. 4 రంతనొక్క - ర; రొక్క - అ.

నియుతుఁడుననువారు, అప్పారికాంక్షికిన్ = ఆతపస్వికి - అయుగస్యునకు (తపస్వీతాపసఃపారికాంక్షీ - అమ) ప్రేమ = అనురాగమునకు-వాత్స ల్యమునకు, ఆస్పదంబులయి = స్థానములయి, ఉండిరి = ఉన్నవారైరి. ఒక్కకాలంబునన్ = ఒకానొకసమయమున, అమ్మునిలోకపాకశాస నుండు = ఆమౌనిజనమహేంద్రుఁడు, నిజ = తనదయిన, అంతర్గతం బునన్ = హృదయములోపల, ఇట్లని = ఈప్రకారముగా, వితర్కించున్ = పర్యాలోచించెను.

ఇట్లని - 'అని' వాక్యాలంకారము.

పాఠ :— ప్రేమాస్పదులనియునుండవచ్చును. "అవివేకా స్పదులైన పాండవులు - సభా 2-63

శా॥ ఈనాశిష్యులలోన 1 వీరిరువురున్ హృద్యానవద్యోదయ
జ్ఞానానూనవిచారవాగ్విభవతేజః 2 క్షాంతికాంతిప్రథా
సానాథ్యంబునఁ 3 గానుపించెదరు; 4 మత్సక్తాశయుల్; వీరి స
న్మానింపందగుఁబాణిపీడనవిధానశ్రీలవాలాయమున్. **170**

వ్యా :— ఈనాశిష్యులలోనన్ = ఈనాఛాత్రులమధ్యమున, వీరుఇరువురున్ = వీరిద్దఱును, (ఈయయుతనియుతులిద్దఱును-అనుట) హృద్య = మనోహరమును, అనవద్య = అనింద్యమును, అగు, ఉదయ = ఉత్పత్తిగల, జ్ఞాన = మోక్షబుద్ధిచేత, (మోక్షేధీర్ జ్ఞానమ్-అమ) అనూన = అధికమయిన, విచార = ఆలోచనగల, వాగ్విభవ = వచస్సంపదయొక్కయు, తేజః = తేజస్సుయొక్కయు, క్షాంతి =

---

170 పః- 1 వారి – గౌ, వీరి - ర, అ. 2 క్షాంతి – ముద్రి (అ). ర, గౌ. కాంతి - అ. 3 గానుపించెదరు - ర, ఆ; గానుపించెదరు- అ, గౌ. 4 మత్సక్తాంశముల్ - క; మత్సక్తాశయుల్ - ర, అ.

సహనముయొక్కయు, శాంతి = శమముయొక్కయు, (అంతరింద్రియ నిగ్రహముయొక్కయు) ప్రథా = ప్రఖ్యాతియొక్కయు, సానాథ్యంబునన్ = సనాథత్వముతో, (పరిపూర్ణతతో) కానుపించెదరు = కనంబడుదురు. మత్ = నాయందు, సక్త = ఆసక్తమయిన, ఆశయుల్= మనస్సులుగలవారు, (ఆశయ = చిత్తే - శబ్దస్తో) వీరిన్ = వీరలను, పాణిపీడన = వివాహములయొక్క (పరిణయోద్వాహోపయమాః పాణిపీడనమ్ - అమ) విధాన = ఏర్పాటులయొక్క, శ్రీలన్ = శోభల చేత, వాలాయమున్ = అవశ్యము, సన్మానింపన్ = బాగుగా సత్కరించుట, తగున్ = యుక్తమగును.

మానశబ్దమునకు సమ్మానమనునర్థముగలదు. "మాన = సమ్మానేచ" [శబ్దస్తో] సత్ + మాన = సన్మాన. నకారము సంయుక్తాక్షర యతినందినది. ప్రయోగాంతరము - కాశీ 7-53

శా॥ వాసోనిగ్రహమెన్నరాఁకలియునీర్వట్టున్ 1 గణింపర్, తలల్
మాసెంగాయన, రంగముల్ 2 బడలినంబాటింప, రట్లుండనీ!
యాసాయంబుగ, నానిశాత్యయముగా, నామ్నాయముల్ 3 గ్రోల్చుచో
నాసీనప్రచలాయితంబయినలేదాహా! వితర్కింపఁగన్. **171**

వ్యా :— వాసః = వస్త్రములయొక్క, నిగ్రహము = ఇబ్బందిని, [కట్టుకొనుటకు వస్త్రములులేకపోవుటను] ఎన్నరు = లెక్కపెట్టరు, ఆఁకలియున్ = క్షుత్తును, నీర్వట్టున్ = దప్పియు, గణింపర్ = పాటింపరు, తలల్ = శిరస్సులు - శిరోజములు, మాసెంగాయనరు = మలినమయినవిగదాయనితలంపరు, అంగముల్ = శరీరములు, బడలినన్ = అలసినను, పాటింపరు = సరకుచేయరు. అట్లుండనీ = అవిష

---

171 పః- 1 గణింపన్ - గొ; గణింపర్ - ర, అ. 2 బడలినన్ - ర, అ. (యతిభంగము) 3 గొల్చచో-అ. గ్రోల్చుచో-గొ; గొల్చుచున్-ర(పా)

యములట్లుండనిమ్ము. ఆసాయంబుగన్ = సాయంతనము మొదలుగా, ఆనిశాఅత్యయముగన్ = ఉషఃకాలము మొదలుగా, [అత్యయ = అతిక్రమే - శబ్దస్తో నిశాంతమ్ = ఉషా - శబ్దక] ఆమ్నాయముల్ = వేదములు, శ్రుతి స్త్రీ వేదఆమ్నాయస్త్రయీ - అమ కోశ్రల్చుచోన్ = అభ్యసించునప్పుడు, ఆహా = బళీ! వితర్కింపంగన్ = పర్యాలోచింపంగా ఆసీనప్రచలాయితంబు = కూర్చుండికునికిపాటుపడుట, (ఆసీనప్రచలాయితమ్ - ఆసీనేన ఉపవిష్టేన ప్రచలవదాచరితమ్, ఉపవిశ్యనిద్రావశేనదోలనమ్ - ఇతిరాజవల్లభః - శబ్దక) అయినన్ = అయినప్పటికి, లేదు = కలుగదు.

సాయము - అవ్యయము (ప్రయోగాంతరము - శృ. శా 3-84 ము కౌ)

వ్యాక :— ఉండనీ = ఉండనిమ్ము - ప్రౌ. క్రియా 10

ఆసాయము, ఆనిశాత్యయము-"అజ్మర్యాదాభివిధ్యోః" పాణి

క॥ పిరలకుఁదగిన మగువల
ధారుణి బొరయంగ 1 నేర, ధాతృతనయలు
న్నారఁట, సకరగ్రహణలు
గారఁట, కొనివత్తువారిఁగమలజుచేతన్. **172**

వ్యా :— పిరకున్ = పిరికి - ఈయయుతనియుతులకుఁ తగిన = అనురూపలయిన, మగువలన్ = కాంతలను - కన్యలను; ధారుణిన్ = భూమియందు, పొరయంగనేరన్ = పడయఁజాలను. ధాతృ = బ్రహ్మయొక్క, తనయలు = కొమార్తెలు, ఉన్నారఁట = కలరఁట. సకరగ్రహణలు = పాణిగ్రహణముతోఁ వివాహముతో గూడుకొన్నవారు - వివాహితలు, కారఁట = కానివారఁట, వారిన్ = వారలను, కమలజుచేతన్ = బ్రహ్మచేత, కొనివత్తున్ = తీసుకొనివత్తును

ధారుణి - 5-47 వ్యాఖ్య.

---

172 ప :- 1 లేర - డ, ద, బ, గౌ; లేరు - ర; నేర - అ.

వ॥ అనినిశ్చయించి యాసత్యవ్రతుండు సత్యలోకంబునకరిగి. 173

వ్యా ;— అని = ఈప్రకారముగా, నిశ్చయించి = నిర్ణయించి. ఆసత్యవ్రతుండు = ఆసత్యపాలనము వ్రతముగాఁగలవాఁడు- సత్యలోకంబునకున్ = బ్రహ్మలోకమునకు, అరిగి = చని. మీఁది పద్యముతో నన్వయము

బ్రహ్మలోకమును సత్యలోకమని యందురు - "షడ్గుణేనతపోలోకాత్సత్యలోకో విరాజతే --- బ్రహ్మలోకోహి సస్మృతః" [విష్ణు]

సీ॥ శశిరేఖఁగైకొన్న సౌవర్ణగిరివోలె
మినుకుఁజేడియఁగూడిమెఱయువాని
నను రేజ్యఁబాటించుహాటకాద్రియుఁబోలె
నంచచెంగటనుండనలరువాని
శారదాభ్రము 1 లంబుభూరిశైలముఁబోలెఁ
దెలుపుఁగైసేఁతలవెలయువానిఁ
గకుబిభంబుల 2 మీఁదకాంచనాగముఁబోలె
వెలి 3 తమ్మిగద్దియ 4 నెలయువానిఁ

తే॥ బొడవులన్నియుఁదన 5 యందపొడమువానిఁ
6 గడయునడుమును మొదలునేర్పడనివాని
సచ్చిదానందకందమై హెచ్చువాని
నలువఁజూశుకితపోధోథతెలచెనుతుల. 174

---

174 ప:- 1 లందు - క, త; లంటు – ర, అ. 2 మీఁద - డ, ద, బ; మీఁది - ర, అ, గౌ. 3 దమ్మి - ర. తమ్మి - అ. 4 వెలయు- ముద్రి (అ), ర; నెలయు - అ. 5 యండె – గౌ; యంద. ర, అ. 6 మొదలునడుమునుగడయు - ర (అ) – ప్రథమముద్రణము; కడయునడుమును మొదలునేర్పడనివాని. ర, గౌ. వాని, గడయు నడుమును మొదలునేర్పడనివాని - అ.

వ్యా :— శశిరేఖన్ = నెలవంకను, కైకొన్న = వహించిన, సౌవర్ణ = సువర్ణసంబంధమయిన, గిరివోలెన్ = కొండవలె - మేరు పర్వతమువలె. మిక్కుటజేడియన్ = వాక్కాంతను (సరస్వతిని) కూడి = కూడుకొని, మొఱయువానిన్ = ప్రకాశించువాఁడును.

[2] అసుర = దైత్యులయొక్క, ఇజ్యన్ = గురువును-శుక్రుని [ఇజ్యో - గురౌ - మే. ని.] పాటించు = వహించు - సామీప్యమునుబొందు [శుక్రనక్షత్రముదగ్గరగాఁగల- అనుట] హాటకఅద్రియుఁబోలెన్ = బంగారుకొండవలె - మేరుపర్వతమువలె, అంచ = హంస, చెంగటన్ = ప్రక్కభాగమునందు, ఉండన్ = వర్తిల్లఁగా, అలరువానిన్ = ఒప్పువాఁడును.

[3] శారద = శరత్కాలసంబంధములయిన, అభ్రములు = మేఘములు, అంటు = స్పృశించు, భూరిశైలముఁబోలెన్ = బంగారు కొండవలె - మేరుపర్వతమువలె, (స్వర్ణేపిభూరిచంద్రౌద్వౌ - అమ) తెలుపు = తెల్లనయిన, కైసేఁతలన్ = అలంకారములతో - మైపూఁతలతో, వెలయువానిన్ = ఒప్పువాఁడును.

[4] కకుబ్ = దిక్కులయొక్క, (దిశస్తుకకుభఃకాష్ఠా - అమ) ఇభంబుల = ఏనుఁగులయొక్క - దిగ్గజములయొక్క, మీఁది = ఉపరి భాగమునందలి, కాంచనఅగముఁబోలెన్ = బంగారుకొండవలె - మేరు పర్వతమువలె, వెలితమ్మిగద్దియన్ = పుండరీకాసనమునందు. ఎలయువానిన్ = ఉండువాఁడును.

పాడవులన్నియున్ = మహత్త్వములెల్లను, తనయంద = తనయందే. పాడమువానిన్ = ఆవిర్భవించువాఁడును, కడయున్ = అంతమును, నడుమును = మధ్యయు, మొదలున్ = ఆదియు, ఏర్పడనివానిన్ = స్పష్టపడనివాఁడును, సత్ = సత్యముయొక్కయు, చిత్ =

జ్ఞానముయొక్కయు, ఆనంద = సుఖముయొక్కయు, కందమై = మూలాధారమై, హెచ్చువానిన్ = అతిశయించువాఁడును, అగు, నలువన్= చతుర్ముఖుని [బ్రహ్మను] చుళుకిత = పుడిసిలిగల, పాథోధి = సముద్రముగలవాఁడు (పుడిసిటఁబట్టిన సముద్రజలముగలవాఁడు) - అగస్త్యుఁడు, నుతులన్=స్తోత్రములతో, తెలచెన్=ప్రసన్నతనొందెను.

వ్యాక :— సచ్చిదానంద - "సంశ్చాసౌచిచ్చాసావానందశ్చేతి - సచ్చిదానందః" (ముగ్ధ) ఇది త్రిపదకర్మధారయము.

బ్రహ్మ శరీరచ్ఛాయ పసుపు. సరస్వతి శరీరచ్ఛాయ తెలుపు చూ 1.5; 4 - వ్యాఖ్యలు. అగస్త్యుఁడు సముద్రపానము చేసినకథ భారత ప్రసిద్ధము.

కకుబిభంబులమీఁదకాంచనాగము - అష్టదిగ్గజములు భూమిని వహించుచున్నవనిపురాణోక్తి. కావున భూమిమీఁదిమేరువుగూడ నీయష్ట దిగ్గజములపైనున్నదే

బ్రహ్మ, సరస్వతి, హంస, ఖగోళదృశ్యములు చూ 1-3 వ్యాఖ్య

వ్యాక :— నలువన్ - అనువిశేష్యము ద్వితీయాంతమునఁ గలదు. కాన విశేషణములు ద్వితీయాంతములయ్యెను. బా. కారక 19

నలువ - నాలుగువాతులు వేనికిగలవోవాఁడు - బహువ్రీహి. బా. సమాస 2-2 అలం :— ఉపమ,

క॥ తెలచినమొలచిన కృపకుం
1 గలసిన 2 మదితోడనతనిఁగమలజుఁడగ్రె
3 స్థలినిలిపిపలుకుఁబలుపన
4 ధళధళలుముఖప్రఘూణ 5 తతుఁంబొలయన్ **175**

---

175 ప:- 1 గలసిన - గౌ; గలఁచిన - ర, అ 2 మతి - గౌ, మది- ర, అ. 3 స్థలిననిలిపిపలుకులపన - ముద్రి (అ), ర: స్థలినిలిపెఁబలుకు బలుఁబన-గౌ; స్థలినిలిపిపలుకుఁబలుపన - అ. 4 ధళధళముఖ-ర: ధళధళముఖర - గౌ; ధళధళలుముఖ — అ. 5 తలముల-ర, తతులన్ — అ.

వ్యా :— తెలచినన్ = (అగస్త్యుఁడు స్తోత్రములతో) ప్రసన్నత నొందింపఁగా, మొలచిన కృపకున్ = పొడమినదయతో, కలసిన = కూడుకొనిన, మదితోడన్ = మనస్సుతో, కమలజుఁడు = బ్రహ్మ, అతనిన్ = ఆతనిని - అగస్త్యుని, అగ్రిస్థలిన్ = ముందటిభాగమున, నిలిపి = కూర్చుండబెట్టి, పలుపస = దంతములకాంతియొక్క, ధళధళలు = తళతళమనుకాంతులు. ముఖ = నోళ్లనెడుద్వారముల యొక్క, (ముఖంతువదనేముఖ్యేతామేద్వారాభ్యుపాయయోః- వై.ని.) ప్రఘాణతతులన్ = బహిర్ద్వారముముందటనుండు నలుచదరపుఁజోటుల సమూహములయందు (ప్రఘాణప్రఘణాళిందబహిర్ద్వారప్రకోష్టకే - అమ) - తుదలయందు, పొలయన్ = వ్యాపింపఁగా, పలుకున్ = (ఇట్లు) వచించెను.

వ్యా :— కృపకున్ = కృపతో - పొ. కారక 13

సీ॥ హుంకారములులేవె? 1 యుపపురందర 2 హఠో
త్పాటనంబునకుఁబాల్పడవుగాక!
భూభ్రంగములులేవె? యాభీలవింధ్య గ
ర్వస్తంభనమునకు రావుగాక!
చుళుకాకృతులులేవె? జలరాశినిశ్శేష
3 చూషణక్రీడకుఁజొరవుగాక;
జాఠరాగ్నులులేవె? 4 జటితాపివాతాపి
తనుదాహమున 5 కెదుర్కొనవుగాక!

---

176 ప :- 1 యువ - అ. యుప - ర, గౌ. 2 హఠాత్పాతనం - క, చః హఠోత్పాద - గౌ; హఠోత్పాటనం - ర. అ. 3 శోషణ ముద్రి(అ) చూషణ - ర, అ, గౌ. 4 జపి — గౌ; జటి - ర, అ. 5 నెదు- డ, ధ, బ, ర; కెదు - అ, గౌ.

తే॥ నిష్ఠనీమాడ్కి లోకప్రతిష్ఠగుఱిచి
దుష్టనిగ్రహశిష్టసంతుష్టిహేతు
రోషభీషణరేఖా 6 నిరూఢగాఢ
లీలఁగ్రీడించు 7 ప్రోడలు లేరుగాక! **176**

వ్యా :— ఉపపురందర = ఇంద్రునికంటెఁ దక్కువయైన వానియొక్క - నహుషునియొక్క, హఠ = బలాత్కారముచేనైన, (బలాత్కారో హఠః - అమ) ఉత్పాటనంబునకున్ = ఉన్మూలమునకు; (ఇంద్రపదవినుండి నహుషునిబలవంతముగా భ్రష్టునిజేయుటకు -అనుట) పాల్పడవుగాక = సమర్థములుకావుతప్ప, హుంకారములు = హుంకరించుటలు, లేవె = లేవా? (ఉన్నవియనుట)

హుంకారములందఱును జేయఁగలరుగాని హుంకారముచేసి నహుషు నింద్రపదవినుండి భ్రష్టునిజేయుట యగస్త్యునకేచెల్లెననుట.

నహుషుఁడగస్త్యునిశాపముచే సర్పమయినకథ భారతప్రసిద్ధము. ఈ సర్పాకారఖగోళదృశ్యమును లాటిన్ భాషలో హైడ్రా యని యందురు, (స. వి.)

ఉపపురందర = పురందరాత్ హీనః పురందరుని (ఇంద్రుని) కంటెఁదక్కువవాఁడు - నహుషుఁడు, ఇంద్రుడు శతమఖుఁడు. నహుషుఁ డన్ననో యేకోనశతమఖముల (99) కర్త. కాన నింద్రునికంటెనూన్యుఁడు.

"హీనేఽనూపోపమతావిహ - శక్రాదయ ఉపాచ్యుతమ్" (ము: గ్ధ. కారక 286) = "అచ్యుతముప, అచ్యుతాద్దీనాః శక్రాదయః" (శ్రీరా)

---

6 నిగూఢ - అ (యతిభంగము) నిరూఢ - ర. గౌ.
7 ప్రోడలె - గౌ; ప్రోడలు — ర, అ.

(2) అభీల = భయంకరమయిన. వింధ్య = వింధ్యపర్వతము యొక్క, గర్వ = దర్పముయొక్క, స్తంభనమునకున్ = స్తంభింపఁ జేయుటకు (నిరోధించుటకు) రావుగాక = సమర్థములు కావుతప్ప, భ్రూభంగములు = బొమముడులు, లేవె = లేవా? (ఉన్నవనుట)

అందఱును బొమలుముడువఁగలరుగాని బొమలుముడిచి వింధ్య పర్వతగర్వమును నిరోధించుట, యొక్క యగస్త్యునకే చెల్లుననుట.

అగస్త్యుఁడు వింధ్యపర్వతమును స్తంభింప జేసిన కథ భారతాది ప్రసిద్ధము.

(3) జలరాశి = సముద్రముయొక్క, నిశ్శేష = మిగులులేని చూషణక్రీడకున్ =(జల) పానకేళికి, చొరవుగాక = సిద్ధపడవుతప్ప, చుళుక = పుడిసిళ్ళయొక్క, ఆకృతులు = రూపములు, లేవె = లేవా ? (ఉన్నవనుట)

అందఱును బుడిసిలిపట్టఁగలరుగాని సముద్రజలమునెల్ల నిశ్శేష ముగాఁబుడిసిటఁబట్టుట, యొక్క యగస్త్యునకే చెల్లెననుట.

అగస్త్యుఁడు సముద్రోదకమును పానముచేసిన వృత్తాంతము భారత ప్రసిద్ధము.

(4) జటి = మునులకు, తాపి = తాపముకలిగించువాఁడగు, వాతాపి = వాతాపియనుదైత్యునియొక్క, తనుదాహమునకున్ = శరీరముయొక్క కాల్చుటకు - శరీరమును జీర్ణముచేసికొనుటకు, ఎదు ర్కొనవుగాక = మార్కొనవుతప్ప, జఠరాగ్నులు = జఠరసంబంధ మయినయనలములు, (గర్భగతములగు నాహారపదార్థములను బచనము చేయునలములు) లేవె = లేవా? (ఉన్నవనుట)

అందఱకును జరరాగ్నులుగలవుగాని వాతాపిని జఠరాగ్నిచే జీర్ణముచేసికొనుట, యొక్కయగస్త్యునకే చెల్లెననుట. ఇది భారత ప్రసిద్ధకథ.

నిష్ఠన్ = పూనికతో, నీమాడ్కిన్ = నీవలె, లోక = జగత్తు యొక్క, ప్రతిష్ఠగుఱిచి = సుస్థితికొఱకు, దుష్టనిగ్రహ = చెడ్డవారిని దండించుటకును, శిష్ట = సన్మార్గులయొక్క, సంతుష్టి = సంతృప్తికిని హేతు = కారణమయిన, రోష = క్రోధముయొక్క, భీషణరేఖా = భయంకరమయిన పరిపూర్ణతచేత, నిరూఢ = మిక్కిలిప్రసిద్ధికెక్కిన, గాఢ = అతిశయమయిన, లీలన్ = విలాసముచేత, క్రీడించు = విహరించు, ప్రోడలు = ప్రగల్భులు, లేరుగాక = నిశ్చయముగాలేరు.

అగస్త్యునివలె లోకముల సుస్థితికి, దుష్టశిక్షకు, శిష్టసంతుష్టికి హేతువుగాఁబ్రసిద్ధికెక్కిన కోపలీలతో విహరించు ప్రగల్భులు నిశ్చయముగాలేరనుట

ఈ పద్యము "శరవేగములులేవె? చలయంత్రపాటీన, పాటన క్రియకునేర్పడవుగాక" (నరప 4 ౹ 3) అను పద్యమున కనుస్మృతి. పాండురంగమాహాత్మ్యపద్యము ప్రశస్తికెక్కినది.

తే॥ భువనసంభవదుపసర్గనివహశాంతి
త్వన్ముఖంబునఁజనబెద్దతనముతోడ
నిందుధరుఁడన, హరియన, నేనసంగఁ
బ్రోవుగంటిమి, మిత్రావరుణకుమార! 177

వ్యా :— మిత్రావరుణకుమార = మిత్రావరుణనందనా - ఓయగస్త్యా! భువన = లోకమునందు, సంభవత్ = పుట్టుచున్న, ఉపసర్గ = ఉపద్రవములయొక్క, (ఉపసర్గఃపుమాన్ రోగభేదోపప్లవ

యోరపి-మే.ని.) నివహ = సమూహముయొక్క, శాంతి = శమించుట తన్ముఖంబునన్ = నీమీఁదుగా. [నీమూలమున - అనుట] చనన్= సంఘటిల్లఁగా, పెద్దతనముతోడన్ = పెద్దఱికముతో, ఇందుధరుఁడనన్ = ఈశ్వరుఁడనఁగా, హరియనన్ = విష్ణువనఁగా, ఏననంగన్ = నేననఁగా, (వక్త - బ్రహ్మ) ప్రోపుగంటిమి = రక్షణపొందితిమి - కృతకృత్యులమైతిమి.

ఊర్వశీదర్శనమువలన మిత్రావరుణులకు రేతస్ఖలనముకాఁగాఁ గుంభమునందుంచిన యారేతస్సునుండి, యగస్త్యుఁడు జన్మించెనని యుత్తరరామాయణము. [చూ. 1-11 వ్యాఖ్య]

సీ॥ అని 1 యాదరించియమ్ముని వచ్చుటకుఁబ్రియో
జనముఁదద్విశదోక్తి సరణిఁదెలిసి
యీవర్తి 2 వగుదఁట, యిది యెంత? యనిశతా
నందుండుమున్నొక్కనాఁడు నిఖిల
యువతిసృష్టికి నెక్కుఁడవుఁగాకయనితన
యాత్మనిర్మించి గాయత్రియనియు
సావిత్రియనియుఁబ్రశస్తనామములిడ్డ
కూఁతులనొసఁగఁగైకొనియతండు

తే॥ వారి 3 నటఁదెచ్చితన 4 కూర్మివారిఁగూర్చి
యయుతనియుతులకెటఁగింప, నందునయుతుఁ
డొల్లఁడయ్యోజోద్గ; మొల్లకున్న
నియుతునకుఁబెండ్లి 5 సేసెఁగన్నియలదోయి. **178**

---

178 ప :- 1 యదలించి - త, యాదరించి - ర, అ. 2 వగుటకు - ర; యగుటకు - డ, ద, బ, వగుదట - అ; గౌ. 3 నటతెచ్చి -గౌ; నటఁదెచ్చి - ర, అ. 4 కూర్చు - ముద్రి (అ), ర; కూర్మివాని-త; కూర్మివారి - అ. 5 చేసె - గౌ, సేసె - ర, అ.

వ్యా :— అని = ఈప్రకారముగా, ఆదరించి = గౌరవించి, అమ్ముని = అమౌని - అయగస్త్యుఁడు. వచ్చుటకున్ = (తనయొద్దకు) ఏతెంచుటకు, ప్రయోజనమున్ = హేతువును, [ప్రయోజనం కార్యహేత్వోః - మే. ని] తత్ = అతనియొక్క, విశద = స్పష్టమయిన, ఉక్తిసరణిన్ = వచనమార్గమున, తెలిసి = ఎఱిఁగి, ఈవు = నీవు, అర్థివి = వేఁడువాఁడవు, అగుదఁట = అగుదువఁట, ఇది = ఇయ్యది - ఈకోరిక, ఎంత = ఏపాటిది, (చాలఁజిన్నకోరికయనుట) అనిశతానందుండు = అని బ్రహ్మదేవుఁడు, శతానందశ్శతధృతిర్విరించోఽజోవిరించనః - అమ] మున్ను = పూర్వము, ఒక్కనాఁడు = ఒక్కదినము, నిఖిలయువతి = సమస్తతరుణులయొక్క, సృష్టికిన్ = సృజనమునకు, ఎక్కుడు = ఉత్కృష్టమయినది, అవుఁగాకయని = అగునుగాకయని, తన = తనయొక్క, ఆత్మన్ = మనస్సుచేత, నిర్మించి = సృజించి, గాయత్రియనియున్ = గాయత్రియనియు, సావిత్రియనియున్ = సావిత్రియనియు, ప్రశస్తనామములు = (శ్రేష్ఠములయిన పేరులు, ఇడ్డ = ఉంచిన, కూఁతులన్ = కొమార్తెలను ఒసఁగన్ = ఒప్పగింపఁగా, కైకొని = స్వీకరించి, అతండు = అతఁడు - అగస్త్యుఁడు, వారిన్ = వారలను, అటఁదెచ్చి = అచ్చటికిఁ [ఆశ్రమమునకు - అనుట] దీసికొనివచ్చి, అయుతనియుతులకున్ = అయుతునకునియుతునకును, తన = తనయొక్క, కూర్మివారిఁగూర్చి = (ప్రీతిపాత్రులయిన వారినిగూర్చి - ఆగాయత్రీసావిత్రులనుగూర్చి, ఎఱిఁగింపన్ = తెలుపఁగా, అందున్ = వారియందు - ఆయయుతనియుతులయందు, అయుతుఁడు = అయుతుఁడనువాఁడు. నిజ = తనదైన, ఉద్యోగము = ప్రయత్నము, (వివాహప్రయత్నమనుట) ఒల్లఁడయ్యెన్ = ఒప్పనివాఁడయ్యెను. [సమ్మతింపలేదనుట] ఒల్లకున్నన్ = ఒప్పుకొనకపోఁగా, కన్నియలదోయిన్ = కన్యకాద్వయమును, నియుతునకున్ = నియుతుఁడనువానికి, పెండ్లిసేసెన్ = వివాహమొనర్చెను.

క॥ తన 1 యాజ్ఞఁగూడశతధృతి
తనయామణిఁగైకొనని హతనయాశయునిన్
2 మునిచట్టువెడల 3 నడిచెను
ముని, కనలికఠోరవర్ణముగఁబలుకొలయన్. **179**

వ్యా :— తన = తనయొక్క, అజ్ఞఁగూడన్ = ఆనతితో సహితము, శతధృతి = బ్రహ్మయొక్క, (శతానందశ్శతధృతిః-అమ) తనయామణిన్ = పుత్త్రికారత్నమును, కైకొనని = స్వీకరింపని, హత = ప్రతిహతమయిన, నయ = నీతిగల, ఆశయునిన్ = మనస్సు గలవాఁడగు, మునిచట్టున్ = మొదటి శిష్యుని - అయుతుని, ముని = మౌని - అగస్త్యుఁడు, కనలి = కోపించి, కఠోరవర్ణముగన్ = పరుషాక్షరములుగలదిగా, పలుకు = మాట, ఒలయన్ = వ్యాపింపఁగా - బహిర్గతముకాఁగా, వెడలనడిచెను = వెళ్ళఁగొట్టెను.

వ్యాక :— మునిచట్టున్ - అను విశేష్యముద్వితీయాంతముగ నుండుటచే, హతనయాశయునిన్ - అనువిశేష్యమునకు ద్వితీయకలిగెను [బా. కారక 19]

మునిచట్టు - మును + చట్టు. [ప్రౌ. సమాస 36]

అలం :— యమకము.

సీ॥ కుటిలాలకములు చీకటిప్రోఁగులగునైనఁ
జిచ్చందిరికాధ్వమల్ 1 చిత్త్రగతులు

179 ప:- 1 యాజ్ఞగూడ - అ; యాజ్ఞఁగూడ - ర, గౌ. 2 మునుచుట్టు - ర; మును (ని?) చట్టు - అ; మునిచుట్టు - గౌ. 3 ననిచెను - గౌ; నడిచెను - ర, అ.

180 ప:- 1 చిత్రరతు - ప; చిత్రగతు - గౌ; చిత్త్ర - ర, అ.

మధురోష్ఠములు రాగమహితంబులగునైన
భావముల్ వైరాగ్య 2 బంధురములు
గురుకుచంబులు గర్వభరితంబులగునైన
హతదుర్వికారంబులాశయంబు
లలవోకనడలు మాంద్య 3 మయంబులగునైన
నంతరంగములు బోధాస్పదములు

తే॥ పొగరుఁజూపులు 4 చపలంబులగునయైన
నిండు 5 మనములు మిక్కిలి 6 నిశ్చలంబు
లవుర! వీరలకననొప్పునతివలందు
నిలిపెనమబుద్ధి ప్రియమూనినియుతమౌని 180

వ్యా :— అవుర = అహా! వీరలకున్ = వీరికి - ఈ గాయత్రీ సావిత్రులకు, కుటిల అలకములు = వక్రములయిన ముంగురులు, అలక = లలాటస్థేభిన్నాగ్రేకుటిలకేశే - శబ్దస్తో; అలకాశ్చూర్ణకుంతలాః -అమ చీకటిప్రోగులు = తమోరాశులు, అగున్ = అగును. ఐనన్= అయినప్పటికిని, చిత్తగతులు = మనఃప్రవృత్తులు, చిత్ = జ్ఞానమనెడు, చంద్రికా = వెన్నెలచేత, ఆఢ్యముల్ = సంపన్నములు.

కుటిలాలకములు - అలకలనఁగాఁగుటిలకేశములే. కుటిలశబ్ద పునరుక్తి, యలకలలక్షణమగు కుటిలత్వమునుబ్రత్యేకముగా నిర్దేశించి చూపును. ఒకవస్తువునందలి లక్షణమును బ్రత్యేకముగా నిర్దేశించిచూపుట సప్రయోజనమయినచో నదిగుణమేయగును. "వెల్లిగొనెనఖిలదిక్కుల,

2 బంభర - డ, ద, బ; బంధుర - ర, అ. గౌ. 3 యుతంబు ర; మయంబు - అ, గౌ, 4 చపలంబు - గ: చాపలంబులగు - గౌ; చపలంబు - ర, అ. 5 మయము - ప; మనము - ర, అ. 6 నిష్ఫలం - జ; నిశ్చయంబు - ర (పా); నిశ్చలంబు - ర, అ. 7 మాని - గౌ; మూ... - ర, అ.

నల్లనిచీకటినవాంజనప్రతిభటమై" (భీమ 2-34) చీకటిలోనినల్లఁదన మనులక్షణమిటఁ బ్రత్యేకముగా సూచితము. అట్లేయలకల కుటిలత్వము ప్రత్యేకముగా సూచితము. కుటిలత్వగుణమలకలయందేకాని చిత్త గతులయందు లేదనియుఁజిత్తగతులలో నార్జవమేకలదనియుఁదెలుపుట ప్రయోజనము. అలకలు చీకటిపోఁగులు అనఁగా నలకలయందు మఱి యొకగుణము నల్లఁదనము. నల్లఁదనమలకలయందేకాని, చిత్తగతుల యందు లేదు. నత్తగతులు జ్ఞానచంద్రికతో సంపన్నములు. నల్లఁదనము తమోగుణమునకుఁబ్రతీక చంద్రికావర్ణము, తెలుపు. సత్త్వగుణమునకుఁ బ్రతీక, చిత్తగతులు సత్త్వగుణసంపన్నములేకాని తమోగుణస్పర్శ లేదనుట.

(2) మధుర = తీయనయిన, ఓష్ఠములు = మోవులు, రాగ = ఎఱ్ఱఁదనముచేత, (రాగోనురక్తామాత్సర్యే, క్లేశాదౌలోహితాదిషు-విశ్వ) మహిత బులు = గొప్పవి, అగున్ = అగును. ఐనన్ = అయినప్ప టికిని, భావముల్ = మనస్సులు (భావః = చిత్తమ్ - శబ్దక) వైరాగ్య = విరక్తిచేత, బంధురములు = ఇంపయినవి.

ఓష్ఠములయందలిగుణములు - (1) మాధుర్యము. (2) ఎఱ్ఱఁ దనము. మాధుర్యమునెఱ్ఱఁదనమునోష్ఠములయందేగలవు; మనస్సుల యందు లేవు. మాధుర్యమనఁగా సంసారసుఖములపట్ల, మాధుర్యము (ప్రీతి.) ఎఱ్ఱఁదనము. రజోగుణమునకు బ్రతీక. మనస్సులందుసంసార సుఖములపట్లఁబ్రీతిలేదు. మనస్సులు సత్త్వగుణ సంపన్నములేకాని రజోగుణస్పర్శలేదు.

గుణములకు, వర్ణములు ప్రతీకలగును. (చూ 1-110 వ్యాఖ్య)

వైరాగ్యము = విరాగముయొక్క భావము రాగమనఁగా విష యానురక్తి. "విరాగ = విగతోరాగోయస్య." [శబ్దస్తో-

(3) గురు = పెద్దవయిన, కుచంబులు = స్తనములు, గర్వ = మదముతో [ఉబ్బుతో] భరితంబులు = నిండినవి, అగున్ = అగును, ఐనన్ = అయినప్పటికిని, ఆశయంబులు = మనస్సులు [ఆశయః = చేతః - శబ్దక] హత = ప్రతిహతములయిన, దుర్వికారంబులు = దుష్టములయిన మనోవ్యాపారములుగలవి,

స్తనధర్మములు రెండు - [1] గురుత్వము [2] గర్వము, గురుత్వగర్వములు స్తనములందేకలవు, మనస్సులందులేవు. గురుత్వ మనునదియొక వస్తువు గొప్పదన్న భావమును దెలుపును. వైరాగ్య వంతులు, సమలోష్టకాంచనులు. అనఁగామట్టియు బంగారమును వారి కొక్కటే వస్తువులపట్ల హెచ్చుతగ్గులుగలవన్నభేదభావము, గర్వము, నను దుర్వికారములు మనస్సులందులేవనుట.

(4) అలవోక = ఒయ్యారములయిన, నడలు = నడకలు, మాంద్యమయంబులు = అలసత్వము స్వరూపముగాఁగలవి, అగున్ = అగును. ఐనన్ = అయినప్పటికిని, అంతరంగములు = మనస్సులు, బోధ = జాగరణమునకు - అప్రమత్తతకు, ఆస్పదములు= స్థానములు,

నడకలయందలిధర్మములు - [1] అలవోకతనము [2] మాంద్య

మయత్వము. అలవోక = అనాసక్తి. "అలవోకగాది గీశసందేశం బాకర్ణించి" [శృ. నై. 4-9] మాంద్యము = మందునియొక్క (మూర్ఖునియొక్క భావము) - మూర్ఖత్వము, అజ్ఞత.

అలవోకతనము (ఒయ్యారము) మాంద్యము (అలసత్వము, మెల్లన) నడకలయందేకలవు, అలవోకతనము (అనాసక్తి- సత్కార్యా చరణముననసాసక్తత) మాంద్యము (అజ్ఞత) మనస్సులయందులేవు, మనస్సులు కర్మానుష్ఠానమున, నప్రమత్తములు.

పొగరుఁజూపులు = తళుకుగలవీక్షణములు, చపలంబులు = చంచలములయినవి, అగున్+అ = నిశ్చయముగానగును. ఐనన్ = అయినప్పటికిని, నిండుమనములు = నెమ్మనములు, మిక్కిలి = అత్యంతము, నిశ్చలంబులు = స్థిరమయినవి.

చూపులయందలి ధర్మములు - 1 పొగరు 2 చాపల్యము. పొగరుశబ్దమునకు మదమనునర్థమునుగలదు. పొగరు (కాంతి) చాపల్యము చూపులయందేకలవు. పొగరు (మదము) చాపల్యము మనస్సులయందులేవు.

అనన్ = అనఁగా, ఒప్పు = తనరు, అతివలందున్ = కాంతలయందు - భార్యలయందు, ప్రియము ఊని = ప్రీతివహించి, నియుతమౌని = నియుతముని, సమబుద్ధిన్ = సమానమయిన భావమును - పక్షపాతములేనిభావమును, నిలిపెన్ = నెలకొల్పెను.

గాయత్రీసావిత్రుల మనస్సులు తమసహజగుణములను బరిత్యజించి, తమకు సన్నిహితములగునలకాదులకు సంబంధించిన గుణములనుగ్రహింపకుండుట యాశ్చర్యమనుట.

**అలం ;— అతద్గుణము.**

క॥ ఈతఁడిటులుండమునుపటి
యాతఁడుహల్లగ్నగురుకృతానాదరుఁడై
శీతనగసవిధవసుధకు
నేతెంచిమనోగతమున నిటులూహించెన్ 181

వ్యా :— ఈఁతడు = ఇతఁడు - నియుతుఁడు, ఇటులుండన్ =

---

181 ప :- 1హించున్ - గౌ; హించెన్ - ర, అ.

ఈప్రకారముగానుండఁగా, మునుపటియాతఁడు = ముందటియతఁడు - అయితుఁడు. హృద్ = మనస్సునందు, లగ్న = హత్తుకొనిన, గురు = ఉపాధ్యాయునిచేత - అగస్త్యునిచేత, కృత = చేయఁబడిన, అనాదరుఁడై = తిరస్కారముగలవాఁడయి, (అగస్త్యునిచేఁదిరస్కృతుఁడయి - అనుట) శీతనగ = చలికొండయొక్క (హిమవత్పర్వతము యొక్క) సవిధవసుధకున్ = సమీపభూమికి, ఏతెంచి = వచ్చి, మనోగతమునన్ = హృదయగతియందు, ఇటులు = ఈప్రకారముగా, ఊహించెన్ = వితర్కించెను.

చ॥ చిలుకలుగమ్మఁదెమ్మెరలు శీతమయూఖుఁడుదేఁటులాదిగాఁ
గలవనవిల్తుసాధన నికాయము వేలముపట్టులంగనా
కులమటుగానదా నివిడఁగొట్టిక 1 తృట్టికఁదొట్టి, వీతరా
గులమనివిఱ్ఱవీఁగెదరుకొందఱుబోఁడలునాన 2 గేఁడలై. **182**

వ్యా :— అంగనాకులము = స్త్రీలసజాతీయసమూహము, చిలుకలు = శుకములును, కమ్మఁదెమ్మెరలు = ఘ్రాణతర్పణమొనర్చు (సువాసనగల - అనుట) మలయమారుతములును, శీతమయూఖుఁడు = చలివెలుఁగును, (చంద్రుఁడును) తేఁటులు = తుమ్మెదలును. ఆదిగాఁగల = మొదలుగాఁగల, ననవిల్తు = పుష్పచాపునియొక్క (మన్మథుని యొక్క) సాధననికాయము = ఉపకరణముల సమూహముయొక్క, వేలము పట్టులు = శిబిరప్రదేశములు, (స్త్రీజనము, మన్మథునియుపకరణములగు శుకమలయమారుతాదులకు శిబిరస్థానములనుట) అటు గానన్ = అట్లగుటచేత - స్త్రీజనము మన్మథుని యుపకరణములకు

---

182 ప :- 1 తృట్టికవెక్కి - చ, త. గొ; తృట్టికనొక్కవీర - క; తృట్టిక లెట్టివీగె - గ; తృట్టికదొట్టి - ర, అ. 2 గెండలై - క; గండలై- ముద్రి (అ), ర; గేడులై - అ; గేడలై - గొ.

శిబిరములగుటచేత, దానిన్ = దానిని - స్త్రీజనమును, విడఁగొట్టక = పరిత్యజింపక, తృట్టు = దప్పి - కామవాంఛ, ఎకఁదెట్టక = అతిశయింపఁగా, కొందఱు = కొంతమంది, బోడలు = సన్న్యాసులు, నానగేఁడలై = సిగ్గుమాలినవారై, వీతరాగులమని = పోయినయనురాగములుగలవారమని - కామభావములుపోయినవారమని, విఱ్ఱవీఁగెదరు = మిక్కిలిగర్వింతురు.

తెమ్మెరలు - తెంబు = దక్షిణము, ఎరల్ = గాలి, తెమ్మెర- అనురూపమనుచితవిభాగమువలననేర్పడి, తెమ్మెరలు - బహువచనముగా నైనది.

పాఠ ;— నానగేఁడ - నాన + కేఁడ. నాన = సిగ్గు. కేడు = నాశనము - కన్నడము, తమిళము. [సూ. ని. కేడువాఱుశబ్దమునొద్ద]

గెండలై, గండలై, గేడులై, గేడలై - ఉపలబ్ధపాఠములు : నానగేఁడలై - సాధుపాఠమని నిర్ణయింపఁదగును. ఎట్లన - దీర్ఘమునకు హ్రస్వమును మీఁదిఖండమునకుఁబూర్ణమునుజేసి వ్రాయుట వ్రాఁత ప్రతులలేఖన సంప్రదాయము. కాన, నానగేఁడలై - అనునది వ్రాఁత ప్రతులలో, నానగెండలై' అని వ్రాయఁబడియుండును. 'గెండ' లేఖన సంప్రదాయసిద్ధరూపము. 'గేఁడ' అనియే చదువుకొనవలెను. కాని గేఁడయననేమో తెలియకపోవుటచేను ప్రసిద్ధమగు 'గండ' శబ్దముచోటుచేసికొని 'నానగండ' యనునపపాఠమేర్పడియుండును.

'నానగండ' అనుపాఠముక్రింది ప్రయోగమునందునుగన్పట్టును.

"మచ్చటులాస్త్రఘట్టన మనంబున నెంచకనానగండయై వచ్చినవాఁడు" (పారిజా 5-20)

ఇటుఁగూడ 'నానగేఁడయై' అన్నదే సాధుపాఠమయియుండును. 'నానగేఁడ' నానగెండగా వ్రాయఁబడితుదకు 'నానగండ' - అయియుండును.

పైపద్యమున 'నానగేడు' శబ్దమునిల్పినచో గణభంగమగును. (నానగేడు+ఐ = నానగేడై) కాన, నానగే డన్నదే సాధుపాఠము.

కేడశబ్దమునఁదమిళకన్నడరూపములలో బిందువులేదు. తెలుఁగున నిది సబిందుకమయియుండును. తమిళ కన్నడములలోని నిర్బిందుకశబ్దములు తెనుఁగున సబిందుకములుగాను గనఁబడును. (వై. పా)

తాక్కు (త) — తాగు (క) — తాఁకు (తె)
తోకై (త) — సోగె (క) — తోఁక (తె)
పాడి (త) — పాడి (క) — పాఁడి (తె)

కాఁగా, 'నాగగేఁడలై' కవిప్రయుక్తపాఠమని నిర్ణయింపవచ్చును 'గొ' ప్రతిలో నానగేడలై - అను నిర్బిందుకపాఠముగలదు. కాని, గెండ, గండ - అనువానిని బట్టియిది సబిందుకమని నిర్ణయింపఁదగును.

క॥ జడలఁట! చుట్టం, గట్టం
గడవసమట! మేనఁగప్పఁగాషాయ 1 మఁటే!
యడవుల నవయుతపస్వికిఁ
గడుసౌఖ్యమె కోరుసతికిఁగలయికతగునే? 183

వ్యా :— చుట్టన్ = చుట్టుకొనుటకు, జడలఁట = జటలఁట! కట్టన్ = ధరించుటకు, కడవసమఁట = చర్మమఁట, మేనన్ = శరీరమునందు, కప్పన్ = కప్పుకొనుటకు, కాషాయమఁటే = కావిబట్టయఁట! అడవులన్ = అరణ్యములందు, నవయు = కృశించు, తపస్వికిన్ = తపసికి, కడున్ = మిక్కిలి సౌఖ్యమె = సుఖమునే; కోరు = అభిలషించు, సతికిన్ = స్త్రీకి, కలయిక = సంగమము, తగునే = యుక్తమా? [యుక్తముకాదనుట]

---

183 పః- 1 ములే - గొ; మటే - ర, అ.

సతి = పతివ్రత. ఇటస్త్రీ - లక్షణార్థము. "కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్" [మను 2-68]

అలం ;— విషమము.

సీ॥ ఉర్వీధరములెక్కి యుఱుకనే? కుచకుంభ
యుగ 1 మొల్లఁగాక! తానుఱుకుమనిన
వాఁడి 2 కైదువులపై వ్రాలనే? 3 నిఁడుజూపు
4 డాలొల్లఁగాక! తావ్రాలుమనిన
5 మున్నీటినుడివడిమునుఁగనే? నతనాభిఁ
గననొల్లఁగాక! తామునుఁగుమనినఁ
బెడఁగారుకాలాహిఁదొడుకనే? నూఁగారు
తొడుసొల్లఁగాక! తాఁదొడుగుమనిన

తే॥ జెప్పిగుఁరుడేమిపనిచినఁజేయలేనె!
కావె? తనసొమ్ముమామకకాయ 6 గతులు
7 గడిసిమొఱ్ఱోయనంగలింగంబుగట్టు
జంగమననంగనలఁ 8 గూర్పఁజనదుగాక! **184**

వ్యా ;— కుచకుంభయుగము = కుండలవంటిచనుదోయిని; ఒల్లఁగాక = అభిలషింపనుగాని, తాన్ = తాను, [గురువు] ఉఱుకుమనినన్ = దూఁకుమన్నచో, ఉర్వీధరములు = పర్వతములను, ఎక్కి = అధిరోహించి, ఉఱుకనే = దూఁకనా? [దూఁకుదుననుట]

---

184 పః- 1 మొల్లనోరగా - జః మొల్లఁగాక - ర, అ, గౌ. 2 కైదువ - గౌ; కైదువు - ర, అ. 3 నిడుఁజూపు -ర, ర (పా), నిడుచూపు-అ,గౌ. 4 వాలొల్ల - ముద్రి (అ), రః డాలొల్ల - అ, గౌ. 5 మున్నీటి - ర, గౌ; మున్నీట - అ. 6 కర్మ - ర, గౌ, గతులు – అ. 7 గతులు - ర; గతుల - గౌ; గడిసి - అ. 8 గూర్పు - చ; గూర్ప - ర, అ.

ఉర్వీధరములకు స్తనములకు నౌపమ్యముద్యోతకము. 'ఉర్వీ' లోని, ఈకారముపర్వతములయౌన్నత్యమునకు స్ఫోరకము.

వ్యాక ,— యుగము = యుగములను, ఉర్వీధరములు = ఉర్వీధరములను. ద్వితీయార్థకప్రథమలు - బా. కారక 24

(2) నిడుఁజూపు = వాలికచూపులయొక్క, డాలు = కాంతిని, ఒల్లఁగాక = అభిలషింపనుగాని, తాన్ = తాను, [గురువు వ్రాలు మనినన్ = ఒఱగుమన్నచో, వాఁడికైదువులపైన్ = తీక్ష్ణములయిన కత్తులమీఁద, కైదువయనఁగనుగత్తియనఁగ - ఆం. భా; కైదువ = కైదువ] వ్రాలనే = ఒఱగనా? ఒఱగుదుననుట.

వాఁడికైదువులకు నిడుఁజూపుడాలునకు నౌపమ్యముద్యోతకము.

(3) నతనాభిన్ = లోఁతయిన పొక్కిలిని, కనన్ = చూచుటకు, ఒల్లఁగాక = అభిలషింపనుగాని, తాన్ = తాను, (గురువు) మునుఁగు మనినన్ = మగ్నముకమ్మన్నచో, మున్నీటిసుడిన్ = సముద్రము యొక్క జలావర్తమునందు, [సముద్రపుసుడిగుండములో - అనుట వడిన్ = వేగముగా - వెంటనే, మునుఁగనే = మగ్నుఁడనుగానా ? మగ్నుఁడనగుదుననుట మునిఁగిపోవుదుననుట

మున్నీటిసుడికి, నతనాభికి నౌపమ్యముద్యోతకము.

(4) నూఁగారు = రోమరాజియొక్క. తొడుసు = సంబంధము, ఒల్లఁగాక = అభిలషింపనుగాని, తాన్ = తాను, (గురువు) తొడుకు మనినన్ = (చేతితో) పట్టుకొమ్మన్నచో, బెడఁగారు = ఒప్పిదమగు, కాలాహిన్ = కృష్ణసర్పమును, [త్రాఁచుపామును తొడుకనే = (చేతితో) పట్టుకొననా ? పట్టుకొందుననుట.

నూఁగారునకుఁగృష్ణసర్పమునకు నౌపమ్యముద్యోతకము.

కదిసి=సమీపించి. మొఱ్ఱోయనంగన్=(వలదు) మొఱ్ఱోయనుచుండఁగా; (వలదని యాక్రందించుచుండఁగా - అనుట) లింగంబు = శివలింగమును, కట్టు=(మెడలో)బంధించు, జంగమనన్=జంగమమనునట్లు, అంగనలన్= కాంతలను, కూర్పఁజనదుగాక=సంధానముచేయఁదగదుగాని, గురుఁడు= ఉపాధ్యాయుఁడు - అగస్త్యుఁడు, చెప్పి = తెలిపి, ఏమిపనిచినన్ = ఏమియాజ్ఞాపించినను, చేయలేనె? = ఆచరింపఁజాలనా? (ఆచరింపఁ గలననుట) మామక = నాయొక్క, కాయగతులు = మేనిపోకలు, తనసొమ్ముకావె = తనయొక్క యధీనములోనివికావా? (అతని యధీనములోనివనుట)

లింగము రెండువిధములు [1] చరలింగము = జంగమము. [2] శివలింగము [స్థిరలింగము] "లింగంతుద్వివిధంప్రోక్తం, జంగమాజంగమాత్మనా" [సిద్ధాం. శి]

ఆ॥ నెయ్యుఁడట్టిపనికి నియుతుండతగుఁగాక
గృహితకంటె 1 వేఱెకీడుగలదె?
గురుహితంబునూఁది 2 యురిఁ బడనేనోప
ననుచుబ్రహ్మచర్యమయుతుఁడొంది. **185**

వ్యా :— అట్టిపనికిన్ = అటువంటి కృత్యమునకు - వివాహ మాడుటకు, నెయ్యుఁడు = ప్రేమాస్పదుఁడగు, నియుతుండు = నియుతుఁడే, తగుఁగాక = అనుకూలుఁడగునుగాక! గృహితకంటెన్= గార్హస్థ్యముకంటె, వేఱెకీడు = వేఱేయకార్యము, కలదె = ఉన్నదా? (లేదనుట) గురుహితంబున్ = గురువు (అగస్త్యుని) యొక్క హితవచనమును, ఊఁది = ప్రమాణముగాఁగొని, ఏన్ = నేను, ఉరిఁబడన్ =

---

185 ప:- 1 వెఱ్ఱి - చ; వేఱె - ర, అ. 2 యిరి - చ; యురి - ర, అ.

ఉరియందుఁజిక్కుకొనుటకు, ఓపన్ = ఇచ్ఛగింపను, అనుచున్ = అని, అయుతుఁడు = అయుతుఁడనువాఁడు, బ్రహ్మచర్యము = బ్రహ్మ చర్యాశ్రమమును, ఒంది = పూని. (మీఁదిపద్యముతో నన్వయము)

మ॥ సుముఖాంతఃకరణంబుమత్సరమునౌత్సుక్యంబునుంబాసి, ధౌ
తమణీదర్పణరీతిఁజెన్నుగఁదదంతర్లగ్నమై యాదిత
1త్వముదీపింపఁదపంబొనర్చు జటిలవ్యాఘ్రంబు 2 బనాఘ్రాతపు
ష్పముచందంబగుమేననూననియమభ్రాష్ట్రాగ్నిఁ 3 దిగ్గింపుచున్.

**186**

వ్యా :— జటిలవ్యాఘ్రంబు = వ్యాఘ్రమువంటి బ్రహ్మచారి - శ్రేష్ఠుఁడయిన బ్రహ్మచారి, (జటిలః = బ్రహ్మచారి. యథా, మనుః - జటిలశ్చానధీయానాందుర్బలంకితవంతథా. జటిలో బ్రహ్మచారీ - ఇతితట్టీకాయాంకుల్లూకభట్టః - శబ్దక) అనాఘ్రాత = వాసన చూడఁబడని, పుష్పముచందంబగు = పువ్వువంటిదయిన, మేను = శరీరము. అనూన = అధికమయిన, నియమ = వ్రతనిష్ఠయనెడు, భ్రాష్ట్ర = మంగలముయొక్క, వేఁపుడుచట్టియొక్క, (మంగలమన భ్రాష్ట్రాభిధానంబు - ఆం భా) అగ్నిన్ = చిచ్చునందు - మంగలపు వేఁడియందు, తిగ్గింపుచున్ = తపింపఁజేయుచు, సుముఖ = అనుకూలమయిన - ఉన్ముఖమయిన, అంతఃకరణంబు = మనస్సు (అంతఃకరణంతుమనః - త్రి. ని.) మత్సరమున్ = మాత్సర్యమును, ఔత్సుక్యంబునున్ = ఉత్సుకత్వమును, (ఇష్టప్రాప్తికైతహతహ) పాసి = విడిచి, ధౌత = తుడువఁబడిన మణీదర్పణరీతిన్ = రత్నమయమగు

---

186 పః- 1 త్త్వము - ర, అ; త్వమ - గౌ. 2 బునా - గౌ; బనా - ర,అ. 3 మ్రగ్గించుచున్ - ర; ద్రగ్గింపు - క; దుగ్గించు - ప; ద్రుం గించు - ర, (ప్రథమముద్రణము), దగ్గించు - డ, ద, బ; ద్రిగ్గించు - అ; ద్రిగ్గింపు - గౌ.

నద్దమువలె: చెన్నుగన్ = ఒప్పిదమయినదికాఁగా, తత్ = దాని యొక్క - ఆమనస్సుయొక్క. అంతర్లగ్నమై = మధ్యమునందుఁదగులు కొన్నదై, ఆదితత్త్వము = పరమాత్మ, దీపింపన్ = ప్రకాశింపఁగా, తపంబొనర్చున్ = తపస్సుచేయును.

త్రిగ్గించు - దీనికిఁబ్రయోగాంతరమున్మృగ్యము.

వ్యాక ,— జటిలవ్యాఘ్రంబు - "ఉపమితంవ్యాఘ్రాది భిస్సామాన్యాప్రయోగే" (పాణి) అనుసూత్రముచే నిదియుపమానోత్తర పదకర్మధారయము.

త్రిగ్గించు + చున్ = త్రిగ్గింపుచున్ - ప్రా. క్రియా. 17

తత్వ - ఏకతకారకమునుగలదు. చూ 2-201

అలం :— ఉపమ.

క॥ సర్వాతిరిక్తధృతియగు
నుర్వీసురసార్వభౌమునుగ్రతపమునన్
బర్వెభయజ్వరదాహమ
ఖర్వోద్ధతినిఖిలభువనగర్భములందున్. **187**

వ్యా :— సర్వ = ఎల్లరకంటె, అతిరిక్త = అతిశయించిన, ధృతి = ధైర్యముగలవాఁడు, అగు = అయిన, ఉర్వీసురసార్వభౌము= భూదేవసమ్రాట్టుయొక్క - బ్రాహ్మణశ్రేష్ఠునియొక్క, ఉగ్ర = భయంకరమయిన, తపమునన్ = తపస్సుచేత, నిఖిల = సమస్తములయిన, భువన = లోకములయొక్క, గర్భములందున్ = మధ్యభాగముల యందు, అఖర్వ = అధికమయిన, ఉద్ధతిన్ = ఔద్ధత్యముచేత, భయజ్వర = వెఱవేఁకియొక్క, దాహము = కాఁక, [వేఁడిమి] పర్వెన్ = వ్యాపించెను.

చతుర్దశభువనములు - చూ 1-25 వ్యాఖ్య

క॥ మినుమినుకుమినుకుమనియెన్
బెనుమినుకుల 1 బరణి; ధరణిబిట్టూటాడెన్
వననిధులువిరిసెం గురిసెన్
గనగనగనమనుచు నిప్పుకలుగుప్పలుగన్. **188**

వ్యా :— పెనుమినుకులబరణి = వేదములయొక్క బరణి - సూర్యుఁడు, [ప్రాఁబలుకులు పెనుమినుకులు నావెలయున్ శ్రుతులకును బేళ్లు-ఆం. సం.] మినుమినుకుమినుకుమనియెన్= మిక్కిలి మినుకుమినుకు మనెను [అతిస్వల్పకాంతితోనొప్పెననుట] ధరణి = భూమి, బిట్టు = వేగముగా, ఊటాడెన్ = కంపించెను. వననిధులు = సముద్రములు, విరిసెన్ = పొంగెను. నిప్పుకలు = అంగారములు (ఉల్కలు) కుప్పలు గన్ = ప్రోగులుగా, గనగనగనమనుచున్ = గనగనగనమని, కురిసెన్ = రాలెను.

"గనగనగన" - రాలుటయందగుననుకరణము. "ఆమ్రేడితంద్వి స్త్రిరుక్తమ్" [అమ గనశబ్దముమూఁడుసార్లు ప్రయుక్తము. [ఒక శబ్దము రెండు లేదా మూఁడుసారులుచ్చరించుట యామ్రేడితము]

నిప్పుకలు [అంగారములు] కురియుట, యుత్పాతము. "సురపతి సభఁజూడఁజూడనంగారవృష్టుల్, గురిసె" [ఆది....]

పెనుమినుకులబరణి - సూర్యుఁడు, వేదమయుఁడు. "కర్మసాక్షీ త్రయీతనుః" [వై. ని.] "త్రయీతనః = త్రయీ వేదా ఏవతనుః శరీరంయస్య -- త్రయీమయంసూర్యమాత్మనం యజంతే - ఇతి బాగవతవాక్యమ్" [శబ్దక]

వ్యాక :— బిట్టు = బిట్టుగా - ప్రౌ క్రి సూ 22. మినుకు + అనియెన్. గనగనగన+అనుచున్. ముగాగమము - ప్రౌ. సంధి 19.

188 ప:- 1 భరణి - గౌ. బరణి - అ, ర; ధరణి - చ, త.

ఉ॥ అ త్తఱినిప్పుదొ్రక్కినటు, తౌదలఁ 1 దేల్గొనినట్టు 2 లావయు
వ్వెత్తుగఁదా్రవినట్టు, విబుధేశుఁడుమాణవకో్గ్రనిష్ఠకున్
జి త్తమునందపించియతి శీఘ్రగతిన్ క్షితికేగుదెంచెఁద
ద్వృత్తము 3 మానుపింతునని వృద్ధమహీసురవేషధారియై 189

వ్యా :— అ త్తఱిన్ = ఆసమయమునందు, విబుధేశుఁడు = సురపతి (ఇంద్రుఁడు) నిప్పు = అగ్నిని, తొ్రక్కినటులు = కాలితో నదిమినట్లు, ఔదలన్ = శిరో్గ్రమునందు, (ఔదలముందల శిరోగ్రము మీఁఱు - అం. భా) తేల్ = వృశ్చికము, కొనినట్టులు = కుట్టినట్లు, అవ = ఆవాలపిండికలిపిచేసిన ద్రవపదార్థమును, ఉవ్వెత్తుగన్=ఎక్కువగా తా్రవినట్లు = పానముచేసినట్లు, మాణవక = బ్రహ్మచారియొక్క, (వటుఃపునర్మాణవకః - అభి. చిం.) ఉగ్ర = భయంకరమయిన, నిష్ఠకున్ = తపస్సునందలిశ్రద్ధకు, చిత్తమునన్ = మనస్సునందు, తపించి = తాపమునొంది, తద్వృత్తము = అతనియొక్క -(అయుతునియొక్క) వర్తనమును, మానుపింతునని = విరమింపఁజేయుదునని వృద్ధమహీసురవేషధారియై = ముసలిబా్రహ్మణ రూపమును ధరించినవాఁడై, అతిశీఘ్రమునన్ = మిక్కిలివేగముతో, క్షితికిన్ = భూమికి ఏగుదెంచెన్ = వచ్చెను.

నిప్పుదొ్రక్కినటులు - "అప్పుడిందా్రది సురులెల్లనిప్పుదొ్రక్కినట్లు మిట్టించి - ఉ. నా. 1-139

వ్యాక :— మానుపించు [ము. కౌ.]

---

189 పఃః 1 దేల్దిని - అ, దేల్గొని - ముద్రి (అ), ర; తేల్గొని - గౌ. 2 తాసము - ప; లావయు - ర, అ. 3 మాని - ర, అ, మాను - గౌ.

సీ॥ జీర్ణైణకృత్తి వేష్టితశాస్త్ర 1 కబళికా
2 సారపేటికలొక్క 3 చట్టుపూనఁ
గంబళకటు 4 బృసీకాషాయకరకంబు
లొక్కయంతేవాసియుద్వహింప
నామ్లికాఫలసారయవసక్తుతండుల
సూపాదులొక్కశిష్యుండు మోవ
సమిదాజ్య 5 పూర్ణకీచకకుశసృక్స్రువ
చయమొక్క 6 శైక్షుండు సంగ్రహింప

తే॥ దలుగుదామెనఁబెనచిన గళముతోడఁ
జంటువెన్నాడుకేగ్రపుతోఁజాలనలసి
నడచుధేనువునొక 7 చిన్న 8 వడుగురొప్ప
నయుతునాశ్రమవాటుమయ్యతిథి 9 దాసె. **190**

వ్యాః— జీర్ణ = ప్రాఁతదయిన (జీర్ణేపురాతనంచిరంతనమ్-అభి. చిం.) ఏణ = ఇఱ్ఱియొక్క, కృత్తి = చర్మముచేత, వేష్టిత = చుట్టఁబడిన, శాస్త్రకబళికా, సారపేటికలు = చదువుటకుఁబైకిఁదీసిన శాస్త్రగంథమునందలి పత్త్రిసంచయమును, (పాఠార్థముద్గృహీతాస్యాత్క

190 ప :- 1 శబలికా - ముద్రి (అ), ర; కదళికా - క, గౌ; కబళికా - అ. 2 వార - ముద్రి (అ), ర; సౌర పేశికలొక్క - క; సారపేటిక లొక్క - అ. గౌ. 3 వటువు - ముద్రి (అ), ర; చట్టు - అ; జట్టు - గౌ. 4 బ్రుసీ - ర, బృసీ - అ. 5 పూరకీచకకుచ - డ, ద, బ; పూర్ణకీచకకుచ. ముద్రి(అ), పూర్ణకీచకకుశ-ర,అ,గౌ. 6 ఛాత్రుండు - ముద్రి (అ), ర, శిష్యుండు – గౌ; శైక్షుండు – అ. ర (పా) 7 చిన్ని - గౌ, చిన్న - ర, అ. 8 వడువు – గౌ; వడుగు - ర, అ.

బళిపత్త్రిపంచికా - వై.ని. కబళీ = కబళికా) దేవతాసంబంధమయిన పెట్టెను (దేవతార్చనపుఁబెట్టెను), ఒక్కచట్టు = ఒకశిష్యుఁడు, పూనన్ = వహింపఁగా.

(2) కంబళ, కటు, బృసీ, కాషాయ, కరకంబులు = కంబళియుఁ జాపయు, (కటుకిలింజకౌ - అమ), యతులయాసనమును, (వ్రతినా మాసనంబృసీ - అమ) గావిపుట్టమును. కమండలువును, (కమండ లౌచకరకః - అమ), ఒక్క = ఒక, అంతేవాసి = శిష్యుఁడు, ఉద్వ హింపన్ = మోయఁగా.

(3) ఆమ్లికాఫలసార = చింతపండురసమును, (ఆమ్లికాతింతిడీ వృక్షః, ఇత్యమరటీకాయాంరాయముకుటః - శబ్దక) యవసక్తు = యవ ధాన్యపుఁబిండి, (పిలపిండి) తండుల = బియ్యము, సూప = పప్పులు ఆదులు = మొదలగువానిని, ఒక్కశిష్యుండు = ఒకఛాత్రుఁడు, మోవన్ = వహింపఁగా.

(4) సమిధ్ = సమిధలు, ఆజ్యపూర్ణ = నేతితోనిండిన, కీచక = వెదురుబొంగులు, (వేణవఃకీచకాః - అమ) కుశ = దర్భలు, స్రుక్= స్రుక్కులనెడియజ్ఞపాత్రవిశేషములయొక్కయు, స్రువ = స్రువము లనెడుయజ్ఞపాత్రవిశేషములయొక్కయు, (ధ్రువోపభృజ్జుహూర్నాతు స్రువోభేదాస్స్రుచఃస్త్రియః - అమ) చయము = సమూహము. ఒక్క శైక్షుండు = (వేదాంగమగు) శిక్షాశాస్త్రమునధ్యయనముచేయు శిష్యుఁ డొకఁడు, (శైక్షాఃప్రాథమకల్పికాః - అమ; శైక్షాగ్రంథాధ్యాయిని - శబ్దస్తో) సంగ్రహింపన్ = పట్టుకొనఁగా.

స్రుక్స్రువములు - "స్రువాదికంతుయజ్ఞాదౌ పాత్రమిత్యభిధీ యతే, స్రువఃపుమానేకహస్తో, బాహుమాత్రాస్రుగీరితా, ఇతిశబ్దరత్నా వళీ, జుహూఃపలాశకాష్ఠస్య, ఖాదిరస్యస్రువోమతః. ఇతిభరతః" (శబ్దక)

తలుగుఁదామెనన్ = పలుపుత్రాటితో, (తలుగునాఁబలుపునాఁద నరుఁగంఠరజ్జువు - ఆం భా) పెనచిన = బంధించిన, గళముతోడన్= మెడతో, చంటన్ = స్తనములయందు,(సిరములయందు) వెన్నాడు= వెంటనంటు, క్రేపుతోన్ = దూడనాఁ(గ్రేపునాఁదోఁచునువత్సంబు - ఆం. భా) చాలన్ = మిక్కిలిగా, అలసి = బడలికచెంది, నడచు = గమించు, ధేనువున్ = గోవును, ఒకచిన్నవడుగు = ఒకయల్ప వయస్కుఁడయిన బ్రహ్మచారి, రొప్పన్ = త్రోలఁగా, అయ్యతిథి = ఆయాగంతకుఁడు, అయుతు = అయుతునియొక్క, అశ్రమవాటమున్= ఆశ్రమమండపమును - ఆశ్రమమునందలి పటకుటీరమండపమును. (వాటోమార్గేవృతిస్థానేస్యాత్కుటీవాస్తునోస్త్రియామ్-మే. ని; వాటః = మండపః - శబ్దర.) డాసెన్ = సమీపించెను.

వాటము - పటకుటీరమండపమనుటకు ; చూ 5-193 వచనము.

అతిథి - చూ 3-24 వ్యాఖ్య.

క॥ శిరసువడంకఁగఁదెల్లగ
నరసినగృహమేధినియును నడచెఁదదంగం
బిరవు కొనిపట్టుచాలక
జరకొంతవినిర్గమించిచనుదెంచుక్రియన్. **191**

వ్యా :— తెల్లగనరసిన = ముదిమిచే] తెల్లగాఁదలవెంట్రుకలు తెలుపెక్కిన, గృహమేధినియును = గేస్తురాలును, (వృద్ధునిభార్యయు- అనుట) శిరసువడంకఁగన్ = తలకంపింపఁగా, తత్= అతనియొక్క- అవృద్ధునియొక్క, అంగంబు = శరీరమునందు, ఇరవుకొని = ఉండి, పట్టుచాలక = స్థలము సరిపడక, జర = ముసలితనము, కొంత = ఇంచుకంత, వినిర్గమించి = బయలువెడలి, చనుదెంచు క్రియన్ = వచ్చునో అనునట్లు, నడచెన్ = గమించెను.

వృద్ధబ్రాహ్మణుని దేహమునందుఁజోటుచాలక, ముసలితనము కొంతబయలు వెడలివచ్చుచున్నదోయన నట్లు వృద్ధబ్రాహ్మణకుటుంబిని నడచుననుట.

వ్యాక :— అంగ౹ బు = అంగంబునందు, సప్తమ్యర్థక ప్రథమ. [ప్రౌ కారక 20]

అలం :— ఉత్ప్రేక్ష.

వ॥ ఇట్లు కుహనాహితాగ్నియుఁద్వైర్థిక వేషాభినయ నిపుణుండునగు నాఖండలుండు, తపఃప్రభావతరంగితంబగు తదాశ్రమంబునఁ బటుకుటీకా 1 మండపంబున ధ్యాసించి, మాధ్యాహ్నికక్రియా చరణానంతరంబునంబ్రాణాగ్నిహోత్రప్రీణనంబుననుసంధించి, యతిస్నిగ్ధవర్ణముగ్ధాకృతి యుఁజతురపదవిన్యాసధన్యాసికయునై 2 సుకవికవితయుం 3 బోనిహోమధేనువునకు 4 ఁబథశ్రమంబునో సరిం 5 చుచు, నుచితగతి 6 నొక్కించుకతడవువిశ్రమించి, సచ్ఛాత్రుండై మెత్తమెత్తనచని,7యెండకండక్రొవ్వుదఱుగు 8 నత్తఱి,సరిత్తీరంబునకు సాయంసంధ్యాసముపాసనార్థంబు నిర్గమింపనుద్యుక్తుండై; ముక్తసమాధియగు నయుతుని కడకుంజనుటయు, నతండతనికి నాతిథేయంబు ప్రియంబుననాచరించి, సుఖాసీనుఁ గావించి, యాగమనకారణంబడుగుటయుఁగృత్రిమమౌని ధాత్రీసురపుత్రునకిట్లనియె, **192**

---

192 ప :- 1 మండపమధ్యంబున - ర; మండపమధ్యంబు – గౌ; మండపంబు – అ. 2 సుకవితయుం – గౌ; సుకవికవితయుం- ర.అ. 3 బోలెనున్న - ర; ముద్రి (అ), బోని - గౌ. అ. 4 బద్ధశ్రమం బొనరిం - త; బథశ్రమంబు – ర. అ. 5 పుచు – గౌ; చుచు- ర. అ. 6 నొక్కింత - ర, గ; నొక్కించుక – అ. 7 యెండ క్రొవ్వు – త; యెండకండక్రొవ్వు – అ. 8 నంతసరి - క; నత్తఱి – ర; అ.

వ్యా :— ఇట్లు = ఈప్రకారముగా, కుహనాహితాగ్నియున్ = కపటాగ్నిహోత్రియు, తైర్థిక వేష = తీర్థయాత్రాపరుని యొక్క భూమికను, అభినయ = ఆహార్యాదులచే అభినయించుట యందు, నిపుణుఁడున్ = నేర్పరియు అగు = అయిన, ఆఖండలుండు = ఇంద్రుఁడు, తపఃప్రభావ = తపోమహిమచేత, తరంగితంబు = వెల్లిగొనినది - అతిశయించినది, అగు = అగు[న], తదాశ్రమంబునన్ = ఆముని నివాసస్థానమునందు, పటుకుటికామండపంబు= పటుకుటీరముయొక్క (గుడ్డతో వేసినపాకయొక్క - డేరాయొక్క) చవికెయందు. అధ్యాసించి = కూర్చుండి, మాధ్యాహ్నిక = మధ్యాహ్నమందయిన, క్రియా = కర్మలయొక్క, ఆచరణానంతరంబునన్ = అనుష్ఠించిన పిమ్మట, ప్రాణాగ్నిహోత్ర = భోజనమునకుముందు చేయు పంచప్రాణరూపమగునగ్నియొక్క, ప్రీణనంబున్ = తృప్తిని గలిగించుటను, అనుసంధించి = కూర్చి, అతిస్నిగ్ధ = మిక్కిలి చిక్కనయిన, (మిక్కిలిగాఢమయిన) వర్ణ = రంగుచేత, ముగ్ధ = మనోహరమయిన, ఆకృతియున్ = ఆకారముగలదియు, (అక్షరరమ్యతగలదియు - అనుట) - అని సుకవికవితాపక్షమునర్థము. చతుర = సుందరములయిన, పద = అడుగులయొక్క, విన్యాస = నిక్షేపించుటచేత, ధన్య = పొగడఁదగిన, ఆసికయున్ = స్థితిగలదియు, ఐ = అయి - అనిహోమధేనుపక్షముననర్థము. చతుర = నిపుణములయిన, పద = మాటలయొక్క, విన్యాస = రచనచేత, ధన్య = పొగడఁదగిన, ఆసికయున్ = స్థితిగలదియు, ఐ = అయి - అని సుకవికవితాపక్షముననర్థము. సుకవికవితయుంబోని = సత్కవికవిత్వమువంటి, హోమధేనువునకున్ = హోమముయొక్క గోవునకు - హోమార్థమయిన గోవునకు, పథశ్రమంబున్ = మార్గాయాసమును, (వాటఃపథశ్చమార్గశ్చ- త్రి. ని.) ఓసరించుచున్ = తొలఁగించుచు, [పోఁగొట్టుచు] ఉచితగతిన్= తగురీతిని, ఒక్కించుకతడవు = కొంచెముసేపు, విశ్రమించి =

శ్రమతీర్చుకొని, సచ్ఛాత్రుఁడై = శిష్యులతోఁగూడుకొన్నవాఁడయి, మెత్తమెత్తన = ఒయ్యనొయ్యనే. [మెల్లమెల్లగనే] చని = అరిగి, ఎండ = ఆతపముయొక్క, కండకొవ్వు = కండకావరము - తీక్ష్ణత్వము, తఱుగున త్తఱిన్ = తగ్గినయానమయమునందు, సరిత్ = నదియొక్క, తీరంబునకున్ = ఒడ్డునకు, సాయంసంధ్యా = మాపటి సంజయొక్క, సముపాసనార్థంబు = ఉపాసించుటకొఱకు, నిర్గమింపన్ = బయలుదేఱుటకు, ఉద్యుక్తుండై = సిద్ధమయినవాఁడయి. ముక్త = విడువఁబడిన, సమాధియుగు = ధ్యానము గలవాఁడగు, (సమాధిర్నా సమర్థనే ధ్యాననీవాకనియమే కావ్యస్యచగుణాంతరే - మే.ని.) అయుతుని కడకున్ = అయుతునియొద్దకు, చనుటయున్ = అరుగుటయు, అతండు = అతఁడు - అయుతుఁడు, అతనికిన్ = అతనికి - వృద్ధబ్రాహ్మణునకు, ఆతిథేయంబు = ఆతిథ్యము, ప్రియంబునన్ = ప్రీతితో, ఆచరించి = చేసి, సుఖాసీనున్ = స్వస్థముగాఁగూర్చున్నవానినిగా, కావించి = ఒనర్చి, ఆగమనకారణంబున్ = రాకకుహేతువును, అడుగుటయున్ = పృచ్ఛించుటయు, కృతిరమముని = కృతకమౌని; ధాత్రీసురపుత్రునకున్ = భూదేవ (బ్రాహ్మణ) నందనునకు - అయుతునకు, ఇట్లు = ఈప్రకారముగా, అనియెన్ = పలికెను.

ప్రాణాగ్నిహోత్ర *--- ప్రాణాహుతులను భోజనమునకు ముందీయవలెను. చూ 4-170 వ్యాఖ్య.

వ్యాక ;— హోమధేనువు - తాదర్థ్యమునషష్ఠీసమానము. అశ్వఘాసము. ధర్మపత్నిలోనగువానివంటిది. "చతుర్థీతదర్థార్థబలిహితసుఖరక్షితైః [2-1-36] -- తదర్థేన ప్రకృతివికృతిబావవ్వగృహ్యతే -- అశ్వఘాసాదయస్తుషష్ఠీసమాసాః" [సి. కౌ.]

పుత్ర - ఏకతకారకమునుగలదు. చూ. 1-9

అలం :— శ్లేషానుప్రాణితమగునుపమ.

చ॥ అమృతభుగాస్పదంబు విశ 1 దాప్సరమున్, నవపారిజాతము
ఖ్య 2 మహిజరాజిరాజితమనంతఫలాయతనంబు, నిత్యర
మ్యమునగునొక్క యాశ్రమము హైమనగోపరిసీమనుల్లసి
ల్లుమదధివాసమై, మదములోభముక్రోధము మొల్వ 3 వచ్చుటన్ 193

వ్యా :— అమృతభుజ్ = జలభక్షకులకు - జలభక్షణచేయుచుండపమొనర్చుమునులకు, [పయఃకీలాలమమృతమ్ - అమ] అస్పదంబున్ = నిలయమును - అని యాశ్రమపక్షమునసర్థము. అమృతభుజ్ = సుధాభోజనులయొక్క - దేవతలయొక్క, (పీయూషమమృతం సుధా - అమ) అస్పదంబున్ = నిలయమును - అని స్వర్గపక్షమునసర్థము. విశద = స్వచ్ఛమయిన, అప్ = జలముతోఁగూడిన, సరమున్= సరస్సులుగలదియు - అనియాశ్రమపక్షమునసర్థము. విశద = పరిశుద్ధులగు; అప్సరమున్ = అప్సరసలుగలదియు - అని స్వర్గపక్షమునసర్థము. నవ = క్రొత్తవయిన - లేఁతవయిన, పారిజాత = పారిభద్ర (దేవదారు) వృక్షములు; [పారిభద్రోనింబతరుర్మందారః పారిజాతకః - అమ] ముఖ్య = మొదలయిన, మహిజరాజి = చెట్లపంక్తిచేత, రాజితము = ప్రకాశితమును - అనియాశ్రమ పక్షమునసర్థము. నవ = క్రొత్తవయిన, పారిజాత = పారిజాతము, (ఇదిదేవతరువులలో నొకటి) ముఖ్య = మొదలయిన, మహిజరాజి = చెట్లపంక్తిచేత, రాజితము = ప్రకాశితమును - అని స్వర్గపక్షమునసర్థము. పారిజాతము దేవతావృక్షములలోనొకటి. (1.62 వ్యా.)

అనంత = మేరలేని, ఫల = పండ్లకు, ఆయతనంబున్ = నిలయమును - అని యాశ్రమపక్షమునసర్థము. అనంత = మేరలేని,

---

193 ప:- 1 దాక్షరముఁ - గౌ; దాప్సరమున్ - ర; ఉ, 2 మహిమరాజి-గౌ. మహిజరాజి - ర, ఉ. 3 దచ్చుటన్-ముద్రి (ఉ)ర; వచ్చుటన్-ఋ;గౌ

ఫల = కర్మఫలములయొక్కయు, ఆయతనంబున్ = ఆశ్రమమును-అని స్వర్గపక్షముననర్థము. (పుణ్యకర్మానుభవమునకు స్థానమనుట.) నిత్య = ఎల్లప్పుడు, రమ్యమున్ = సుందరమయినదియు - అని యాశ్రమపక్షముననర్థము, నిత్య=ఎల్లప్పుడు; రమ్యమున్ = క్రీడింపం దగినదియు, (రముక్రీడాయామ్ - సి. కౌ. రమ్ + యత్) -అని స్వర్గ పక్షముననర్థము. అగు = అయిన, ఒక్క = ఒక, ఆశ్రమము = పర్ణ శాల, మత్ = నాయొక్క, అధివాసమై = నివాసస్థానమయి, హైమ నగ = హిమమయమగు పర్వతముయొక్క - హిమాలయపర్వతము యొక్క, ఉపరిసీమన్ = పైభాగమునందు, ఉల్లసిల్లున్ = ఒప్పును - అని యాశ్రమపక్షముననర్థము. ఒక్క = ఒకఆశ్రమము, మత్ = నాయొక్క, అధివాసమై = నివాసస్థానమయి, హైమనగ = హేమ (బంగారు) మయమునయిన పర్వతముయొక్క -మేరుపర్వతముయొక్క, ఉపరిసీమన్ = పైభాగమునందు; ఉల్లసిల్లున్ = ఒప్పును. (మేరువు దేవతావాసముగాన నిట్లుచెప్పుట - మేరుః సుమేరుర్హేమాద్రిరత్నసానుః సురాలయః-అమ) మదము = దురహంకారము. (గర్వము) లోభము = తృష్ణ, క్రోధము = కోపము, (ఇవియరిషడ్వర్గములోనివి) అచ్చటన్= అక్కడ-ఆశ్రమమునందు, అనియాశ్రమపక్షముననర్థము; మేరువునందు-అని స్వర్గపక్షముననర్థము. మొల్వవు = మొలకెత్తవు - సంభవింపవు.

అః ం :— శ్లేష.

*క॥ శ్రీసఖులుసుగుణరత్నా
వాసులుసమవర్తనప్రవర్తులునయ్యున్
నాసరివారలుగనిమనం
గానుఖి 1 నైయేనొనర్తుంగాంపురమచటన్. **194**

---

194 పః- *ఈపద్యము 'త' లోలేదు -అ. 1 సుఖియై-గౌ; సుఖినై - ర, అ.

వ్యా :— శ్రీసఖులున్ = సంపదలకు మిత్రులును - సంపన్నులును, అని వృద్ధబ్రాహ్మణపక్షమునరము. శ్రీసఖులున్ = సంపదలకు మిత్రులు - కుబేరులు, అన యింద్రపక్షమునన్నము. సుగుణ = సద్గుణములనెడు, రత్న = మణులకు, ఆవాసులు = స్థానములయిన వారు - అని వృద్ధబ్రాహ్మణపక్షమునర్థము. సుగుణ = నీలాదివర్ణములుగల, (గుణః - శుక్లకృష్ణరక్తపీతాదిః - శబ్దక) రత్నావాసులున్= రత్నాకరములు (సముద్రములు) గలవారును - వరుణులును, అని యింద్రపక్షమునన్నము. సమవర్తన = సమానమయిన ప్రవర్తనచేత - పక్షపాతములేని నడవడిచేత, ప్రవర్తులున్ = వర్తించువారును - అని వృద్ధబ్రాహ్మణపక్షమునర్థము. సమవర్తన =పక్షపాతములేని ప్రవర్తనచేత ప్రవర్తులున్ = వర్తించువారును - యమధర్మరాజులును (సమవర్తి= యముఁడు) అని యింద్రపక్షమునన్నము. అయ్యున్ = అయియు, నాసరివారలు = నాసాటివారు, కని = (నన్ను) ఆశ్రయించి. మనఁగా = జీవింపఁగా, ఏన్ = నేను. సుఖినై = సుఖవంతుఁడనై అచటన్ = అక్కడ - అయాశ్రమనము, అని వృద్ధబ్రాహ్మణపక్షమునర్థయ. కాఁపురము = సంసారము, ఒనర్తున్ = చేయుదును.

అలం :— శ్లేష.

తే॥ అఖిలధర్మంబులందు గార్హస్థ్యమెన్న
నుత్కటుంబనితన్నిష్ఠనోర్పుగలిగి
జగతిఁదీర్థాచరణబుద్ధిసంచరింతు
ధ్రువతపోగామి! యీామేనుధ్రువము 1 గామి 195

వ్యా :— ధ్రువతపోగామి = ఎడతెగవితపస్సునందుసాగువాఁడా! ఎన్నన్ = భావింపఁగా, గార్హస్థ్యము = గృహస్థాశ్రమము,

195 ప:- 1 గాదు - క; గామి - ర, అ.

అఖిలధర్మంబులందున్ = సమస్త ధర్మములందును, ఉత్కటంబని = గొప్పదని, తద్ = దానియందలి - గృహస్థాశ్రమమునందలి. నిష్ఠన్= శ్రద్ధచేత, ఓర్పుగలిగి = ఓరిమిగలవాఁడనయి, ఈమేను = ఈశరీరము, ధ్రువముగామి = శాశ్వతముకాకుండుటచేత, జగతిన్ = భూమియందు, తీర్థాచరణబుద్ధిన్ = తీర్థయాత్రచేయవలెనను తలంపుతో, సంచరింతున్= తిరుగుదును.

ఉ॥ కంచిభజించి, శేషగిరిఁగన్గొని, 1 యాదిమురంగనాథుఁగీ
ర్తించి, ప్రయాగమాధవునుతించి, గయాప్రియుశ్రీగదాధరున్
గాంచి, కరిద్విషన్నగశిఖామణికిం బ్రణమిల్లి వార్ధినే
తెంచినకొయ్యవేల్పుఁగని, దిక్కులతీర్థములెల్లనాడుచున్. **196**

వ్యా :— కంచిన్ = కాంచీపురమును, భజించి = సేవించి, శేషగిరిన్ = శేషాద్రిని, వేంకటాచలమును కన్గొని = దర్శించి, ఆదిమున్ = ఆద్యుఁడయిన, రంగనాథున్ = శ్రీరంగనాథస్వామిని, కీర్తించి = కొనియాడి, ప్రయాగమాధవున్ = ప్రయాగ క్షేత్రము నందలి మాధవుని, నుతించి = స్తుతించి, గయాప్రియున్ = గయా క్షేత్రమునందుఁబ్రీతిగలవాఁడగు, శ్రీగదాధరున్ = శ్రీవిష్ణుమూర్తిని, కాంచి = దర్శించి, కరిద్విషద్+నగశిఖామణికిన్ = తలమానికము వంటి - అనఁగా శ్రేష్ఠమగు సింహాచలమునకు, ప్రణమిల్లి = నమస్కరించి, వార్ధిన్ = సముద్రమునందు, ఏతెంచిన = వచ్చిన, కొయ్యవేల్పున్ = దారువుతో నిర్మించినదేవతను - జగన్నాథస్వామిని, కని = దర్శించి, దిక్కులతీర్థములెల్లన్ = అన్నిదిశలయందున్న సర్వతీర్థముల యందు, ఆడుచున్=స్నానముచేయుచు మీఁదిపద్యముతోనన్వయము - కరిద్విషద్ = ఏనుఁగునకు శత్రువు - సింహము. కరిద్విషన్నగము = సింహాచలము.

---

196 ప:- 1 యాదిమ - గౌ; యాదిము - ర. అ.

కొయ్యవేలు - పురుషోత్తమమునందలి (=పూరీ) జగన్నాథస్వామివిగ్రహము కొయ్యతోనిర్మితము. "అమూర్దారుస్వరూపేణదృష్టాః-ఇత్యుత్కళఖండమ్ (శబ్దక)" "స్మారంస్మారం స్వగృహచరితందారుభూతోమురారిః" (చాటు)

కంచి - వరదరాజస్వామి. శేషగిరి - వేంకటేశ్వరస్వామి; శ్రీరంగము - శ్రీరంగనాథుఁడు; ప్రయాగ - మాధవస్వామి; సింహాచలము - వరాహలక్ష్మీనృసింహస్వామి, పురుషోత్తమము (పూరీ) - జగన్నాథస్వామి.

**వ్యాక** :— తీర్థములు = తీర్థములయందు - ప్రౌ. కారక 20.

ఉత్సాహము:- వచ్చివచ్చి 1 కల్వకచ్చువంటి యొంటివానిఁ, గ
న్నిచ్చవచ్చుగ్రచ్చకాయలెంచియాడువాని, 2 మో
విచ్చు 3 వెచ్చగంటివాని, వింటివెన్నముచ్చు, న
ప్పచ్చవిల్తుకన్నతండ్రిఁ 4 బాండురంగవిట్ఠలున్ **197**

**వ్యా** :— వచ్చివచ్చి = (తీర్థములందు స్నానముచేయుచుఅరుదెంచి యరుదెంచి, కల్వకచ్చువంటి = ఉత్పలదళమువంటి, ఒంటివానిన్ = ఒడలుగలవాఁడును కన్నిచ్చవచ్చు = కంటికింపగు, గ్రచ్చకాయలు = కాచస్థాలియొక్క [గ్రిచ్చతీఁగయొక్క] కాయలను [గ్రచ్చగచ్చనఁ జెల్వెఁగాంచుఁగాచస్థాలి - ఆం భా] ఎంచి = ఏటి, ఆడువానిన్ = క్రీడించువాఁడును, మోవిచ్చి = ముఖభాగమున [అగ్రిభాగమున]

---

197 పః- 1 కల్వకంబు - ముద్రి (అ). ర; కల్వకచ్చు - అ, గౌ. 2 మేవిచ్చి — ర; మోవిచ్చు - అ, గౌ. 3 నచ్చ - ముద్రి (అ) వెచ్చ - అ, గౌ. 4 బండరంగి - త; బాండురంగ - ర, అ. 5 వీరలున్ - గౌ; విట్ఠలుణ్ - ర, అ.

విశాలనముగలదియగు, (అరవిచ్చిన - అనుట) వెచ్చగంటివానిన్ = వేఁడికన్ను (ఫాలనేత్రము) కలవాఁడును, వెన్నముచ్చున్= నవనీత చోరుఁడును, అప్పచ్చవిల్తుకన్నతండ్రిన్ = ఆమన్మథునియొక్క జనకుఁడును, అగు, పాండురంగవిట్ఠలున్ = పాండురంగవిట్ఠలునిగూర్చి వింటిన్ = ఆకర్ణించితిని.

మోవిచ్చు - నిఘంటువులకెక్కలేదు. ఇది "మొగవిచ్చు" అను దాని రూపాంతము. మొగము+విచ్చు = మొగవిచ్చు. మొగము = మోము. మోము+విచ్చు = మోవిచ్చు.

వెచ్చగంటివానిన్-విట్ఠలునకు ఫాలనేత్రముండును. చూ. 5-56

విట్ఠలు - విట్ఠలశబ్దనిరుక్తికి, చూ. 1-213

వ్యాక :- ఒంటివాఁడు - ఒడలివాఁడు - అనియుండవలెను.

వెచ్చగంటివాఁడు = వెచ్చగంటి యొక్కవాఁడు - వెచ్చని కన్నుగలవాఁడు. అభాసబహువ్రీహి. చూ 1-213 వ్యాఖ్య.

పచ్చవిల్తుఁడు -- చెఱకువిల్లుగావేనికిఁగలదోవాఁడు - ఇక్షుధన్వుఁడు. ఇటువృత్తియందుఁబచ్చశబ్దమునకు విలక్షణార్థము.

విట్ఠలున్ - అను విశేష్యము ద్వితీయాంతమగుటచే, విశేషణములకు ద్వితీయయ్యెను. బా. కారక 19

అలం ;— వృత్త్యనుప్రాస.

వ॥ విని 1 యద్దేవదేవుసేవింపంజనువాఁడనై, పైజాడనపరిచ్ఛదంబుగా 2 నేగుదెంచితి; నీ 3 వెవ్వఁడవెద్దియభిలషించి భువనభయాన

---

198 వ:- 1 యద్దేవదేవుని - గౌ: యద్దేవదేవు - ర. అ. 2 జను - ర (పా) నేఁగు-ర,అ. 3 నీవెవ్వడ ... చున్నయది-ఈభాగము 'త'లో లేదు-అ.

కంబగు తపంబాచరించెదు? వాచంయమవంశ 4 కరీరంబ! యీ శరీరసాదంబునకు నాదికారణంబగు నీ 5 హృదయంబదయంబని యుచ్చరిం 6 చుటన నోరుపొక్కుచున్న యది; 7 యున్న దియున్న యట్లనొడువు 8 మనుడునవ్వడువిట్లనియె. **198**

**వ్యా :—** విని = (పాండురంగవిట్ఠలునిగూర్చి) ఆకర్ణించి, అద్దేవదేవున్ = ఆదేవులకు దేవుని - అవిట్ఠలుని, దేవదేవః = దేవానాం దేవేషువాదేవః, [శ్రేష్ఠత్వాత్ -- విష్ణుః శబ్దక] సేవింపన్ = భజించుటకై, చనువాఁడనై = అరుగువాఁడనయి, పైజాడన్ = పైరీతిని, సపరిచ్ఛదంబుగాన్ = సపరివారముగా, (పరివారః - పరిచ్ఛదః - అభి చిం.) ఏగుదెంచితిన్ = వచ్చితిని. ఈవు = నీవు, ఎవ్వఁడవు = ఎవఁడవు? ఎద్ది = దేనిని, అభిలషించి = కోరి, భువనభయానకంబగు = లోకభీకరమగు, తపంబు = తపస్సు, ఆచరించెదు = ఒనర్చెదవు? వాచంయమవంశకరీరంబమౌనికులమనెడు వెదురుయొక్క మొలకయయినవాఁడా! (వంశాకురేకరీరః . అమ) ఈశరీర = ఈదేహముయొక్క, సాదంబునకున్ = కృశించుటకు, (బక్కచిక్కుటకు) ఆదికారణంబు = మూలకారణము, అగు = అయిన, నీహృదయంబు= నీయొక్కమనస్సు, అదయంబని = కరుణలేనిదని, ఉచ్చరించుటన = పలుకుటచేతనే, నోరుపొక్కుచున్నయది = అధికతాపముకలుగుచున్నది. ఉన్నదియున్నయట్ల = ఉన్నదానినున్నట్లుగానే, నొడువుము=చెప్పుము. అనుడున్ = అన్నయనంతరము, అవ్వడువు = అబ్రహ్మచారి, ఇట్లు = ఈప్రకారముగా, అనియెన్ = పలికెను.

---

4 కంఠీరవం – డ, ద, బ; కరీరంబ - ర, అ, గౌ. 5 హృదయంబని - డ, ద, బ; హృదయంబదయంబని - ర, అ. 6 చుటనా నోరువొక్కు – గౌ; చుటననోరుపొక్కు - ర, అ. 7 యున్న యట్లు - అ; యున్నదియున్నయట్ల - ర; 8 మనవుడునవ్వటు- క; మనవుడునవ్వడు – గౌ, మనుడునవ్వడు – ర, అ.

నోరుపొక్కు - సూ. ని. లో నీజాతీయములేదు. "నానోరు పొక్కినది. My mouth is burnt or sore. To give much or be afflicted" [బ్రౌ]

వంశకరీరము, వంశకరీరుఁడు - అని ద్వివిధరూపములునుండ వచ్చును. "రాజవంశకరీరుండరాజవదన" [శృ. నై. 4-55]

క॥ ప్రియుతుఁడనుమునికుమారుఁడ
నయుతుండనువాఁడనియుతునగ్రజుఁడ! గత
స్మయ! విస్మయావహతపో
నియతి వెలుఁగు కలశజన్మునికిశిష్యుండన్. 199

వ్యా :— ప్రియుతుఁడను మునికుమారుఁడన్ = ప్రియుతుఁడను పేరుగల మౌనియొక్క నందనుఁడను, అయుతుండనువాఁడన్ = అయుతుఁడను పేరుగలవాఁడను, నియుతు = నియుతునియొక్క, అగ్రజుఁడన్ = అన్నను, గతస్మయ = నశించిన గర్వముగలవాఁడా! విస్మయావహ = అచ్చెరువుగలిగించు, తపోనియతిన్ = తపోనియమముచేత, వెలుఁగు = ప్రకాశించెడు, కలశజన్మునికిన్ = కుంభజునకు (అగస్త్యునకు) శిష్యుండన్ = ఛాత్రుఁడను.

కలశజన్ముఁడు - చూ 1-120 వ్యాఖ్య.

క॥ కులశిఖరినిభులు తనకుం
గలశిష్యులలోననెల్లగారవమారన్
1 గలశిసుతుండు కరుణా
కలశితలదృష్టిబెరయఁగాముముఁ 2 జూచున్. 200

---

200 ప:- 1 గలసీ - గౌ; గలశీ - ర, అ. 2 బ్రోచున్ - గౌ; జూచున్-ర,అ.

వ్యా :— కులశిఖరినిభులు = కులపర్వతములతో సమానులగు, తనకుంగల = తనకున్నట్టి, శిష్యులలోనన్నెల్లన్ = అందఱు ఛాత్రులలోపల, గౌరవమారన్ = వాత్సల్యమతిశయింపఁగా, కలశీసుతుండు = అగస్త్యుఁడు, కరుణా = దయయొక్క, అకల = కూర్పుగల, శీతలదృష్టిన్ = చల్లనిచూపు, బెరయగాన్ = ప్రస్ఫుటముకాఁగా, మమున్ = మమ్ము-మాయయుతనియుతులను, చూచున్=ఆదరించును.

కులశిఖరులు - చూ. 2.144; కలశీసుతుండు 1-120

ఛం :— ద్విప్రాసము.

అలం :— యమకము, ఉపమ.

ఉ॥ దాతయుదైవమున్ గురుఁడుఁదల్లియుఁదండ్రియునై, యభేద్యవి
ద్యాతిశయంబురాఁజొనిపి, యమ్మునిమున్నొకనాఁడుధాత్రృసం
జాతల, సస్మితాస్యజల 1 జాతల. జాతలతాంతసాయక
ద్యోతలనొక్కయిద్దఱుతలోదరులన్ మముఁ 2 జూపియిట్లనున్ 201

వ్యా :— దాతయున్ = (సర్వము) ఒసంగువాఁడును: దైవమున్ = దేవుఁడును, గురుఁడున్ = ఉపాధ్యాయుఁడును, తండ్రియునై = జనకుఁడునునై, అభేద్య = భేదింపశక్యముకాని. విద్యా = (వేద) విద్యయొక్క, అతిశయంబున్ = ఆధిక్యమును. రాఁజొనిపి = అలవడఁజేసి, అమ్ముని = ఆమౌని - అయగస్త్యుఁడు, మున్ను = పూర్వము, ఒకనాఁడు = ఒకదినము, ధాత్ర = బ్రహ్మవలన, సంజాతలన్ = జన్మించినవారును, సస్మిత = చిఱునవ్వుతోఁగూడిన, ఆస్యజలజాతలన్ = పద్మములవంటి ముఖములు గలవారును, జాత = పొడమిన, లతాంతసాయకద్యోతలన్ = మన్మథవికాసముగలవారును - మన్మథవర్ధితమయినశోభ (=కాంతి - చూ 4-148 వ్యా) గలవారును,

201 ప:- 1 జాతలతాంతనితాంతసా - ప: జలజాతలజాతలతాంతసా - ర,అ.
2 జూచి - ముద్రి (అ); గౌ, జూపి - ర, అ.

అగు, ఒక్కయిద్దఱుతలోదరులన్ = ఒకయిరువురుకాంతలను, మమున్= మమ్ము - మాకు, చూపి = కనఁబఱిచి, ఇట్లు = ఈప్రకారముగా, అనున్ = పలికెను.

వ్యాక :— తలోదరులన్ మమ్ముఁజూపి - ప్రయోజ్యకర్తకు బా. క్రియా 124 చే షష్ఠికావలెను. ఇటు, మమున్ - అని ద్వితీయ యయినది. చూ - ము. కౌ. క్రియా 44 (సూ. ము)

అలం :— యమకము.

క॥ మీకనికొనితెచ్చితినా
శీకానను వేఁడియిన్నలిననయనల మీ
రోకుఱ్ఱలార! పాణి
స్వీకృతిజ్యేష్ఠానుపూర్విఁజేకొనుఁడనుడున్. 202

వ్యా :— ఓకుఱ్ఱలార = ఓబాలకులారా! మీకని = మీ కొఱకని, నాళీకాసనున్ = పద్మాసనుని, [బ్రహ్మదేవుని] వేఁడి = అర్థించి, ఇన్నలిననయనలన్ = ఈపద్మాక్షులను - ఈకాంతలను, కొనితెచ్చితిన్ = తిసుకొనివచ్చితిని, మీరు = మీరలు, జ్యేష్ఠాను పూర్విన్ = జ్యేష్ఠానుక్రమముగా, [పెద్దచిన్నలవరుసలో - పెద్దవాఁడు పెద్దకన్యను జిన్నవాఁడుచిన్నకన్యను - అనుట] పాణిగ్రహణమునందు (వివాహమునందు) చేకొనుఁడు = (వీరిని) గ్రహింపుఁడు. అనుడున్= అన్నయనంతరము. (మీఁది పద్యముతోనన్వయము)

నాళీకాసనుఁడు - ఇది ఖగోళదృశ్యము. చూ 2-55 వ్యాఖ్య.

క। అవగుణగణశేవధులగు
ధవళాక్షులకీడుదలఁచి; దారాదరణ
వ్యవహృతికి మాఱుమొగమిడి
యవుఁగాదని కొన్నిమాటలాడితినతనిన్. 203

వ్యా:— అపగుణగణ = దుర్గుణసమూహమునకు, శేవధులు = నిధులు - స్థానములు, అగు = అయిన, ధవళాక్షుల = స్త్రీలయొక్క, కీడు = చెఱుగు తలఁచి = ఊహించి, దారఆదరణవ్యవహృతికిన్ = భార్యనభిః షింపుచేఁతకు, మాఱుమొగమిడి = పెడమొగముపెట్టి - పరాఙ్ముఖుఁడనై, అతనిన్ = అతనినిగూర్చి - అగస్త్యునుద్దేశించి, అవుఁగాదని = అవుననికాదని, కొన్నిమాటలు = కొన్నిపలుకులు, ఆడితిన్ = పలికితిని.

క॥ అడినకూడినకినుకన్
పీడినజడముడియుఁబొగలు 1 వెగలెడుచూపుల్
2 పోడెముగొనునిట్టూర్పులు
వాడినడెందమునుఁ మేనవడియుఁ 3 జెమరునై. **204**

వ్యా :— ఆడినన్ = (అవునుగాదని కొన్నిమాటలను) పలుకఁగా, కూడిన = కలిగిన, కినుకన్ = కోపముతో. పీడిన = ఊడిన, జడముడియున్ = జటాబంధమును, పొగలు = ధూమములు వెగలెడు = నిర్గమించెడు, చూపుల్ = దృక్కులు - కోపదృక్కులు, పోడెముగొను = త్వరితగతినొందు, నిట్టూర్పులు = నిశ్వాసములు, వాడిన, = ఖేదమునందిన, డెందమును = మనస్సును, మేనన్ = శరీరమునందు, వడియు = కాఱు, చెమరున్ = చెమటయు, ఐ = కలిగినవాఁడయి. (మీఁదిపద్యముతోనన్వయము)

ఐ = కలవాఁడగు, కలదియగు —

[1] తెల్లవిగోడుగును వెల్లసీవిరులునై,
యల్లవాఁడేపాండవాగ్రజుండు - ద్రో॰ 2-54

---

204 ప:- 1 వెడలెడు - ర; వెగలెడు - అ. 2 పోఁడిమి - ర, అ. బోడెము — గౌ. 3 జమరు - గ; జెమరు — అ, గౌ.

2 వెడలుపు, ఉరమునున్నైదోఃణుఁడొప్పెను త్తరకంతే విరాట 2-53
పోడెము = అశ్వాదులదుౢతగతి విశేషము. ఇటుదుౢతగతియను
నదిలక్షణార్థము.

క॥ శపియింపఁగఁదలఁచియున
త్తపసియుడిగెఁగఅవఁదలఁచితానెయుడుగు పా
ముపగిది. 1 శిఖవిడినంతనె
విపులామరవిపులకోపవిషముందిరుగున్. **205**

**వ్యా :—** అత్తపసి = అతపస్వి - ఆయగస్త్యుఁడు, శపియింపఁగఁదలఁచియున్ = శపింపనుద్దేశించియు, కఅవన్ = కాటువేయుటకు, తలఁచి = ఉద్దేశించి, తానె = తనంతనే, ఉడుగు = మాను, పాముపగిదిన్ = సర్పమువలె, ఉడిగెన్ = (శపింప) మానెను. శిఖ = జుట్టు, విడినంతనె = విడిపోఁగానే, విపులా = భూమియందలి, (విపులాగహ్వరీధాత్రీ - అమ) అమర = దేవతలయొక్క - భూసురుల యొక్క, (బ్రాహ్మణులయొక్క) విపుల = మిక్కుటమయిన, కోప విషమున్ = కినుకయనెడు గరళమును, తిరుగున్ = నివర్తించును.

**అలం ;—** ఉపమ, రూపకము.

క॥ నను వెడలనడిచినాత
మ్మునికివివాహంబానర్చెముని, కనకవిభా
జనకతనుద్యుతి విభవల
వనరుహాభవమానసోద్భవలనాకవలన్. **206**

**వ్యా :—** ననున్ = నన్ను, వెడలనడిచి = వెళ్ళఁగొట్టి, ముని = మౌని - అగస్త్యుఁడు, కనక = బంగారము యొక్క, విభా = కాంతిని, జనక = కలిగించెడు, తను = శరీరముయొక్క, ద్యుతివిభ

---

**205** పః- **1** సిగవి - గ; శిఖవిడినం - ముద్రి (అ). శిఖవిడునం - ఉ, గౌ.

వలన్ = కాంతిసంపదలుగలవారును, వనరుహాభవ = పద్మజునియొక్క (బ్రహ్మయొక్క) మానస = హృదయమువలన (నుండి), ఉద్భవలన్= పుట్టినవారును. అగు, అకవలన్ = అయమళమును, (అకవలపిల్లలను) నాతమ్మునికిన్ = నాయనుజునకు, వివాహంబొనర్చెన్ = పెండ్లిచేసెను.

వ్యాక:— కవలన్ - అను విశేష్యము ద్వితీయాంతమగుటచే విశేషణములకు ద్వితీయయయినది. [బా. కారక 19]

క॥ సలసలమను, కలశజు వె
1 గ్గలపుఁగినుక యెసటఁబడియుఁగరవడి, వడి 2 నౌ
శిలయంటి 3 చూచికొనియే
నిలువెడలితి నాక్షణంబ 4 యెత్తినభీతిన్. **207**

వ్యా — సలసలమను = సలసలమనెడు, కలశజు = కుంభభవునియొక్క (అగస్త్యునియొక్క) వెగ్గలపుఁగినుక = అధికమయినకోపమనెడు, ఎసటన్ = వంటకొఱకుఁగాఁగఁబెట్టిన నీటియందు పడియున్ = మునిఁగియు, కరవడి = కరఁగుపడి, [కాఁగి. వడిన్= వేగముగా - వెంటనే; ఔదలయంటి చూచుకొని = చావుతప్పెనుగదా! యనిగ్రహించి సంతోషించి, ఏన్ = నేను, అక్షణంబ = అక్షణమే - అప్పుడే, ఎత్తినభీతిన్ = ఉద్భవించిన భయముతో, ఇలువెడలితిన్ = గృహమువలన (నుండి) నిర్గమించితిని.

ఔదలయంటిచూచుకొను - జాతీయము. తలపగులకయథాప్రకారముగానున్నదా? యని ముందలయంటి చూచుకొనుటయను

---

207 ప:- 1 గ్గలపుంగినుకయనునెసటఁగలవడి - ముది (అ). ర; గలపుంగినుకయెసటఁబడియుఁగరివడి—గౌ; (గణభంగము) గ్గలపుఁగినుక యెసటఁబడియుఁగరివడి -అ; గరిసడివడి-క; 2 నావలయంటి-క; నౌఁదలయంటి - అ; నౌదలయంటి — ర. 3 చూచు - ర, అ; చూచి - గౌ; 4 యేపుదలిర్పఁ - గౌ, యెత్తినభీతిఁ - ర, అ.

నాపత్కాలచేష్టావిశేషమునఁ బట్టి యీజాతీయమేర్పడినది.

వ్యాక:— సలసల+అను = సలసలమను - ప్రౌ. సంధి 19
ఇలువెడలు = ఇంటివలన వెడలు - బా. కారక 21

అలం ;— రూపకము.

ఆ॥ విషనిభంబులైన విషయాభిలాషంబు
లెల్ల 1 నళ్ళఁబెట్టియేన బ్రహ్మ
చర్యధుర్యవృత్తి 2 నవరించుచున్నాఁడ
నుగ్రతపము మోక్షమొందుకోర్కి. 208

వ్యా :— విషనిభంబులు = గరళముతో సమానములు, అగు = అయిన, విషయాభిలాషంబులు = భోగవాంఛలు, ఎల్లన్ = అన్నియును, నళ్ళఁబెట్టి = సడలఁజేసి - విసర్జించి; ఏను = నేను; బ్రహ్మచర్యధుర్యవృత్తిన్ = బ్రహ్మచర్యాశ్రమభారమును వహించెడు వర్తనముచేత, మోక్షము = ముక్తిని, ఒందు = ప్రాపించు, కోర్కిన్= కాంక్షతో, ఉగ్రతపమున్ = భయంకరమగుతపస్సును, నవరించుచు న్నాఁడన్ = చేయుచున్నవాఁడను.

వ్యాక :— సడలు = నళ్లు (ము. కౌ. ప్రకీర్ణక 3)

క॥ అనుడుదరహాసరసమునఁ
దనవదనజరద్విధుండు తారుణ్యముగై
కొన, మందాందోళనమే
ళనమునళిరసమరమాయలాఁడిట్లనియెన్. 209

---

208 వ:- 1 ఁజెల్లఁబెట్టి - ముద్రి (అ). ర: సల్లపెట్టి - అ, గౌ.
2 నవరింపు - గౌ; నవరించు - ర, అ.

వ్యా:— అనుడున్ = (అయుతుఁడిట్లు) పలికినయనంతరము, మాయలాఁడు = మాయావి - కపటబ్రాహ్మణుఁడు, దరహాస = చిఱునవ్వనెడు, రసమునన్ = ద్రవముచేత - అమృతద్రవముచేత, (గుణేరాగేద్రవేరసః - అమ) తన = తనయొక్క. వదన = ముఖమనెడు, జరత్ + విధుండు = ముసలిచంద్రుఁడు, తారుణ్యము = యౌవనము, కైకొనన్ = పొందఁగా, మంద = అల్పమయిన. అందోళన = ఊఁగుటయొక్క, మేళనమునన్ = కూడికచేత, శిరము = తల, అమరన్ = ఒప్పఁగా, ఇట్లు = ఈప్రకారముగా, అనియెన్ = పలికెను.

ఛం :— మాయలాఁడు - వ్యంజనయతియే గ్రాహ్యము.

అలం :— రూపకము.

చ॥ ప్రయుతుఁడుమత్సఖుండతని ప్రాభవమున్ భవమున్ సుధీజన
ప్రియజనకంబు, లాగుణగరిష్ఠునిజ్యేష్ఠతనూజుఁడౌటమ
న్నయనయుగంబుహర్షసుధనానెనినుంగనుఁగొన్న; సాధుబో
ధయుత! భవద్విరుద్ధచరితంబుశ్రవఃపుటసూచియయ్యెడున్ 210

వ్యా :— ప్రయుతుఁడు = ప్రయుతుఁడనువాఁడు, (మీ తండ్రి) మత్సఖుండు = నాయొక్కమిత్రుఁడు, అతని = అతనియొక్క ప్రాభవమున్ = శ్రేష్ఠత్వమును, (ప్రాభవమ్ = శ్రేష్ఠత్వమ్, ఇతి శబ్దచంద్రిక) భవమున్ = సంసారమును, సుధీజన = పండితజనులకు ప్రియజనకంబులు = ప్రీతికరములు, ఆగుణగరిష్ఠుని = ఆసద్గుణముల యందు మిక్కిలిగొప్పవానియొక్క, జ్యేష్ఠతనూజుఁడు = పెద్దకుమారుఁడవు, ఔటన్ = అగుటచేత, నినున్ = నిన్ను, కనుఁగొన్నన్ = చూడఁగా, మత్ = నాయొక్క, నయనయుగంబు = కండ్లోయి, హర్షసుధన్ = సంతోషమనెడు నమృతమును, ఆనెన్ = కోరెను.

సాధుబోధయుత = ఉత్తమజ్ఞానముతోఁగూడుకొన్నవాఁడా! భవత్ = నీయొక్క, విరుద్ధచరితంబు = అయోగ్యమయిన నడవడి, శష్కులీపుట = డొప్పలవంటిచెవులకు, సూచి = సూది, అయ్యెడున్ = అగుచున్నది. (వినుటకుబాధాకరమగుచున్నదియనుట.)

ప్రయుతుఁడు సఖుఁడనుటచేనతఁడు స్వర్గస్థుఁడయ్యెనని తెలియుచున్నది.

సఖుండు - సమానఃఖ్యాతీతిసఖః, "సఖః = మిత్రః, సహాయః" (సర్వ. సం.) శాంతి 3_48.

అలం :— రూపకము.

మ॥ కులధర్మంబెడలించి 1 నీగురునకుంగోపంబువుట్టించి; మి
త్రులసౌభ్రాత్రనివాసదేశములనీతోఁబుట్టులంబాసి; ని
శ్చలతన్ వ్రేలెదవుట్టిగట్టుకొని, దుస్సాధంబునుమ్మీ! స్మర
జ్వలనజ్వాలికసోఁకనీక నిలుపన్ జ్ఞానామృతస్యందమున్. **211**

వ్యా :— కులధర్మంబు = వంశాచారమును; (ధర్మాః పుణ్యయమన్యాయస్వభావాచారసోమపాః - అమ) ఎడలించి = విసర్జించి, నీగురునకున్ = నీయుపాధ్యాయునకు_అగస్త్యునకు, కోపంబువుట్టించి = కినుకకలిగించి, మిత్రులన్ = సఖులను, సౌభ్రాత్ర = మంచిసహోదరభావమునకు, నివాసదేశములన్ = ఉనికిపట్టులగు, నీతోఁబుట్టులన్ = నీసహజన్ములను, పాసి = ఎడఁబాసి, నిశ్చలతన్ = స్థిరత్వముతో, ఉట్టిగట్టుకొనివ్రేలెదవు = దృఢప్రతిజ్ఞుఁడవై _దృఢదీక్షవహించినవాఁడవై యున్నావు. స్మరజ్వలనజ్వాలిక = మన్మథాగ్నికీల; సోఁకనీక = తగులనీయక, జ్ఞాన = బోధమనెడు, అమృతస్యందమున్ = ఘృత

---

211 ప:- 1 శ్రీగురు - ముద్రి (అ), ర; నీగురు - అ.

రసమును, (అప్పుష్పృతామృతే - అమ) నిలుపన్ = నిరోధించుట, దుస్సాధంబుసుమ్మీ = సాధింపశక్యముకానిది సుమా!

తోఁబుట్టులన్ - అనుటలోకవ్యవహారానుసారి. బహుత్వమవివక్షితము. అయుతునకు నియుతుఁడొక్కఁడేతోఁబుట్టువు.

అలం :— రూపకము.

చ॥ చలనవిహీన వృత్తినడినన్న పరాశరుఁడాదియైన య
య్యలయలరాయివంటిహృదయంబులు నీరుగఁజేయుబోయపూ
విలుతున కెంతదొడ్డపని? వెన్నెల 1 బిట్టునఁగాసినంతలో
పలనకరంగిపొంగు 2 పసిబాలుర చిత్తముమెత్తఁజేయఁగన్. **212**

వ్యా :— చలనవిహీనవృత్తిన్ = చలించుటలేని ప్రవృత్తిచేత, నడినన్న = ప్రసిద్ధికెక్కిన, పరాశరుఁడు = పరాశరమహర్షి, ఆదియైన = మొదలగు, అయ్యల = పూజ్యపురుషుల యొక్క, అలరాయివంటి = అపాషాణసదృశములయిన - పాషాణములవంటివిగాఁబ్రసిద్ధికెక్కిన, హృదయంబులు = మనస్సులను, నీరుగన్ = ద్రవించునవిగా, చేయు = ఒనర్చు, బోయ = కిరాతుఁడగు - క్రూరుఁడగు, పూవిలుతునకున్ = పుష్పచాపునకు, (మన్మథునకు) వెన్నెల = చంద్రిక, బిట్టునన్ = బిఱ్ఱుమని, కాసినంతలోపల = ప్రసరించునంతలోనే, కరంగి = ద్రవించి, పొంగు = సంతోషపడు, పసిబాలుర = పసిబిడ్డల - లేఁబ్రాయపుయువకుల, చిత్తము = మనస్సులు, మెత్తఁజేయఁగన్ = రసార్ద్రముగావించుట, ఎంతదొడ్డపని = ఎంతటి దుష్కరకార్యము. (దుష్కరకార్యముకాదనుట)

అల ప్రసిద్ధినిదెలుపును.

---

212 ప:- 1 బిట్టునికా - ముద్రి(అ);ర; బిట్టున - అ, గౌ. 2 వసిబాలువి-గౌ; పసిబాలుర - ర, అ.

బిఱ్ఱున - కాయుటయందగుననుకరణము,

వ్యాక :— చిత్తము - జాత్యేకవచనము. పూవిలుతుఁడు = పూవువేనికివిల్లోవాఁడు - మన్మథుఁడు. [బా సమాస 22 ] కాయి= ఊయి. ద్విరేఫకము. [ము. కౌ. సంజ్ఞా. 9]

మ॥ లలితాగారవిహారులై, మణిమయాలంకారులై, 1 ఖేలవ
ల్లలనాలాలితులై, యమూల్యమృదుచేల 2 ద్యోతితాకారులై
కలమాన్నప్రియులై, సుగంధధరులై. కందర్పునిం 3 బోలి భూ
తలనాథుల్ జనకాదులొందిరిగదా! తత్తాదృగానందముల్. **213**

వ్యా:— లలిత = మనోహరములయిన, (లలితః = సుందరః-శబ్దక) అగార = మందిరములయందు, (భవనాగారమందిరమ్_అమ) విహారులై = విహరించువారయి, మణిమయ = రత్నమయములగు అలంకారులై = ఆభరణములుగలవారయి, ఖేలవత్ = క్రీడావతులగు, లలనా = కాంతలచేత - నాట్యకత్తెలచేత, లాలితులు ఐ = లాలింపఁబడినవారయి, అమూల్య = వెలలేని, మృదు = కోమలములగు, చేల = వస్త్రములచేత - జిలుఁగువలువలచేత, ద్యోతిత = ప్రకాశించిన, ఆకారులై = ఆకృతిగలవారయి, కలమఅన్నప్రియులై = వరియన్నమునందుఁబ్రీతిగలవారయి, సుగంధధరులై = చందనమునుధరించువారయి - ఒడలికిఁజందనచర్చచేసికొన్నవారయి. (సుగంధమ్ = చందనమ్ - ఇతిరాజనిర్ఘంటః - శబ్దక) కందర్పునిన్ = మన్మథుని, పోలి = ఎనసి, (సరిపోలి) భూతలనాథుల్ = పుడమిఱేండ్లగు, జనకాదులు = జనకమహారాజుమున్నగువారు, తత్తాదృక్ = సాటిలేని, ఆనందముల్ = సుఖములను - మోక్షసుఖములను, (ఆనంద= సుఖే-శబ్దస్తో) ఒందిరిగదా = ప్రాపించిరిగదా!

---

213 పః- 1 శీలవ - ముద్రి (అ), ర; గౌ; ఖేలవ - అ. 2 జ్యోతి - గౌ; ద్యోతి - ర, అ. 3 బోలి - గౌ; బోని - ర, అ.

జనకాదులు మునులవలెఁబర్ణశాలలో నివసింపలేదు, సుందరమందిరములో విహరించిరి. మునులవలె రుద్రాక్షలు ధరింపలేదు; మణిమయాలంకారములను ధరించిరి. మునులవలె ఋతుకాలధర్మపత్నీ సమాగమములతో బ్రహ్మచర్యము నెఱపలేదు; క్రీడావతులచే లాలితులయిరి. మునులవలెఁగావిచీరలచే మఱుఁగువడ్డయాకారములతో నుండలేదు, జిలుఁగు వలువలచేఁబ్రకాశించినయాకారములతో నుండిరి. మునులవలె నివ్వరియన్నము నరుచితో భుజింపలేదు, కలమాన్నము నఃబ్రీతితో భుజించిరి. మునులవలె విభూదిపూసికొనలేదు, చందనచర్చలు చేసికొనిరి. అట్లు రాజభోగములననుభవించియు సాటిలేని మోక్షసుఖములను బ్రాపించిరి. కావున నిరీహులగు మునులకు గృహస్థాశ్రమము మోక్షప్రతిబంధకము కానేరదని భావము.

తత్తాదృక్ - చూ. 1-78 వ్యాఖ్య.

మ॥ కలలో వార్తలు విప్పిచెప్పెడు క్రియన్ గాథాపురాణార్థముల్
దెలుపన్నేర్తురుగాని, నేరరుసుమీ! తీవ్రవ్రతాచార 1 శ
ష్కులులై యుఁడెడుముఁండ 2 ధారులునుముక్తుల్ డాయఁగాఁజింతకా
యల 3 కజ్జాయముతో యమింతచదరంబా? తత్పరిష్వంగముల్. **214**

వ్యా:— తీవ్రవ్రతాచార = తీక్ష్ణములయిన వ్రతముల యొక్కయాచరణమునకు, శష్కులులై = చక్కిలములయి - ఖాద్యములయి, [తీవ్రవ్రతములచేత శుష్కించినవారయి - అనుట) ఉండెడు = వర్తించెడు, ముండధారులును = బోడితలలను దాల్చినవారును - సన్న్యాసులును, కలలో వార్తలు = స్వప్నమునందలి వృత్తాంతములు,

---

**214** పః- 1 చకులునై - క; చష్కులులై - త; శష్కులులై - ర, అ.
2 ధారులు, సుముక్తుల్ - ముద్రి (అ), ర, ధారులునుముక్తుల్ - అ, గౌ. 3 ఖజ్జాయ – గౌ; కజ్జాయ - ర; అ.

విప్పిచెప్పెడు క్రియన్ = వివరించి చెప్పునట్లు, గాథా = ప్రాకృత భాషాపద్యములయొక్కయు, (గాథా = ఆర్యాచ్ఛందసిప్రాకృతాది రచితేపద్యే-శబ్దస్తో) పురాణ - పంచలక్షణములయొక్కయు (పురాణంపంచ లక్షణమ్ - అమ) అర్థముల్ = అర్థములను, తెలుపన్ = ఎఱిఁగించుటకు నేర్తురుగాని = సమర్థులగుదురుగాని, ముక్తుల్ = మోక్షములను, డాయఁ గాన్ = సమీపించుటకు (మోక్షములుపొందుటకు) నేరరుసుమీ = సమర్థులు కారుసుమా! చింతకాయలకజ్జాయము తోయము = ఇది చింత కాయలతో నప్పములుచేయుటవంటిది - అసాధ్యము. [దీ. పి] తద్ = వానియొక్క - ఆమోక్షములయొక్క, పరిష్వంగముల్= అలింగనములు - సమాగమములు. ఇంతచదరంబా ?= ఇంతసులభమా?

తీవ్రవ్రతాచారశష్కులులు - కఠోరనియమశష్కులులైయుండెడి వారికి - ఉ నా 5_51.

గాథా - ఇది గాథాసప్తశతి బేతాళపంచవింశతియను వానిని సూచించును. "గానటుబీనటేచదివి గాథలు త్రవ్వు తెనుంగువారికిన్" (నృసింహ 1-9)

పురాణములు - చూ1-23 వ్యాఖ్య.

మ॥ వరసారస్వతపట్టభద్రులు కవుల్ వర్ణించి వర్ణించియున్
సరసావంతయుఁగానలేరు 1 తుదయోషావిభ్రమాంభోధికి
న్వరసాంతఃకరుణుండవైయెటులుగానిందించెదోయయ్యా, స
త్సరసాకారముదారమన్మథకళాసత్వస్వశృంగారమున్. **215**

వ్యా :— వర = శ్రేష్ఠములయిన, సారస్వత = కావ్య శాస్త్రములయందు, పట్టభద్రులు = మూర్ధాభిషిక్తులగు, కవుల్ =

---

215 ప :- 1 తుది - ర; తుద - అ, గొ.

కవయితలు, వర్ణించివర్ణించుయున్ = మాటిమాటికివర్ణనచేసియు, తుదన్= అంతమునందు - తుదకు, యోషా = స్త్రీలయొక్క, విభ్రమ = యౌవనమువలనఁగలిగిన శృంగారచేష్టలనెడు. [విభ్రమః = యోషితాం యౌవనజోవికారోవిభ్రమః, ఇత్యేకే-శబ్దస్తో] అంభోధికిన్= సముద్రమునకు, సరన = సామీప్యము - అవధి (హద్దు) అవంతయున్ = అవగింజంతయు - అత్యల్పమయినను, కానలేరు = తెలియఁజాలరు. ఓయయ్య = ఓకుఱ్ఱవాఁడా! (ఇది వాత్సల్యసూచకము) తత్సరసాకార = అరసవంతమయిన స్వరూపముగలదియగు, ఉదార = గొప్పదయిన, మన్మథకళా = మదనకళయందు, సర్వస్వ = సాకల్యమయిన, శృంగారమున్ = కాంతావిషయకమగు ననురాగమును, నిరస = నీరసమయిన అంతఃకరణుండవై = మనస్సుగలవాఁడవయి, (అంతఃకరణంతుమనో నిగుః - త్రి ని.) ఎటులుగాన్ = ఏప్రకారముగా, నిందింతువో = దూఱుదువో! తెలియదు- అనికిర్యయధ్యాహార్యము- [పౌ. వాక్య 14]

సారస్వతము — "సరస్వత్యా ఇదం సారస్వతమ్" కావ్యవాఙ్మయము సాహిత్యము. కావ్య శాస్త్రవాఙ్మయములు రెండును గలిసిసారస్వతమని వ్యవహారము. కాని నిఘంటువులందీ యర్థముకానరాదు, "దేవీంవాచముపాసతేహిబహవః సారంతుసారస్వతం, జానీతేనితరామసౌగురుకులక్లిష్టోమురారిఃకవిః" గురుకులక్లేశము శాస్త్రధ్యయనమునకుఁదప్పనిసరి. "విద్వత్త్వయఃకవయఃకేవలకవయస్తుకేవలంకపయః" అని యభియుక్తోక్తి. కాననిట, సారస్వతశబ్దముకావ్యశాస్త్రవాఙ్మయపరముగాగ్రాహ్యము.

సీ॥ కీలారముననుండి పాలింటికేతెర
బహుధాన్యములు చేలఁబండియొనఁగ
నెడనెడఁ 1 బెండిండ్లుపడుగులుఁబొడమఁగ్ర
తార్థులెయర్థించునర్థులలరఁ

216 ప ః- 1 బెండ్లిండ్లు - ర, అ.

బరిచారికాకోటి పని 2 పాటు వాటింపఁ
జుట్టంపుసందండి సెట్టుకొనఁగ
గ్రామమెంతయు నిజప్రాభవంబున మన
సత్యనిష్ఠకుఁ 3 దన్ను సాక్షిగోర

తే॥ నిత్యనైమిత్తికములు నిర్నిద్రబుద్ధి
నాచ 4 రించుచుహరి 5 భుక్తమాత్మభార్య
6 భక్తినిడభుక్తికొనుచున్కి ముక్తిగాని
నిదురవంటిది 7 రాతివంటిదియుఁగాదు. **216**

వ్యా :— కీలారముననుండి = పశువుల మందయందుండి, పాలు = క్షీరము, ఇంటికిన్ = గృహమునకు, ఏతేరన్ = రాఁగా, బహుధాన్యములు = పెక్కువడ్లు, చేలన్ = సస్యములందు, పండి = ఫలించి, ఒరగన్ = [సస్యములు] వంగఁగా.

వ్యాక :— చేలన్ - అనుసప్తమికి, చేలు - అని ప్రథమ యగుట విభక్తివిపరిణామము. [ప్రౌ. కారక 26] (చేలన్, బహుధాన్యములు పండి, చేలు - ఒరఁగన్)

(2) ఎడనెడన్= అప్పుడప్పుడు, పెండిండ్లున్ = వివాహములును వడుగులున్ = ఉపనయనములును, పొడమన్ = జరుగఁగా, అర్థించు = వేఁడు, అర్థులు = యాచకులు. కృతార్థులై = నెఱవేఱిన ప్రయోజనముగలవారయి, అలరన్ = సంతోషింపఁగా.

---

2 వాట - గౌ: పాటు - ర. అ 3 దన - గౌ: దన్ను - ర. అ. 4 రింపుచు - గౌ: రించుచు - ర, అ. 5 భక్తినాత్మ - గౌ; భుక్తమాత్మ - ర, అ. 6 భుక్తి - గౌ; భక్తి - ర, అ. 7 రాయి-గౌ; రాతి - అ; జాతి - అ.

వ్యా :— పుక్కిటియోవరిన్ = పుక్కిటియొక్క గర్భగృహమునందు - పుక్కిటిలోపలిభాగమునందు, చదువుపుత్తడిన్ = విద్యామయుమయిన బొమ్మను - సరస్వతీ దేవిని, హత్తిన = నిలుపుకొనిన, పెద్దకయినన్ = విజ్ఞానకయినను - బ్రహ్మకైనను, మీరు = మీరలు, ఒక్కొక్కవేళన్ = ఒకొక్కప్పుడు, పాటవమునొందమి చెందినన్ = దక్షతలేమిని బొందినచో; (తడఁబాటుకలిగినచో - అనుట) చక్కఁబెట్టువారు = సవరించువారు, (అట్టిమీయంతవారే) అక్కట = అయ్యో! ఒక్కటన్ = ఒకవిషయమునందు, బెడఁకి = తొట్రుపడి, ఆడినన్ = పలికినచో, కీడుఅనన్ = అనుచితమనుటకు, ఎవ్వఁడు = ఎవఁడు, ఓపున్ = సమర్థుఁడగును? (సమర్థుఁడుకాఁడనుట) పేరు = మిక్కిలి, ఉక్కునన్ = వేగముతో, ఏఱు = నది, నిక్కి = ఉబ్బి, చనన్ = పాఱఁగా, (పొంగిప్రవహింపఁగా) ఒక్కఁడున్ = ఒకఁడయినను, (ఎవఁడైనను) వంకలు = వంకరలు, నొక్కన్ =(వంపు) తీర్చుటకు, (వంకరలుచక్కదిద్దుటకు) శక్తుఁడే =సమర్థుఁడా?(సమర్థుఁడుకాఁడనుట)

అలం :— దృష్టాంతము, ఛేకానుప్రాసము;

క॥ నిష్కారణముగఁదన్నుబ
1 హిష్కారమునొందఁజేయునిల్వలవైరిన్
శుష్కీభూత 2 కరణహృ
త్పుష్కరుఁడితఁ 3 డనకనన్నుదూఱంగునే? **219**

వ్యా :— నిష్కారణముగన్ = హేతువులేకుండ, తన్నున్ = నన్ను, బహిష్కారమునొందఁజేయు = బహిష్కృతినొందించు (బహిష్కరించు - ఇంటినుండి వెళ్లఁగొట్టు) ఇల్వలవైరిన్= ఇల్వలారిని_అగస్త్యుని

---

219 ప:- 1 హిష్కరణ - ర; హిష్కారము - అ, గౌ. 2 కరుణ - ర; కరణ - అ, గౌ. 3 డనఁగ - డ, ద, బ, డనక — ర. అ, గౌ.

ఇతఁడు = ఈతఁడు, శుష్కీభూత = శుష్కీభవించిన - మార్దవమెడిపోయిన, కరణ = 'ఇంద్రియ' వ్యాపారముగల, హృత్పుష్కరుఁడు= మనఃపద్మములుగలవాఁడు, అనక = అనిపలుకక, నన్నున్= నన్ను, దూఱందగునే = నిందించుటయుక్తమా? (యుక్తము కాదనుట)

ఇల్వలవైరి - ఇల్వలవాతాపులనగస్త్యుఁడు చంపినకథరామాయణ భారతప్రసిద్ధము.

వ్యాక :— తన్నున్ = నన్ను [ప్రౌ. శబ్ద 78]

క॥ మమకారదూరునకు, మి
త్రములుకళత్రములు నన్నదమ్ములు ననుబం
ధముల 1 పరిష్వంగముధ
ర్మమె 2 మైకొన? మణుఁగుసగముమైలయుసగమే? **220**

వ్యా :— మమకారదూరునకున్ = తనదియను నభిమానమునకు దవ్వయినవానికి, (విసర్జించినవానికి) మిత్రములు = సఖులును, కళత్రములున్ = భార్యలును, అన్నదమ్ములున్ = అగ్రజానుజులును, 'సోదరులును - అనుట' అను = అనెడు, బంధముల - అనుబంధనములయొక్క, పరిష్వంగము = కూడిక - సంబంధము, మైకొనన్ = సమ్మతించుట, ధర్మమె = న్యాయమా? (న్యాయము కాదనుట) మణుఁగు = పరిశుద్ధి, సగము = అర్ధభాగము. మైలయున్= అపరిశుద్ధియు, సగమే = అర్ధభాగమా? మమకారవిసర్జనముకొంత; మిత్రకళత్రసోదరబంధమును విసర్జింపకపోవుటకొంత సంగతముకాదు. అది మమకారవిసర్జనమనిపించుకొనదనుట.

---

220 ప:- 1 పరిస్కంధముధర్మముగైకొక - క; పరిష్వంగము - ముద్రి(అ) ర, గౌ. 2 కైకొను - గ; గైకొన - ర; కైకొన-గౌ; మైకొన - అ.

మాఱుఁగు = ఉదికిన వస్త్రము. మైల = మురికివస్త్రము. వస్త్రములో, సగభాగముదికి, సగభాగము మురికివదలింపనిచో నావస్త్రము పరిశుద్ధమనిపించుకొనదు. దీనినిబట్టి మాఱుఁగుసగము, మైలసగమను లోకోక్తియేర్పడినది.

అలం :— లోకోక్తి.

తే॥ గాఢవిజ్ఞానమయమనో 1 గూఢమైన
2 నిర్మమునిధైర్యమతనుండు నేరఁడుగొన
దానధారాకరాళకాంతారదంతి
కుంభముక్తాహరణమొనగూడు 3 నెట్లు? 221

వ్యా :— గాఢ = అధికమయిన, విజ్ఞానమయ = విశేషమయిన జ్ఞానముతో నిండినదగు, మనః = హృదయముచేత, గూఢమైన = రహస్యమయినదియగు, నిర్మముని = మమకారములేనివాని యొక్క, ధైర్యము = ధీరత్వమును, స్థిరమయిన చిత్తౌన్నత్యమును, [ధైర్య = స్థిరచిత్తోన్నతిర్యాతుతద్ధైర్యమితిగియతే, ఇత్యుక్తేమనస్థైర్యే- శబ్దస్తో] అతనుండు = మన్మథుఁడు, కొనన్ = హరించుటకు, నేరఁడు = సమర్థుఁడుకాఁడు. దానధారా = మదజల సంతతస్రావముచేత, (మదో దానమ్ - అమ) కరాళ = భయంకరమయిన, (కరాళోభీషణేన్యవత్- విశ్వ) కాంతారదంతి = అడవియేనుఁగుయొక్క, కుంభ = కుంభస్థలమునందలి, ముక్తా = ముత్యములయొక్క, ఆహరణము = వెలికి దీయుట, ఎట్లు = ఏప్రకారముగా, ఒనగూడున్ = సిద్ధించును? (సిద్ధింపదనుట)

---

221 ప:- 1 రూఢ - ప; గూఢ - అ, గౌ. 2 నిర్మలుని - త; నిర్మముని - ర, అ. 3 పెట్లు - ర, నెట్లు - అ, గౌ.

ఏనుఁగు కుంభస్థలమున ముత్యములు పుట్టుననుట ప్రసిద్ధము.
2-175 వ్యాఖ్య.

అలం :— దృష్టాంతము.

క॥ అకుటిలగుణవాసనతో
నకలిగిమరువంపులేఁగొనయుఁబోలిన శ్రీ
శుకు 1 నెన్నరేమి? సారె జ
నకు 2 నెంతురుపరముఖోపనత విజ్ఞానున్. **222**

వ్యా :— అకుటిల = ఋజువయిన, గుణ = మంచిగుణములయొక్క, వాసన = సంస్కారము (వాసనా = సంస్కారే - శబ్దస్తో) తోన్ + అ = వెంబడినే - పుట్టుకతోనే, కలిగి = కలవాఁడయి అని శ్రీశుకుని పక్షమునసర్థము. అకుటిల = ఋజువయిన; గుణ = మంచిగుణముగల, వాసన = సుగంధము, తోన = పుట్టుకతోనే, కలిగి = కలదియయి - అని మరువపులేఁగొనపక్షమునసర్థము, మరువంపులేఁగొనయుఁబోలిన = మరువకమను పేరుగల సువాసనగలిగిన మొక్కయొక్క లేఁతదయిన చివరికొమ్మను (అగ్రశాఖను) బోలిన, శ్రీశుకున్ = శ్రీశుకమహర్షిని, ఎన్నరేమి = ఎందులకుఁ బేర్కొనరు? పరముఖ = ఇతరులముఖమువలన (నుండి) - ఇతరులబోధనల వలన (నుండి) ఉపనత = పొందఁబడిన, విజ్ఞానున్ = విశేషమయిన మోక్షసాధకమగు బుద్ధిగలవాఁడగు, (మోక్షేధీర్జ్ఞానమ్ - అమ) జనకున్ = జనకమహారాజును, సారె = మాటికి, ఎంతురు = పేర్కొందురు.

జనకునిజ్ఞానము యాజ్ఞవల్క్యమహర్షి ముఖమున సిద్ధించినది. శుకునిజ్ఞానము జన్మతోసిద్ధించినది.

---

222 ప :- 1 నెన్నవే - ప; నెన్నదీనిసార - త; నెన్ననేమి-క; నెన్నడేమి-గొ; నెన్నలేమి - ర (పా). 2 నెన్నఁడు - గొ; నెన్నడు - క; నెన్నెడు - త: నెంతురు - ర, అ.

శుకునిగూర్చి - చూ 1-5 వ్యాఖ్య.

అలం :— శ్లేషానుప్రాణితమగునుపమ.

చ॥ మునిజనభాగధేయమగు మోక్షముపక్షములేక పల్కినీ
వనఘవిచార! సారెఁగొనియాడెదు బూడిద 1 బుట్టివోనియీ
చెనఁటిగృహస్థధర్మ 2 మది, 3 చిమ్మటసింగమె? గాజురత్నమే?
4 కనక 5 శలాటుకాధమముకల్పఫలంబె? చలంబులేటికిన్ **223**

వ్యా. — అనఘవిచార = పుణ్యమయినయాలోచనగలవాఁడా! మునిజన = మౌనిజనులయొక్క, భాగధేయము = భాగ్యము, అగు = అయిన, మోక్షముపక్షములేక = ముక్తిపక్షము కలవాఁడవు కాకుండ, పల్కి = వచించి, నీవు = ఈవు, బూడితబుట్టివోని = బూదిపోసిన బుట్టవంటి. ఈచెనఁటిగృహస్థధర్మమది = ఈతుచ్ఛమయినగార్హస్థ్యమును (అది - వాక్యాలంకారము) సారెన్ = మాటికి, కొనియాడెదు = ప్రశంసింతువు. చిమ్మట = ఈలపురుగు. (చిమ్మటయనఁగఝిల్లిదనరు- ఆం. భా.) సింగమె = సింహమా? గాజు = కాచము, రత్నమే = మణియా? కనకశలాటుకాధమము = నీచమయిన యుమ్మెత్తపిందె, (కనకం -- దుత్తూరే - విశ్వ) కల్పఫలంబె = కల్పవృక్షపుఁబండా? చలంబులు = అభినివేశములు, ఏటికిన్ = ఎందులకు? (అనావశ్యకములనుట)

గృహస్థధర్మమ దీ - "అది" పాదపూరణార్థము [ప్రౌ శబ్ద 63]

---

223 ప:- 1 బొట్టు - ర, అ; బుట్టి - గౌ. 2 మిది - త, గౌ; మది - ర; మది (మును?)- అ 3 చిమ్మెట - ము(డ్రి) (అ), ర: చిమ్మట-అ. 4 కనిళ - క; కనక - ర, అ. 5 శలాటుకాధళము - త; శలాటుకాధమము - ర, అ.

ఉ సంపదచేతఁగానికొనసాగవుసువ్వె గృహస్థధర్మముల్
సంపదపూర్వజన్మవికసత్సుకృతంబునఁగానిచేరదా
సంపదచేరియున్ 1 మదవశంవదుఁజేయు మహాత్మునేనియున్
2 జంపకునన్నుఁ 3 గన్నుసిమి 4 చంపుదుముంపుదుబోధగాథలన్ **224**

వ్యా: — గృహస్థధర్మముల్ = గార్హస్థ్యములు, సంపదచేతఁగాని = ఐశ్వర్యముచేఁతదప్ప. కొనసాగవుసువ్వె = నిశ్చయముగా వర్ధిల్లవు, సంపద = ఐశ్వర్యము, పూర్వజన్మ = మునుపటి పుట్టుక యొక్క, వికసత్ = వికసించుచున్న - వృద్ధిపొందుచున్న, సుకృతంబునఁగాని = పుణ్యముచేతఁదప్ప, చేరదు = ప్రాప్తింపదు. ఆసంపద= ఆయైశ్వర్యము, చేరియున్ = ప్రాప్తించియు, మహాత్మునేనియున్ = ఉదారస్వభావముగలవానినైనను, మద = దురహంకారమునకు, వశంవదున్ = లోఁబడినవానినిగా, చేయున్ = ఒనర్చును చంపుదు = చంపునట్టియు - అధోగతిపాలుచేయునట్టియు, బోధ = ఉపదేశములు గల, గాథలన్ = ఆధ్యాత్మికదృష్టిలేనికథలతో, కన్నుసిమి = మోస పుచ్చి, నన్నున్ = నన్ను, చంపకు = బాధింపకుము.

శా॥ కందర్పాస్త్రములంచు, నంచితతటిత్కాండంబులంచున్, సుధా
మంద 1 స్యందములంచుఁ, గాంచనలతామత్తల్లులంచున్, సుధీ
బృందంబుల్ ధ్వనినిందలందెగడు నీబింబోష్ఠులందెల్ల నా
నందాభాసమెకాశభాసిత చిదానందంబుపెంపొందునే? **225**

---

224 పః- 1 స్మర - డ. ద. బ; మద - ర, అ, గౌ. 2 జంపక - త, గౌ; జంపకు - ర, అ. 3 గన్నుమిసి - గ; గన్నుసివి - గౌ; గన్నుసిమి- ర. అ. 4 చంపదుముంపదు - క; చంపుదుముంపుదు-ర;అ.

225 పః- 1 స్పంద - అ; స్యంద - ర, గౌ.

వ్యా :— కందర్ప = మన్మథునియొక్క, అస్త్రములంచున్ = ఆయుధములని, (ఆయుధంతుప్రహరణం శస్త్రమస్త్రమథాస్త్రియౌ-అమ) అంచిత = ఒప్పిదములయిన, తటిత్ = మెఱపులయొక్క, కాండంబులంచున్ = సమూహములని, సుధా = అమృతముయొక్క; అమంద = అధికమయిన, స్యందములంచున్ = స్రవించుటలని; కాంచనలతా = బంగారుతీఁగలయొక్క, మత్తల్లులంచున్ = మత్తల్లీ నృత్యవిశేషములని, సుధీ = పండితులయొక్క, సుధీఃకోవిదోబుధః - అమ) బృందంబుల్ = సమూహములు, ధ్వనినిందలన్ = ధ్వనిరూపములయిన దూషణములచేత, తెగడు = నిందించు, ఈబింబోష్ఠులందున్ ఎల్లన్ = ఈకాంతలెల్లరయందు, అనందఆభానమెకాక = వావస్తము నకు సుఖముకాకున్న సుఖముగాఁగనఁబడుటతప్ప, భాసిత = ప్రకాశిత మయిన. చిత్ ఆనందంబు = జ్ఞానాత్మకమగునాత్మానందము, పెంపొందునే = అతిశయించునా? [అతిశయింపదనుట]

ధ్వనినిందలు -- శబ్దమునకు నభిధ, లక్షణ, వ్యంజనయను మూఁడుశక్తులుగలవు. అభిధాశక్తివలన సిద్ధించునది వాచ్యార్థము. లక్షణాశక్తివలన సిద్ధించునది. లక్ష్యార్థము వ్యంజనాశక్తివలన సిద్ధించునది. వ్యంగ్యార్థము. వ్యంగ్యార్థము ప్రధానమయినచో ననఁగా వాచ్యార్థము కంటె వ్యంగ్యార్థము చమత్కారావహమయినచోనది ధ్వనియనియనఁబడును ఇది రెండు విధములు (1) వివక్షితాన్యపరవాచ్యము. ఇది యభిధామూలకము. వాచ్యార్థము పొసఁగుచు నర్థాంతరములిందు స్ఫురించును. (2) అవివక్షితవాచ్యము. ఇందు వాచ్యార్థమవివక్షితమగును,

కందర్పాస్త్రములంచు - ఇత్యాది స్త్రీ ప్రశంసలో స్త్రీ నిందధ్వని రూపమునఁగలదనియయుతుని వాదము. స్త్రీలు, కందర్పాస్త్రములు = మన్మథబాణములు - అని వాచ్యార్థము. సమ్మోహనము, సున్మాదనము, శోషణము, తాపనము, స్తంభనమునను వానినిగలిగించువారనినిందార్థము

"సమ్మోహనోన్మాదనౌచ, శోషణస్తాపనస్తథా
స్తంభనశ్చేతి కామస్య, శరాఃపంచప్రకీర్తితాః"

తటిత్కాండంబులు = మెఱపులసమూహములు - అని వాచ్యార్థము. స్త్రీల విలాసములు తాత్కాలికములని నింద్యార్థము, మెఱపుక్షణ భంగురము.

సుధామందస్యందములు - అమృతస్రావములని వాచ్యార్థము విపరీతలక్షణచే, విషస్రావములని నిందార్థము. వాచ్యార్థమునకనుపపత్తి కలుగునపుడు విరుద్ధార్థమును స్ఫురింపఁజేయులక్షణాశక్తి, విపరీతలక్షణః అసత్యవాదిని హరిశ్చంద్రుఁడన్న చో వాచ్యార్థము పొసఁగకపోవుటచే, నసత్యవాదియును విరుద్ధార్థముస్ఫురించును, అట్లే, స్త్రీలనమృతస్యంద ములనుట పొసఁగదుగాన విషస్యందములను నిందార్థముగమ్యము.

కాంచనలతా మత్తల్లులు - బంగారు తీఁగలమత్తల్లినృత్య విశేష ములని వాచ్యార్థము. ప్రలోభపెట్టువారని నిందార్థము.

నిజమునకీ వాక్యములలో నిందార్థములు ధ్వనితములగుట లేదు. అయినను స్వవాదానుకూలముగ నిందార్థములు ధ్వనితములనెనని గ్రహింపదగును.

మత్తల్లి - నృత్యభేదము (1) బాహాసిమత్తల్లీనర్తన (జై. భా. 1-140) "కాళియక్ష్వేళమూ, ర్ధసలీనృత్తమత్తల్లి హల్లీసకా" (ఆముక్త 3-92) మత్తల్లీలక్షణము —

"వామదక్షిణపాదాభ్యాం, ఘూర్ణమానోపసర్పణైః
ఉద్వేష్టితాపవిద్ధైశ్చ, హస్తైర్మత్తల్ల్యుదాహృతమ్" [నా. శా.]

పాఠ :— మత్తల్లులంచున్ - ఉపలబ్ధపాఠము. ఇది యప పాఠమని కి. శే, వఝలవారు. కాంచనలతామాతల్లులంచున్ - అవి

యుండవలయును. కాంచనలతలయొక్క, మా = శోభకు, తల్లులని యర్థము. మా - ఏకాక్షరశబ్దము గాన హ్రాస్వములేదు." [కీ. శే. వజ్ఝలవారిలేఖ 18-7-1958] ఈపక్షమున తల్లులు = పోషకములని యర్థము [రాఘువ 1-1]

"మతల్లికామచర్చికాప్రకాండముద్ఘతల్లజౌ, ప్రశస్తవాచకాన్యమూని" (అమ) మతల్లికాశబ్దముననుసరించి మతల్లీశబ్దము ప్రయోగింపఁబడినది. [చూ 3-190; 4-177 వ్యాఖ్య] అట్లే, మత్తల్లిశబ్దము ప్రయుక్తమయ్యేనన్నపక్షమున, కాంచనలతామత్తల్లులంచున్ = ప్రశస్తములయిన బంగారుతీఁగలయనియర్థము.

వ్యాక : - మతల్లి - మత + అల్ + ఇ్వల్ + టాప్=మతల్లికా- అని పృషోదరాదులలోఁజేర్చి సాధింపఁబడును.

మతల్లీ - మత + అల్ + జీష్ - అని పృషోదరాదులలోఁజేర్చి, మతల్లీశబ్దము సాధింపనగును.

మత్తల్లి - మత + తల్ + జీష్ - అని పృషోదరాదులలోఁజేర్చి మతల్లీశబ్దమును సాధింపనగును,

బింబోష్ఠి = బింబము [తొండపండు] వంటి యోష్ఠముదేనికిఁ గలదోయది - స్త్రీ బింబ + ఓష్ఠ = బింబోష్ఠి, బింబౌష్ఠి. "ఓత్వోష్ఠయోస్సమాసేవా" (వా) నాసికోదరౌష్ఠజఙ్ఘాదన్తకర్ణశృఙ్గాచ్చ అను సూత్రముచే, జీష్.

చ॥ కురుల 1 సిరుల్, మెఱుంగుఁజనుగుబ్బలనిబ్బరముల్, మొగంబు వి
స్ఫురణము 2 లింద్రనీలమణి భూధరశృంగకుతంగలాంఛ నా
దర 3 వశదృష్టిఁజూచెదవు, తాపసవంశవతంస! తజ్జరా
భరమునవచ్చుతెల్పుఁబడుపాటు, వళీ4 వలనంబునుండఁగన్. 226

226ప:- 1 మెఱుంగుపంగు-గౌ; సిరుల్ మెఱుంగు-ర,అ. 2 నింద్ర క; లింద్ర- ర,అ. 3 వర -గౌ; వశ - ర,అ. 4 లపనం - క; వలనం - ర, అ.

తాపసవంశవతంస = ఓతపస్వికులశిఖామణీ - ఓతపస్వికుల శ్రేష్ఠా! తద్ = వారియొక్క - స్త్రీలయొక్క, జరాభరమునన్ = వార్ధక్యాతిశయమునందు, వచ్చు = ప్రాప్తించు. తెల్పున్ = (శిరోజముల) తెల్లఁదనమును, పడు = పొందెడు, పాటున్ = (స్తనముల) పతనమును, వళీ =(ముఖమునుమీఁది) ముడుతలయొక్క, వలనంబున్= చలనమును, ఉండఁగన్ = ఉండఁగా, (ముసలితనమునందు శిరోజములు తెల్లనగుట, స్తనములువ్రాలుట, ముఖముముడుతలు పడుటయనునవి యుండఁగా) కురుల = శిరోజములయొక్క, సిరుల్ = శోభలు, మెఱుంగు = తళతళమను కాంతిగల, చనుగుబ్బలు = తలుపుగంద పట్టెలమీఁది బొగడలవంటి స్తనములయొక్క (స్తనకవాటుంగముల్ దనరుగుబ్బలనంగ - ఆం. భా) నిబ్బరముల్ = అతిశయములు -బిగువులు, మొగంబు = ముఖములయొక్క, విస్ఫురణములు = వికాసములు, ఇంద్రనీలమణి=ఇంద్రనీలమణులయొక్కయు, భూధరశృంగ= పర్వతశిఖరములయొక్కయు, కురంగలాంఛన=మృగాంకునియొక్కయు (చంద్రునియొక్కయు) ఆదర = ఆదరణమునకు, వశ = లోఁబడిన, దృష్టిన్ = బుద్ధితో, (దృష్టిఃస్త్రియాంబుద్ధౌ - మే. ని) చూచెదవు = ఆలోచింతువు (శిరోజశోభలనింద్రనీలమణులనుబుద్ధితోను, స్తనముల యుబ్బును బర్వతశిఖరములను బుద్ధితోను, ముఖకాంతిని జంద్రుఁడను బుద్ధితోను జూచెదవని క్రమముగానన్వయము)

అలం :— యథాసంఖ్యము

క॥ కులమొల్లగోత్రమొల్లన్
గలకంఠులనొల్ల, నొల్లఁగలుములు; 1 బోధా

---

227 ప:- 1 బాధా - ముద్రి (అ), ర; బోధా - అ.

నలహుతదుర్భవబాధా
నలమతినై 2 కందునొకధనము 3 నేననుచున్. 227

వ్యా :— కులము = వంశమును, ఒల్లన్ = అపేక్షింపను, (కోరను) గోత్రము = వంశమూలపురుషులపరంపరను, ఒల్లన్ = అపేక్షింపను, (కోరను) కలకంఠులన్ = కాంతలను, ఒల్లన్ = అపేక్షింపను (కోరను) కలుములు = సంపదలు, ఒల్లన్ = అపేక్షింపను, (కోరను) బోధ = జ్ఞానమనెడు, అనల = అగ్నియందు, హుత = వేల్వఁబడిన, (హోమముచేయఁబడిన) దుర్భవ = దుష్టములయిన, పుట్టుకలయొక్క, బాధా = వ్యథయనెడు, నల = కిక్కసగడ్డివంటి (నలఃపోటుగళే - విశ్వ, కిక్కసయనఁగఁబెంపెక్కునునల సంజ్ఞ-ఆం. భా) మతినై = బుద్ధిగలవాఁడనయి, ఏన్ = నేను, ఒకధనమున్ = ఒక సంపదను - ఒక్కమోక్షసంపదను, ఏన్ = నేను, కందున్ = పొందుదును, అనుచున్ = అని (మీఁదిపద్యముతోనన్వయము)

కలకంఠి = అవ్యక్తమధురమయిన కంఠము దేనికిఁగలదో యది - స్త్రీ బహువ్రీహి.

క॥ ఒకటికిఁబదియుఁబదింటికి
నొకనూఱునుగాఁగఁ 1 దనదుయుక్తులకుఁజలిం
పకనొడువు వడువుద్బుధ ని
ష్ఠకునలరియుఁబలుకుఁగపటసంయమికినుకన్. 228

వ్యా :— ఒకటికిన్ = ఒకదానికి - ఒకయుక్తికి, పదియున్ = పదియు - పదియుక్తులును, పదింటికిన్ = పదిటికి - పదియుక్తులకు,

---

2 కొందునొకొ - కొ; కందునొక - ర, అ. 3 చేననుచుఁ - క; ముద్రి (అ); ర; నేననుచుఁ - అ.

228 ప.- 1 దనకుయుక్తులకు - గొ; దనదుయుక్తులకు - ర, అ.

ఒకనూఱునుగాఁగన్ = ఒకశతమునగునట్లుగా - ఒకశతయుక్తులునగునట్లుగా, తనదుయుక్తులకున్ = తనయొక్క వాదమునకుపష్టంభకముగాఁజూపిన సాధకవాక్యములకు, చలింపక = కలవరపడక, నొడువు = వచించు - సమాధానములనొసఁగు, వడువు = బ్రహ్మచారియొక్క, దృఢనిష్ఠకున్ = గాఢమయిన, ధర్మాచరణమందలి యభినివేశమునకు, అలరియున్ = సంతోషించియు, కపటసంయమి = మాయామౌని, కినుకన్ = కోపముతో, పలుకున్ = (ఇట్లు) వచించెను.

వ్యాక :— పలుకున్ = పలికెను. భూతమునలాట్టు -- బా. క్రియా 22

సీ॥ పందకుఁబోటులోభగ్రస్తునకుసిగి
బోయకుఁగరుణ నపుంసకునకు
నంగనాసుఖము నెఱింగించుతెఱఁగయ్యె
నాబుద్ధినీయందు నాఁటుకునికి
నెటులైనఁగమ్మనీ, విదివోలునిది 1 వోల
దనితెల్పఁదెలియునేయనదుఁబొడువ
నిమ్నాభిముఖమైన నీటి 2 నెవ్వాఁడోపుఁ
ద్రిప్పి 3 యొప్పగుచోటఁ దిరుగఁ 4 జేయు

తే॥ నలమిగుడిమిఁ్రంగువానికిఁదలుపులప్ప
డములుగాకుండనే? యగస్త్యముని 5 పనుపు
మీఱి 6 యూరకెగుర్పునమిన్ను ముట్టు
నింతమేటికి నామాట, యెంతపాటి? 229

229 పః- 1 నిదివల - గ; నిటవోల - ర; అ. 2 నెవ్వండోపు - గౌ; నెవ్వాఁడోపు - ర, అ, 3 యెప్పటి - గ; యొప్పదు - ర, అ, గౌ. 4 ద్రోయ – త, గౌ; జేయ - ర, అ. 5 పలుకు - ప; పనుపు- ర, అ. 6 యూరకిగుర్పున - ర; ము(ద్రి(అ); యూరకెగిజుసిన-గౌ, యూరకెగి (గు?) ర్పున - అ.

వ్యా ;— నాబుద్ధి = నాయొక్కయుపదేశము, నీయందున్= నీవిషయమున, నాటకునికి = నాటుకొనకపోవుటచే, పందకున్ = భీరువునకు, (పిఱికివానికి) పోటు = శౌర్యము, లోభ = పిసినిగొట్టు తనముచేత, గ్రస్తునకున్ = ఆక్రమింపఁబడినవానికి - లోభికి, ఈగి= త్యాగము, బోయకున్ = కిరాతునకు, కరుణ = దయ, నపుంసకు నకున్ = షండునకు, అంగనాసుఖమున్=స్త్రీసౌఖ్యమును, ఎఱింగించు తెఱఁగయ్యెన్ = తెలుపునట్లయ్యెను. నీవు = ఈవు, ఎటులైనఁగమ్ము= ఎట్లయిననగుము. అల్పుఁడు = అల్పుఁడయిన, పొడువ = దుష్టుఁడు, ఇది = ఇయ్యది, పోలున్ = తగును. ఇది = ఇయ్యది, పోలదు = తగదు, అనితెల్పన్ = అనియెఱిఁగింపగా, తెలియునే = ఎఱుఁగునా? (ఎఱుఁగఁడనుట) నిమ్న = పల్లమునకై, అభిముఖమైన = ఎదురు ముఖముగలదియయిన, నీటిన్ = జలమును, త్రిప్పి = మరలించి, ఒప్పగుచోటన్ = యోగ్యమయిన స్థలమునందు, తిరుగఁజేయన్ = మెలఁగునట్లుచేయుటకు, ఎవ్వాఁడు = ఎవఁడు, ఓపున్= సమర్థుఁడగును? (ఎవఁడును సమర్థుఁడుకాఁడనుట) అగస్త్యముని పసుపున్ = అగస్త్య మౌనియొక్క యానతిని, ఊరక = తగినకారణములేకుండ, మీఱి = నిరసించి, ఎగుర్పునన్ = పొగరుతో, మిన్నుముట్టు = అతిశయించు (విఱ్ఱవీఁగు) ఇంతమేటికిన్ = ఇంతఘనునకు, నామాట = నాయొక్క వచనము - నావంటి సామాన్యునివచనము, ఎంతపాటి = ఏపాటిది? (లెక్కలోనిది కాదనుట) అలమి = ఆక్రమించి, గుడిన్ = ఆలయ మును, మ్రింగువానికిన్ = కబళించువానికి, తలుపులు = కవాటు ములు, అప్పడములు = అర్పటములు, కాకుండనే = కాకుండునా? (అప్పడములగుననుట)

నిమ్నాభిముఖమైననీటినెవ్వాఁడోపుఁద్రిప్పి - కః .... పయశ్చ నిమ్నాభిముంప్రతీపయేత్ [కు. సం. 5_5]

గుడిమ్రింగువానికిఁదలుపులప్పడములు గాకుండునే - గొప్పపనిని నిర్వర్తించినవానికిఁగొలఁదిపాటి పనిని జేయుట లెక్కలోనిదికాదనుటను దెలుపులోకోక్తి. "గుడిమ్రింగేవానికిందల్పులప్పడముల" [ప్రబోధ2-67]

అలం :— అర్థాంతరన్యాసము, లోకోక్తి.

ఉ॥ వ్యాససుతాదులందలఁచివాసికి 1 మంగలికత్తిమ్రింగె; దా
సాసలనబ్బుచాఁచె 2 దలయందనిపంటికి; బొంకితోన కై
లాసముఁజేరఁజూచెదు; చలంబదియేదిమిఫలంబటంచు, నా
భూసురుఁడీసువెంచి, మునిపుత్రికుఁబాసితొలంగి వెండియున్.

**230**

వ్యా :— వ్యాససుతాదులన్ = వ్యాసనందనుఁడులోనగు వారిని - శుకాదులను, తలఁచి = ప్రస్తావించి, (శుకప్రస్తావనకు - చూ 5 222 ప.) వాసికిన్ = ప్రసిద్ధికై, మంగలికత్తిమ్రింగెదు = హానికరమయిన పనిచేయుటకు సిద్ధపడెదవు. ఆసాసలన్ = ఉత్కటమయిన యాశలతో, అలయందనిపంటికి నబ్బుచాఁచెదు = అపొందశక్యముకానిదానిని బొందుటకు యత్నింతువు బొందితోకైలాసముఁజేరఁజూచెదు = అసాధ్యకార్యమును సాధింపనెంచెదవు చలంబు = పంతము, (మొండిపట్టుదల) అదియేమిఫలంబు = ఏమిప్రయోజనము, అటంచున్ = అని, ఆభూసురుఁడు = ఆబ్రాహ్మణుఁడు; ఈసువెంచి = కినుకరెట్టించి, మునిపుత్రికున్ = మౌనిసుతుని - ఆయుతుని, పాసి = విడిచి, తొలంగి = వెడలి, వెండియున్ = మఱియును. (మీఁది పద్యముతోనన్వయము)

మంగలికత్తిమ్రింగు, అందని (మ్రాని) పంటికి నబ్బుచాఁచు, బొందితోఁగైలాసముఁజేరఁజూచు - జాతీయములు. "అందని మ్రాని పండ్లకునునబ్బులుసాఁచెద - (దశ 3-131) అబ్బు = మెడ.

---

230 ప.- 1 మంగల-అ, మంగలి-ర, గౌ. 2 దదె-ముద్రి(అ) ర; దల-అ,గౌ.

వ్యాక :— అసానలన్ - అనలన్ + అనలన్ = అసానలన్. (బా. సంధి 41) అడియేమి - 'అది' యూంతపదము. (ప్రౌ. శబ్ద 63) పుత్రి - ఏకతకారకమును గలదు. చూ - 1-9

అలం :— లోకోక్తి.

తే॥ కామధేను ముఖంబునఁగార్యసిద్ధిఁ
బడయనూహించి మాయలుపన్ని చనియె
వినుమునిశ్రేష్ఠ! తపముగావించువారిఁ
గనినఁదలయేర్చుఁగాదె యాఖండలునకు. **231**

వ్యా :— కామధేనుముఖంబునన్ = కామగవిద్వారమున, కార్యసిద్ధిన్= పనినెఱవేఱుటను, పడయన్ = పొందుటకు, ఊహించి = ఆలోచించి, మాయలుపన్ని = కపటోపాయములుకల్పించి, చనియెన్= అరిగెను. మునిశ్రేష్ఠ = మౌనివర్యా - ఓనారదా! విను = ఆలకింపుము తపము + కాంవిచువారిన్ = తపస్సుచేయువారిని, కనినన్= చూచినచో ఆఖండలునకున్ = ఇంద్రునకు, తలయేర్చున్కాదె = శిరోవేదన కలుగునుగదా!

సీ॥ ఉద్య 1 దుత్థానసముద్యోగమాత్రావ
శిష్టచేతస్సార, దష్ట 2 దర్భ
క్షతికృదుగ్రిధ్వాంక్షతతి 3 నివారణ విధా
త్వరమాణ 4 వాలాగ్రి, 5 దంశపిహిత
6 నాదృతాధశ్శయనారంభ 7 విస్రంభ

232 ప:- 1 దుద్యాన - త; దుత్థాన - ర, అ. 2 గర్భత - త; దర్భ- ర, అ. 3 విదారణ - ం; నివారణ - ర, అ. 4 వాతోగ్ర - గౌ; వాలాగ్ర- ర, అ. 5 దంశ్రవిహిత - త; దంశపిహిత - ర, అ. 6 నావృతాధన శయనా - క; అదృతాధశ్శనా - ర, అ. 7 పస్రంభ — త.

8 గళకంబళాభోగఁ, గాతరాక్షి
నేకపార్శ్వస్థితిస్వీకారనిర్భగ్న
9 చరమోరు 10 తరశల్య, 11 సాంద్రబాష్ప

తే॥ దుగ్ధసేవాసమయబోధముగ్ధవత్స
పీడితాపీన పర్యంతఁ, బృథులదామ
వేష్టితగ్రీవ, నటచూచెవిపుఁడొకఁ
యర్జుని, నిజోటజప్రఘాణాంతరమున. **232**

వ్యా :— ఉద్యత్ = ఉద్గమించుచున్న - పుట్టుచున్న, ఉత్థాన = పైకిలేచుటకు [నిలఁబడుటకు] సముద్యోగమాత్ర = ప్రయత్నించుపాటిదిగా, అవశేష = మిగిలిన, చేతస్వారన్ = మనోబలము గలదియు, లేచినిలఁబడఁగల శక్తి లేదనియు, లేచినిలఁబడవలెనని ప్రయత్నించుపాటి మనోబలముమాత్రమే, మిగిలియున్నదనియు - అని భావము] దష్ట = కొఱకఁబడిన, దర్భన్ = కుశలుగలదియు, [కొఱకినకుశలుదానినోటిలోనున్నవనుట

[2 క్షతికృత్ = గాయముచేయునవియగు. ఉగ్ర = కూరములయిన, ధ్వాంక్షతతి = కాకులసమూహముయొక్క, (ధ్వాంక్షాత్మఘోషపరభృద్బలిభుగ్వాయసాఅపి - అమ) నివారణవిధా = నివారించు కృత్యమునందు, (కర్మక్రియావిధా - అభి. చిం.) త్వరమాణ = తొందరపడుచున్న, వాల = తోఁకయొక్క,అగ్రన్ = చివరగలదియు,(గాయముచేయుకాకులను దోఁకచివరిభాగముతోఁ దోలుకొనుటయందుఁద్వరగలదియనుట) దంశ = అడవియీఁగలచే, (దంశస్తువనమక్షికా - అమ) పిహితన్ = కప్పఁబడినదియు.

---

8 గళకుచ్చికా—క; గళకంబళా - ర, అ. 9 భర-గ; చర-ర,అ. 10 కర— ర; మర - గౌ; తర - అ. 11 బాష్పసాంద్ర - గ; సాంద్రబాష్ప - ర, అ.

వ్యాక :— క్షతికృత్ - చూ 1.4 వ్యాఖ్య, కరోతీతికృత్.

[3] అదృత = ఆదరింపఁబడిన, అధశ్శయన = నేలఁబరుండుట యొక్క, అరంభ = ఉపక్రమణముయొక్క, విస్రింభ = పరిచయముగల, గళకంబళ = గంగడోలుయొక్క, [సాస్నాతుగళకంబళః - అమ] అభోగన్ = విస్తృతిగలటయు, (నేలపరుండుటకుపక్రమించునప్పుడు విస్తృతినందిన గంగడోలుగలదియు - అనుట) కాతరాక్షిన్ = బెదరుచూపులుగలదియు.

[4] ఏకపార్శ్వస్థితి = ఒక్కప్రక్కనేయుండుటయొక్క, స్వీకార = గ్రహించుటచేత, నిర్భగ్న = పగిలిన, చరమ = వెనుకటిదయిన, ఉరుతర = మిక్కిలిపెద్దదయిన, శల్యన్ = ఎముకగలదియు, (ఒక్క ప్రక్కనే పడియుండుటచేత వెనుక భాగమున విఱిగిన పెద్దయెముక గలదియు - అనుట) సాంద్ర = విరివియైన, బాష్పన్ = కన్నీళ్లు గలదియు, దుగ్ధసేవాసమయ = పాలుసేవించు (త్రాగు) వేళయొక్క బోధ = జ్ఞానముగల, ముగ్ధవత్స = లేదూడచేత, పీడిత = పీడింపఁబడిన, ఆపీన = పొదుఁగుయొక్క, (ఊధస్తుక్లీబమాపీనమ్ - అమ) పర్యంతన్ = (ప్రక్కభాగము పర్యంతః = పార్శ్వః - శబ్దక) గలదియు [పాలుత్రాగువేళ నెఱిఁగిన లేదూడపాలుకుడువఁబోఁగాఁబొదుఁగుయొక్క ప్రక్కభాగము పీడింపఁబడుచుండెననుట] పృథుల = స్థూలమయిన, [లావుపాటిదయిన] దామ = పలుపుచేత, [నపుంసిదామసందానమ్ - అమ] వేష్టిత = చుట్టునువచ్చునట్లుచేయఁబడిన, గ్రీవన్ = మెడగలదియు, [మెడకులావుపాటి పలుపుకట్టఁబడియుండెననుట] అగు, ఒక్క = ఒక, అర్జునిన్ = గోవును, (మాహేయీసౌరభేయీ ... అర్జున్యఘ్న్యా రోహిణీస్యాత్ - అమ) విప్రుఁడు = బ్రాహ్మణుఁడు - అయినతుఁడు అట = అచ్చట, నిజ = స్వకీయమయిన, ఉటజ = పర్ణశాలయొక్క [మునీనాంతుపర్ణశాలోటజోఽస్త్రియామ్-అమ] ప్రఘాణ = తలవాకిటిముందఅనుండు చావడియొక్క, [(ప్రఘాణప్రఘణాళిందాబహిర్ద్వారప్రకోష్ఠకే అమ] అంతరమునన్ = మధ్యమునందు, చూచెన్= కనెను.

క॥ చూచియిదియల్లమొన్నటి
వాచంయమువేల్మిగిడ్డి వడువొందెడు; నీ
1 నైచికికినెట్లొకో! యీ
నీచతవాటిల్లెనిన్న నేఁటనెయనుచున్. **233**

వ్యా :— చూచి = (గోవును) కనుఁగొని, ఇది = ఇయ్యది-ఈగోవు, అల్లమొన్నటి వాచంయమి = ఆమొన్నటిదినమున వచ్చిన మునియొక్క, (వాచంయమోమునిః - అమ) వేల్మిగిడ్డి = హోమ ధేనువుయొక్క, వడువు = విధము, ఒందెడున్ = పొందుచున్నది. (మొన్నవచ్చిన మునియొక్క హోమధేనువవలెనున్నదనుట) ఈనైచికికిన్ = ఈయుత్తమమయిన గోవునకు, (ఉత్తమాగోషునైచికీ - అమ) ఈనీచత = ఈహీనత్వము - ఈదుస్థితి, నిన్ననేఁటనె = గతదినము లోపలనే, (ఇంతలోనే - అమ) ఎట్లొకోపాటిల్లెన్ = ఏవిధముగా సంభవిల్లెనో! ఒకో - సందేహమునుదెలుపును అనుచున్ = అని. మీఁదిపద్యముతోనన్వయము

చ॥ మతిఁగృపగ్రమ్మబాడబకుమార 1 శిరోమణియుద్ధరించె భూ
పతితఁదపస్విరోహిణినపాయపరంపరఁబాచిసాఁకియీ
క్షితబలఁజేయఁగాఁదలఁచి, శిష్టహితన్ గలికాలజాతదు
స్థితఁబడు ధర్మదేవతశతచ్ఛదలోచనుఁడెత్తుకైవడిన్. **234**

వ్యా :— బాడబకుమారశిరోమణి = తలమానికమువంటి బ్రాహ్మణుఁడు-శ్రేష్ఠుఁడయిన బ్రాహ్మణుఁడు- అయుతుఁడు, (బాడబాః విప్రశ్చబ్రాహ్మణః - అమ) మతిన్ = మదియందు, కృప = దయ

---

233 పా:- 1 నైచికినెట్లొకొహోయీ - త; నైచికికినెట్లొకోయీ - ర, అ.
234 పా:- 1 శిఖా - గ, త, ర; శిరో - అ.

క్రమ్మన్ = అతిశయింపఁగా, శిష్టహితన్ = సచ్చరిత్రులకుహితమయి నదియు, కలికాల = కలియుగసమయమువలన, జాత = కలిగిన; దుస్థ్సితన్ = దుస్థితిభావమునందు, పడు = చిక్కుకొను, ధర్మదేవతన్ = ధర్మదేవతను, శతచ్ఛదలోచనుఁడు = పద్మాక్షుఁడు - విష్ణుమూర్తి, ఎత్తుకైపడిన్ = ఉద్ధరించునట్లు, అపాయ = కీడులయొక్క, పరంపరన్ = వరుసలవలన (నుండి) పాచి = తొలఁగించి, సాఁకి = రక్షించి, ఊర్జితబలన్ = వృద్ధిచేయఁబడిన శక్తిగలదానినిగా, చేయఁగాన్ = ఒనర్చుటకు, తలఁచి = సంకల్పించి, తలపెట్టి భూపతితన్= నేలఁగూలిన, తపస్వి = మునియొక్క, రోహిణిన్ = ధేనువును, "మాహేయీసౌరభేయీగౌః -- రోహిణీస్యాత్ - అమ" ఉద్ధరించెన్ = లేవనెత్తెను.

కలికాలదుస్థితియందుఁజిక్కుకొన్న ధర్మదేవతలను విష్ణుమూర్తి యుద్ధరించునట్లు, నేలఁగూలియున్న మునిధేనువునయుతుఁడుద్ధరించెను.

అలం :— ఉపమ.

క॥ 1 పడఁబడఁబాఱుచుగడగడ
వడఁకుచు మొదవింతనిలిచె, వనజాక్షుఁడుమున్
వెడలింపఁగజడనిధివెలు
వడియించుకదెలియు 2 పుడమిపడఁతియుఁబోలెన్. **235**

వ్యా :— పడఁబడఁబాఱుచున్ = మిక్కిలి త్రొట్రుపడుచు, గడగడవడఁకుచున్ = గడగడమనికంపించుచు, (గడగడ - వణఁకుటయందగునుకరణము) మొదవు = ఆవు, వనజాక్షుఁడు = విష్ణుమూర్తి, మున్ = పూర్వము, వెడలింపఁగన్ = వెడలఁజేయఁగా, జడ

---

235 పః- 1 బడబడ - క; పడఁబడ – ర, అ. 2 వనితయు - ప, పడఁతియు - ర, అ.

నిధిన్ = సముద్రమునందుండి, వెలువడి = బయటికివచ్చి, ఇంచుక = కొంచెము, తెలియు = తెప్పిఱిల్లు, స్వస్థతనొందు పుడమిపడఁతి యుఁబోలెన్ = భూకాంతవలె, ఇంతనిలిచెన్ = కొలఁదిగానిలఁబడెను.

సముద్రమగ్నమయిన భూమిని విష్ణువరాహావతారమునఁబై కెత్తెనని పురాణకథ.

పడఁబడఁబాఱుచున్ - చూ 3-38 వ్యాఖ్య.

వ్యాక :— జడనిధిన్ - జడనిధివలన్ + ఉండి + వెలువడి బా. కారక 11చే - జడనిధిని + ఉండి + వెలువడి. ప్రౌ. కారక 11 చే - జడనిధిని + వెలువడి = జడనిధివెలువడి.

అలం ;— ఉపమ, వృత్త్యనుప్రాసము.

చ॥ పదములకొంకుపోఁ 1 బిసికి, ప్రక్కలఁసుక్కెడలించి, దంశవం
శదమనవృత్తినింపొసఁగి, 2 సొస్ననఖంబులదువ్వి, నెత్తురుల్
చిదికెడు 3 గంట్లభూరజముచిల్కి, ముఖస్థతృణంబుదోఁచి, య
మ్మొదవుమృదుక్రియన్‌నడపి, ముందటఁబందిటిరాటఁగట్టుచున్. 236

వ్యా ;— పదముల = అడుగులయొక్క, కొంకు = వంకర, పోన్ = పోవునట్లు, (తొలఁగునట్లు) పిసికి = (చేతులతో) ఒత్తి, ప్రక్కల = పార్శ్వభాగములయొక్క, సుక్కు = ముడుత, ఎడలించి = సరిచేసి, దంశవంశ = అడవియీఁగలకులము (గుంపు)యొక్క (దంశస్తువనమక్షికా - అమ) దమనవృత్తిన్ = నిగ్రహించువర్తనముచేత (నివారించుప్రయత్నముచేత - అనుట) ఇంపొసఁగి = సంతోషము కలుగఁజేసి, సొస్న = గంగడోలు, (సాస్నాతుగళకంబళః - అమ)

236 ప:- 1 బసికిప్రక్కల - డ, ద, బ; బిసికిప్రక్కల - ర, అ; గౌ.
2 సన్న-గౌ; సాస్న-ర, అ. 3 గండ్ల - డ, ద, బ; గంట్లు-ర, అ, గౌ

నఖంబులన్ = గోళ్లతో, దువ్వి = గోకి, నెత్తురుల్ = రక్తములు; చిదికెడు = చిమ్మెడు, గంట్లన్ = గాయములయందు, భూరజము = నేలధూళి, చిల్కి = చల్లి, (గంటులపైదుమ్ముచల్లుటచే రక్తస్రావము నివర్తించును) ముఖస్థ = నోటియందున్న, తృణంబున్ = గడ్డిని - కుశలను, (చూ 5-232) త్రోచి = తీసివైచి; (తొలఁగించి) అమ్మొదవున్ = ఆగోవును, మృదుక్రియన్ = మృదురీతిని (మెల్లగా-అనుట) నడపి = నడిపించి, ముంగిటన్ = అంగణమునందు, పందిటిరాటన్= పందిరిగుంజయందు, (పందిరిగుంజకనుట) కట్టుచున్ = బంధించుచు (మీదిపద్యముతో నన్వయము)

క॥ చేతోజహయచ్ఛాయా
పాతా 1 వహమైనమంచి 2 పచ్చికయు, విని
ర్ధౌతకలధౌతదండ వి
భాతులిత 3 జలంబులుందపసిప్రియమొసఁగెన్. **237**

వ్యా :— చేతోజ = మన్మథునియొక్క, హయ = అశ్వము వంటి మన్మథుని వాహనమగు చిలుకవంటి, ఛాయా= కాంతియొక్క, పాత = పరిపాలనము, అవహ = కలిగించునది, ఐన = అగు, మంచి = మేలయిన, పచ్చికయున్ = పచ్చిగడ్డియు, వినిర్ధౌత = మిక్కిలి స్వచ్ఛముగాఁజేయబడిన, కలధౌతదండ = వెండికఱ్ఱలయొక్క (వెండిబెత్తములయొక్క) విభా = కాంతితో, తులిత = సాటిగలదియగు, జలంబులున్ = నీళ్ళను, తపసి = ముని - అయుతుఁడు, ప్రియము = ప్రీతిగా, ఒసఁగెన్ = [గోవునకు] ఇచ్చెను.

వ్యాక :— పియప్రము = ప్రియముగా. [పౌ్ర. కియా 22]

---

237 పః- 1 వహ - గౌ; సహ - ర, అ. 2 పచ్చికమును - త. గౌ; పచ్చికయువిని - ర; పచ్చికయు(ల?)-అ. 3 జలంబులం - ర, అ. 4 మెసఁగెన్ - ముద్రి (అ), ర; మొసఁగఁ- పః మొసఁగెన్-అ,గౌ

సీ॥ పడఁబడనెత్తఁబాల్పడియున్కి నాసనా
1 భ్యాసనైపుణ 2 శక్తి పట్టువదలె
3 నులపాంకురములేర్చియులుప పట్టెడు పూన్కిఁ
గుశపల్లవాహృతి కుంటువడియె
4 సడిలంగసడిలంగమెడ రజ్జువిడుతమి
నక్షసూత్రావృత్తి 5 యవులఁ జనియెఁ
బొలయూడ్చి తినుటకుఁబొలయుపుల్గులఁబోవ
వదలించుహుంకృతిఁ 6 జెదరెమంత్రి

తే॥ మాసలన్నియు మొదలంటఁగోసియున్న
గోఁచికట్టున కటువంటి గొడపగడవ
రాకమెడఁజుట్టుకొసియె, నూరక యశార్య
కరణశీలురకెప్పాటఁగలదె సుఖము. 238

వ్యా :— పడఁబడన్ = నిల కూలఁగాఁగూలఁగా - మాటి మాటికినేలఁగూలఁగా, ఎత్తన్ = లేవనెత్తుటకు, పాల్పడియున్కిన్ = సిద్ధపడియుండుటచేత. ఆసన = యోగాసనములయొక్క, అభ్యాస = సాధనమునందలి, నైపుణ = నేర్పరితనముయొక్క, శక్తి=సామర్థ్యము పట్టువదలెన్ = శిథిలమయ్యెను.

2 ఉలప = మెదవగడ్డియొక్క, (ఉలపస్తృణభేదొస్యాత్-విశ్వ

238 ప:- 1 ధ్యాస - ద, బ; భ్యాస - ర. అ. 2 వృత్తి - ప: శక్తి - ర,అ.
3 యులవా...యులువ - త: నురుపాం - గొ; నులపాం- ర,అ.
4 సడలంగమెడరజ్జుగడువడి - ముద్రి (అ); సడలంగమెడరజ్జుఁ గడువడి - ర, సడిలంగ సడిలంగమెడరజ్జు విడుతమి - అ, గొ.
5 యులవుసని - త; యవలఁజని - ర, అ, యవుల - గొ.
6 బెదరె - ముద్రి (అ); ర; జెదరె - అ.

ఉలపము = మొదవగడ్డి, బల్బజము - సూ. ని) అంకురములు = మొలకలు, ఏర్చి = ఏటి, ఉలుపపట్టెడు = (కానుకవలె) అర్పించెడు, పూన్కిన్ = ప్రయత్నముచేత, కుశ = దర్భలయొక్కయు పల్లవ = చిగుళ్ళయొక్కయు, ఆహృతి = ఆహరణము, (తీసికొనివచ్చుట) కుంటువడియెన్ = భగ్నమయ్యెను. (చెడెను.)

(3) సడిలంగసడిలంగన్ = జాఱిపోఁగాజాఱిపోఁగా - మాటిమాటికి జాఱిపోఁగా, మెడన్ = గళమునందు, రజ్జువు = త్రాడు - పలుపు ఇడుతమిన్ = ఉంచుపూనికచేత, అక్షసూత్ర = జపమాలయొక్క, (అక్షసూత్రమ్ .... జపమాలా - ఇతిజటాధరః - శబ్దక) ఆవృత్తి = త్రిప్పుట, అవులఁజనియెన్ = దవ్వయ్యెను. (లుప్తమయ్యెను)

అక్షమాల - "ముక్తాఫలైర్విద్రుమేణ రుద్రాక్షైఃస్ఫాటికేనవా, గణనాసర్వథాకార్యాసమ్యగంగుళిపర్వభిః" (అగ్ని)

సడిలు - అనుఇత్వమధ్యమునుగలదు. (కాళహ 4-12) — ము. కౌ. ప్రకీర్ణక.

(4) పొల = మాంసమును, ఊడ్చి = పీఁకి, తినుటకున్ = భక్షించుటకు, (ముక్కుతోఁబొడిచి కండలు తీసితినుటకు - అనుట) పొలయు = మూఁగు, పుల్గులన్ = పక్షులను - కాకులను, (చూ 5-232) పోవన్ = తొలఁగునట్లు, అదలించు = బెదరించు, హుంకృతిన్ = హుంకారముతో. మంత్రము = మనువు, చెదరెన్=చెడెను.

అసలన్నియున్ = కోరికలనన్నింటిని, మొదలంటున్ = సమూలముగా, కోసియున్న = త్రెంచియున్న, గోఁచికట్టునకున్ = కాపీనధారికి - బ్రహ్మచారికి, అటువంటి = అరీతిదైన, గొడవ = జోలి, (సంబంధము) కడవకాక = తప్పించుకొన శక్యముకాక, మెడఁజుట్టుకొనియెన్ = అలముకొనెను. (వదలకుండఁబట్టుకొనెను) ఊరక =

విడువక, అకార్యకరణశీలురకున్ = చేయఁదగని పనిచేయుట స్వభావముగాఁగలవారికి, (గృహస్థాశ్రమతిరస్కారమకార్యకరణమనుట) ఎప్పాటన్ = ఏవిధముగానైనను, సుఖము = సౌఖ్యము, కలదె = ఉన్నదా? (లేదనుట)

పడఁబడనెత్తపాల్పడుటకు, నానసనాభ్యాసనైపుణశక్తి పట్టువదలుటకు, నులపాంకురములనర్పించుటకుఁ గుశపల్లవములను దెచ్చుటకు, సడలఁగా సడలఁగా మెడరజ్జువిడుకోరికకు, నక్షమాలత్రిప్పుటకుఁ, గాకులను బెదరించుటకుఁజేయుహుంకారమునకు, మంత్రోచ్చారణమునకు సామ్యమువ్యంజితము.

**అలం :— అర్థాంతరన్యాసము.**

చ॥ విబుధతపోధనేంద్ర! విను, వేయువిధంబులనాతఁడేదనే
చిబలవిభేదినైచికి విశృంఖలమైఖలమైత్రిఁ 1 బోలె, వే
గబలవిహీనతార్తియుఁడుగన్, గడుఁగొవ్వున నివ్వటిల్లి, బీ
దటలిసిబందికాఁడగు విధంబునఁదిమ్మరునమ్మహాటవిన్. **239**

వ్యా :— విబుధతపోధనేంద్ర = ఇంద్రునివంటి సురమునీ (శ్రేష్ఠుఁడైన సురమునీ) - ఓనారదా! విను = ఆకర్ణింపుము. బలవిభేది = బలదైత్యునిభేదించినవానియొక్క - ఇంద్రునియొక్క, నైచికి = ఉత్తమమయినగోవు - కామధేనువు (ఉత్తమాగోషునైచికీ - అమ) వేయువిధంబులన్ = వెయ్యిరీతులచేత పలురకములుగా - అనుట) అతఁడు = అతఁడు - అయుతుఁడు, ఏదన్ = పోషింపఁగా, ఏచి = విజృంభించి, ఖలమైత్రిఁబోలెన్ = దుర్జనస్నేహమువలె, విశృంఖలమై = కట్టుపాటులేనిదై, వేగన్ = త్వరగా, బలవిహీనతా = శక్తియొక్కయల్పత్వము

239 ప:- 1 వోలె – గొ; బోలె - ర, అ.

వలననైన, ఆర్తి = వ్యథ, ఉడుగఁగన్ = తొలఁగఁగా, కడున్= మిక్కిలి క్రొవ్వునన్ = పుష్టితో, నివ్వటిల్లి = అతిశయించి, బీదబలిసి బంది కాఁడగు విధంబున్ = పేదవాఁడుబలుపెక్కి బందిపోటయినట్లు, (బంది బోటుగా మాఱినట్లు) అమ్మహాటవిన్ = ఆగొప్పయరణ్యమునందు, తిరిమ్మఁకున్ = సంచరించును.

అలం :— ఉపమ.

ఉ॥ గుండువలెన్బలీయమగుఁ 1 గోడియతోడఁజరింప. నారఁగాఁ
బండినబల్సువంటి 2 పసభాసిలుమైసిరిచూడ్కి 3 కెంతయున్
బండువౌనల్పనర్పగతి పాలజనింప, 4 సమాంసమీనకున్
వెండియునిల్చెఁజూలుదధివీచిమణీఘృణి 5 చొచ్చుచాడ్పునన్. **240**

వ్యా :— గుండువలెన్ = గుండ్రాయివోలె, బలీయమగు = (మిక్కిలిబలము (దృఢత్వము) గలదియగు, కోడియ = వత్సతరము కోడెదూడ) తోడన్ = వెంబడిని, చరింపన్ = సంచరింపఁగా, అరఁ, గాన్ = బాగుగా, పండిన = ఫలించిన, బల్సువంటిపసన్ = కసివెంద పొదవంటి (బసులుకొరకసివెందయనఁగాసమర్థము - ఆం. భా) కాంతితో భాసిలు = ప్రకాశించు, మైసిరి = శరీరశోభ, చూడ్కికిన్ = దృష్టికి, ఎంతయున్ = అత్యంతము. పండువౌనర్పన్ = ఆనందముకూర్పఁగా (నేత్రోత్సవమొనర్పఁగా - అనుట) పాలన్ = క్షీరమునందు, అల్పగతి= తక్కువయినరీతి, జనింపన్ = కలుగఁగా, (గోవుపట్టిపోవునుండు

---

240 ప:- 1 గోడియ - గౌ: నో (కో?) డియ - అ. ‹గోడియ -ర, 2 పసి- డ, ద, బ; పస - ర,అ. 3 నెంతయుఙ్ - గౌ, కెంతయున్- ర.అ. 4 సమానమీనకుఙ్ - గౌ. సమాంసమీనకుఙ్-ర, అ. 5 వొల్చు-గ; చొచ్చు - ర, అ, గౌ.

క్షీరధారతగ్గును.) సమాంసమీనకున్ = ఏఁటేఁటనీనునట్టియావునకు - ఆకామధేనువునకు, (సమాంసమీనాసాయైవ ప్రతివర్షంప్రసూయతే- అమ) ఉదధివీచిన్ = సముద్రపుఁగెరటమునందు మణిఘృణి = రత్న కాంతి, చొచ్చుచాడ్పునన్ = ప్రవేశించునట్లు, వెండియున్= మరల, చూలు = గర్భము, నిల్చెన్ = కలిగెను.

బల్సు - ఇది గుల్మభేదము. ఇది వర్షర్తువునఫలించును, దీని ఫలములాకుపచ్చగానుండును. కృష్ణహరితవర్ణములకైక్యము. కవిసమ యము. "కృష్ణహరితయోః .... ఏకత్వేననిబంధనం కవిసమయః" [కావ్యమీ]

వ్యాక :— అగు+కోడియ = అగు+న+కోడియ; అగుఁ గోడియ. ఇది "పోలుందెలనాకులు" వంటిది. చూ 1-29 వ్యాఖ్య. "ఉదంతతద్ధర్మార్థవిశేషణమునకు హల్లుపరంబగునపు గొన్నియెడలనుగాగ మంబుబహుళంబుగానగు" [ము. కౌ. సంధి 24]

అలం :— ఉపమ.

ఆ॥ వత్సయుతయు గర్భవతియునై మాహేయి
1 ప్రతివ్రతంబు 2 నడఁపవార్చియుండెఁ
3 గంజగర్భతర్ణకయు 4 జగద్గర్భయు **241**
నైన 5 యసురఁజెఱుపు 6 టావుఁబోలె.

241 ప:- 1 పతి - ముద్రి (అ), ర; వ్రతి — అ. 2 నడచి - క; నడుప-చ; నడఁప - ర. అ. 3 గంబు - గ. ర; గండు - గౌ. 4 జగ-అ,గౌ; జర - ర. 5 యసురు - ముద్రి (అ): యసుర జెఱుపు - క; యసురఁజెఱుపు - ర, అ; అసురఁజెపు - గౌ. (అస్పష్టము) 6 టావు - ర, అ.

వ్యా :— వత్సయుతయున్ = దూడతోఁగూడుకొన్నదియు, గర్భవతియునై = చూలుదాల్చినదియునై, మాహేయి =గోవు, (మాహేయీసౌరభేయీగౌః - అమ) వ్రతి = బ్రహ్మచారియొక్క, (వ్రతీ = బ్రహ్మచారీ - శబ్దక) వ్రతంబున్ = నియమమును - తపస్సును, అణఁపన్ = భగ్నముచేయుటకు, కంజగర్భ = బ్రహ్మదేవుఁడు, తర్ణకయున్ = దూడఁగాఁగలదియు, (సద్యోజాతస్తుతర్ణకః - అమ = అప్పుడే పుట్టినదూడ. ఇటుదూడయని యర్థము. వయస్సవివక్షితము,) జగత్‌గర్భయున్ = విశ్వము కుక్షియందుఁగలదియు, ఐన = అయినట్టి అసురఁజెఱుపు = దైత్యాంతకుఁడైన - విష్ణుమూర్తియైన, అవున్‌పోలెన్= గోవువలె, వార్చిఉండెన్ = వేచియుండెను.

*హరుఁడు, త్రిపురాసులను సంహరింపఁగా, మయుఁడు వారిని సిద్ధరసకూపమునవైచెను. కూపామృతరసముచే వారుపునర్జీవితులయిరి. అప్పుడు విష్ణుమూర్తి, బ్రహ్మదూడయైరాఁగా గోరూపమునఁగూపామృతమును బానముచేసెను. పిమ్మటుహరుఁడు త్రిపురాసురులను సంహరించెను. (భాగ 7 స్కం. 397-401 ప.)

"వత్సఆసీత్తదా బ్రహ్మ, స్వయం విష్ణురయంహిగౌః
ప్రవిశ్యత్రిపురంకాలే, తచ్చకూపామృతంపపౌ"
(సం. భాగ. 7-10-64)

---

*ఈపురాణకథాంశము తమ తండ్రిగారి సత్యవత్యుపాఖ్యానమునఁగలదని మాన్యమిత్రులు శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మగారు తెలిపిరి. "జిష్ణువత్సఁజేసికొని తానుధేనువై--కూపామృతము హరియారగించె" సత్యవత్యుపాఖ్యానము (మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రిగారి కృతి) పిమ్మటఁబరిశీలింపఁగా భాగవత ప్రమాణములభించినది. ఇంద్రుఁడుదూడయయ్యెనని పురాణాంతరములలో నుండవచ్చును. శ్రీ శర్మగారికిఁ గృతజ్ఞుడను.

దూడఁతోఁగూడుకొన్నదియు, గర్భముకుక్షియందుఁగలదియు నగు కామధేనువు. బ్రహ్మదూడ గాఁగలదియు, జగత్తుకుక్షియందుఁగలది యునై, త్రిపురాసురసంహారకాలమున, మయునిర్మితమయిన కూపామృతమును పానముచేయుటకై వేచియున్న విష్ణుమూర్తియగుధేనువవలె నాబ్రహ్మచారియొక్క తపస్సునుభగ్నముచేయుటకై వేచియుండెననుట

వ్యాక :— అసురఁజెఱుపు = అసురనుజెఱుపు - ద్వితీయాతత్పురుషము. అలుక్సమాసము, మిశ్రము. చెఱుచు + పు = చెఱుపు. చెఱుచువాఁడనుట. కర్త్రర్థమున. 'పు' వర్ణము. (బా. సంధి 11) ఇది, 'తాలుపు' వంటిది. నెలతాలుపు = నెలనుదాలుపు నెలనుదాల్చువాఁడనుట. ఇదియాచ్ఛికము. లుక్సమాసము. అసుర_జాత్యేకవచనము. ఇదినిపాతన్యాయమున గ్రాహ్యము. (ము. కౌ. సమాస 18)

అలం :— ఉపమ.

క॥ లోచన వికృతిముకురమున
గోచరమగు పగిదిఁగపటగోచరితము దన్
మోఁచిన, వాచంయమసుతుఁ
డేచిన నెవ్వగలఁబొగిలి యిట్లూహించెను. **242**

వ్యా :— లోచన = కన్నులయొక్క, వికృతి = వికారము మార్పు ముకురమునన్ = అద్దమునందు, గోచరమగుపగిదిన్ = కనఁబడునట్లు, కపటగో = మోసపుటావుయొక్క, చరితము = నడవడి, తన్ = తన్ను, మోఁచినన్ = తాఁకఁగా, వాచంయమసుతుఁడు = మునికుమారుఁడు - అయుతుఁడు, ఏచిన = అతిశయించిన, నెవ్వగలన్ = అధికచింతచేత, పొగిలి = పరితపించి, ఇట్లు = ఈ ప్రకారముగా, ఊహించెన్ = వితర్కించెను.

అలం :— ఉపమ.

సీ॥ వత్సనాభీగంధవహమయ్యెనీయావు
పైగాలి నీవారపాకమునకుఁ
గఠినకుద్దాలవక్త్రములయ్యెనీ జన్నె
1 మునుడెక్కలకక్కందమూలములకుఁ
జటులదావానలచ్ఛట 2 యయ్యెనీగిడ్డి
కటుజిహ్వాబర్హిర్నికాయమునకు
3 నారుణోచ్చారణోద్ధతులయ్యె 4 నీతొఱ్ఱు
కంఠహుంకృతులేణగర్భిణులకు

తే॥ నాకు మొగమోడియాఁగాదనరు తపస్వు
లేలయీమైల? 5 పూయకదూల, దీని
వత్సయుతముగ నివనివాటమునకు
6 లాడిగావింతు, నంతఁదొలంగుదూఱు. **243**

వ్యా ;— ఈయావు = ఈగోవుయొక్క, పైగాలి = మీఁది నుండి వీచువాయువు, నీవారపాకములకున్ = నివ్వరిసస్యముయొక్క ఫలములకు - నివ్వరిధాన్యములకు, వత్సనాభీగంధవహము = వత్సనాభియను విషభేదముయొక్క వాయువు, అయ్యెన్ = అయెను.

ఆవుపైనుండి వీచువాయువువత్సనాభీవిషవాయువయ్యెను. అనఁగా నివ్వరిసస్యమునుభక్షించియావు నివ్వరిధాన్యమునునాశనముచేయుచున్న దనుట.

నీవారపాకము — "నీవారపాకాదికడంగరీయైః (రఘు 5-9)= పచ్యత ఇతిపాకః, ఫలంధాన్యమితియావత్, నీవారస్యపాకః తృణధాన్యమ్" (సంజీ)

---

243 ప:- 1 ముసు - ర, గౌ; మును(ని?)-అ, 2 లయ్యెగ, ర, యయ్యె -అ; గౌ. 3 నారణో - ర, అ. 4 నిత్రొఱ్ఱు - గౌ; నీతొఱ్ఱు -ర,అ. నీతొ(రి - చ. 5 పుయ్యక - క, చ, త; పూయక - ర, అ. 6 లాతి — త; లాడి - ర, అ.

(2) ఈజన్నె = ఈహోమధేనువుయొక్క, మనడెక్కలు = గిట్టలయొక్క ముందటిభాగములు, (గొరిజడెక్కగిట్టయన ఖుర నామంబు - అం. భా) అక్కందమూలములకున్= ఆముల్లంగిదుంపలకు, కఠిన = వాఁడియైన, కుద్దాల = త్రివ్వకోలయొక్క, (గుద్దలియొక్క) వక్త్రములు = ముఖములు - అగ్రములు, అయ్యెన్ = ఆయెను.

ఆవుయొక్క ఖురాగ్రములు కందమూలములకు వాఁడియయిన త్రివ్వకోలమొనలయ్యెను. అనఁగా నావుఖురాగ్రములచేతఁగందమూల ములు పెల్లగింపఁబడి నశించుచున్నవనుట.

(3) ఈగిడ్డి = ఈయావుయొక్క, (ఆవుపొట్టియుగిడ్డియనఁజెలఁగు- అం. భా) కటు = పరుషమైన, జిహ్వా = నాలుక, బర్హిః = దర్భల యొక్క, (బర్హిస్ఫూసి హుతాశనే, నస్త్రీకుశే - మే. ని) నికాయము లకున్ = సమూహములకు, చటుల = చంచలమయిన, (చటులంచపలం లోలంచలంపారిప్లవాస్థిరే -అభి. చిం.) దవానల = కార్చిచ్చుయొక్క, (దవదావౌవనారణ్యవహ్న్యోః - వై. ని.) ఛట = కాంతి, (ఛటా = దీప్తౌ - శబ్దస్తో) - మంట, అయ్యెన్ = ఆయెను.

ఆవుయొక్కనాలుక, దర్భలకుఁగార్చిచ్చుయొక్కజ్వాలయయ్యెను. అనఁగా నావుదర్భనెల్లయెడలభక్షించివేయుచున్నదనుట.

(4) ఈతొఱ్ఱు = ఈపసరముయొక్క - ఈయావుయొక్క, (గోమ హిష్యాదులనామముల పసితొఱ్ఱుతొడుకుపసరమునానడరు అం. భా) కంఠ హుంకృతులు = అఱపులు. (అంభారావములనుట) ఏణగర్భిణులకున్= చూలుతోనున్న లేళ్లకు, అరుణ = అరుణమంత్రములకు సంబంధించిన, ఉచ్చారణ = పలుకుటయొక్క, ఉద్ధతులు = నిష్ఠురత్వములు, అయ్యెన్ = ఆయెను.

ఆవుయొక్క యంభారావములు చూలుతోనన్న లేళ్లకరుణ మంత్రోచ్చారణములయ్యెను. అనఁగా లేళ్లకు గర్భపాతమును గలిగించు ననుట.

కృష్ణయజుర్వేదములోని యారణ్యకమను వేదభాగమునందలి యరుణమంత్రములను గర్భిణులు విన్నచో గర్భస్రావమగును. కాన నావుచేయునంభారవములరుణ మంత్రములయ్యెననుట. ప్రసవసమయమున నరుణ మంత్రములు పఠించిన సుఖప్రసవమగును.

"ద్విజతనారణ్యకధ్వనివినఁగఁజేసి

గర్బమునుసుఖచ్యుతము సేయఁగడఁగెననఁగ" (ఆయుక్త 479)

"ఆరణ్యకధ్వని - వేదభాగవిశేషము." అరణ్యేఽధ్యయనాదేవ ఆరణ్యకముదాహృతమ్- అరణ్యమందు అధ్యయనముసేయవలసినదగుట చేత అరణ్యకమనఁబడును, దీనిని ఇంటిలో చెప్పరు. ఏలయన దీనిని విను గర్భిణులకు గర్భస్రావమగును. ప్రసవసమయమందు స్త్రీ వినునట్లుగా దీనిని పఠించిన సుఖప్రసవమగును. ప్రసవమేకాక, నొప్పులేపడుచున్నను, అప్పుడు బ్రాహ్మణులు దీనింబఠింతురు. దీనిని వినుటచేత శీఘ్రమే సుఖప్రసవమగును. (సంజీ)

అరుణ - అరుణమునకు సంబంధించినది. "అరుణాలు పఠింపగ నాలకించి" (శివతా 3-14) "అరణాలు - అపముద్రితము - సూ. ని. ఈయపముద్రితమును జూచి అరణ్యకశబ్దభవమే 'ఆరణ' శబ్దమనికొంద అనుట యవిచారమూలకము

తపస్విలు = మునులు. నాకున్ = నాయందు - నావిషయమున, మొగమోడి=దాక్షిణ్యమువహించి, (మొగమోటుపడి)ఔఁగాదనరు= ఔనని కాదని పలుకరు - ఊరకొందురు. ఈమైల = ఈమాలిన్య

మును - ఈయుపకీర్తిని, పూయక = అలందక - అణిగింపక, (ఈచెడ్డ పేరును బోగొట్టుకొనక - అనుట) దూల = కండూతి, (దురద) ఏల = ఎందులకు? (అనావశ్యకమనుట) దీనిన్ = దీనిని - ఈయావును వత్సయుతముగన్ = దూడతోఁగూడ, ఈవనీవాటమునకున్ = ఈయరణ్యప్రదేశమునకు, [వాట = స్థానే - శబ్దస్తో] లాడి + కావింతున్ = ఉపహారముగాఁజేయుదును [అడవిలోనికిఁబాఱఁద్రోలెదననుట] అంతన్ = అంతటితో, దూఱ = నింద, తొలంగున్ = పాయును.

వ్యాక;- నాకున్ = నాయందు - నావిషయమున. (ప్రౌ. కారక 13)

అలం ;— రూపకము.

ఉ॥ దండమెదీని 1 వాలధి, సుధా 2 నిభవాఃకరకంబెదీనియీ
కుండపొదుంగు, దీనిముకుఁ 3 గ్రోళులు భూమిబిలాంతరంబులే?
4 ఖండపటంబెదీసమెడకంబళమంచుఁదృజించెరోసియ
5 క్రొండికబ్రహ్మచారి, మడిఁగూకులువత్తులునై, 6 యసద్గవిన్.

**244**

వ్యా :— దీని = దీనియొక్క - ఈయావుయొక్క, వాలధి = తోఁక (పుచ్ఛోఽస్త్రీలూమలాంగులే వాలహస్తశ్చవాలధిః - అమ) దండమె = కఱ్ఱయా? (బ్రహ్మచారిచేతితో ధరించు మోదుగులేదా బిల్వముయొక్క కఱ్ఱయా?) దీని = దీనియొక్క - ఈయావుయొక్క ఈకుండపొదుంగు = ఈఘటమువంటి యూధస్సు, సుధా = అమృతముతో, నిభ = సమానమయిన, వాః = జలముయొక్క, కరకంబె =

---

244 ప:- 1 వాలము - చ, త: వాలధి - ర, అ. 2 నిధివాక్కర- త; నిధివాఃకరకంబె - ర, అ; నిధివాఃకరణంబె - గౌ. 3 గ్రోళ్లులు - త; గోళులు - గ; గ్రోళులు - ర, అ. 4 గండపటం - డ, ద, బ: ఖండపటం - ర, అ, గౌ. 5 క్రొండెక - ముద్రి (అ): క్రొండక - గ: క్రొండికక - ర, అ. 7 యసద్గతిః - ముద్రి (అ), ర; యసద్గవిన్ - అ

కమండలువా? [కమండలౌచకరకః - అమ] దీని = దీనియొక్క ఈయావుయొక్క, ముకుఁగోళులు = నాసాపుటములు, భూమిబిల గుహలయొక్క, అంతరంబులే = మధ్యభాగములా? (భూగర్తము గుహ, బిలము = గర్తము - సూ. ని.) దీని = దీనియొక్క-ఈయావు యొక్క, మెడకంబళము = గంగడోలు, (సాస్నాతుగళకంబళః - అమ గళము = మెడ) ఖండపటంబె = గుడ్డముక్కయా? - కౌపీనమా అంచున్ = అని, ఆక్కొండికబ్రహ్మచారి = అయల్పవయస్కుఁడగు వటువు, మది = మనస్సు, కూకులువత్తుట నై = తుత్తుసియలై (మనస్సు వికలమై - మనస్సువిఱిగి - అనుట) అసద్గవిన్ = దుష్టమయినగోవును రోసి = ఏవగించి, త్యజించెన్ = విసర్జించెను.

మోదుగులేదా మారేడుదండమో, జలకుండికయో, గుహాభాగములో, కౌపీనమో బ్రహ్మచారికిఁగావలయునుగాని, యావుయొక్క తోఁకకుండపొదుగు ముక్కుఁబుటములు గంగడోలునను వానితోనేమిపని?

దండమునకు వాలమునకు, జలకుండికకుఁబొదుఁగునకు; ముక్కుఁజెఱ్ఱ ములకు గుహలకుఁగౌపీనమునకు గంగడోలునకునౌపమ్యమువ్యంజితము

బ్రాహ్మణ బ్రహ్మచారి, మారేడు దండముగాని మోదుగు దండముగాని ధరింపవలెను—

"బ్రాహ్మణోబైల్వపాలాశౌ, క్షత్త్రియోవటఖాదిరౌ
పైలవైదుంబరౌవైశ్యో, దండానర్హంతిధర్మతః" [మ. స్మృ]

వ్యాక :— అసద్గవి - అసత్+గో, చూ. 1-65 వ్యాఖ్య.

తే॥ క్రేపువాపోవఁబట్టిలంకియకుఁదార్చి
తోఁకలవియఁగొట్టి, మెడనొక్క 1 త్రుద్దుగట్టి
గిడ్డివెడలించెఁదల్లితాడు కేలఁ 2 జుట్టి
మారివెలించువడువున. మాణవకుఁడు. 245

---

245 ప:- తుండు - ముద్రి (అ). ర: త్రుందు - త: త్రుడ్డు - చ; తొ్రడ్డు-ఆ.
2 చొట్టి - ముద్రి (అ), ర; జుట్టి - అ, గౌ.

వ్యా :— మాణవకుఁడు = బ్రహ్మచారి - అయుతుఁడు, (వటుఃపునర్మాణవకః - అభి చిం.) క్రేపు = దూడ, వాపోవన్ = అఱవఁగా, పట్టి = పట్టుకొని, లంకింపుకున్ = లంకెకు, రెండింటిని గలిపికట్టెడుకట్టునకు తార్చి = కూర్చి, తోలు = చర్మము, అవియన్ = చిట్లునట్లు, కొట్టి = తాడించి, మెడన్ = కంఠమునందు, ఒక్క = ఒక, దుడ్డు = లావుపాటికఱ్ఱను. (టొంపను) కట్టి = బంధించి, తలత్రాడు = పశువులకొమ్ములకుఁగట్టెడు రజ్జువును, కేలన్ చుట్టి = చేతియందుఁ జుట్టుకొని, మారిన్ = మాసూరికారోగమును (స్ఫోటకమును) వెడలించువడువునన్ = తొలగించునట్లు, గిడ్డిన్ = ఆవును, వెడలించెన్ = వెళ్ళఁగొట్టెను.

అలం :— ఉపమ.

క॥ అధేనువు తత్కృతబహు
బాధలసక్రోధయగుచుఁబర 1 తత్వసము
ద్బోధకబోధకలితుఁడగు
వాధూల 2 మునీంద్రుఁడుండువనమునఁబడియెన్. **246**

వ్యా :— అధేనువు = అగోవు, తత్కృత = అతనిచేఁ (అయుతునిచే) జేయఁబడిన. బహుబాధలన్ = అనేక పీడనలచేత, సక్రోధయగుచున్ = కోపముగలదియగుచు, పరతత్వ = శ్రేష్ఠుఁడయిన పరమాత్మయొక్క, సముద్బోధక = సంస్కారోద్దీపనమును గలిగించు, బోధ = జ్ఞానముతో, కలితుఁడు = కూడుకొన్నవాఁడు, అగు = అయిన, వాధూల = వాధూలుఁడనెడు. మునీంద్రుఁడు = ఇంద్రుఁనివంటిమౌని - మౌనిశ్రేష్ఠుఁడు, ఉండు = వర్తించు, వనమునన్ = అరణ్యమునందు, పడియెన్ = చొచ్చెను.

---

246 ప.- 1 తత్త్వ - ర, అ; తత్వ - గౌ. 2 మునీంద్రు - ప, ర, గౌ; యతీంద్రు - అ.

తత్వ - ఏకతకారకమునుగలదు. చూ. 2-201 వ్యాఖ్య.

క॥ పులియున్న పొదరు, మొసలికి
నెలవగుబలుమడువుఁద్రాఁచునిల్చినవల్మి
బిలమన, నమ్మునివనమె
వ్వలనంజొరఁజనదు వాసవప్రభృతులకున్. **247**

వ్యా :— పులియున్న పొదరు = వ్యాఘ్రమువర్తించుపొద, మొసలికిన్ = నక్రమునకు, నెలవు = నివాసస్థానము, అగు = అయిన, బలుమడువు = పెద్దసరస్సు, త్రాఁచు = నాగుఁబాము, [నాగుఁబాముతాఁచనఫణిదనర్చు- ఆం. భా] నిల్చిన = నివసించిన, వల్మి = చెదలయొక్క, బిలము = రంధ్రము - పుట్ట (వల్మీకము) అనన్ = అనునట్లు, అమ్మని= ఆమౌనియొక్క-ఆవాధూలునియొక్క; వనము=అరణ్యము, ఎవ్వలనన్=ఏవిధముగాను, వాసవప్రభృతులకున్= ఇంద్రాదులకును, చొరఁజనదు = ప్రవేశింపశక్యముకాదు.

"వల్మి = చెదలపురుగు, చెదలు." సూ. ని. వల్మీకము చెదపురుగులచే నిర్మింపఁబడును గాన వల్మిబిలమనుట—

"అనేక సుషిరంవాద్యం, కాంతం స్త్రీ ముఖపంకజమ్
చక్షుఃశ్రోత్రప్రియంకరం, యోజానాతి సపండితః" - చాటువు
(వ+అద్యం; క+అంతం; స్త్రీ = చెదపురుగు. వమ్రికా యోషితోస్త్రియా - వై. ని.)

అలం :— ఉపమ.

శా॥ ఆమాయా 1 గవిమట్టునట్టడివిలోనత్యుద్ధతిన్ 2 రేసి, మ
ధ్యేమార్గంబున, నభ్రగర్భితసురాద్రిన్ 3 బోలి. వల్మీకరే
ఖామగ్నాకృతినున్నయున్న తతపఃకౌశల్య 4 కల్యున్, గత
వ్యామోహాలున్, జిరజీవి, దేవతులితున్, వాధూలవాచంయమున్. 248

---

248 పా:- 1 వివి-చ, త,గ,గౌ; గవి-ర,అ 2 రేగి-ర, రేసి-అ,గౌ. 3 బొల్చు గ; బోలి -ర, అ, గౌ. 4 శల్య - డ, ద, బ; కల్యున్ - ర, అ, గౌ.

వ్యా :— అమాయాగవి = అకపటధేనువు, నట్టడవిలోన్= అరణ్యమధ్యమునందు, అత్యుద్ధతిన్ = మిక్కిలియౌద్ధత్యముతో, రేసి = విజృంభించి, మధ్యేమార్గంబునన్ = నడిమితోవయందు, అభ్రిగర్భిత= మేఘము; మధ్యభాగమునఁగల, సురాద్రిన్ = మేరుపర్వతమును, పోలి = ఎనసి (సరిపోలి) వల్మీకరేఖా = పుట్టయొక్క యాభోగము (వైశాల్యము) నందు, రేఖా = ఆభోగే - శబ్దస్తో) మగ్న= మునిఁగిన ఆకృతిన్ = ఆకారముతో. ఉన్న = వర్తించుచున్న, ఉన్నత = గొప్పదయిన, తపః = తపస్సుయొక్క, కౌశల్య = నేర్పరితనము నందు, కల్యున్ = దక్షుఁడును. (కల్యోవాక్శ్రుతివర్జితే, సజ్జనీరోగ దక్షేషు - మే. ని.) గత = పోయిన, వ్యామోహున్ = వ్యామోహముగలవాఁడును. చిరజీవిన్ = చిరకాలజీవియు, దేవతులితున్ = దేవతాసమానుఁడు, అగు, వాధూల = వాధూలుఁడనెడు. వాచంయమున్ = మునిని. మట్టెన్ = త్రొక్కెను.

శరీరమధ్యభాగము పుట్టలోమునిఁగియున్న వాధూలముని, మేఘము మధ్యభాగమునఁగల మేరుపర్వతమువలెనుండెననుట.

వ్యాక :— మాయాగవి - మాయా + గో. చూ 1-65 వ్యాఖ్య మధ్యేమార్గము - చూ 2-77 వ్యాఖ్య.

అలం :— ఉపమ.

ఉ॥ మట్టిన, బిట్టు, మిట్టిపడిమౌని 1 సముత్థితుఁడయ్యె, మేనిపైఁ
బెట్టినపుట్టనెట్టువిసిబీటలువాఱ, శ్రవశ్యకుంతముల్
చట్టుపలెత్తిముందటికిసోఁగఁదలంప, 2 జటాచ్ఛటాటవిన్
3 దుట్టెలుగట్టినిద్రిలు మరుద్భ్రగధీశకులంబుమేల్కనన్. **249**

---

249 ప.- 1 సముద్ధతు - గౌ; సముత్థితు - ర. అ. 2 జటాచ్ఛటాళినిఁ-త; జటాచ్ఛటాచ్ఛవిఁ - ర; జటాచ్ఛటాచ్ఛవిఁ (దిన్?) – అ; జటాచ్ఛటాటవిఁ- గౌ. 3 దుట్టులు-త; దుట్టెలు-ర,గౌ; దుట్టెలు-అ.

వ్యా :— మట్టినన్ = (కపటధేనువు) త్రొక్కఁగా, మౌని = ముని - వాధూలుఁడు, బిట్టు = అత్యంతము. మిట్టిపడి = అదరిపడి, మేనిపైన్ = దేహముమీఁద, పెట్టిన = నిర్మించిన, పుట్ట = వల్మీకముయొక్క, నెట్టు = ప్రదేశము, 'ఉపహతియుఁదావునెట్టననొప్పు చుండు - ఆం. భా) అవిసి = పగిలి, బీటలువాఱన్ = బద్దలుకాఁగా, శ్రవఃశకుంతముల్ = చెవులందున్నపక్షులు, చట్టుపలెత్తి = ఱెక్కలు పైకెత్తి (గటి యీఁక చట్టుప యెఱక డాకననొప్పుఁబక్షంబు-ఆం. భా ముందటికిన్ = పురోభాగమునకు, సాఁగఁదలంపన్ = పోనెంచఁగా, జటాచ్ఛటాటవిన్ = అడవివంటి జడలసమూహమునందు, తుట్టెలు గట్టి = గుమిగూడి, నిదిరలు = శయనించు మరుద్భుగధీశ = వాతాశన (సర్ప) రాజులయొక్క, కులంబు = సజాతీయసమూహము, మేల్కనన్ = మెలకువనందఁగా, సముత్థితుఁడయ్యెన్ = లేచినిలఁబడిన వాఁడయ్యెను.

ఈ తపస్సమాధిక్రింది యభిజ్ఞానశాకుంతలశ్లోకమును దలపించు చున్నది.

"వల్మీకార్ధనిమగ్నమూర్తిరురసానందష్టసర్పత్వచా
కంఠేజీర్ణలతాప్రతానవలయేనాత్యర్థసంపీడితః
అంసవ్యాపిశకుంతనీడనిచితంబిభ్రజ్జటామండలం
యత్రస్థాణురివాచలోమునిరసావభ్యర్కబింబంస్థితః" (అభిజ్ఞా 7-11)

వ్యాఖ :— శ్రవస్ + శకుంత = శ్రవశ్శకుంతముల్. జటా + ఛటా = జటాచ్ఛటా, మరుత్ + భుక్ + అధీశ = మరుద్భుగధీశ.

మ॥ కనవుందీవలుదావపావక శిఖౌఘం 1బున్ బ్రకాశింప, వె
క్కసమైతోఁచినకొండచందమున దీర్ఘశ్మశ్రుచంచత్సటా

---

250 ప:- 1 బుల్ప్రకా - ముద్రి (అ), ర; బుఞప్రకా-అ; బుఞబ్రకా—గొ.

విసరకోధరసోగ్రమూర్తియగుచున్, వృద్ధవ్రతిశ్రేష్ఠుఁడా
త్మసమీపస్థితుహస్తముక్తసురభిన్ దద్వర్ణి నీక్షించుచున్. 250

వ్యా :— కసవుందీవలు = లతలవంటి తృణములు, దావ పావక = కార్చిచ్చుయొక్క, (దవదావౌవనారణ్యవహ్నోః - వై.ని.) శిఖా = జ్వాలలయొక్క, ఓఘంబున్ = సమూహమును, ప్రకాశింపన్ = ప్రకటింపఁగా, వెక్కసమై = అతిశయించినదయి, తోఁచిన = గోచరమయిన, (కనఁబడిన) కొండచందమునన్ = పర్వతమువలె, వృద్ధవ్రతిశ్రేష్ఠుఁడు = ముసలియైన మునివరుఁడు, దీర్ఘ = పొడవయిన, శ్మశ్రు = మీసముగడ్డమునను వానియొక్కయు (తద్వృద్ధౌశ్మశ్రుపుంముఖే - అమ) చంచత్ = ఒప్పుచున్న, సటా = జడలయొక్కయు, (వ్రతినస్తుజటాసటా - అమ) విసర = సమూహముచేత, క్రోధరస = కోపరసముచే, ఉగ్ర = భయంకరమయిన, మూర్తియగుచున్ = ఆకారముగలవాఁడగుచు, ఆత్మ = తనయొక్క, సమీప = దగ్గఱిప్రదేశమునందు, స్థితున్ = ఉన్నవాఁడను. హస్త = చేతివలన (నుండి) ముక్త = విడువఁబడిన, సురభిన్ = ధేనువుగలవాఁడును. (సురభిః - గోషుయోషితి - మే. ని) అగు, తద్వర్ణిన్ = ఆబ్రహ్మచారిని, (వర్ణినో బ్రహ్మచారిణః - అమ ఈక్షించుచున్ = చూచుచు, పొడవయిన మీసము గడ్డమునను వానితోడను, బొడవయిన జడలతోడను, నొప్పు, ముసలిముని, కార్చిచ్చుమంటలను స్ఫురింపఁజేయులతలవంటి తీఁగలతో నొప్పుపర్వతమువలెనుండెననుట.

సురభి - స్వర్లోకకామధేనువు పేరు. సురభి. అయినను నిటగోవను నర్థముననే నిదిప్రయుక్తము. ఏలన, వాధూలునకదికామధేనువని చూచి నప్పుడు తెలియదు. **అలం :—** ఉపమ.

---

2 చంచచ్ఛ(జ్జ?) టాహ-అ; చంచచ్ఛటా - ర,గౌ. 3 వీక్షించుచున్- డ, ద, బ; నీక్షింపుచున్ - గౌ; నీక్షించుచుఁ - ర, అ.

ఉ॥ ఓరిదురాత్మ! యోరివినయోజ్ఝిత! యోరిమదాంధ! యెందునే
వారికిఁజేరరాదు మనువారికి నావన, మీవుచొచ్చి, జం
భారికృతోపఘాతశతహార్యముగాని మదీయ ఘోరదు
ర్వారసమాధిగౌరవమువమ్ముగఁజేసితివాసురక్రియన్. **251**

వ్యా :— ఓరి దురాత్మ = ఓరీ! దుష్టమయిన స్వభావము గలవాఁడా! ఓరివినయఉజ్ఝిత = ఓరీ! యడఁకువచేత విడువఁబడిన వాఁడా! (అడఁకువలేనివాఁడా! అనుట) ఓరిమదాంధ = ఓరీ! మదము చేతఁగన్నుగాననివాఁడా! [మదముచేత నవివేకియయినవాఁడనుట] మనువారికిన్ = జీవించువారికి - జీవముపైనాశగలవారికి. నావనము = నాయొక్కయడవి, ఎందున్ = ఎచ్చటను, చేరరాదు = సమీపింప శక్యముకాదు. ఈవు = నీవు, చొచ్చి = ప్రవేశించి, [బ్రదుకుపై నాశగలవారికిఁజేరరాని నావనమునందుఁబ్రవేశించి-అనుట] జంభఅరి = జంభాసురవైరిచేత - ఇంద్రునిచేత, కృత = చేయఁబడిన, ఉపఘాత = విఘాతములయొక్క; శత = నూటిచేత (అనేక తపోభంగయత్నము లచేత - అనుట) హార్యము = అడఁపఁదగినది, కాని = కానట్టి, [ఇంద్రుఁడుచేసిన పెక్కుతపోభంగప్రయత్నములచేత నడఁపరానట్టి- అనుట] మదీయ = నాదయిన, ఘోర = భయంకరమయినదియు, దుర్వార = నివారింపరానిదియునగు, సమాధిగౌరవమున్ = ధ్యేయ వస్తువునందు మనస్సునేకాగ్రముగానుంచు సమాధియను ధ్యానభేదము యొక్క గొప్పతనమును, అసురక్రియన్ = అసురసంబంధమయిన వ్యాపారముచేత, వమ్ముగన్‌చేసితి = వ్యర్థముగానొనర్చితివి.

తే॥ వృద్ధుఁబణిధాన 1 నిర్మగ్నబుద్ధి, బలవి
హీమునన్నిట్లుచేసితిగాన, నీవు
నిట్టిప్రాయంబునీరూపు నీవిధంబు
నడటునడిపోపభేకంబవగుమనవుడు. **252**

---

252 ప. 1 నిర్మగ్న-ముద్రి (అ). ర; నిర్మగ్న - అ, గౌ.

వ్యా :— వృద్ధున్ = ముసలియు, ప్రణిధాన = సమాధి యందు, నిర్మగ్న = మునిఁగిన - లీనమయిన, బుద్ధిన్ = మతిగల వాఁడును, బలవిహీనున్ = శక్తి లేనివాఁడును, అగు, నన్నున్= నన్ను, ఇట్లు = ఈప్రకారముగా, చేసితి = ఒనర్చితివి. కానన్ = కావున, నీవున్ = నీవును, ఇట్టిప్రాయంబున్ = ఇటువంటి వయస్సును, ఈ యాకారమును, ఈవిధంబున = ఈరీతియొక్క - ఈరీతికిఁజెందిన, అదటున్ = గర్వమును, (ఇటువంటి మిసిడిపాటును - అనుట) ఉడి వోవన్ = ఉడిగిపోఁగా, (చెడఁగా) భేకంబవు = కప్పవు, అగుము= కమ్ము. అనవుడు = అన్నయనంతరము.(మీఁదిపద్యముతోనన్వయము)

శా॥ అప్పృథ్వీసురసూతితత్పదసరోజానమ్రుఁడై యిట్లనున్
గోపాటోపమడంపుఁ 1 డీరలిగినన్ గొండల్ 2 వడున్, వారిధుల్
రూపేదున్; ధరవ్రయ్యు. మిన్నొరగు, మద్రూపంబు 3 నానెంతని
ష్ఠాపద్మాసన! లెస్సగాఁదెలిసినన్ శాపాగ్నిచేఁగ్రాఁపవే! **253**

వ్యా ;— అప్పృథ్వీసురసూతి = ఆబ్రాహ్మణాపత్యము-అయ యుతుఁడు, (సూతిః = సంతానః - శబ్దక) తద్ = అతనియొక్క - వాధూల మహర్షియొక్క, పదసరోజ = పద్మములవంటి పాదముల యందు, అనమ్రుఁడై = వ్రాలినవాఁడయి, ఇట్లు = ఈప్రకారముగా అనున్ = పలికెను. కోప = కినుకయొక్క, ఆటోపము = విజృంభ ణమును, అడంపుఁడు = ఉపశమింపఁజేయుఁడు, ఈరు = మీరు, అలిగి నన్ = కోపించినచో, కొండల్ = పర్వతములు, వడున్ = కూలును, వారిధుల్ = సముద్రములు, రూపేదున్= రూపుచెడును (నశించును) ధర = భూమి, వ్రయ్యున్ = భేదిల్లును, మిన్ను = ఆకాశము,

253 ప:- 1 పుమీర - త; పుఁడీర - ర; అ. 2 నదుల్—క; వడున్-ర; అ.
3 బనా - త, గౌ; బునా - ర, అ,

ఒరగున్ = పడిపోవును. మత్ = నాయొక్క, రూపంబు = రూపు, నాన్ = అనఁగా, ఎంత = ఏపాటిది? నిష్ఠా = నియమమునందు - తపోనియమమునందు, పద్మాసన = బ్రహ్మయైనవాఁడా! లెస్సగాన్= బాగుగా, తెలిసి = యోజించి, నన్ = నన్ను, శాపాగ్నిచేన్ = శాపమనెడు ననలముచేత, కాల్పవే = దహింపుమా! (నేనుదండ్యుఁడ నోకానోతెలిసికొనిదండ్యుఁడనైనచో శాపాగ్నిచే దహింపుమనుట)

రూపేదు - ఏదు = నశించు ఇదివ్యస్తముగావాడఁబడదు. అనుప్రయుక్తముగానే దీనికిఁబ్రయోగములు.

పద్మాసనుఁడు - ఖగోళదృశ్యము. చూ 1-3 వ్యాఖ్య.

అలం :— కావ్యార్థాపత్తి

క॥ తఱుగని లయశిఖివని నిను
నెఱుఁగుదు; వాధూల మునికులేశ! నిజముగా,
నెఱిఁగియెఱిఁగి తనయౌదలఁ
గొఱవిం గొని 1 గోఁకఁదివురుకుమతియుఁగలఁడే? **254**

వ్యా:— వాధూల = వాధూలుఁడను పేరుగల, మునికులేశ = మౌనికులపతీ! నినున్ = నిన్ను, తఱుగని = క్షీణింపని, లయశిఖివని = ప్రళయాగ్నివని, ఎఱుఁగుదున్ = తెలియుదును నిజముగా =యథార్థముగా, ఎఱిఁగియెఱిఁగి = తెలిసితెలిసి తన = తనయొక్క, ఔదలన్= శిరోగ్రమును, ఔదలముందలయైన శిరోగ్రముమీఁఱు - అం, భా కొఱవిన్ = కొఱకచ్చును, కొని = గ్రహించి, కొఱకచ్చుతో - అనుట గోఁకన్ = బరుకుటకు, తివురు = యత్నించు, కుమతియున్ = అవివేకియు, కలఁడే = ఉండునా? (ఉండఁడనుట) తెలిసి

254 ప:- 1 గ్రోక - త; గోక - ర; నోఁక - - అ.

తెలిసి బుద్ధిపూర్వకముగా నెంతయవివేకియయినను గిదుతెచ్చి పెట్టు కొనఁడనుట. అలం :— లోకోక్తి.

ఉ॥ ఉద్ధతిదక్కియొక్కయెడనూరక యుండఁగనీని కంధరా
బద్ధమహాహినీ కపిలఁబాపఁదలంచితి, నొండులేదు, దీ
నోద్ధర 1 ణాతిసాంద్రకరుణోదధివీచి సమృద్ధియైననీ
బుద్ధికిఁజేర్పఁగాఁదగునె? భూరిదవానలకీల 2 ఖేలమున్. **255**

వ్యా:— ఉద్ధతి = ఔద్ధత్యమును, తక్కి = విడిచి, ఒక్కయెడన్ = ఒక చోట, ఊరక యుండఁగనీని = ఉపేక్షాభావముతోనుండనీయని, కంధరా = మెడయందు, బద్ధ = కట్టఁబడిన, మహాహిన్ = గొప్పసర్పమగు, ఈకపిలన్ = ఈకపిలధేనువును,(ఈపుల్లావును) పాపఁదలంచితిన్ = తొలఁగింపనెంచితిని ఒండులేదు = వేఱుచింతలేదు. దీన = జాలిగొలుపువారియొక్క, ఉద్ధరణ = రక్షించుటయందు, అతిసాంద్ర = మిక్కిలియతిశయ మయిన, కరుణా = దయయనెడు, ఉదధి = సముద్రముయొక్క వీచి = కెరటములచేత, సమృద్ధియైన = పెంపుదలగలదియయిన, నీ = నీయొక్క, బుద్ధికిన్ = మతికి, భూరి = అధికమయిన. దవానల = కార్చిచ్చుయొక్క. (దవదావౌవనారణ్యవహ్నీ - అమ) కీల = జ్వాలలయొక్క, ఖేలమున్ = క్రీడను, చేర్పఁగాఁదగునె = పొందించుట యుక్తమా? (యుక్తముకాదనుట)

అలం :— రూపకము, విషమము

వ॥ అనిమునితనయుండు ధేన్వాగమనాది 1 తదుచ్చటనాంతంబుగాఁ గలతనవృత్తాంతంబు విన్నవించుటయు, నూహించియత్తెఱంగు చిత్తంబునయథార్థంబుగాఁగనుంగొని. **256**

---

255 ప:- 1 ణార్థ - త; ణాతి - ర, అ. 2 ఖేలముల్ - త, గొ. ఖేలమున్ - ర, అ.
256 ప:- 1 తదుచ్చాలనా - చ; తదుచ్చాటనా - ర, అ.

వ్యా :— అని = ఈప్రకారముగా, మునితనయుండు = మౌనిసుతుఁడు - అయుతుఁడు, ధేను = గోవుయొక్క, అగమనాది = రాక మొదలుకొని, తద్ = దానియొక్క - ఆగోవుయొక్క, ఉచ్చాటనాంతంబుగాఁగల = స్వస్థానమునుండి వెడలఁగొట్టుటవఱకుఁగల, తన = తనయొక్క, వృత్తాంతంబున్ = ఉదంతమును, విన్నవించుటయున్ = విన్నపముచేయుటయు, ఊహించి = ఆలోచించి, అత్తెఱంగు = అవిధము (అయుతుఁడుచెప్పిన వృత్తాంతము - అనుటు) చిత్తంబునన్ = మనస్సునందు, యథార్థంబుగాన్ = సత్యమయినదిగా, కనుంగొని= తెలిసికొని (మీఁటపద్యముతో నన్వయము)

మ॥ భ్రుకుటీ 1 భీషణఫాలభాగుఁడుఁదను బ్రోద్భూతఘర్మాంబుబిం
దుకుఁడున్ 2 బ్రస్ఫురదోష్ఠపల్లవుఁడుఁ, జేతోభీతికృల్లోలతా
రకఘూర్ణన్నయనుండుఁగాక, శమసారస్మేరుఁడయ్యెన్ దప
స్వికులగ్రామణి, చిచ్చుచంద్రుడు 3 పొడవై చెన్నొందుచందంబునన్

**257**

వ్యా :— తపస్వికులగ్రామణి = తాపసవంశముఖ్యుఁడు - వాధూలమహర్షి, భ్రుకుటీ = బొమముడిచేత, భీషణ = భయంకరమయిన, ఫాలభాగుఁడున్ = లలాటప్రదేశముగలవాఁడును, తను = శరీరమువలన (నుండి), ప్రోద్భూత = మిక్కుటముగాఁబొడమిన, ఘర్మాంబు = స్వేదజలముయొక్క, (చెమటనీటియొక్క) బిందుకుఁడున్ = కణములుగలవాఁడును, ప్రస్ఫురత్ = బాగుగాఁజలించుచున్న, ఓష్ఠపల్లవుఁడున్ = చిగురువంటి మోవిగలవాఁడును, చేతః = మనస్సునకు, భీతికృత్ = భయముఁ గలిగించునదియగు, లోల = చంచలమయిన, తారక = కనుగ్రుడ్డులచేత; (కనీనికాయాంనక్షత్రేతారక

---

257 ప:- 1 భూషణ - గొ; భీషణ - ర, అ. 2 ప్రస్ఫుటదోష్ఠ - ముద్రి (అ), ర; ప్రస్ఫురదోష్ఠ - అ. 3 పొడుపై - క; పొడవై - ర, అ.

తారకేపిచ - విశ్వ) ఘూర్ణత్ = తిరుగుడుపడుచున్న, నయనుండున్ = కన్నులుగలవాఁడును, కాక = కాకుండ, చిచ్చు = అగ్నిచంద్రు = ఇంద్రునియొక్క, పాదపై = ఆకృతియై. చెన్నొందుచందంబునన్ = ఒప్పారునట్లు, శమ = శాంతియొక్క, సార = అతిశయము చేత, స్మేరుఁడు = చిఱునవ్వుగలవాఁడు, అయ్యెన్ = ఆయెను.

అలం ;— కల్పితోపమ.

క॥ సప్రణయుఁడగుచు మునిలో
కప్రవరుండాదరించెఁగనికరమున న
వ్విప్రకుమారుఁదృణాంచల
విప్రుషములుగా వెయవని విబుధా 1 గ్రహముల్. **258**

వ్యా :— మునిలోకప్రవరుఁడు = మౌనిజన శ్రేష్ఠుఁడు - వాధూలమహర్షి. సప్రణయుఁడగుచున్ = ప్రీతితోఁగూడిన వాఁడగుచు, అవ్విప్రకుమారున్ = ఆబ్రాహ్మణనందనుని - ఆయయుతుని, కనికరమునన్ = దయతో, ఆదరించెన్ = చేరఁదీసెను. అవనివిబుధ = భూదేవులయొక్క, (బ్రాహ్మణులయొక్క) ఆగ్రహముల్ = కోపములు, తృణ = గడ్డియొక్క, అంచల = చివరఁగల, విప్రుషములుగావె = జలబిందువులుకావా? అగుననుట. (పృషంతిబిందుపుషతాః పుమాంసో విప్రుషఃస్త్రియం - అమ) అత్యల్పకాలముననశించుననుట.

తృణాంచలవిప్రుషము లు - "విప్రులయలుకయుఁ, దృణహుతాశనంబుదీర్ఘమగునె" ఆది 6-89

వాధూలమహర్షి కోపము నువీడి ప్రీతిపూర్వకముగా నయుతునాదరించెను. బ్రాహ్మణులకోపము గడ్డిచివరఁగల నీటిబిందువుగదా! (క్షణభంగురమనుట) అలం ;— అర్థాంతరన్యాసము.

---

258 ప- 1 ధగ్రహ - త; ధాగ్రహ - ర, అ.

ఉ॥ అవసుధామర 1 ప్రవరునమ్మునియిట్లను 2 విన్మువత్స! 3 మ
ద్భావపథంబునన్ నిను 4 నపాపునిగాఁగనుఁగొంటి, 5 నాగ్రహా
వ్యావిలచిత్తవృత్తినిటులాడితి. మీఁదరయంగలేక; నా
6 యీవచనంబుతప్ప7దనియింకెద, మూర్ఖత 8 తన్ను మోచుటన్

**259**

వ్యా:— అవసుధామర ప్రవరున్ = అభూసుర (అబ్రాహ్మణ) శ్రేష్ఠునిగూర్చి, అమ్ముని = అమౌని - అవాధూల మహర్షి, ఇట్లు = ఈ ప్రకారముగా, అనున్ = పలికెను. వత్స = బిడ్డా! (ఇది వాత్సల్య సూచకము) విన్ము = ఆకర్ణింపుము. మత్ = నాయొక్క, భావ పథంబునన్ = మనోమార్గమున, నినున్ = నిన్ను, అపాపునిగాన్ = అనఘునిగా, కనుఁగొంటిన్ = తెలిసికొంటిని. అగ్రహా = కోపము చేత, వ్యావిల = మిక్కిలికలుషమయిన, చిత్తవృత్తిన్ = మనఃప్రవృత్తి చేత, మీఁదు = రాఁబోవుపరిణామమును, అరయంగలేక = తెలియఁ జాలక, ఇటులు = ఈప్రకారముగా, ఆడితిన్ = పలికితిని. మూర్ఖత = అవివేకిత్వము, తన్నున్ = తన్ను, మోచుటన్ = ఆవహించుటచేత, నా = నాయొక్క, ఈవచనంబు = ఈపలుకు (ఈశాపము) తప్పదని= వ్యర్థముకాదని, ఇంకెదన్ = స్రుక్కెదను (శాపమునివర్తింపలేనితన యశక్తతకు వాధూలుఁడు చేసికొను నాత్మనిందయిది )

---

259 ప.- 1 ప్రభవు-ముద్రి (అ). ర: ప్రవరు - అ. గౌ. 2 వత్సవిన్ము-ర,అ విన్మువత్స - గౌ. 3 నాభావ - ముద్రి (అ). ర. మద్భావ - అ. 4 నపాతు్రి - ప: నపాపు - ర. అ. 5 నాగ్రహాయావిల - చ, త, నాగ్రవ్యావృత - ముద్రి (అ), ర, యీవచనంబుతప్పదని - అ: యావచనంబుదప్పదని యింకెద - గౌ. (యతిభంగము) యావచ నంబుదప్పదనయుంబెద - ముద్రి (అ), ర. 7 దనియింకడ -క; దనియింకెద - అ, గౌ; దనయుంబెద-ర. 8 నన్ను-ర,అ; తన్ను-క.

వ్యాక :— వత్స - "వత్సదేవశబ్దంబులు మహాద్రాజవాచకంబులు సంబోధనంబునంద, ప్రయుక్తంబులగు; నగుచో వాని సంబుద్ధి డుజ్ఞానకు లోపంబగు" (ము. కౌ తత్సమ 10) అనున్ = అనెను - బా. క్రియా 22 తన్నున్ = వన్నున్ - ప్రౌ. శబ్ద 78

చ॥ వగవకుమన్న! దైవగతివచ్చిన కీడుదలంచి నెమ్మదిన్
బొగులకుమన్న! కర్మముల 1 పోకకుభోగమెహేతువన్న! వి
శ్వగురుఁ 2 గరీంద్రవత్సలు 3 దివానిశముందలపోయుమన్న! మే
లగుహరిభక్తియుక్తులకునాపదరాదుగదన్న! యెన్నఁడున్. **260**

వ్యా :— వగవకుమన్న = నాయనా! దుఃఖింపకుము. దైవగతిన్ = పూర్వజన్మార్జితకర్మమార్గమున, (దైవ = పూర్వజన్మార్జితం కర్మణి - శబ్దసా) వచ్చిన = సంప్రాప్తించిన, కీడు = హానిని (శాపమునుటు) తలంచి = తలపోసి, నెమ్మదిన్ = నిండుమనమున, పొగులకుమన్న = పరితపింపకుము. (శాపముపూర్వజన్మకర్మవశమున నైనది. వాధూలుఁడు నిమిత్తమాత్రుఁడనుట) కర్మముల = కర్మముల యొక్క - ప్రారబ్ధకర్మములయొక్క, పోకకున్ = క్షయమునకు, భోగమె = సుఖదుఃఖరూపమగుఫలానుభవమే, హేతువన్న = కారణము. విశ్వగురున్ = జగత్పితయగు, కరీంద్రవత్సలున్ = గజేంద్రునియందు వాత్సల్యముగలవానిని - శ్రీహరిని, దివానిశమున్ = రేవగలును, (అహోరాత్రమును) తలపోయుమన్న = భావింపుము. మేలు = శుభము. అగున్ = కలుగును, హరిభక్తియుక్తులకున్ = విష్ణుభక్తితోఁ గూడుకొన్నవారికి, ఎన్నఁడున్ = ఏనాఁడును, ఆపదరాదుగదన్న = విపత్తిరాదుగదా!

---

260 పః- 1 పోకువ - క; పోకకు - ర; అ. 2 రుగరీం - డ,ద,బ; గిరీంద్రు- ర (పా), రుఁగరీం - ర, అ, గౌ. 3 నిశలఁజ-చ; నిశమున్-ర; అ.

దైవము - "భాగ్యే, ఫలోన్ముఖేశుభాశుభకర్మణి,
'ప్రాగ్జన్మనికృతంకర్మ, శుభం వాయదివాఽశుభమ్
దైవశబ్దేన నిర్దిష్ట, మిహజన్మనితద్భుదైః"
ఇత్యుక్తే పూర్వజన్మార్జితే కర్మణి" (శబ్దస్తో)

కర్మము - ఆగామి, సంచితము, ప్రారబ్ధమునని కర్మమువ్విధములు. ప్రారబ్ధకర్మమనుభవముచేతనే క్షయించును. కర్మసిద్ధాంతము లేనిచో జీవులయందుహెచ్చుతగ్గులును, జీవులకు దుఃఖములును గలుగుటకు దేవుఁడేకారణము కావలసివచ్చును. అట్టి పక్షపాతియుఁ గ్రూరుఁడు నగు దేవుఁడు నింద్యుఁడేయగును. గాని వంద్యుఁడుకానేరఁడు.

వాధూలమని శాపమునకయుతుని కర్మఫలానుభవమే హేతువు. వాధూలుఁడునిమిత్తమాత్రుఁడు. ఋషుల వాక్కునర్థమే యనుసరించును. "ఋషీణాంపునరాద్యానాం వాచమర్థోనుధావతి" (ఉ చ) అయుతుఁడు ప్రారబ్ధకర్మవశమునఁ గప్పకావలసియుండుటచేతనే వాధూలమహర్షి నోటశాపాక్షరములు వెలువడి వచ్చె మాట.

వ్యాక ;— కామగదన్న - కాదు + అన్న = రాదు + కద + అన్న = రాదుగదన్న - ప్రౌ క్రియా 9

సీ॥ జలధరంబన నెద్ది 1 పొలపంబుపుట్టించు
నిల్లాలిమెఱుఁగుల 2 ముల్లములకు
మున్నీరననఁగనెద్దిమొలచుటకావాల
మాణిపూసలువోని యాత్మజులకు
నీడమాఁకననెద్దినిలువనీడైతోఁచు
3 నాఁకటనెండుద్విజాపళులకుఁ

261 పః- 1 యొలపం - చ, త, గౌః యొలవం - కః పొలపం - ర, అ.
2 మొల్లకు - గౌః మొల్లము - రః అ. 3 నాఁకటనుండు-ముద్రి (అ), రః నాఁకటనొందు- గః నాఁకటనిండు - తః నాఁకటనెండు-అ నానటనీడు - గౌ.

దాపనసెద్దియాధారమౌ 4 దివిఁబ్రాఁకు
పితృసర్వ 5 లకుఁ 6 గుంటిపిచ్చుకలకు

తే॥ నట్టిగృహమేధి ధర్మంబునందునీవు
కుత్ససేయుటనీ రీతిఁ 7 గొదవయొదవె
నొప్పనదియొప్పదని పల్కునుద్ధతులకుఁ
గసరిపైవచ్చుఁ 9 దాళ్లపైగాలియైన. **261**

వ్యా :— ఎద్ది = ఏది, జలధరంబు = మేఘము, అనన్ = అనునట్లు, (మేఘమువలె - అనుట) ఇల్లాలిమెఱుఁగుల = గృహిణులనెడు మెఱపులయొక్క, మొల్లములకున్ = సమూహములకు, పొలపంబుపుట్టించున్ = పొలుపుగలిగించునో.

వ్యాక :— ఇల్లాలిమెఱుఁగుల - 'ఇల్లాలు' జాత్యేకవచనము. ఇల్లాండ్రనెడుమెఱుఁగులు - చూ 4-17 వ్యాఖ్య.

పుట్టించున్= పుట్టించునో. ఓ - అధ్యాహార్యము. (ప్రౌ వ్యాక 13)

(2) ఎద్ది = ఏది, మున్నీరు = సముద్రము, అనన్ = అనునట్లు, (సముద్రమువలె) అణిపూసలువోని = అణిముత్యాలపూసలవలెనున్న, ఆత్మజులకున్ = సుతులకు, మొలచుటకున్ = జన్మించుటకు; ఆవాలము = అలవాలమో! (పాదో ఓ - అధ్యాహార్యము.)

(3) ఎద్ది = ఏది, ఆఁకటన్ = క్షుధతో, ఎండు = సీరసించు,

---

4 దీవ్రాంశు — గౌ; దివిఁబ్రాఁకు - ర, అ. 5 లను — చ; లకు - ర, అ. 6 గుంటుపిచ్చులకు - ర, గౌ; పిచ్చిక - ప; గుంటిపిచ్చుక - అ. 7 గొడవ - ఉ, ద, బ; గొదవ - ర, అ, గౌ. 8 గతినొప్పగనఁగల్గదుద్ధ - ఉ, ద, బ; నదియొప్పదనిపల్కు - ర, అ, గౌ. 9 జ్వాళ్లపై - ర, గౌ; రాళ్లపై - అ; దాళ్ళపై - త.

ద్విజ = బ్రాహ్మణులనెడు పక్షులయొక్క, (దంతవిప్రాండజాద్విజాః- అమ) అవళులకున్ = సమూహములయొక్క, నీడమ్రాను = నీడ నిచ్చుచెట్టు, (అశ్రియవృక్షము) అనన్ = అనునట్లు, నిలువనీడ = జీవనాధారము; ఐ = అయి, తోఁచున్ = కనఁబడునో! (ఓ - అధ్యాహార్యము)

(4) ఎద్ది = ఏది, దివిఁజొ్రఁకు = స్వర్గమునుజేరుటకుసాగు, కుంటిపిచ్చుకలకున్ = పాదములులేనివారగు - ముందుకుసాగలేని వారగు, పితృవర్యులకున్ = పితృశ్రేష్ఠులకు - పితృదేవతలకు, కాప = నిచ్చెన, అనంగన్ = అనునట్లు, ఆధారము = ఆదరువు, ఔన్ = అగునో! (ఓ - అధ్యాహార్యము)

అట్టి = అటువంటి, గృహమేధి ధర్మంబునందున్ = గృహ స్థాశ్రమమునందు, ఈవు = నీవు, కుత్స+చేయుటన్ = రోఁతపడుట చేత, ఈఁరితిన్ = ఈవిధముగా, కొదవ = న్యూనత (లోపము) ఒద వెన్ = సంభవించెను. ఒప్పునది = యోగ్యమయినదానిని, ఒప్పదని= యుక్తము. కాదని, పలుకు = నిందించు, ఉద్ధతులకున్ = గర్వితులకు కసరి = విజృంభించి. తాళ్లపైగాలి ఐనన్, పైవచ్చున్ = వచ్చుటకు వీలులేనిచోటునుండియైనను, నుపద్రవము వచ్చిపడును.

తాళ్లపైగాలిపైవచ్చు - వచ్చుటకువీలులేని చోటునుండివచ్చు, నుపద్రవమున దెలుపును. "తాళ్లపైన్ = తాటిచెట్లపైనున్న, గాలి యైనన్ = వాయువయినను, కసరి = విజృంభించి, పైవచ్చున్ = మీఁదికివచ్చును - ఉపద్రవకరమగును"

పైవచ్చు = మీఁదికివచ్చు. ఉపద్రవకరమగు -- తనమెచ్చులు తనకాహో, పైవచ్చె - భాగ 10 ఉ. 1248 "సూ. ని"

అలం :— రూపకానుప్రాణితములగునుపమలు.

క॥ ఏనింతవాఁడ. 1 నేనయి
పూనుదునఁటయెద్దికాకపోయెదునని 2 పం
తానఫలమందఁదీఱదు
మానవులకకాదు, వినుమమర్త్యులకైనన్. **262**

వ్యా :— ఏన్ = నేను, ఇంతవాఁడన్ = ఇంతగొప్పవాఁడను ఏనయి = నేనుగా (నేనేస్వయముగా) పూనుదునఁట = చేయఁదల పెట్టుదునఁట, ఎద్ది = ఏది, కాకపోయెదునని = నెఱవేఱకపోవునని, పంతానన్ = చలముతో, మానవులకకాదు = మనుష్యులకేకాదు. వినుము = (సావధానముగా) ఆకర్ణింపుము, అమర్త్యులకైనన్ = దేవతలకయినను, ఫలము = ప్రయోజనము. అందన్ = పొందుటకు, తీఱదు = సాధ్యముకాదు.

వినుము -- వాక్యమధ్యమున ముఖ్యాంశము వచ్చినప్పుడు శ్రోతకువక్త చేయుహెచ్చరిక.

సీ॥ మునులనుష్టుభమునఁదనుఁగొల్వఁదగువానిఁ
బ్రహ్లాదుఁబోర్వఁబాల్పడినవాని
ద్వాత్రింశదురుభుజాస్తంభాఢ్యుఁడగువాని
నశ్వత్థమూర్తియైయలరువానిఁ
జక్రింబుచే క్షేత్ర 1 జనముఁబ్రోచెడువాని
వివిధాయుధంబులవెలయువాని
నలఘుదివ్యాకల్పములజూడఁగలవాని
భీమరథ్యాపగా సీమవాని

---

262 ప:- 1 యేనయు - చ, త, నేనయి - ర, అ. 2 సుంతైన - ముద్రి (అ), ర; సంతాన - చ, త, గౌ; పంతాన - అ.

263 ప:- 1 జమని - చ; జనము - ర, అ.

ఆ॥ వివిధకథలవాని వివిధరూపంబుల
వానినిలిచికొలుచు 2 వానివాని
శ్రీనృసింహదేవు సేవింపుభేకంబ
వై తదంఘ్రిమూలమధివసించి. **263**

వ్యా :— 1) మునులు = మౌనులు, అనుష్టుభమునన్ = అనుష్టుప్ ఛందస్సుతో, తనున్ = తన్ను. కొల్వన్ = సేవింపఁగా, తగువానిన్ = ఒప్పువాఁడును. ప్రహ్లాదున్ = ప్రహ్లాదుని, ప్రోవన్= రక్షించుటకు, పొల్పుడినవానిన్ = పూనకొన్న వాఁడును.

అనుష్టుభము - "అనుష్టుబ్‌గాయత్త్రైః (పింగళ 3-23) చతుష్పాద్ ఇత్యనువర్తతే, గాయత్త్రైరష్టాక్షరైః పాదైశ్చతుష్పాచ్ఛందః "అనుష్టుప్" సంజ్ఞాభవతి.

(2) ద్వాత్రింశత్ = ముప్పదిరెండు, ఉరు = గొప్పవయిన, భుజాస్తంభ = కంబములవంటి బాహువులచేత, ఆఢ్యుఁడు = సంపన్నుఁడు, అగువానిన్ = అయినవాఁడును, అశ్వత్థమూర్తియై = రావిచెట్టురూపముగలవాఁడయి, అలరువానిన్ = ఒప్పువాఁడును.

నరసింహునకు ముప్పదిరెండు బాహువులుండును. అతఁడశ్వత్థరూపియైయుండును. చూ 2-137; 2-124 ప.

(3) చక్రంబుచేన్ =(సుదర్శన) చక్రముచేత, క్షేత్రజనమునన్= క్షేత్రమునందలి ప్రజను (పాండురంగక్షేత్రవాసులననుట) ప్రోచెడువానిన్ = రక్షించువాఁడును. వివిధ = పలురకములయిన, ఆయుధంబులన్ = శస్త్రములతో. వెలయువానిన్ = ఒప్పువాఁడును.

---

2 వారి - గ; వానిశ్రీనృ. సింహదేవునెపుడు - గొ; వానివాని - అ.

(4) అలఘు = గొప్పవయిన, దివ్య = మనోహరములయిన, ఆకల్పములన్ = అభరణములచేత, (ఆకల్ప = భూషణేచ - శబ్దస్తో) చూడఁగలవానిన్ = దర్శనీయుఁడును, భీమరథీ = భైమియనెడు, ఆపగా = నదియొక్క, సీమవాసిన్ = ప్రదేశముగలవాఁడును.

వివిధ = అనేకవిధములయిన, కథలవానిన్ = చరిత్రలుగల వాఁడును, వివిధరూపంబులవానిన్ = అనేకవిధములయిన యాకృతులు గలవాఁడును, అగు, శ్రీనృసింహదేవున్ = శ్రీనరసింహస్వామిని, తద్ = అతనియొక్క, అంఘ్రిమూలము = పాదమూలమునందు, అధివసించి = ఉండి, భేకంబవై = కప్పవయి, సేవింపు = భజింపుము.

వ్యాక ;— శ్రీనృసింహదేవున్ = అనువిశేషణము ద్వితీయాంత మగుటచేఁ గొల్వఁదగువానిన్ - లోనగువిశేషణములకు ద్వితీయకలిగెను బా. కారక....

సీమవాని, కథలవాని, రూపంబువాని కొలుచువానివాని - అనునవి యాభాసబహువ్రీహులు. (వికృ)

అంఘ్రిమూలము = అంఘ్రిమూలమునందు -- సప్తమ్యర్థక ప్రథమ - ప్రౌ. కారక 20.

తే॥ దర్దురాంగనయందు సంతానసిద్ధి
నీకునగుఁగొంతకాలంబు 1 నిర్గమింప
దాననిదు పిత్రాణంబు 2 దలఁగు, శాప
మోక్షసంప్రాప్తి యునుగల్గు నాక్షణంబు. **264**

---

264 ప:- 1 నిర్గమించి - చ; నిర్గమింప – ర, అ. 2 తలఁగి - ముద్రి (అ), ర; తలఁగ – గ; తలఁగు – అ; గౌ.

వ్యా :— నీకున్ = నీకు - కప్పగా మాఱిననీకు, కొంత కాలంబు = కొంతసమయము, నిర్గమింపన్ = కడవఁగా, దర్దురఅంగన యందున్ = కప్పయయిన స్త్రీయందు, (భేకేమండూకవర్షాభూ, శాలూరప్లవదర్దురాః - అమ) సంతానసిద్ధి = సంతతిలాభము, (సంతాన ప్రాప్తి) అగున = కాఁగలదు. దానన్ = దానిచేత - ఆసంతాన ప్రాప్తిచేత, నీదుపితృాణంబు = నీయొక్క పితృాణము, తలఁగున్ = తొలఁగును. అక్షణంబ = అక్షణమునందే - వెంటనే, శాపమోక్ష = శాపవిముక్తి యొక్క, సంప్రాప్తియును=లబ్ధియు, కల్గున్=సంభవించును

దర్దురాంగన - దర్దురమయినయంగన - కన్యాకుబ్జరాజకుమారి శాపవశమునఁగప్పగామాఱి, కప్పగామాఱినయయుతునకు భార్యయాగును ఆదర్దురాంగనయందయుతునకు సంతానముకలుగును. అంతతో శాప విముక్తి.

పితృాణము - ఋణత్రయము -దేవ - పితృ-ఋషి, ఋణములు

"దేవానాంచపితౄణాంచ, ఋషీణాంచతథానరః"

ఋణవాన్ యజాతేయస్మాత్; తన్మోక్షేప్రయతేత్సదా తత్పరి

శోధనమాహ—

"దేవానామనృణోజంతు, ర్యజ్ఞైర్భవతిమానవః

అల్పవిత్తశ్చపూజాభి, రుపవాసవ్రతైస్తథా

శ్రాద్ధేనప్రజయాచైవ, పితౄణామనృణోభవేత్

ఋషీణాంబ్రహ్మచర్యేణ, శ్రుతేనతపసాతథా"

—ఇతి విష్ణుధర్మోత్తరమ్ [శబ్దక]

కాఁగాఁబితృణ విముక్తి సంతానప్రాప్తిచేతను శ్రాద్ధముచేతను ప్రాప్తించును.

వ॥ అనియివ్విధంబున వాధూలుండు శాపావధి నొడివి 1 యవ్వడువునా శ్వాసించి, విశ్వాద్భుత జనకంబుగ నంబురుహ ప్రియమండలంబు భేదించి కొనుచుం జని, యపవర్గసామ్రాజ్యసింహాసనాసీనుండయ్యె; నిచ్చటవియచ్చరధేనువు నేలిన వానిపని సఫలంబు చేసి ఫలోదయంబు నలంకరించె. ప్రయుత సుతుండును విఫలప్రయత్నుండై యయత్న సంప్రాప్తంబగు నిజవ్యసనంబున నసురుసురయ్యెను, సాయంసమయ కుముదంబు చందంబున 2 గొంతకొంతతచ్ఛాంతి వచనంబుల 3 వడం దేఱినవాఁడై, 4 జగత్త్రితయ 5 పవిత్రీకరణప్రవణంబగు పాండు రంగక్షేత్రంబునకుం జని. **265**

వ్యా :— అనియివ్విధంబునన్ = అని యీప్రకారముగా, వాధూలుండు = వాధూలమహర్షి, శాపావధి = శాపముయొక్క హద్దు, (శాపాంతము - అనుట) చెప్పి = తెలిపి, అవ్వడువున్ = అబ్రహ్మచారిని, అశ్వాసించి = ఊఱడించి, విశ్వ = లోకమునకు - లోకులకు, అద్భుతజనకంబుగన్ = ఆశ్చర్యకరముగా, అంబురుహప్రియమండలంబున్ = సూర్యమండలమును, భేదించికొనుచున్= చీల్చుకొనుచు, చని = అరిగి, అపవర్గసామ్రాజ్య = మోక్షసామ్రాజ్యముయొక్క, సింహాసన = సింహపీఠియందు, ఆసీనుండయ్యెన్ = కూర్చున్న వాఁడయ్యెను. ఇచ్చటన్ = ఇక్కడ, వియత్ = ఆకాశమునందు, చర = సంచరించువారియొక్క - దేవతలయొక్క, ధేనువున్= గోవును- కామధేనువును, ఏలినవాని = ఏలికయొక్క - ఇంద్రునియొక్క, పని= కార్యము, సఫలంబుచేసి = నెఱవేఱినదిగా నొనర్చి, ఫలోదయంబున్=

---

265 వ:- 1 యవ్వటువు-ముద్రి(అ), ర: యవ్వడువు—అ. 2 కొంతయలవడం దేఱిన-క: కొంతతచ్ఛాంతి-గా: కొంతకొంతతచ్ఛాంతి-అ. 3 వడదేరిన-అ; వడదేఱిన-అ,గౌ. 4 జగత్త్రయ-ర, జగత్త్రితయ-అ,గౌ. 5 పవిత్రీకరణంబగు - డ, ద, బ; పవిత్రీకరణప్రవణంబగు - ర, అ,గౌ.

స్వర్గమును, (స్వర్గో నాకస్సురావాస ఊర్ధ్వలోకః ఫలోదయః - వై. ని) అలంకరిచెంను= భూషితమగునట్లుచేసెను (స్వర్గమును జేరుకొనెననుట) ప్రియుతసుతుండును = ప్రియుతుని కుమారుఁడును - అయుతుఁడును- విఫలప్రియత్నుండై = వ్యర్థమయిన ప్రియత్నముగలవాఁడయి, అయత్న = యత్నములేకుండ - అనుకొనకుండ, (-నూహ్యామాగా) సంప్రాప్తంబగు = ఉపస్థితమయిన, (ఉటుస్థించి... జ... తమయిన, వ్యసనంబునన్ = విపత్తుచేత, (వ్యసన = విపత్తౌ - శబ్దస్తో) అసురు సురయ్యును = వ్యథనొందిన వాఁడయ్యును, సాయంసమయ = సాయంకాలమునందలి, కుముదంబుచందంబునన్= తెల్లకలువవలె, తత్= అతనియొక్క - వాధూలమహార్షియొక్క, శాంతివచనంబులన్ = ఉప శమనవాక్యములచేత, కొంతకొంత = కొంచెముకొంచెము, వడఁ దేఱినవాఁడై = సంతాపమునుండి తెప్పరిల్లినవాఁడయి. జగత్ = లోకములయొక్క, త్రితయ = మూఁడింటియొక్క - ముల్లోకముల యొక్క, పవిత్రీకరణ = పావనముచేయుటయందు, ప్రవణంబగు = ఆసక్తిగలదియగు, పాండురంగక్షేత్రంబునకున్ = పాండురంగక్షేత్రమునకు, చని = అరిగి, మీఁదిపద్యముతోనన్వయము]

వాధూలుని సూర్యమండలభేదనమునకు —

"ద్వావిమౌపురుషౌలోకే, సూర్యమండలభేదినౌ
పరివ్రాడ్యోగయుక్తశ్చ, రణేచాభిముఖోహతః" పరాశ

జగత్త్రితయ - "స్వర్గమర్త్యపాతాళభేదాస్త్రీణిజగంతి --
ఇత్యేకే" కావ్యమీ

క॥ భీమరథిఁ 1 దొట్టితీర్థ
స్తోమంబులనెల్లఁదనువుఁదోఁగించి; ముని
గ్రామణి, కుహనాభీరశి
ఖామణిమణిసౌధరాజగర్భాగతుఁడై. 266

266 ప.- దొంటి - ప; దొట్టి - ర, అ.

వ్యా :— మునిగ్రామణి = మౌనిముఖ్యుఁడు - అయుతుఁడు, మొదలుకొని, తీర్థస్తోమంబులనెల్లన్ = పుణ్యనదీ సమూహములయందన్నింటను, తనువు = శరీరమును, తోఁగించి = ముంచి, (స్నానము చేసి- అనుట) కుహనాభీరశిఖామణి = కపటగోపాలశేఖరునియొక్క- విటులునియొక్క, (గోపగోపాలగోసంఖ్యగోధుగాభీరవల్లవాః - అమ) మణిసౌధశాల = రత్ననిర్మితమగు సౌధశ్రేష్ఠముయొక్క- రత్నమయ దేవాలయముయొక్క, గర్భ = లోపలిభాగమునందు, అగతుఁడై = వచ్చినవాఁడయి. (దేవాలయములోనికిఁబ్రవేశించినవాఁడయి_అనుట) మీఁదిపద్యముతోనన్వయము.

సీ॥ సురతరుప్రసవరింఛోళి 1 చూలవినీల
జలదంబు 2 లోన్ని క్రొందళుకులనగ
మొగమువెన్నెలయేటి 3 మొగఁదేలు 4 మగమీల
గతిఁబక్షలాక్షియుగ్మకము మెఱవఁ
గఱియ 5 నెమ్మేనుచీకటిమ్రాఁకుఁబాఁకు బం
గరు 6 తీఁగకిర్యఁదూలఁ 7 గదుప్రశాటి
యుడుపథంబున 8 జాఱు 9 నుడురత్నతతిఖాతి
మెడహారముల పెనపుడమీఁదాఁక

---

267 ప:- 1 మౌళి - ముద్రి (అ). ర: చోళి - క, గౌ. చూళి - అ. 2 లోని కత్తెలకునొసగ-క; వోనీకతెలకునెసగ-చ:లోనికొ్రందళుకులెసఁగ-ర; లోనికొ్రందళుకులెసఁగ(?)-అ. లోనికత్తెలకునెసఁగ - గౌ. (గణ భంగము) కొ్రత్తళుకు-ప 3 మొగరేటి-ఢ,ద,బ; మొగలేటి ర(పా) మొగఁదేలు - ర, గౌ; మొగదేలు - అ. 4 మొగజాల - గ: మగ మీల – ర, అ. 5 నెమ్మేని-గౌ; నెమ్మేను- ర, అ· 6 తీగె- గౌ; తీగ-ర; తీఁగ-అ. 7 గ్రమ్మ – గౌ; గదుర - ర,అ. 8 మీరు- గ; జాఱు-ర,అ. 9 నురురత్న-డ,ద,బ,గౌ;నుదుపత్ర-క;నుడురత్న-ర,అ.

తే॥ నచ్చరలు పీవనలుపీవ, నంగశాగ
వాననలు భూషణా 10 ర్చులునేనరేఁగఁ
11 బిటిఁడిదెననున్నరమమీఁద 12 నొఱగిధవళ
చలదళచ్ఛాయనుండు విట్టలునుతింతు. **267**

వ్యా :— సురతరుప్రసవ = దేవతావృక్షకుసుమములయొక్క, రింఛోళి = సమూహముగల, చూల = కేశములు, (చూలః = కేశః-శబ్దక) నీనిల = మిక్కిలి నల్లనయిన, జలదంబు = మేఘముయొక్క, లోనికొ్రిందళుకులన్ = లోపలనున్న, కొ్రొత్తకాంతులను - లోపలి కొ్రిమ్మెఱపులను, నగన్= పరిహసింపఁగా, కొప్పుమేఘమును, గొప్ప నందలిదేవతాపుష్పములు మేఘగర్భమునందలిమెఱపులను, బోలుననుట.

రింఛోళి - చూ 2-44 వ్యాఖ్య.

అలం ,— ఉపమ.

(2) మొగము = ముఖమనెడు, వెన్నెలయేటి మొగన్= చంద్రికామయమగునదియొక్క ద్వారమునందు, తేలు= మునుఁగక పైకివచ్చు మగమీలగతిన్ = మగచేపఁలోయనునట్లు, పక్ష్మల = ఱెప్పలతోఁ గూడిన, అక్షియుగ్మకము = కందోయి, మెఱవన్ = ప్రకాశింపఁగా,

ఱెప్పలతోఁగూడిన కన్నులు, ముఖమనెడు చంద్రికామయమగు నదియొక్క ద్వారమునందుఁదేలుమగచేఁపలోయనునట్లున్నవనుట.

పురుషనేత్రములను మీనములతోఁ బోల్చుటకు—

"ఇతివిజ్ఞాపితోరాజ్ఞా; ధ్యానస్తిమితలోచనః
క్షణమాత్రమృషిస్తస్థౌ, సుప్తమీనఇవహ్రదః" (రఘు 1-73)

అలం :— ఉత్ప్రేక్ష.

---

10 ర్చులసేసలెసఁగ - డ, ద, బ; ర్చులునేసరేఁగ — అ; రేగ-ర. 11 పరిది-ప; బిఁదిటి-ర,అ, వెరగు-గొ. 12 నురిసి—స; నొఱఁగి - ర, గొ; నొరగి — అ.

3 కటికయనెమ్మేను = నల్లనిప్రశస్తమగు శరీరమనెడు, చీకటి మ్రాకున్ = తమాలవృక్షమును, ప్రాఁకు = అల్లుకొను, బంగరు తీఁగక్రియన్ = సువర్ణమయమగు లతయోయనునట్లు, కద్రుశాటి = పీతాంబరము, ("కద్రుఃకనకపింగళః - ఇతినామమాలా" - శబ్దర) తూలన్ = చలింపఁగా.

పీతాంబరము, నల్లనిదేహమనెడు తమాలవృక్షమును బ్రాఁకు బంగారుతీగయోయనునట్లున్నదనుట.

నెమ్మేను - నెఱ + మేను. నెఱ = ప్రశస్తము. చూ. 3-2వ్యాఖ్య

అలం :— ఉత్ప్రేక్ష.

4 ఉడుపథంబునన్ = నక్షత్రమార్గమునందుండి - ఆకాశము నుండి, జాఱు = క్రిందికిఁబడు, ఉడురత్నతతిభాతిన్ = మణులవంటి నక్షత్రములయొక్క సమూహములోయనునట్లు, మెడహారముల = కంఠమునందలి ముత్యాలపేరులయొక్క, పెన = మెలిక, పుడమిన్ = భూమిని, తాఁకన్ = స్పృశింపఁగా.

మెడలోని ముత్యాలహారములమెలిక, యాకాశమునుండి జాఱు నక్షత్రముల సమూహమోయననునట్లున్నదనుట.

వ్యాక:- ఉడుపథంబునన్=ఉడుపథంబుననుండి - ప్రౌ. కారక 11

ఉడు + పథిన్ - "ఋక్పూరబ్ధూః పథామానక్షే" పాణి అను సూత్రముచే 'అ' ప్రత్యయము సమాసాంతకార్యము. "టేః" (పాణి) అను సూత్రముచే 'టి' లోపము. ఉడుపథ్ + అ = ఉడుపథ.

'పథ' అను అకారాంతశబ్దము కాలక్రమమున నేర్పడెను. "వాటః పథశ్చమార్గశ్చ" (త్రి. ని.) "పథము, తప్పకునికియు" — ఉద్యో 2-45 అలం :— ఉత్ప్రేక్ష.

అచ్చరలు = అప్సరసలు, వీవనలువీవన్ = వీజనములువీవఁగా (వింజామరలతో విసరఁగా - అనుట) అంగరాగ = మైపూఁతలయొక్క, వాసనలున్ = గంధములును, భూషణ = ఆభరణములయొక్క, అర్చులున్ = కాంతులును, ఏసరేఁగన్ = మిక్కిలివిజృంభింపఁగా - అతిశయింపఁగా, పిఱిఁదిదెసన్ = వెనుకవైపున, ఉన్న = ఉన్నట్టి, రమమీఁదన్ = లక్ష్మిపైని, ఒఱగి = వ్రాలి. ధవళ = తెల్లనయిన, చలదళ = రావిచెట్టుయొక్క. (బోధిద్రుమశ్చలదళః పిప్పలఃకుంజరాశనః, అశ్వత్థే - అమ) ఛాయన్ = నీడయందు. ఉండు = వర్తించు విఠ్ఠలున్ = పాండురంగవిఠ్ఠలుని, నుతింతున్ = స్తుతింతును.

విఠ్ఠలు ;- విఠ్ఠలశబ్దనిరుక్తికి — చూ 1_213 వ్యాఖ్య. పాండురంగవిఠ్ఠల శబ్దమునుండి విఠ్ఠల అనునేకదేశము గ్రహింపఁబడెను. చూ 2_15 వ్యాఖ్య.

ఉ॥ 1భాలముచుక్క 2 వ్రక్కనెలపై వెలుఁగొందెడు లోహితాంగునిన్
బోలఁగఁగంబు 3 గర్భమునఁబొల్పగు నీలములీలఁగంధరా
కాళిమయుల్లసిల్ల. విధుఖండముకెంజడకెంపు 4 దమ్మిలో
బాలమరాళమట్లమరభాసిలుశూలి, లలాటపట్టికన్. **268**

వ్యా ;— భాలము = నుదుటియొక్క, చుక్క = బొట్టు- లలాటనేత్రము, (మూఁడవకన్ను) వ్రక్కనెలపైన్ = ఖండేందుని, (నెలవంక)యొక్కయుపరిభాగమున. వెలుఁగొందెడు = ప్రకాశించెడు. లోహితాంగునిన్ = అంగారకుని (అంగారకఃకుజోభౌమోలోహితాంగో

268 ప:- 1 ఫాలము - ర. అ; భాలము - గౌ. 2 వంకనెల - ముద్రి(అ),ర; ప్రక్కనెల - ప; వ్రక్కనెల - అ. 3 గర్భ-ప: గర్భమున-ర, అ. గర్భమను - గౌ. 4 దమ్మితో - గౌ; దమ్మిలో - ర, అ.

మహీసుతః - అమ) పోలఁగన్ = ఎనయఁగా, (నుదురుచంద్రఖండము వలెను, నుదుటిమీఁది మూఁడవకన్ను, చంద్రఖండముయొక్క మీఁది భాగమున వెల్గునంగారకునిబోలఁగా) కంధరా = మెడయొక్క, కాళిమ= నల్లఁదనము. కంబుగర్భమునన్ = శంఖముయొక్క లోపలిభాగము నందు, పొల్పగు = ఒప్పగు, నీలములీలన్ = నీలమణివలె నీలమణి కాంతివలె, ఉల్లసిల్లన్ = ప్రకాశింపఁగా, (మెడశంఖమువలెను. మెడ యందలినలుపు శంఖములోని నీలమణి కాంతివలె నొప్పఁగా) విధు ఖండము = చంద్రఖండము, కెంజడ = ఎఱ్ఱనిజడయనెడు. కెంపుఁ దమ్మిలోన్ = ఎఱ్ఱతామరయొక్క మధ్యబాగమున, బాలమరాళము అట్లు = పిల్లయంచయోఁయనునట్లు, అలరన్ = ఒప్పఁగా, (నెలవంక జటాజూటమందు నెఱ్ఱఁదామరయొక్కమధ్యభాగముననొప్పుహంసపిల్ల యోఁయనునట్లొప్పఁగా) భాసిలు = ఒప్పు, శూలి = శివుఁడు, లలాటపట్టికన్ = ఫలకమువంటి ఫాలమునందును. (మీఁదిపద్యముతో నన్వయము) ఫాలము - చూ. 3-64

వ్యాక ,— కెంపుఁదమ్మిలో - కెంపు + తమ్మి. తొలియచ్చు మీఁదివర్ణములకు (బా. సంధి 36) లోపముగానప్పటిరూపము. కెంపుఁ దమ్మియొక్క + లోన్ = కెంపుఁదమ్మిలోన్. లోన్ - 'లోను' శబ్దమున నుత్వములోపింపఁగా సిద్ధించినరూపము.

అలం :— కల్పితోపమ, ఉపమ, ఉత్ప్రేక్ష.

మ॥ నలినాసన్, నలి 1 నాసనావనపురాణస్థానముల్ 2 డాయకి
ముమ్మలఁ3బల్చాయల 4 బోరు తల్పుకలధరంపుంగెంపువాచూరులుం
గలవిద్వద్వదనాంతరాళ నవరంగ క్షోణిరాణించును
జ్వలవజ్రవజ్రజశంఖసంఘునిభ, భాషాయోష, జిహ్వాస్థలిన్. 269

---

269 ప:- 1 నాసన్నవికాసనా-క; నాసన్నలినాసనా- ర, అ. 2 బాయకి-క; డాయనిమ్ము-డ,ద.బ. డాయకి - ర, అ. 3 బల్మాయ - ప, ర; బల్చాయల-ర(పా), బల్చాయల-అ;గౌ. 4 బోరు(ర?)-అ; బోరు-ర, బోలుదల్పు - గౌ. 5 రంబుల్ - ముద్రి (అ), ర; రంపుం గెంపువా - అ; రంపురగెంపుగా - గౌ.

వ్యా ;— నలిన్ = అనురాగముతో. అసన్ = అపేక్షతో. నలినాసన = పద్మమాసనముగాఁగలవానియొక్క - బ్రహ్మయొక్క, ఆనన = ముఖములయొక్క, పురాణస్థానముల్= పురాతనస్థలములను డాయక = పొందక, ఇమ్ములన్ = ప్రీతితో, పల్ = దంతముల యొక్క, చాయల = మార్గములనెడు - దంతపంక్తులనెడు, బోరు తల్పులు = ముఖద్వారముయొక్క పెద్దతెక్కతలుపులు. అధరంపుం గెంపుశాచూరులున్ = క్రిందిపెదవు నెడు పద్మరాగమణిమయములగు ముంజూరులు, కల = కలిగిన, విద్వత్= పండితులయొక్క, వదన= ముఖములయొక్క, అంతరాళ = మధ్యభాగమనెడు, నవ = నూతన మయిన, రంగక్షోణిన్ = రంగస్థలమునందు, రాణించు = ఒప్పు - నటించు, ఉజ్జ్వల = ప్రకాశించెడు, వ్రజ = మగణాలయొక్క, (వజ్రములయొక్క) వ్రజ = సమూహముతోను, నిభ = సమాన మయిన, భాషాయోష = సరస్వతీకాంత, జిహ్వాస్థలిన్ = నాలుక ప్రదేశమునందు (మీఁదిపద్యముతో నన్వయము)

బ్రహ్మదేవుని ముఖములను వదలి, దంతపంక్తులనెడు తలవాకిటి తెక్కతలుపులు, క్రింది పెదవులనెడు పద్మరాగ మణిమయములగు ముంజూరులుగలిగిన పండితుల ముఖమధ్యభాగమనెడు రంగస్థలమున నొప్పు, వజ్రములవలెను శంఖములవలెను. దెల్లనయిన సరస్వతీదేవి; నాలుకయందును, [మీఁదిపద్యముతో నన్వయము]

పండితుల దంతపంక్తులు పెద్దకవాటములు వారి యధరములు కెంపులతో నిర్మించిన ముంజూరులు వారిముఖమధ్యభాగములు సరస్వతీ దేవికి రంగస్థలములు. సరస్వతివర్ణము తెలుపు. చూ. 1-4 వ్యాఖ్య.

నలినాసన - ఇట ఖగోళదృశ్యమునకుఁబ్రతీక చూ 1-3 వ్యాఖ్య

వ్యాక :— బల్చాయలబోరుతల్పులు - బల్చాయలయొక్క + బోరుతల్పులు = బల్చాయలనెడు బోరుతల్పులు - చూ 4-17 వ్యాఖ్య.

అలం ;— రూపకము.

సీ॥ లలితకుంతలశైవలము, ముఖైందవబింబ
మధరాధరప్రవాళాంకు 1 రంబు
చపలస్వభావలోచనమహామీనంబు
కమనీయకంధరాకంబుకంబు
గర్వితస్తనకనత్పర్వతాభోగంబు
విశదత్రివళిభంగవిలసనంబు
మధ్య 2 వృత్తావర్తమహితంబు, కటితటీ
ద్వీపంబు, పృథులోరుదివిజకరటి

తే॥ కరము, పదకూర్మపృథుకంబు 3 గమ్రనఖర
మణికలాపంబునగుచునేమగువరూపు
భూరిసౌభాగ్యసంపదఁ 4 బోలుఁదండ్రి
నాసుధాంబోధిపుత్రిబాహాంతరమున **270**

వ్యా :— లలిత = మనోహరమయిన (లలిత = సుందరే - శబ్దస్తో) కుంతలశైవలము = నాఁచువంటి కేశములుగలది - అని లక్ష్మి పక్షముననర్థము. (జలనీలీతుశైవాలంశైవలః - అమ) లలిత = మనోహరమయిన, కుంతలశైవలము = కేశములవంటి నాఁచు (తీఁగలు) గలది - అని క్షీరసముద్రపక్షముననర్థము. ముఖైందవబింబము= చంద్ర సంబంధియగు బింబమువంటి (ఐందవము = ఇందుసంబంధమయిన) మోముగలది - చంద్రబింబమువంటి మోముగలది - అని లక్ష్మిపక్షమున నర్థము. ముఖైందవబింబము = మోమువంటి, చంద్రసంబంధియగు బింబముగలది (ముఖాకృతిగల చంద్రబింబనుగలది - అనుట) - అని

---

270 వ:- 1 రములు - క; రంబు - ర, అ. 2 వృంతా - డ, ద, బ వృత్తా - ర, అ. 3 గ్రమ్మ - ముద్రి (అ), ర; గౌ. క్రమ— అ.
4 బొదలు - గొ; బోలు - ర, అ.

క్షీరసముద్రపక్షమునర్థము. అధశాధరప్రవాళాంకురంబు = పగడపు మొలకవంటి క్రిందిపెదవిగలది - అని లక్ష్మీపక్షముననర్థము. (అధస్తాదపిచాధరః; ఓష్ఠాధరౌతు - అమ) అధర = క్రిందిదయిన, అధర = పెదవివంటి (క్రిందిపెదవివంటి) ప్రవాళ = పగడముయొక్క, అంకురంబు = మొలకగలది - అని క్షీరసముద్రపక్షముననర్థము.

[2] చలపస్వభావ = చాంచల్యధర్మముగల, లోచనమహామీనంబు = గొప్పచేపలవంటి (వాలుగలవంటి - అనుట) కన్నులుగలది- అని లక్ష్మీపక్షముననర్థము. చపలస్వభావ = చాంచల్య ధర్మముగల, లోచనమహామీనంబు = కన్నులవంటిగొప్పచేపలుగలది (తిమితిమింగలాది మహామత్స్యములుగలది - అనుట) - అని క్షీరసముద్రపక్షముననర్థము. కమనీయ = సుందరమయిన, కంధరాకంబుకంబు = శంఖమువంటి (శంఖస్యాత్కంబురస్త్రియౌ-అమ) మెడగలది. కంఠః .... కంధరేత్యపి - అమ. కంధరా+క = కంధరగలది) - అని లక్ష్మీపక్షముననర్థము కమనీయ = సుందరమయిన, కంధరా = మెడవంటి, కంబుకంబు = శంఖములుగలది. (కంబు+స్వార్థేకన్)

లోచనమహామీనంబు - అనుటచేఁగన్నుల పక్షమున వాలుగలును క్షీరసముద్రపక్షమునఁదిమితిమింగలాదులునుగ్రాహ్యములు. స్త్రీల నేత్రములను వాలుగలతోను బేడిసలతోనుబోల్తురు. "వాలుగసోగలనేలుదెంచి తనవిలోచనములు" (విరాట 2-83) "బలువాలుగలనేలు తెలిడాలు కనుడాలు" (వసు 3 69) "బింబఫలోష్ఠి కన్నులను బేడిసమీలు" (ప్రభావ 2-71) మహామీనంబు - అనుటచే నిటువాలుగలని గ్రహింపఁదగును. సముద్రపక్షమునఁదిమితిమింగలాది మహామత్స్యములు గ్రాహ్యములు. ఇవి సముద్రమునందేయుండును.

"అస్తిమత్స్యస్తిమిర్నామ, శతయోజనవిస్తరః" (భరతః)
"అస్తిమత్స్యస్తిమిర్నామ, తథాచాస్తితిమింగలః
తిమింగలగిలోప్యస్తి, తద్గిలోప్యస్తిరాఘవ" (వాల్మీకి)

(3) గర్వితస్తనకనత్ పర్వతఆభోగంబు = ఒప్పుచున్న కొండ యొక్క పరిపూర్ణతవంటి మదించిన కుచములుగలది - అని లక్ష్మి పక్షమునసర్థము. గర్విత = మదించిన, స్తన = కుచములవంటి, కనత్= ఒప్పుచున్న, పర్వత = కొండలయొక్క, అభోగంబు = వైశాల్యములుగలది - అని క్షీరసముద్రపక్షముననర్థము. విశదత్రివళిభంగవిలసనంబు = కెరటములయొక్క, (భంగస్తరంగ ఊర్మిర్వా - అమ) విలాసమువంటి స్పష్టములయిన మూడు కడుపుముడుతలుగలది - అని లక్ష్మి పక్షముననర్థము. విశద = స్పష్టమయిన, త్రివళి = మూడుకడుపుముడుతలవంటి, భంగ = కెరటములయొక్క, విలసనంబు = విలాసముగలది - అని క్షీరసముద్రపక్షముననర్థము.

వ్యాక :— త్రివళి -- "కృదికారాదితిపక్షేజీప్త్రివళీత్యపి" (శబ్దక) ఇది కర్మధారయసమాసము.

"త్రివళీశబ్దఃసిద్ధః సంజ్ఞాచేత్ -- 'దిక్సంఖ్యే సంజ్ఞాయామ్' (పా 2-1-50) ఇతి సంజ్ఞాయామేవసమాసవిధానాత్". [శా. సూ.]

[4] మధ్యవృత్తఆవర్త = సుడివంటి [ఆవర్తోంభసాంభ్రమః - అమ] బొడ్డుచేత, మహితంబు =గొప్పది - అని లక్ష్మిపక్షముననర్థము మధ్యవృత్త = బొడ్డువంటి. ఆవర్త = సుడులచేత, మహితంబు = గొప్పది - అని క్షీరసముద్రపక్షముననర్థము. కటితటీద్వీపంబు = దీవివంటి నితంబప్రదేశముగలది - అని లక్ష్మిపక్షముననర్థము. కటితటీ = నితంబప్రదేశమువంటి. ద్వీపంబు = దీవులుగలది - అని క్షీరసముద్రపక్షముననర్థము.

మధ్యవృత్తము - చూ 1-129 వ్యాఖ్య.

పృథుల = స్థూలమయిన, ఊరుదివిజకరటికరము = దేవతాగజముయొక్క [ఐరావతముయొక్క - అనుట] తొండమువంటి తొడలు

గలదియు - అని లక్ష్మీపక్షమునఁ నర్థము. పృథుల = స్థూలములయిన ఊరు = తొడలవంటి, దివిజకరటి = దేవతాగజములయొక్క (అష్ట దిగ్గజములయొక్క - అనుట) కరము = తొండములుగలది - అని క్షీరసముద్రపక్షముననర్థము.

అష్టదిగ్గజములు క్షీరసముద్రమథనమున నందుండి జనించెనని పురాణకథనము. అష్టదిగ్గజములు - చూ. 1-2 వ్యాఖ్య.

పదకూర్మపృథుకంబు = తాఁబేటిపిల్లలవంటి (పృథుకశ్శాబక శిశుః - అమ) పాదములుగలది - తాఁబేటిపిల్లలచిప్పలవంటి మీఁగాళ్లు గలది - అని లక్ష్మీపక్షముననర్థము. పద = పాదములవంటి తాఁబేటి పిల్లలగలది - మీఁగాళ్లవంటి తాఁబేటిపిల్లలగలది - అని క్షీరసముద్ర పక్షముననర్థము.

మీఁగాళ్లకుఁ దాఁబేటి చిప్పలతో సామ్యము చెప్పుట ప్రసిద్ధము కాన మీఁగాళ్లు, తాఁబేటి చిప్పలుననునవిలక్షణార్థములుగా గ్రాహ్యములు.

కమ్ర = మనోహరమయిన, నఖరమణి కలాపంబున్ = రత్న సమూహములవంటి (కలాపోభూషణేబర్హే తూణీరే సంహతావపి- అమ) గోళ్లుగలది (ముత్యాలవంటిగోళ్లుగలది - అనుట) - అని లక్ష్మీపక్షమున నర్థము. కమ్ర = మనోహరమయిన; నఖర = గోళ్లవంటి (నఖోऽస్త్రీ నఖరోऽస్త్రియామ్ - అమ) మణి = రత్నముల యొక్క (ముత్యముల యొక్క) కలాపంబు = సమూహముగలది - అని క్షీరసముద్రపక్షమున నర్థము. అగుచున్ = అగుచు, ఏమగువ = ఏకాంతయొక్క, రూపు= ఆకృతి, భూరి = అధికమయిన, సౌభాగ్యసంపదన్ = ఒప్పిదము యొక్క సంపత్తిచేత, తండ్రిన్ = జనకుని (క్షీరసముద్రుని లక్ష్మి - క్షీరసముద్రమథనమున, నందుండి జనించెనని పురాణకథనము) పోలున్ = ఎనయునో, అసుధాంబోధిపుత్రి = ఆక్షీరసముద్రతనయ-

ఆలక్ష్మీదేవి, బాహాంతరమునన్ = వక్షమునందు (దోర్దోషాబాహు బాహాచ.... తదంతరమురః ధనం) మీఁదిపద్యముతోనన్వయము.

ఈపద్యమున క్షీరసముద్రధర్మములు లక్ష్మీదేవియందుఁగలవని శ్లేషచే నిరూపితము. తండ్రియాకృతిగలకన్యలు ధన్యలనుట ప్రసిద్ధము.

"ధన్యాపితృముఖీకన్యా, ధన్యామాతృముఖస్సుతః"

"తండ్రిచాయగలకన్యలు ధన్యలుగావసుంధరన్" (వసు 3-113)

**అలం ,—** శ్లేషానుప్రాణితమగునుపమ.

మ॥ సితకీరస్ఫటికాక్షమాలి 1 కలు గెంజేదోయిసంధించి, భా
రతివామాంకతలంబునన్ సతతమున్ రంజిల్లఁగల్లోలసం
గతహంసోత్తమఫేన పంక్తియగుగంగావాహినిందాల్చుదై
వతశైలంబనఁదేజరిల్లునలవిశ్వస్రష్టనాభిం 2 దగన్. **271**

**వ్యా :—** సిత = తెల్లనయిన, కీరస్ఫటికాక్షమాలికలు = చిలుకయుఁబటికపుఱాళ్ల జపమాలయు, కెంజేదోయిన్ = ఎఱ్ఱనికేలుఁగవయందు (ఎఱ్ఱనియు ఱచేతులయందు - అనుట) సంధించి = కూర్చి, (ధరించి) భారతి = సరస్వతీదేవి, వామ = ఎడమదయిన, అంక తలంబునన్ = తొడయొక్కపై భాగమునందు, (తలమ్ = హస్తాదీనాముపరిభాగః - శబ్దర) సతతమున్ = ఎల్లప్పుడు, రంజిల్లన్ = ఒప్పఁగా, కల్లోల = కెరటములతో, సంగత = కూడుకొనిన, హంసోత్తమ ఫేనపంక్తియగు = మరాళశ్రేష్ఠము, నురుగువరుసగలదియగు, గంగావాహినిన్ = భాగీరథీనదిని, తాల్చు = వహించు, దైవతశైలంబు = సురాద్రి (మేరుపర్వతము. మేరుః సుమేరుర్హేమాద్రీరత్నసానుఃసురాలయః - అమ) అనన్ = అనునట్లు, తేజరిల్లు = ప్రకాశించు, విశ్వస్రష్ట =

271 ప:- 1 కలఁగెం - ర; కలుగెం - అ, గౌ. 2 దగున్ - త; దగన్-ర,అ.

జగత్తునున్సృజించినవాఁడు - బ్రహ్మదేవుఁడు. నాభిన్= పొక్కిటియందు (బొడ్డునందు) తగన్ = ఒప్పఁగా. (మీఁదిపద్యముతోనన్వయము)

తెల్లనిచిలుకను బటికపుజపమాలను ధరించిన సరస్వతీదేవినెడమ తొడయందుఁదాల్చిన బ్రహ్మదేవుఁడు, హంసయునురుగు పంక్తియుఁగల గంగానదినిదాల్చిన మేరుపర్వతమువలెనొప్పుననుట.

సరస్వతితెలుపు. గంగాజలముతెలుపు. బ్రహ్మపసుపు.చూ 1.5; 50. మేరువు, సురాద్రి. కానినట నాకాశగంగయుండును.

సరస్వతిచేతి చిలుక తెల్లనిదిగానిటుఁజెప్పుటచే సరస్వతీనక్షత్ర ప్రాంతమునందలి కీరాకారనక్షత్రములేచిలుకకుఁబ్రతీకలని తెలియనగును.

268 పద్యమునందలి, లలాటపట్టికన్-అనునదియు, 269 పద్యము నందలి, జిహ్వాస్థలిన్ - అనునదియు, 270 పద్యమునందలి, బాహాంత రమునన్ - అనునదియు, నీ 271 పద్యమునందలి, 'నాభిన్' అనునదియు నీ 271 పద్యమునందలి, 'తగన్' అనునసమాపకక్రియతోనన్వయించును. శూలిలలాటపట్టికన్ (268) భాషాయోషజిహ్వాస్థలిన్ (269) సుధాంభోధి పుత్రిబాహాంతరమునన్ (270) విశ్వస్రష్టనాభిన్ - తగన్ [271] అని యన్వయము. ఇది మీఁదిపద్యముతోనన్వయించును.

అలం :— ఉపమ.

తే॥ రత్నసందర్భగర్భయీరత్నగర్భ
చరణపీఠంబుగానున్న సకలభువన
మయునినినుఁగంటిదేవ! నాభయములుడిగె
ననితపసి ప్రీతిఁగంసాభియాతిఁబొగడె. **272**

వ్యా :— దేవ = ఓవేలుపా! రత్నసందర్భగర్భ = మణుల యొక్క కూర్పులోపలిభాగమునఁగలిగిన, ఈరత్నగర్భ = ఈభూమి;

(జగతీరత్నగర్భాచ - అమ) చరణపీఠంబుగాన్ = పాదపీఠముగా, [కాళ్ళు పెట్టుకొనెడుపీఁటగా] ఉన్న = ఉన్నట్టి, సకలభువనమయునిన్ = సమస్తలోకాత్మకుఁడవగు; నినున్ = నిన్ను, కంటిన్ = దర్శించితిని, నాభయములు = నాయొక్కభీతులు, ఉడిగెన్ = తొలఁగెను. (తీఱెను) అని = ఈప్రకారముగా, తపసి = ముని - అయినతుఁడు, ప్రీతిన్ = ప్రియముతో, కంస = కంసునియొక్క, అభియాతిన్ = విరోధిని, (కృష్ణుని) - విట్ఠలుని, పొగడి = స్తుతించి.

క॥ అటఁ జనివటువు త్తర ది
క్తటమునఁగనుఁగొనియెఁదరళ 1 దళతరుమూర్తిన్
బటు 2 నఖరశైత్యమున నా
రటముడిపి 3 సురాళి నేలురసికున్నృసింహున్. **273**

వ్యా :— అటుజని = అక్కడనుండియరిగి, వటువు = బ్రహ్మచారి - అయినతుడు, ఉత్తరదిక్తటమునన్ = ఉత్తరదిశాప్రదేశమున, తరళదళతరుమూర్తిన్ = రావిచెట్టురూపముగలవాఁడును (తరళదళ = చలదళ - "బోధిద్రుమశ్చలదలః పిప్పలః కుంజరాశనః" - అమ) పటు = వాఁడియయిన, నఖర = గోళ్లయొక్క, శైత్యమునన్ = శితత్వముచేత (వాఁడిమిచేత), అరటము = సంతాపమును, ఉడిపి = పోఁగొట్టి, (వాఁడిగోళ్లతో హిరణ్యకశిపునిజీల్చి సంతాపమును బోఁగొట్టి-అనుట) సురాళిన్ = దేవతాసమూహమును, ఏలునట్టి = పోచినట్టి, రసికున్ = రసజ్ఞుఁడగు - చతురుఁడగు, నృసింహున్ = నరసింహస్వామిని, కనుఁగొనియెన్ = దర్శించెను.

268 పద్యము నుండి యీ 273 పద్యము వఱకు నన్వయము. కాన నిదికులకము.

---

273 ప:- 1 తరతరు - ముద్రి (అ); దళతరు - అ, ర. 2 శిఖర - గౌ; నఖర - ర, అ. 3 సురారి — ముద్రి (అ), ర; సురాలి - అ.

"ఛందోబద్ధంపదంపద్యం, తేనముక్తేనముక్తకమ్
ద్వాభ్యాంతుయుగ్మకంసంధానితకంత్రిభిరిష్యతే
కలాపకంచతుర్భిశ్చ, తదూర్ధ్వంకులకంమతమ్" (సా. ద.)

నాలుగుకంటె నెక్కువ పద్యములకన్వయమున్నచోఁగులకమనఁ బడును సంఖ్యానియమము వ్యాకర్తలమతమునలేదు. (ప్రౌ. వాక్య 23)

క॥ శాశ్వతకరుణాంబుధిన
వ్విశ్వవిభుంగనుటఁగోలె, విప్రునిమదిమౌ
నీశ్వరశాపవికా 1 రము
నశ్వరదుశ్చేష్టితాభినయమొనరింపన్. **274**

వ్యా :— శాశ్వత = అనశ్వరమయిన, కరుణా = దయకు, అంబుధిన్ = సముద్రమయినవాఁడగు - నిలయమయినవాఁడగు, అవ్విశ్వవిభున్ = ఆజగత్పతిని - అనృసింహస్వామిని, కనుటఁగోలెన్ = దర్శించినదిమొదలుకొని, విప్రుని = బ్రాహ్మణునియొక్క - అయుతుని యొక్క, మదిన్ = మనస్సునందు, మౌనీశ్వర = మునినాథునియొక్క- వాధూలమహర్షియొక్క, శాపవికారము = శాపవికృతి, (శాపమువలన స్వాభావికస్థితియందుఁగలిగినమాఱుపాటు) నశ్వర = శాశ్వతముకాని, దుశ్చేష్టిత = చెడ్డపనులయొక్క, అభినయము = అవస్థానుకరణమును - ప్రదర్శనమును, ఒనరింపన్ = చేయఁగా. వాధూలుని శాపమువలన సహజస్థితియందుఁగలిగినమాఱుపాటుచెడ్డపనుల[బదర్శింపఁగా-అనుట] మీఁదిపద్యముతో నన్వయము.

---

274 ప:- 1 మనశ్వర - డ, ర; రమునీశ్వర - ద, బ, య. (యతిభంగము)
రమునశ్వర - అ.

శా॥ నీరప్రాంగణకర్కటీబిల 1 మునన్ నిద్రింప, మృత్స్నామయా
హారంబుంగబళింపఁ 2 బెల్లఅవనిట్టట్టుఁబ్లుతంబుల్ గొనన్
దూరాయాస్యదహీంద్రభీతిహతి గొందుల్ దూఱఁగోరున్ మదిన్
3 సారాపేతమనోబలంబగుభవిష్యద్భేక 4 ముచ్ఛోకమై. **275**

వ్యా :— సార = చేవచేత, అపేత = తొలఁగిన, మనో బలంబగు = గుండెదిటవుగలదియగు, భవిష్యత్ = కానున్న, భేకము= కప్ప, ఉత్ = పైకుబికిన, శోకమై = దుఃఖముగలదై, నీరప్రాంగణ = నీటిముంగిలియందలి, కర్కటీ = ఆఁడుపీతల (ఎండ్రికల) యొక్క, బిల మునన్ = కన్నమునందు, నిద్రింపన్ = పండుకొనుటకు, మృత్స్న మయ = ప్రశస్తమయినమట్టివికారమగు (ప్రశస్తాతుమృత్స్నామృత్స్నా చ మృత్తికా - అమ) ఆహారంబును = తిండిని, కబళింపన్ = మ్రింగు టకు, పెల్లు = అధికముగా, అఱవన్ = అఱచుటకు, ఇట్టట్టుఁ = ఈవైపునావైపు, (ఇటునటు) ప్లుతంబుల్గొనన్ = గంతులు (దాఁటులు) వేయుటకు, దూర = దవ్వునందు, ఆయాస్యత్ = రానున్న, అహీంద్ర= సర్పశ్రేష్ఠము యొక్క, భీతిహతిన్ = భయాఘాతముచేత, గొందుల్ = సందులందు, దూఱన్ = ప్రవేశించుటకు, మదిన్ = మనస్సునందు, కోరున్ = వాంఛించును.

కప్పకాఁబోవుచున్నయయుతుని మనస్సునందుఁగప్పలక్షణములు స్ఫురించుచున్నవనుట.

వ్యాక :— గొందుల్ = గొందులందు సప్తమ్యర్థకప్రథమ ప్రౌ. కారక 20

---

275 వః- 1 ములన్ - ముద్రి (అ). మునన్ ర. అ. 2 బెల్లవని - గౌ: బెల్లఱవ - ర, అ. 3 సారో - గౌ; సారా - ర. అ. 4 ముత్సేక- ముద్రి (అ), ర; ముచ్ఛోక - అ; ముఛోక - గౌ. (లిపిలోపము)

క॥ ఈవడువున శాపవ్యస
నా వేశము 1 గదిరియునుమహాధైర్యముతో
నావిప్రుఁడు, సుప్రతిభా
దేవేజ్యుఁడు, ప్రస్తుతించుదితిసుత 2 శత్రున్. **276**

వ్యా :— ఈవడువునన్ = ఈవిధముగా, శాపవ్యసన = శాపరూపమగు విపత్తుయొక్క, [వ్యసన = విపత్తా - శబ్దస్తో] ఆవేశము = అభినివేశము, కదిరియును = అతిశయించినప్పటికిని, మహాధైర్యముతోన్ = గొప్పధీరత్వముతో, సుప్రతిభా = చక్కనయిన బుద్ధియందు, [మతిర్మనీషాబుద్ధిః .... ప్రతిభా అభి. చిం,] దేవేజ్యుఁడు = బృహస్పతియగు, (దేవేజ్యః = దేవానామిజ్యః పూజ్యః - బృహస్పతిః, ఇతి శబ్దరత్నావళి - శబ్దక) అవిప్రుఁడు = అబ్రాహ్మణుఁడు - అయితుఁడు, దితిసుతశత్రున్ = దైత్యారిని - నృసింహస్వామిని, ప్రస్తుతించున్ = (ఇట్లు) నుతించును.

శా॥ ఆసభ 1 నుక్కుఁగంభమున నాక్రియనుద్భవమంది, యాసురా
గ్రేసర హృద్విదారణముఁగించి దుదంచితవాసకృత్యముం
గానమకట్టియున్ బెనుపఁగాఁగతమేమి పునర్భవస్పృహన్
నీసటులెవ్వరే దెలియనేర్తురె? మర్త్యమృగాధినాయకా! **277**

వ్యా :— ఆసభన్ = ఆకొలువుకూటమునందు, ఉక్కుఁగంభమునన్ = ఉక్కుస్తంభమునందు, ఆక్రియన్ = ఆవిధముగా, ఉద్భవమంది = జన్మించి, అసురాగ్రేసర = దైత్యాగ్రగణ్యునియొక్క

276 పా:- 1 గదిరియున్ - గౌ; గదిరియును - ర, అ. 2 శృతులఙ - గ, శత్రుఙ - ర, అ.

277 పా:- 1 నుక్కుఁగంబమున - ర, అ; నున్నగోప్యముఙ - క, (గణ భంగము గోప్యమున?) నుక్కుఁగంభమున - గౌ.

హిరణ్యకశిపునియొక్క, (అసురః = అసురః ఇతి సిద్ధాంత కౌముద్యాం ముణాదివృత్తిః - శబ్దక) హృత్ = హృదయముయొక్క, విదారణమున్ = చీల్చుటను, కించిత్ = అల్పమయిన, ఉదంచిత = పైకిఁ బ్రకటితమయిన, హాసకృత్యమ్ముంగాన్ = నవ్వుతోఁజేయఁదగినదిగా, సమకట్టియున్ = నిర్ణయించియు, పునర్భవ = గోళ్లయొక్క, (పునర్భవః కరరుహోనఖోస్త్రీనఖరోస్త్రియామ్ - అమ) స్పృహన = వాంఛను, (గోళ్లతోఁజీల్పవలెనను కోరికను - అనుట) పెనుపఁగాన్ = వర్ధిల్లఁజేయుటకు, కతమేమి = కారణమేమి? మర్త్యమృగాధినాయకా = ఓ నరసింహస్వామీ! నీనటలు = నీయొక్క మాయలు, ఎవ్వరేన్ = ఎవరయినను, తెలియనేర్తురె=గ్రహింపఁజాలుదురా?(గ్రహింపలేరనుట)

పాఠ:- కంభము - చూ 2-55 వ్యాఖ్య - వ్యా. సం స. 159 పు.

చ॥ మిమ్ముటమైనవాఁడిఁబవిమిత్రములై వెలుఁగొందునీ నఖా
గ్రమ్ములకున్ మృదుప్రకృతిగల్గుట కొత్తరమాకుచాద్రిపా
ర్శ్వమ్ములయందుఁ 2 నందుఁగలసారగతుల్నఖరాభిపాతసా
ధ్యమ్ములుగామిఁగావలయునట్లగుటల్, దితిపుత్రశాత్రవా! **278**

వ్యా :— మిమ్ముటము = మిక్కుటము, ఐన = అయినట్టి, వాఁడిన్ = తీక్ష్ణతచేత, పవి = వజ్రాయుధముయొక్క, మిత్రములై = సఖములయి, (వజ్రాయుధసమానములై - అనుట) వెలుఁగొందు = ప్రకాశించు, నీ = నీయొక్క, నఖ = గోళ్లకయొక్క, అగ్రమ్ములకున్= కొనలకు రమా = లక్ష్మీదేవియొక్క, కుచాద్రి = కొండలవంటి స్తనములయొక్క, పార్శ్వమ్ములయందున్ = ప్రక్కలయందు, మృదు = కోమలమయిన, ప్రకృతి = స్వభావము, కల్గుట = సంభ

---

278 పః- 1 వాఁడిపవి – ముద్రి (అ), ర, వాఁడిఁబవి - అ. 2 నందుఁగల - ర, గౌ; నందుఁగల (ఘన?) – అ.

వించుట, క్రొత్త = అపూర్వము, దితిపుత్రఘాతప్రవా = ఓదైత్యారీ-ఓనృసింహస్వామీ! అందున్= అచ్చట-ఆలక్ష్మీదేవియొక్క కొండల వంటి స్తనములయొక్క పార్శ్వములయందు, కల = ఉన్నట్టి, సారగతుల్= దృఢములయిన స్థానములు; (గతి = స్థానము - సూ. ని.) నఖర = గోళ్లయొక్క, అభిపాత = అఘాతములచేత, (గోటినొక్కులచేత - అనుట) సాధ్యమ్ములు = సాధింపఁదగినవి, కామిన్ = కాకపోవుట చేత, కావలయున్ = కాఁబోలును.

లక్ష్మీదేవి స్తనములు నఖక్షతము లుంచఁదగినవేగాని హిరణ్యకశిపుని బొమ్మువలెఁ జీల్చి వేయవలసినవికావు. కానవాని యందు నృసింహుని నఖాగ్రములు మృదుస్వభావముగలవియగుననుట.

నృసింహస్వామిగోటికొనలు లక్ష్మీస్తనపార్శ్వములందు మృదుస్వభావములగుటకు వానిని జీల్చలేకపోవుట హేతువుకాదు. హేతువు కానిదానినిట హేతువుగానూహించినట్లు గ్రహింపఁగును.

అలం :— హేతూత్ప్రేక్ష.

ఉ॥ కోపవికారమంచునొకకొందఱు, కొందఱుభక్తలోకర
క్షాపరతంత్రతాజనిత సాంద్రకృపాగుణమంచుఁగొందఱు
దీపితవీర 1 సింధు 2 విహృతిస్ఫుట 3 ఖేదవికారమంచు నీ
చూపులరక్తిమంబొగడుచున్ నుతియింపుదురీశ్వరేశ్వరా! 279

వ్యా :— ఈశ్వర = స్వామివయిన, ఈశ్వరా= ఓశ్రీహరీ!-ఓనృసింహస్వామీ! (ఈశ్వరః = శ్రీహరిః - శబ్దక) కొందఱు = కొంతమంది, కోపవికారమంచున్ = క్రోధ వికృతియనియును. (క్రోధమువలన సహజస్థితియందుఁగలగినమార్పనియును) కొందఱు=

---

279 పా.- 1 సింహ - ర; సింధు - అ. 2 వికృతి - చ, విహృతి - ర, అ. 3 ఖేటి - ముద్రి [అ]; ఖేట - ర; ఖేద - త, అ.

కొంతమంది, భక్తలోక = భక్తజనులయొక్క, రక్షా = రక్షించుట యందుఁగల, పరతంత్రతా = పరాధీనతచేత, జనిత = కలిగిన, సాంద్ర = అతిశయమయిన, కృపాగుణమంచున్ = దయాగుణమనియును, కొందఱు = కొంతమంది. ఉద్దీపిత = ప్రకాశింపఁజేయబడిన, వీర సింధు = వీరమనెడు సముద్రముయొక్క, విహృతి = విహారముచేత, స్ఫుట = వ్యక్తమయిన, ఖేదవికారమంచున్ = బడలికవలన సహజ స్థితియందుఁగలిగిన మార్పనియు, నీ = నీయొక్క, చూపులరక్తిమన్ = దృక్కులయొక్క యెఱ్ఱఁదనమును, పొగడుచున్ = కొనియాడుచు, నుతియింపుదురు = పూజింతురు. (నుతిః = పూజా, ఇతిశబ్దరత్నా వళీ - శబ్దః)

అలం .— ఉల్లేఖము.

చ॥ హరికిరిదంష్ట్రనాఁటువడియైందవరేఖఁదలిర్పు పూర్వభూ
ధరశిఖరంబనంగనుతిదాల్చుకుచంబునఁబొల్చు భూసతిన్
బరిహసనంబొనర్చురమభావము సిగ్గునమ్రొగ్గఁజేయవే
నరమృగరాజ! నీనఖమునాఁటిన 1 చోఁదదురోజకుంభముల్.

**280**

వ్యా :— నరమృగరాజ = ఓనృసింహా! హరి = విష్ణు మూర్తియగు, కిరి = వరాహముయొక్క - ఆదివరాహముయొక్క, (వరాహః సూకరోఘృష్టిః, కోలఃపోత్రీకిరిః కిటిః - అమ) దంష్ట్ర = కోఱయొక్క, నాఁటువడి = నొక్కుపొంది, ఐందవరేఖన్ = ఇందు సంబంధమయిన రేఖచేత - చంద్రరేఖచేత, తలిర్పు = ఒప్పు, పూర్వ భూధర = తూర్పుకొండయొక్క, శిఖరంబు=శృంగము, అనంగన్ = అనునట్లు, నుతిదాల్చు = పొగడ్త హించు, కుచంబునన్ = స్తనము

---

280 ప:- 1 ఁబొల్చునురోజ - ముద్రి (అ), ర, గౌ; చోఁదదురోజ - అ. బొందదురోజ - గ.

చేత, పొల్చు = ఒప్పు, భూసతిన్ = ధరాకాంతను, పరిహాసనం బొనర్చు = పరిహాసించు, రమా = లక్ష్మీదేవియొక్క, భావమున్= మనస్సును, తత్ = ఆమెయొక్క, ఉరోజకుంభముల్ = కుండలవంటి స్తనములయందు, నీనఖము = నీయొక్క గోరు, నాటినచోన్ = గ్రుచ్చుకొనునప్పుడు, సిగ్గునన్ = లజ్జతో, క్రుంగఁజేయవే = క్రుంగునట్లుచేయవా? (క్రుంగునట్లుచేసితివనుట)

వరాహదంష్ట్రి, యొకస్తనమున గ్రుచ్చుకొన్నందులకు భూదేవిని బరిహసించిన లక్ష్మీదేవి, నృసింహుని నఖము తన రెండు స్తనములయందు గ్రుచ్చుకొన్నప్పుడు లజ్జితురాలయినదనుట.

వ్యాక ,— ఉరోజకుంభముల్ = ఉరోజకుంభములందు - ప్రౌఢ. కారక 20 అలం :— కల్పితోపమ.

సీ॥ పరిపూర్ణ చంద్రబింబము 1 నడుచక్కిలోఁ
గొనసాగు విద్రుమాంకురమనంగఁ
గన్నె గేదఁగిఱేకు కత్తుల 2 బోనులోఁ
3 జిక్కిన యౌర్వాగ్ని శిఖయనంగ
వెండి 4 కంబములతో వియ్యంపుఁబొత్తెత్తు
యమునాతరంగ 5 సంఘములనంగఁ
బ్రాలేయగిరి వెన్క భారంబువహించు
పవనహారణకుల ప్రభువనంగ
తే॥ మొగమునకు బిగిగావించు మిగులుఁగన్న
దంష్ట్రికాంతరజిహ్వయుఁదఱచుఁగేల
నలుఁగులుఁ 6 బిఱింది వాలమ్ముఁగలుగునిన్నుఁ
గొలుతుదితిపుత్రచేతఃకుకూలదహన. **281**

281 పః- 1 నందుచక్కిలో-డ. ద. బః నడుచక్కి - ర. అ, గౌ. 2 బోరి-త; బోవి - గ,ర,గౌ, బోను - అ. 3 జెక్కిన - త, జిక్కిన - ర. అ. 4 వెండికంబంబు-త; వెండికంబమ్ము-గౌ; వెండికంబములతో-ర,అ. 5 సంగతుల - త; సంఘముల - ర, అ

వ్యా:- పరిపూర్ణచంద్రబింబము = నిండుజాబిల్లి బింబముయొక్క, (పున్నమనాఁటి చంద్రబింబముయొక్క, నడుచక్కిలోన్ = మధ్యభాగములోపల, కొనసాగు = వ్యాపించు, విద్రుమ = పగడముయొక్క, అంకురము = మొలకయో. అనంగన్ = అనునట్లు, మొగమునకున్ = ముఖమునకు, బిగి = తీక్ష్ణత, కావించు = కలిగించు, మిగులుఁగన్ను = సంఖ్యయందధికమగునేత్రము - మూఁడవకన్ను. (ఫాలనేత్రమనుట)

ముఖమునందలి మూఁడవకన్ను, పూర్ణచంద్రబింబముయొక్క మధ్యభాగములోఁగొనసాగు, పగడపుఁదీఁగయో యనునట్లున్నదనుట.

నృసింహస్వామికి ఫాలనేత్రముండును. చూ. 1.31 వ్యాఖ్య.

[2] కన్నె = లేఁతదయిన, గేదఁగిఱేకు = మొగలిదళమనెడు, కత్తులబోనులోన్ = కత్తులతోనిర్మించిన యొకవిధమగు బోనుయొక్క యంతర్భాగమునందు, చిక్కిన = చిక్కుకొన్న, ఔర్వాగ్ని = బడబానలముయొక్క, శిఖ = జ్వాలయో, అనంగన్ = అనునట్లు, దంష్ట్రికా= కోఱలయొక్క, అంతర = మధ్యభాగమునందున్న, జిహ్వాయున్ = నాలుకయు.

కోఱలమధ్యనున్ననాలుక. లేఁతమొగలిఱేకనెడు కత్తులబోనులోఁ జిక్కుకొన్న బడబాగ్నిజ్వాలాయోయనునట్లున్నదనుట.

ఔర్వాగ్ని - ఔర్వమహర్షికోపము, బడబాముఖమున సముద్రమునందుఁగలదని భారతకథ. (బడబ = ఆఁడుగుఱ్ఱము)

కన్నె = లేఁతది - లక్షణార్థము.

3- వెండికంబములతోన్ = రజతస్తంభములతో, వియ్యంపుఁబొత్తు = చుట్టఱికపుసంబంధమును బొందు; యమునా = కాళిందీనదియొక్క, తరంగ = కెరటములయొక్క, సంఘములు = సమూహ

ములో, అనంగన్ = అనునట్లు, తఱచు(గేలన్ = అతిశయములయిన, (ధృఢములయిన - అనుట) చేతులయందు, అలుగులు = ఆయుధములు

హస్తములయందలి యాయుధములు, వెండిస్తంభములతోఁగూడు కొనినయమునానదియొక్క కెరటములసమూహమో యనునట్లున్నవనుట

సింహము, శ్వేతగణములోనిది. "లోధ్రసింహ -- స్ఫాటికాదయః" (కవికల్ప) నృసింహస్వామిచేతులు తెల్లగానుండుటచే వెండికంబముల వలెనున్నవనుట. యమునానదినీరు నలుపు. "తదా ప్రభృతి కాళింద్యా, భృగంజననిభంజలమ్" (వామన)

కేలు - జాత్యేకవచనము. చూ 1-193 వ్యాఖ్య

4 ప్రాలేయగిరి = హిమాద్రియొక్క, (హిమంప్రాలేయం మిహికా - అమ) వెన్కన్ = పశ్చాద్భాగమునందు, (వెనుకవైపు) భారంబు = బరువును, వహియించు = మోయు; పవనపారణ = వాతాశనములయొక్క [సర్పములయొక్క] కుల = సజాతీయసమూహము యొక్క, (సజాతీయైఃకులమ్ - అమ) ప్రభువు = రాజో - ఆదిశేషుఁడో, అనంగన్ = అనునట్లు, పిఱిందివాలమ్మున్ = పృష్ఠభాగము నందుఁదోఁకయు.

పృష్ఠభాగమునందలితోఁక, హిమాలయపర్వతముయొక్క వెనుక భాగమునందు బరువు మోయునాదిశేషుఁడోయనునట్లున్నదనుట.

కలుగు = కలిగిన (మొగమునందు మూఁడవకన్ను, కోఱల మధ్యమున నాలుక, చేతులయందాయుధములు. పృష్ఠ భాగమునఁ దోఁకయుఁగలిగిన - అనుట) నిన్నున్ = నిన్ను. దితిపుత్ర = దైత్యుని యొక్క - హిరణ్యకశిపునియొక్క, చేతః = మనస్సునకు, కుకూలదహన = కుమ్ము (పొట్టు) నిప్పయినవాఁడా! "కుకూలః శంకుభిఃకీర్ణే శ్వభ్రేనాతు తుషానలే - అమ) కొలుతున్ = సేవింతును.

దితిపుత్రచేతఃకుకూలదహన - హిరణ్యకశిపుఁడు కశ్యపమహర్షి వలన దితియందు జన్మించినవాఁడు.

"తత్రహిరణ్యాక్షహిరణ్యకశిపు ప్రహ్లాదవిరోచన బలిబాణాదయో దైత్యాః" (కావ్యమీ)

చేతఃకుకూలదహన - ఇది, ఊొమ్ముకుంపటిఅను జాతీయము ననుసరించి కల్పించినది. మనస్సునకు మిక్కిలి బాధను గలిగించుటను దెలుపును.

"ఊొమ్ములకుంపట్లు రోఁతప్రామిండ్లు" (పండితా)

పుత్ర - ఏకతకారకమును గలదు. చూ 1-9 వ్యాఖ్య.

అలం :— ఉత్ప్రేక్ష, యథాసంఖ్యము.

తే॥ అని నృహర్యక్షవర్యు, నర్యమసహస్ర
దివ్యతేజః1 ప్రభావుఁగీర్తించియతఁడు
తత్పదద్వంద్వమునకువందనమొనర్చి
తపసితిట్టునఁబ్లవమయ్యెఁదత్క్షణంబ. 282

వ్యా :— అని = ఈప్రకారముగా, అర్యమసహస్ర = సూర్యులవేయియొక్క - అసంఖ్యాకసూర్యులయొక్క, (సూరసూర్యార్యమాదిత్యద్వాదశాత్మదివాకరాః - అమ) దివ్యతేజఃప్రభావున్ = దివ్యమయిన ప్రకాశాతిశయముగలవాఁడగు, నృహర్యక్షవర్యున్ = శ్రేష్ఠుఁడగు నరసింహుని, కీర్తించి = స్తుతించి, తద్ = అతనియొక్క - ఆనరసింహునియొక్క, పదద్వంద్వమునకున్ = అడుగుదోయికి, వందన మొనర్చి = నమస్కారముచేసి, అతఁడు = ఆతఁడు - అయుతుఁడు,

---

282 ప:- 1 ప్రవాహం - ముద్రి (అ) (హం? హు) ప్రభావు - ర; అ.

తపసి = మునియొక్క - వాధూలునియొక్క, తిట్టునన్ = శాపము చేత, తద్క్షణంబు = అక్షణమునందే, అప్పుడే, ప్లవము = కప్ప (భేకే మండూక వర్షాభూశాలూరప్లవదర్దురాః - అమ) అయ్యెన్ = అయెను.

క్షణము = 3 మినిట్లకాలము. మినిట్టునిమేషముకాదు. నిమేషము= $\frac{16}{75}$ సెకెండు. (చూ 5-286)

వ్యాక :— క్షణంబు + అ = క్షణంబ. "అకారై కారంబు లవధారణంబునందగు" (ము. కౌ. ప్రకీర్ణక 14)

క॥ అశమమునావివేకం
బాశుద్ధియు నంతపంబు 1 బునాబహునిగమ
ప్రాశస్త్యము 2 సటులయ్యెము
నీశునకునుఁదైవఘటనలిట్టివిదలఁపన్. 283

వ్యా :— అశమమున్ = అశాంతియు. అవివేకంబు = అవివేచనము, అశుద్ధియున్= అశుచిత్వమును,అతపంబున్= అతపస్సును, అబహునిగమప్రాశస్త్యమున్ = అనేకశాస్త్రములయందుఁగొనియాడఁ దగియుండుట, మునిఈశునకున్ = మౌనినాథునకు - అయుతునకు; సటులయ్యెన్ = అసత్యములయ్యెను. (సటుహుళక్కినాననత్యమభవ - అం. భా) దైవఘటనలు = దైవముయొక్క; సంయోజనములు, తలఁపన్ = ఆలోచింపఁగా, ఇట్టివి = ఇటువంటివి.

అలం :— అర్థాంతరన్యాసము

ఆ॥ అస్మదాదిమానసావాలవలయప్రి
శాశభక్తియుక్తికల్పలతకు
మూలమనఁగనొప్పునాలోకవిభునంఘ్రి
మూలమాశ్రయించిజాలిమాలి. 284

---

283 ప.- బులా - ముద్రి (అ), ర; బునా - అ. 2 సటుల - ముద్రి(అ).ర; సటల - అ.

వ్యా :— అస్మద్= నేను, ఆది=మొదలుగాఁగలవారః యొక్క (శివుఁడు - వక్త) మానస = హృదయమనెడు, అవాలవలయ = వలయమువంటిపాదునందు, ప్రకాశ = ప్రసిద్ధమయిన, భక్తియుక్తి = భక్తితోఁగూడుకొనుటయనెడు, కల్ప = కల్పవృక్షముయొక్క, లతకున్ = కొమ్మకు, (సమేశాఖాలతే - అమ) మూలము = వేరో, అనఁగన్ = అనునట్లు, ఒప్పు = తనరు, ఆలోకవిభు = ఆజగత్పతియొక్క - అన్నృసింహస్వామియొక్క, అంఘ్రిమూలము = పాదమూలము (పాదమూల మొదలు) ఆశ్రయించి = అండగొని, జాలిమాలి = దుఃఖమును విడిచి, (మీఁదిపద్యముతో నన్వయము)

శివాదిదేవతల హృదయమనెడు పాదునందొప్పుభక్తి భావమనెడు కల్పవృక్షశాఖయొక్కమూలమోయనునట్లొప్పు నరసింహస్వామియొక్క పాదమూలమునండగొని, కప్పగామాటిన యయుతుఁడు దుఃఖమును విడిచెననుట.

అలం :— రూపకానుప్రాణితమగునుత్ప్రేక్ష.

ఉ॥ ముత్తియముల్ ప్రవాళదళముల్ 1 కనకాకృతిఁగూడినట్టులై
క్రొత్తగునౌర! 2 దీనియపురూపపు 3 రూపిదియంచువిస్మయో
దాత్తమనస్కులై సకలతైర్థికులున్ గొనియాడ, భేకలో
కోత్తమ మొప్పుఁజితప్రవపురుజ్జ్వలమై, జలజాసనోద్భవా! 285

వ్యా :— జలజాసన = బ్రహ్మవలన, ఉద్భవా = పుట్టినవాఁడా! - ఓనారదా! ముత్తియముల్ = మౌక్తికములు, ప్రవాళదళముల్ = పగడపుముక్కలు, (దళమ్ = ఖండమ్ - శబ్దక) కనక =

285 పః- 1 గగనా — ముద్రి (అ). గమనా - ర; కనకా - అ. 2 వీని - ముద్రి (అ).ర, దీని-అ. 3 రూపపుచేడి -త; రూపిదియంచు.ర,అ.

బంగారముయొక్క, ఆకృతిన్ = రూపుతో, కూడినట్టులై = కలిసినట్లయి, దీని = దీనియొక్క - ఈకప్పయొక్క, అపురూపపురూపు ఇది = ఈవింతయయిన యాకారము, ఔర = అహా! క్రొత్తఅగున్= అపూర్వమగును. అంచున్ = అని, సకలతైర్థికులున్ = ఎల్లతీర్థయాత్రికులును, విస్మయ = ఆశ్చర్యముచేత, ఉద్ = అధికముగా, ఆత్త = పొందఁబడిన, మనస్కులై = హృదయములుగలవారయి, కొనియాడన్ = ప్రశంసింపఁగా, భేక = కప్పలయొక్క, లోక = సమూహమునందు, (లోకము = సమూహము - సూ. ని) ఉత్తమము= మేలయినది - అశ్రేష్ఠమయినకప్ప, చిత్ర = తెలుపు, నలుపు, పసుపు రంగులుగల, వపుః = శరీరముచేత, ఉజ్జ్వలమై = ప్రకాశించుచుఁదయి, ఒప్పున్ = తనరును. అలం :— ఉపమ.

సీ॥ కమలాప్తుఁడుదయింపకయ 1 మున్నబుటుకున
మున్నఁగుసంగమతీర్థమునకునేగి
వినుసైకతనిషణ్ణముని వేదనినదంబు
తగుచోటునుండి వేఁబగటిదాఁక
మధ్యాహ్నవేళ సం 2 ప్రాశించుబలిపిత
గతపులాకంబులు మితముగాఁగ
నందెప్రొద్దుననుండి సవరేయి గడసన
సమ్ముఖమ్మునఁగొల్చిసంవసించు

తే॥ శ్రీనృసింహుండు పెనుఁబాఁపసెజ్జమేను
3 సేర్పఁదద్దివ్యచరణరాజీవమూల
భూబిలంబున నధ్యాత్మపూర్ణబుద్ధి
జాగరముసేయు, శాలూరచక్రవర్తి. 286

---

286 ప - 1 మున్నఁబ - ర; మున్నబు - అ. 2 ప్రాపించు - ప, ప్రాశించు ర, అ, గౌ. 3 చేర్ప - ర, అ; సేర్ప - గౌ.

వ్యా :— శాలూరచక్రవర్తి = భేకసమ్రాట్టు, (భేకేమండూకవర్షాభూశాలూరప్లవదర్దురాః - అమ) కమలాప్తుఁడు = సూర్యుఁడు, ఉదయింపకయమున్న = తూరుకమునుందే, సంగమతీర్థమునకున్ = సంగమనామకమగు తీర్థమునకు, (చూ 2-156) ఏగి = అరిగి, బుటుకునమునుఁగున్ = బుటుక్కునమునుఁగును.

బుటుకున - మునుఁగుటయందగుననుకరణశబ్దము.

[2] తగు = యోగ్యమయిన, చోటన్ = స్థలమునందు, ఉండి = వర్తిల్లి, సైకత = ఇసుకతిన్నెయందు, నిషణ్ణ = ఆసీనులయిన, ముని = మౌనులయొక్క, వేదనినదంబు = నిగమధ్వని (వేదపారాయణమును) లేఁబగటిదాఁకన్ = పూర్వాహ్ణమువఱకు - పదిగడియాల ప్రొద్దెక్కువఱకు, వినున్ = ఆలకించును. (లేఁబగలు = సూర్యోదయము మొదలుకొని పదిగడియలప్రొద్దెక్కువఱకునుండుకాలము-సూ.ని)

పదిగడియలు = 5 ముహూర్తములు. "ముహూర్తమ్ = ఘటీద్వయమ్ - ఇతిరాజనిర్ఘంటుః" [శబ్దక]

ముహూర్తము = 13,500 నిమేషములు.

15 నిమేషములు = 1 కాష్ఠ

30 కాష్ఠలు = 1 కళ

30 కళలు = 1 ముహూర్తము

30 ముహూర్తములు = 1 దివారాత్రము

"నిమేషైర్దశభిః కాష్ఠా, తథాపంచభిరుచ్యతే

కళాత్రింశచ్చవైకాష్ఠా, ముహూర్తత్రింశదేవతాః

అహోరాత్రంమనుష్యాణాం, నృణాంత్రింశత్తువైస్మృతమ్ (మార్కం)

కాఁగా, ముహూర్తము = 15 × 30 × 30 = 13500 నిమేషములు

5 ముహూర్తములు (=10 గడియలు)=13,500 × 5=67,500 „

1 దివారాత్రము = 15 × 30 × 30 నిమేషములు.

ఆంగ్లమానమునుబట్టి 1 దివారాత్రము = 60 × 60 × 24 సెకెండ్లు. (60 సెకెండ్లు = 1 మినిట్టు; 60 మినిట్లు = 1 గంటు; 24 గంటలు = 1 దినము = అహోరాత్రము)

$$1 \text{ నిమేషము} = \frac{24 \times 60 \times 60}{15 \times 30 \times 30 \times 30} = \frac{16}{75} \text{ సెకెండు.}$$

$$67{,}500 \text{ నిమేషములు (=10 గడియలు)} = \frac{16}{75} \times \frac{67500}{60 \times 60} = 4 \text{ గంటలు}$$

కాఁగా, పూర్వాహ్ణము = సూర్యోదయకాలము + 4 గంటలు ఇది దివాభాగమును మూఁడుభాగములుగా విభజించినచోనగు కాలము.

"పూర్వాహ్ణః = త్రిధావిభక్తదినప్రథమభాగః" (శబ్దక)

దివాభాగమునైదు భాగములుగా విభజించుటయుఁగలదు.

30 ముహూర్తములు = దివారాత్రము

15 ముహూర్తములు = పగలు

15 ముహూర్తములు = రాత్రి

1. ప్రాతఃకాలము (వేకువ) :- సూర్యోదయమువఱకుఁగల, 3 ముహూర్తములకాలము = 2 గంటల 24 మినిట్లకాలము. ప్రాతః = సూర్యోదయావధిత్రిముహూర్తకాలః" (శబ్దక)

2. సంగవకాలము :- సూర్యోదయము మొదలు, 3 ముహూర్తములకాలము. అనఁగా, సూర్యోదయకాలము +2 గం. 24 మి. కాలము.

3. మధ్యాహ్నము ,- సూర్యోదయము మొదలు, 7-9 ముహూర్తముల మధ్యకాలము. అనఁగా, సూర్యోదయ కాలము + 4 గం. 49 ని- 7 గం. 12 ని, మధ్యకాలము.

4. అపరాహ్ణము ;- సూర్యోదయము మొదలు, 10-12 ముహూర్తముల మధ్యకాలము. అనఁగా, సూర్యోదయ కాలము + 7 గం. 13 ని - 9 గం, 36 ని. మధ్యకాలము.

5. సాయాహ్నము ;- సూర్యోదయము మొదలు, 13-15 ముహూర్తముల మధ్యకాలము. అనఁగా, సూర్యోదయ కాలము + 9 గం. 37 ని - 12 గం. మధ్యకాలము.

"ప్రాతఃకాలో ముహూర్తాన్ త్రీన్, సంగవస్తావదేవతు
మధ్యాహ్నస్త్రిముహూర్తః స్యా, దపరాహ్ణస్తతః పరమ్
సాయాహ్నస్త్రిముహూర్తః స్యాత్" (తిథ్యా) - శబ్దక.

[2] మధ్యాహ్నవేళన్ = మధ్యాహ్నకాలమునందు, బలిపీఠ = భూతబలికొఱకు ఉద్దేశించిన పీఠమును, గత = పొందిన, పులాకంబులు = అన్నపుమెదకులను, మితముగాఁగన్ = పరిమితముగా, సంప్రాశించున్ = భక్షించును.

గృహస్థులకు విహితములయిన పంచమహాయజ్ఞములలో భూతయజ్ఞమొకటి.

పొయ్యి, సన్నికల్లు, [illegible]లు, [illegible], చేటలోనగు ఉపకరణములను, నీళ్ల కడవలను వాడుటవలన [illegible]. కాన నివి పంచ[illegible] బడును. [illegible] = ప్రాణివధస్థానము [illegible] పంచమహాయజ్ఞములు చేయవలెను. [illegible]

(i) బ్రహ్మయజ్ఞము — అధ్యాపనము
(ii) పితృయజ్ఞము — తర్పణము
(iii) దైవయజ్ఞము — హోమము.
(iv) భూతయజ్ఞము — వాయసాదులకిచ్చుబలి.
(v) నృయజ్ఞము — అతిథిపూజనము.

వ్యాక :- మధ్యాహ్నము: అహముయొక్క మధ్యము-ఏకదేశిసమాసము

4 సందెప్రొద్దుననుండి = సంధ్యాకాలము మొదలు కొని, నడ రేయి = అర్ధరాత్రిము, కడచనన్ = కడవఁగా (కడచువఱకు) సమున్ముఖ మ్మునన్ = (నృసింహస్వామి) సన్నిధియందు, కొల్చి = సేవించి, సంవసించున్ = నివసించును. (ఉండును)

వ్యాక ;— నడరేయి - నడుము + రేయి = నడరేయి - ప్రౌ. సమాస 36 రేయియొక్క నడ(గ)ము - ఏకదేశిసమాసము.

శ్రీనృసింహుండు = శ్రీనరసింహస్వామి, పెనుఁబాఁపసెజ్జన్ = పెద్దసర్పశయ్యయందు (ఆదిశేషునియందు - అనుట) మేను + చేర్పన్ = శయనించునప్పుడు, తద్ = అతనియొక్క- ఆనరసింహస్వామియొక్క, దివ్య = మనోహరములయిన, (దివ్యంవల్గౌ - విశ్వ) చరణరాజీవ మూల = పద్మములవంటిపాదములయొక్కమూలమునందుగల, భూ = భూమియొక్క, బిలంబునన్ = కన్నమునందు, అధ్యాత్మ = పర బ్రహ్మముచేత, (అధ్యాత్మ - పరబ్రహ్మణిచ -శబ్దస్తో) పూర్ణ = నిండిన. బుద్ధిన్ = మతితో, జాగరము + చేయున్ = జాగారమొనర్చును.

వ్యాక ;— పాముయొక్క + సెజ్జ = పాఁపసెజ్జ (బా. సమాస 19) పెనుపు + పాఁపసెజ్జ = పెను + పాఁపసెజ్జ (ప్రౌ. సమాస 36) = పెనుఁబాఁపసెజ్జ (బా. సంధి 25)

ఇందుఁగప్పగామాటినయుయుతుని దినచర్యవర్ణితము.

ఆ॥ రత్నరంగవల్లి రచనకుఁదనమేను
1 పూవుగుత్తికరణిఁబొలుపు 2 నిలుప
నంబుచరము ప్రాతరారంభవేళల
నృహరియగ్రవీథినిలుచునసఘ! **287**

వ్యా :— అనఘ = ఓసుకృతీ - ఓనారదా! రత్నరంగవల్లి = మణిమయములయిన ముగ్గులయొక్క, రచనకున్ = కూర్పునకు, (మణులపొడులతోఁదీర్చిన ముగ్గులయొక్క కూర్పునకు) తన = తన యొక్క, మేను = శరీరము, పూవుగుత్తికరణిన్ = పుష్పగుచ్ఛమువలె. పొలుపునిలుపన్ = శోభగలిగింపఁగా, అంబుచరము = జలచరము-కప్ప, ప్రాతరారంభవేళలన్ = ప్రభాతకాలముయొక్క ప్రారంభ సమయములందు, నృహరి = నరసింహునియొక్క, అగ్రవీథిన్ = పురోభాగమునందు, నిలుచున్ = వర్తించును.

పుష్పసామాన్యవర్ణము తెలుపు. కప్పవర్ణము చిత్రవర్ణము. (5-285) అందుఁదెలుపొకటి. ఆతెల్లభాగము కనఁబడునట్లు కప్ప నృసింహునెదుటనిలుచుననుట.

అలం :— ఉపమ.

క॥ హరి 1 దాసమనుచుఁదనునె
ల్లరుఁబేరిడిపిలువఁగలిగిప్లవపతిగడపెన్
చిరకాలము, పూర్వజనన
2 చరితజ్ఞంబగుచుమోక్షసౌఖ్యాపేక్షన్. **288**

వ్యా :— తనున్ = తన్ను, హరిదాసము అనుచున్ = హరిదాసమని, పేరిడి = నామకరణముచేసి, ఎల్లరున్ = అందఱును,

---

287 ప:- 1 పువ్వు - ర; పూవు - అ. 2 గిలుప — ప; నిలుప - అ, ర, గౌ
288 ప:- 1 వాస - త; దాస - ర, అ. 2 చరితజ్ఞతపెనచు - గౌ; చరితజ్ఞం బగుచు - ర, అ.

పిలువఁగలిగి = పేర్కొనుటగలదియై, ప్లవపతి = కప్పలఱేఁడు, (భేకే-ప్లవదర్దురాః - అమ) పూర్వజననచరితజ్ఞుఁబగుచున్ = పూర్వజన్మము వృత్తాంతమునుదెలిసినదగుచు, (పూర్వజన్మస్మృతిగలదియగుచు) మోక్ష సౌఖ్య = ముక్తిసుఖమునందు, అపేక్షన్ = కోరికతో, చిరకాలము = దీర్ఘకాలము, కడపెన్ = వెళ్లఁబుచ్చెను.

ఆ॥ ఇటులుకొన్ని 1 యేఁడులేగంగ నొకనాఁడు
పౌండరీకనాథు పర్వమునకుఁ
2 గన్యకుబ్జవిభుని కన్యాశిరోమణి
ప్రాణసఖులు 3 గొల్వనరుగుదెంచె 289

వా :— ఇట్లు = ఈప్రకారముగా, కొన్నియేఁడులు = కతి పయవత్సరములు, ఏగంగన్ = కడవఁగా; ఒకనాఁడు = ఒకదినము, కన్యకుబ్జవిభుని = కన్యాకుబ్జరాజుయొక్క. కన్యాశిరోమణి = తల మానికమువంటి బాలిక - శ్రేష్ఠురాలగు కూఁతురు, ప్రాణసఖులు = ప్రాణస్నేహితురాండ్రు, (ప్రాణప్రియలగు చెలికత్తెలు - అనుట) కొల్వన్ = సేవింపఁగా, పౌండరీకనాథు = పౌండరీకక్షేత్రాధిపతి యొక్క - పాండురంగవిఠ్ఠలునియొక్క, పర్వతమునకున్ = ఉత్సవ మునకు, అరుగుదెంచెన్ = వచ్చెను.

పాఠ :— కన్యకుబ్జ - ఉపలబ్ధపాఠము. కాన్యకుబ్జగా దీనిని మార్చి గ్రహింపనక్కఱలేదు. "కన్యాకుబ్జః = కన్యాఃకుబ్జాః యత్ర దేశేసః. కన్యా+కుబ్జ. జాపోస్సంజ్ఞాఛందసోర్బహుళమ్" (6-3-63)

---

289 ప:- 1 యేండ్లులే - డ, ద, బ; యేఁడులే - ర, అ, గౌ. 2 కాన్య-ర; కన్య - అ, గౌ, 3 గొలువ - గౌ; గొల్వ - ర, అ. 4 దెంచి-త; దెంచె - ర, అ.

అనుసూత్రముచే, హ్రస్వముబహుళముగానగును. కన్యకుబ్జ, కన్యాకుబ్జ కన్యకుబ్జ + స్వార్థేఅణ్ = కాన్యకుబ్జ. ఇట్లు మూఁడురూపములునుండ వచ్చును. శబ్దకల్పద్రుమాదులలో, "కన్యకుబ్జ" శబ్దము లేదు. "కన్య కుబ్జా - అ. సీ. కాన్యకుబ్జనగరమ్" [సర్వ. సం]

కుశనాభుని కూఁతులు వాయుదేవునిచేఁ గుబ్జలుగాఁజేయఁబడిన దేశముగాన, దీనికిఁగాన్యకుబ్జమను పేరు గలిగెనని రామాయణకథ. మహోదయము, కుశస్థలము, ననునవిదీనినామాంతరములు. ఇది గంగా తీరమునఁగలదు 'కనోజ్' అనునది నేటి వ్యవహారనామము.

తే॥ ఆత్మవాహనములనుండి 1 యవతరించి
నారసింహాఖ్యతీర్థంబునకుఁగుఱఁగటు
భైమిచెంగటవిడిసిరి పద్మముఖులు
విరహిహృద్గాములగు 3 మారుశరములనఁగ. **290**

వ్యా :— ఆత్మ = తమయొక్క, వాహనములనుండి = యానములనుండి, అవతరించి = దిగి, నారసింహ = నారసింహ మనెడు, ఆఖ్య = పేరుగల, తీర్థంబునకున్ = తీర్థమునకు, కుఱఁగటున్ = సమీపమునందు, భైమి = భీమరథీనదియొక్క, చెంగటన్ = పక్క భాగమునందు, పద్మముఖులు = కాంతలు - కన్యాకుబ్జగాంగ తనయయునామె చెలికత్తెలును, విరహిహృద్గాములు = వియోగుల హృదయములయందుఁజొచ్చుకొనిపోవునవి, అగు = అయిన, మారు = మన్మథునియొక్క, శరములు = బాణములో, అనఁగన్ = అనునట్లు, విడిసిరి = బసచేసిరి.

---

290 ప:- 1 యరుగుదెంచి - ర, అ, గౌ. 2 నరుగురగటు(?)-గౌ, నకుఁగుఱ గుట-త; నకుఁగుఱఁగట-ర, అ. 3 మరు-అ; మారు-ముద్రి(అ)ర,గౌ

విరహిహృద్దాములనుటచే - వారుచూచిన నదేతడవుగా విరహ తాపముకలుగుచున్నదనుట. చూపులకు మన్మథబాణములకు సామ్యము ప్రసిద్ధము.

మారుశరములు — చూ 2-129 వ్యాఖ్య.

అలం :— ఉత్ప్రేక్ష.

ఆ॥ మార్గఖేదశిథిలమతులంగనలు చొచ్చి
భీమరథిఁగలంచుటేమికొత్త!
వారిగోరువెచ్చవక్షోజములకాంతి
1లవమము 2జ్జగములఁదవిలికలఁప. **291**

వ్యా :— వారి = వారియొక్క - ఆకాంతలయొక్క, గోరువెచ్చ = నఖంపచములయిన, వక్షోజముల = స్తనములయొక్క, కాంతిలవము + అ = ద్యుతిలేశమే, ముజ్జగములన్ = ముల్లోకములను, తవిలి = పొంది (ముల్లోకములందును వ్యాపించి-అనుట) కలఁపన్ = క్షోభపెట్టఁగా, మార్గఖేద = పథశ్రమచేత, (ప్రయాణపుబడలికచేత-అనుట) శిథిలమతులు = శైథిల్యమునందిన బుద్ధిగలవారగు, అంగనలు= కాంతలు, చొచ్చి = ప్రవేశించి, భీమరథిన్ = భైమీనదిని, కలంచుట = క్షోభపెట్టుట, ఏమికొత్త = ఏమివింత (వింతలేదనుట)

వారిస్తనకాంతిలవము, త్రిలోకవాసులను మనఃక్షోభము పాలు చేయుచుండఁగా, వారుభైమీనదియందు జలక్రీడలాడుచు నదీజలమును క్షోభిల్లఁజేయుచుండిరనుట.

ముజ్జగములు — స్వర్గమర్త్యపాతాళములు. (చూ 1-1)

---

**291** ప:- 1 లవము - ప, య, గౌ; లవమ - ర, అ. 2 గములు - గౌ. గముల - ర, అ.

సీ॥ గంధవాహమున 1 కాగారంబులివియంచు
వీజనం 2 బులఁజూచివెగటు 3 గదిరి
మరుబాణములసహోదరవర్గ 4 మిదియంచు
నలరుమొగ్గలఁజూచియలఁతనొంది
కమలారినామంబుగైకొన్న వివియంచుఁ
బుల్ల 5 తీఁగలఁజూచిపుల్లసిల్లి
శుక 6 యుగంబులుఁదామునొక 7 చాయయవియంచు
నవ 8 కుశంబులఁజూచి న 9 యముదలఁగి

తే॥ 10 కన్య 11 కుబ్జేశకన్యపైఁగలుగుచెలువు
భావ 12 ము లపెంపు 13 నొఱపులు 14 వోవఁజేయ
బలిమిఁ జధైర్యముఁలు చిక్కఁబట్టియున్న
మునులొనర్పుదు రొకరీతిముఖ్యవిధులు. **292**

వ్యా ,— వీజనంబులన్ = వీవనలను - చామరములను, చూచి = కనుఁగొని; గంధవాహమునకున్ = వాయువునకు-మలయ

---

292 ప:- 1 కాగా-డ.ద.బ: కాగా-ర.అ,గౌ. 2 బులుచూచి-గౌ, బులఁజూచి-ర, అ, 3 దిరిగి-త: గదిరి-ర,అ,గౌ, 4 మది-ర (పా); మిది- ర, అ, గౌ. 5 తీఁగెలుచూచి-గౌ: తీఁగలఁజూచి-ర,అ. 6 యుగంబులు-ర,గౌ: యుగం(వం?)-అ. 7 చాయవివి-అ,ర. 8 శుకంబుల-ముద్రి(అ)ర: కుశంబుల-అ. 9 నవముగదిరి - డ,ద;బ: నయముదఱగె - గ: నయముదఱిగి-ర, నయముదలఁగి - అ. 10 కాన్య - ర, కన్య- అ. గౌ. 11 కుబ్జేశు - గౌ: కుబ్జేశ - ర, అ. 12 ములపెంపు - త: ములఁబెంపు- అ 13 నొఱపులు (ను) - అ: నొఱపులు - ర, గౌ. 14 మోవఁజేయ - ర, ద్రోవఁజేయ - చ: మో(బో?) వఁజేయు - అ: వోవఁజేయ - గౌ. 'గౌ' ప్రతిలో 2వ పాదపుటుత్తరార్ధము, 4వ పాదపుటుత్తరార్ధముఁబునకు క్రమముయున్నది లిపికరప్రమాదముగాఁదోఁపును.

మారుతమునకు, ఇవి = ఈయవి, ఆగారంబులు = గృహములు - ఆశ్రియములు, (అగారమ్ = గృహమ్ - ఇత్యమరటీకా - శబ్దక) అంచున్ = అని, వెగటు+కదిరి = వైరస్యముపొంది.

మలయమారుతము. మదనోద్దీపకము. వీజనములు, వసంతమున వీచుకొన్నప్పుడు, మలయమారుతమును బ్రసరింపఁజేయును కావున, వానిని జూడఁగానేయవి మలయమారుతమును బ్రసరింప జేయునన్న విషయము స్ఫురించి వాని పట్లవైరస్యమునందుదురనుట.

[2] అలరుమొగ్గలన్ = పుష్పముకుళములను, చూచి = కను గొని, ఇది = ఇయ్యది, మరుబాణముల = మన్మథశరములయొక్క, సహోదరవర్గము = తోఁబుట్టువుల సజాతీయసమూహము, అంచున్= అని, అలఁతనొంది = బాధపడి

పుష్పములు మదనబాణములగుటచేఁబూమొగ్గలను జూడఁగానే, పుష్పములుమదనబాణములనుట స్ఫురించి మదన బాధపొందుదురనుట.

[3] ఫుల్లతీఁగలన్ = సోమలతలను, చూచి = కనుఁగొని, కమలారి = తమ్మిసూడుయొక్క (చంద్రునియొక్క) నామంబు = పేరు, ఇవి = ఇయ్యవి - ఈఫుల్లతీఁగలు, కైకొన్నవి = స్వీకరించినవి, అంచున్ = అని, ఫుల్లసిల్లి = భయపడి

సోముఁడు మదనోద్దీపకుఁడగుటచేఁ బుల్లతీఁగలను జూడఁగానే వానికిఁగలసోమలతానామము స్ఫురించి, సోమనామమును ధరించినవి గాన వానిని దీయుటకు భయపడుదురనుట.

సోమలత - చూ 4-256 వ్యాఖ్య.

[4] శుకయుగంబులున్ = చిలుకజంటలును, తామున్ = తామును, ఒకచాయయవి = ఒక రంగుగలవి. (ఏకవర్ణముగలవి)

అంచున్ = అని, నవకుశంబులన్ = లేఁతదర్భలను, చూచి = కనుఁగొని, నయము + తలఁగి = స్వస్థతచెడి.

చిలుకలు, మదనోద్దీపకములు. కానఁజిలుకలవలె నాకుపచ్చగానున్న లేఁతదర్భలనుజూచి, యివి చిలుకలవలె నాకుపచ్చగానున్నవనఁటు స్ఫురించి స్వస్థతచెడుదురనుట

కన్యకుబ్జేశ = కన్యాకుబ్జరాజుయొక్క, కన్యపైన్ = బాలికపై-కౌమార్తెదేహమునందు, కలుగు = ఉన్న, చెలువు = సౌందర్యము (కన్యాకుబ్జరాజకుమారియొక్క దేహసౌందర్యము) భావములపెంపు = హృదయౌన్నత్యములయొక్క, ఒఱపులు = ఒప్పిదములను. పోవఁజేయన్ = తొలఁగఁజేయుచుఁగా, మునులు = మౌనులు, ఒకరీతిన్ = ఒకవిధముగా - అనవధానముగా, ముఖ్యవిధులు = ప్రధానములయిన కర్మములు - నిత్యకర్మములు, (స్నానసంధ్యాదికర్మములనుట) ఒనర్చుదురు = అనుష్ఠింతురు.

చేయనియెడలఁబ్రత్యవాయము కలుగునుగాన, స్నానసంధ్యాదులగు నిత్యకర్మములను ముఖ్య విధులనుట.

కన్యకుబ్జ - 5_289 వ్యాఖ్య.

వ్యాక :— ఒనర్చుదురు - ఒనర్చు + దు + రు. "ఒనరుధాతునాగమచకారంబున కొకానొకచో దుక్కుపరంబగునపుడు పకారంబు చూపట్టెడు" ము. కౌ. క్రియా 22 అలం :— స్మరణము

తే॥ వనజనాభునియభిషేక 1 మునకకాని
కనకగర్భాదు 2 లకు వాడికొనఁగరాని
తీర్థకుండాంబునికరంబుతెలుపపిండు
గబ్బిచనుజక్కవలచేతఁ 3 గలఁపఁబడియె. 293

293 పః- 1 మునకె.ర, అ. మునక-గౌ. 2 లకుఁబాదు-డ.ద,బః లకువాడు-ర; లకువాడి - అ, గౌ. 3 గప్పఁ - డ, ద, బ; గలప - ర, అ, గౌ.

వ్యా :— వనజనాభుని = విష్ణుమూర్తియొక్క - విట్ఠలుని విట్ఠలునియొక్క, అభిషేకమునకకాని = స్నానముచేయుటకేకాని, కనకగర్భాదులకున్ = బ్రహ్మలోనగువారికిని, (కనకగర్భ = హిరణ్య గర్భ - హిరణ్యగర్భోలోకేశం స్స్వయంభూశ్చతురాననః - అమ) వాడి కొనఁగరాని = ఉపయోగించుకొనఁదగని. తీర్థ = క్షేత్రమునందలి - పాండురంగక్షేత్రమునందలి, కుండ = దేవఖాతమగు జలాశయము యొక్క, (కుండం .... దేవజలాశయే - మే. ని.) - నృసింహతీర్థము యొక్క, అంబునికరంబు = జలమూహము, తెఅవపిండు = అతివల సమూహముయొక్క, గబ్బిచను జక్కవలచేతన్ = ఉబ్బుగుబ్బలనెడు చక్రవాకములచేత, కలఁపఁబడియెన్ = క్షోభపెట్టఁబడెను.

తే॥ జాఱు 1 నలరును దేనియగారయిచ్చి
గాడ్పు సంధించునయకాని 2 యీడ్పవెఱచు
నెందునయ్యాఁకవిరితోఁట 3 లిందుముఖుల
నగవునునుమించు 4 సొనఁబోలెనయము 5 దటిగె. **294**

వ్యా :— ఎందున్ = ఎచ్చటు, జాఱు = చ్యుతమగు, (రాలఁబోవు) అలరును = పువ్వును, తేనియగారయిచ్చి = తేనెపూఁత పూసి, గాడ్పు = గాలి, సంధింపనయకాని = కూర్చుటనేగాని, ఈడ్పన్ = ఊడఁగొట్టుటకు, వెఱచున్ = భయపడునో, అయ్యాఁక = అకట్టుపాటుగల - గాలితాడిమయూడిరాఁలబోవు పుష్పమును, బూఁదేనె పూఁతతోనతుకవలెనేకాని పడఁగొట్టరాదనుకట్టుపాటుగల, విరితోఁటలు =

294 ప:- 1 నలరులతే - ముద్రి (అ). సడలను - గొ. నలరును - అ
2 యూర్చు- డ, ద. బః యూడ్పు - ర. యూడ్వ-గొః యీడ్పు-అ
3 తోఁటనిందు - ముద్రి(అ). తోఁటలిందు-అ. 4 సొనపోలె-ముద్రి (అ) ర, సొనపోలె - గొ, సొనఁబోలె - అ. 5 దటుఁగ-ముద్ర(అ) దటిగి గొ; దటిగి (గె?) - అ; దరిగి - క, త

పుష్పోద్యానములు, ఇందుముఖుల = ఆచంద్రవదనలయొక్క-ఆకాంతల యొక్క, నగవు= నవ్వనెడు, నునుమంచుసోనన్‌పోలెన్= గాటమైనహిమ ప్రవాహముచేతనోయనునట్లు, నయము+తటిగెన్ = పొలుపుదక్కెను.

వ్యాక :— సంధింపనయకాని - సంధింపన్+అ = సంధిం పన+అ = సంధింపనయ. "కొన్నియెడలనర్థదార్ఢ్యంబున నవధార ణార్థకము మీఁదనవధారణార్థకంబుచూపట్టెడు." (ము. కౌ. ప్రకీర్ణక 14 వృత్తి) అలం :— ఉత్ప్రేక్ష.

ఆ॥ అవసరంబుగాచి యల్లంతదవ్వుల
నుండి 1 సురలుదనకుదండములిడ
2 నొప్పుముక్కునందునూరుపుగలవేల్పుఁ
3 గొమ్మలంటి 4 రాటబొమ్మవోలె. **295**

వ్యా :— అవసరంబుగాచి = తటివేచి, (సమయము ప్రతీక్షించి) అల్లంతదవ్వులనుండి = కంటికగపడునంతదూరమునుండి (ఎడముగానుండి - అనుట) సురలు = దేవతలు, తనకున్ = తనకు, దండములిడన్ = నమస్కారములు పెట్టఁగా, ఒప్పు = తనరెడు, ముక్కునందునూరుపుగలవేల్పున్ = నాసికముననిశ్వాసములు పుచ్చుటగల దేవతను - కాలభైరవుని, కొమ్మలు = కాంతలు, ఆటబొమ్మవోలెన్ = ఆటలాడుకొను బొమ్మనువలె - ఆటలాడుకొనుబొమ్మను స్పృశించునట్లుగా, అంటిరి = స్పృశించిరి.

---

295 ప.- 1 మునులు - డ, ద, బ, చ; సురలు - ర, అ, గౌ. 2 నువ్వు-క; నొప్పు - ర, అ. 3 బొమ్మ - క; గొమ్మ - అ. 4 లాటబొమ్మ పోలె - గౌ; రాటబొమ్మపోలె - ర; రాటబొమ్మపోఁ(బో?) వె - అ.

రాజకుమారియుఁ జెలికత్తెలును బ్రాహ్మణశాపముచేఁగప్పలుగా మా అవలసియున్నది కానవారినినిరోధింపవీలు లేక, వారుచేయుచున్న దేవతాపచారములనుజూచితాపముతోఁగాలభైరవుఁడుఁనిట్టూరులు పుచ్చుచుండెననుట. అట్టికాలభైరవునాటుబొమ్మను ముట్టుకొన్నట్లువారుముట్టికొనిరి.

వ్యాక:— అటుబొమ్మవోలెన్ = అటుబొమ్మనుబోలె, బొమ్మ= బొమ్మను - ద్వితీయార్థక ప్రథమ [బా. కారక 24]

అలం :— ఉపమ.

మత్త ;- జాలిదక్కిమఠాంతరాళవిశాలవేదుల 1 యందుగో
జాల 2 గొందిఁదపంబు సల్పుజనంబుతాల్మలు 3 దూలెఁద
ద్బాలికాకులనిస్తులస్తనపాళికామృగనాభివా
తూలికాహతిఁబక్వశాల్మలితూలికాశకలాకృతిన. **296**

వ్యా :— జాలిదక్కి = కోరికలువిసర్జించి, మఠ = మఠముల యొక్క, (సన్న్యాసాశ్రమములయొక్క) అంతరాళ = మధ్యభాగములయందున్న, విశాలవేదులయందున్ = విస్తృతములయిన యరుఁగులయందుఁగల, గొందిన్ = మూలలయందు, గోణాలన్ = కౌపీనములతో, (గోచియనఁగచ్చడఁబన గోణమనఁగబొట్టుమంచనకౌపీనముదనరారు - అం. బా) తపంబునల్పు = తపమాచరించు, జనంబు = జనులయొక్క - మునిజనులయొక్క, తాల్మలు = ధైర్యములు, (మనస్థైర్యములు) తద్బాలికాకుల = అకన్యలసజాతీయసమూహముయొక్క, నిస్తుల = సాటిలేని, స్తనపాళికా = కుచప్రాంతమునందలి, పాలిః =

---

296 ప:- 1 యందుఁగోణాల - ర, యందుఁగో [గో?] నాల - అ. యందు గోనాల - గౌ. 2 గొండి - క; గొంది - ర, అ. 3 దూలు -ముద్రి [అ], ర; దూలె - అ, గౌ.

ప్రాంతః - శబ్దక) మృగనాభి = కస్తూరియొక్క, వాతూలికా = వాయువుయొక్క-కస్తూరివాసనతోఁగూడిన వాయువుయొక్క, హతిన్= తాఁకుటచేత (గాఢస్పర్శచేత - అనుట) పక్వ = పరిణతమయిన; శాల్మలితూలికా = బూరుగుదూదియొక్క (పిచ్ఛిలాపూరణీమోచా, చిరాయుశ్శాల్మలిర్ద్వయోః - అమ) శకల = పింజయొక్క, అకృతిన్ = విధమున - బూరుగుదూదిపింజవలె, తూలెన్ = చెదరెను.

"అకృతి = సాదృశ్యము, పోలిక, రీతి --- పాండు 1-119; అడవుల బొబ్బలువెట్టుచు, నడలెడుహరులింతికౌను నాకృతిఁగనునే - రసిక 2-97" - సూ. ని.

కోరికలు త్యజించి, మఠములయరుఁగు మూలలయందుఁగోపిన ధారులై తపస్సుచేయుమునుల ధైర్యము, లాకన్యకుచముల యందలి కస్తూరివాసనలతోఁగూడుకొనిన వాయువులగాఢస్పర్శచే, బూరుగుదూది పింజలవలెఁజెదరెను.

ఛం :— మత్తకోకిల. గణములు :- రసజజభర. యతి - 1-11 ఇది 18-93019 వ, వృత్తము.

అలం :— ఉపమ.

శా॥ డోలారోహణసాహసోద్యమముఁ, జాటుప్రౌఢి, నర్మోక్తివి
ద్యాలాలిత్యముఁ, బుష్పసాయక సపర్యాచర్యయున్, మున్నుగా
హాలాపాన విహారమున్నడపిరుద్యత్ప్రీతిఁబద్మేక్షణల్
పోలుంబోలములింతయెన్నక మహాబోధిద్రుమచ్ఛాయలన్ 297

297 ప.- 1 ప్రౌఢ - క, ప, ర, గౌ; ప్రౌఢి - అ. 2 విహీసమున్ - గౌ; విహారమున్ - ర, అ. 3 బోధ - క; బోధి - ర, అ.

వ్యా ;— పద్మతాక్షణల్ = సరోజాక్షులు - ఆకాంతలు, పోలుంబోలములు = ఉచితానుచితములను, ఇంతయెంచక=కొంచెమును భావింపక, మహత్ + బోధిద్రుమ = గొప్పరావిచెట్టుయొక్క, ఛాయలన్ = నీడలయందు (బోధిద్రుమశ్చలదళః పిప్పలః కుంజరాశనః, అశ్వత్థే-అమ) ఉద్యత్=వర్తించుచున్న, ప్రీతిన్ = ఆసక్తితో, డోలా = ఉయ్యాలలయొక్క, ఆరోహణ = ఎక్కుటయందలి (ఉయ్యాలల నూఁగుటయందలి - అనుట) సాహస = చొరవతోఁగూడిన, ఉద్యమమున్ = పూనికయు, చాటు = ప్రియవాక్యములయొక్క, (చటు చాటుప్రియప్రాయమ్- అభి. చిం.) ప్రౌఢి = ప్రాగల్భ్యమును, (దిట్టతనమును) నర్మ = పరియాచకముతోఁగూడిన, ఉక్తి = వచనముల యొక్క, విద్యా = జ్ఞానమునందలి, లాలిత్యమున్ = ఒప్పిదమును, పుష్పసాయక = కుసుమబాణునియొక్క (మన్మథునియొక్క) సపర్యా చర్యయున్ = పూజానుష్ఠానమును, (పూజానమస్యాపచితిస్సపర్యార్చార్హణాస్సమాః - అమ; చర్యా = అనుష్ఠానమ్ - శబ్దక) మున్నుగాన్ = ముందటివిగా, హాలాపాన = మద్యపానముయొక్క, విహారమున్ = వినోదమును, నడపిరి = కొనసాగించిరి.

కన్యాకుబ్జరాజకన్యయు నామెచెలికత్తెలు, నుచితానుచితములనాలోచింపక రావిచెట్లనీడలయందుఁబంతము పట్టియుయ్యాలలూఁగిరి. ప్రియవాక్యములలోదిట్టతనముచూపిరి. పరియాచకములాడుకొనుటలోఁ దెలివి ప్రదర్శించిరి మన్మథపూజచేసిరి. పిమ్మట మద్యపాన వినోదమును గొనసాగించిరి,

వ్యాక;- డోలా - ఇది దోలాశబ్ద ప్రాకృతరూపము. (త్రి. ప్రా) సంస్కృతశబ్దముగావాడఁబడినది,

హాలా - ఇది ప్రాకృత రూపము. "అతిప్రయుక్తం దేశభాషాపదమ్ .... యోషిదిత్యభిలలాషనహాలామ్ ఇతి అత్ర 'హాలా' ఇతి దేశభాషాపదమ్" (కా. సూ) ఇది సంస్కృతమునఁజేరి సంస్కృతత్వము

వడసినది. కనుకనే యమరకోశమునకెక్కినది. "సురాహాలిప్రియా హాలా" అను. ఇటు, హాల = శీధువనియర్థము. చూ 5-298 ప.

పోలుంబోలములు - పోలు + పోలమి "భావద్వంద్వంబునందొలి పదంబుటువర్ణకంబునకులోపంబగు" ప్రౌ. సమాస 31 పోలు+పోలమి ప్రౌ. సమాస 36 చే - నుగాగమమగునని వ్యాఖ్యానించుకొనవలెను. పోలు + ను + పోలమి = పోలుంబోలమి+లు; పోలుంబోలములు.

అ॥ జవ్వ 1 నంబుమదము సౌందర్యమదమును
ధనమదంబుమనసుఁబెనుకుదుళ్ల
2 బొదలనంతశీధుమదముఁదోడ్తోఁబ్రోది
యగుచునిగిడెనమ్మృగాక్షులందు. **298**

వ్యా :— అమ్మృగాక్షులందున్ = ఆలేడికన్నులవంటికన్నులుగలవారియందు - ఆకాంతలయందు, జవ్వనంబుమదమున్ = యౌవనగర్వమును, (పడుచుఁదనముగలవారమన్నదురహంకారమును- అనుట) సౌందర్యమదమును = రూపగర్వమును, (అందకత్తెలమన్నదురహంకారమును - అనుట) ధనమదంబున్ = ధనగర్వమును. (సంపన్నులమన్నదురహంకారమును) మనసు=హృదయములయొక్క, పెనుఁగుదుళ్లన్= గొప్పమొదళ్లయందు, (హృదయమూలములయందు - అనుట) పొదలన్ = ప్రబలగా, అంతన్ = అప్పుడు, శీధుమదమున్ = పక్వమయిన చెఱకురసముతో నిర్మించిన మద్యము దాగ్రుటవలనఁగలిగిన మత్తును, (శీధురిక్షురసైఃపక్వైః - మాధవుఁడు) తోడ్తోన్ = క్రమక్రమముగా, ప్రోదిఅగుచున్= వృద్ధిపొందుచు, నిగిడెన్= వ్యాపించెను.

---

298 ప:- 1 నంపు - ర, అ, నంబు - గౌ. 2 బొదలునంత - క; బొదుల నంత — ర, అ.

సీ॥ దామోదరుఁడుయశోదాస్తన్యమానెడు
నని మ్రొక్కి విరిగుత్తినలిభ్రమింపఁ
బొద్దులు సొచ్చెఁగ్రద్దాదేవికిపుడని
ప్రియ మందు 1 వేణుగర్భిణిగుటించి
పావనిగదనొచ్చెఫణికేతుతొడలని
యడలునేనుఁగుచేతనరఁటు 2 లొరగ
బడబాగ్నిజడధివెల్వడియెడుననిచూపుఁ
గానఁబూచినకింశుకముచెలులకు

తే॥ శేషవృతమేరు శిఖరమనిషఁబొగడు
నంచకౌఁగిటనున్న హేమాంబుజంబుఁ
బూర్వమగువిన్కిమది 3 వెడపొడముదేర
మధుమద 4 క్షీబయగునొక్క విధునిభాస్య. **299**

వ్యా :— మధుమద = మద్యపానమువలనఁగలిగిన మత్తుచేత, క్షీబయగు= మత్తిల్లినదియగు, (మత్తే శౌండోత్కటక్షీబాః -అమ) ఒక్క= ఒక, విధునిభ = చంద్రతుల్యమగు, అస్య = ముఖముగలది ˉఒక చంద్రముఖిˉ - ఒకకన్య, పూర్వమగు విన్కి = ముందటికాలమున నయిన యాకర్ణించుట, [మునుపువినియుండుట] మదిన్ = మనస్సునందు, వెడ = కొంచెముగా, పొడముదేరన్ = స్మరణకుతాఁగా.

[1ˉ విరిగుత్తిన్ = పుష్పగుచ్ఛమునందు, అలి = తుమ్మెద, భ్రమింపన్= సంచరింపఁగా, దామోదరుఁడు = కృష్ణుఁడు, యశోద = యశోదాదేవియొక్క, స్తన్యము = చనుఁబాలు, అనెడునని = త్రాగుచున్నాఁడని, మ్రొక్కన్ = నమస్కరించును.

299 పః- 1 వేఁడు - గొ, వేణు -ర, అ. 2 లొదుగ - డ, ద, బః లిడఁగ-గొ. లొరుగ - అ, లొరుఁగ - ర. 3 వెద - గొ; వెడ - ర, అ. 4 క్షీభ - గొ; క్షీబ -ర, అ.

తుమ్మెదను కృష్ణునిగాను, బూగుత్తిని యశోదాస్తనముగాను భ్రమించుచున్న మాట

[2] ఇపుడు = ఇప్పుడు, కద్రూదేవికిన్ = (నాగులతల్లియగు) కద్రువకు, పొద్దులుసొచ్చెన్ = ప్రసవకాలమాసన్న మయ్యెనని, వేణుగర్భిణిగుఱించి = చూలాలివంటి వెదురుబొంగునుగూర్చి, ప్రియ మందున్ = సంతోషించును.

కద్రూదేవికశ్యపపత్ని. ఈమె, నాగకాంతకాదు. కాని, నాగ జననియగుటచే, నామె, నాగాకారయని మద్యపాన మదమువలన భావించి, వెదురు బొంగునుజూచి ప్రసవింపఁబోవు కద్రూదేవియని భ్రమించుననుట.

వేణుగర్భిణి - అనుటచే గర్భమునందు ముత్యములున్న వేణువని గ్రహింపనగును. వెదురున ముత్యములుండును - 5-315 వ్యాఖ్య.

[3] ఏనుఁగుచేతన్ = కరిచేత, అరఁటులు = కదళీవృక్షములు, (అరఁటిబోదెలనుట) ఒరగన్ = వ్రాలఁగా, ఫణికేతు = సర్పధ్వజుని యొక్క - దుర్యోధనునియొక్క, తొడలు = ఊరువులు, పావని = పవన (వాయు) పుత్రునియొక్క - భీమునియొక్క, గదన్ = గదచేత; నొచ్చెన్, అని = నొప్పిపొందెనని, (భగ్నమయ్యెనని - అనుట) అడలున్ = మనస్తాపమునందును.

అరఁటిబోదెను దుర్యోధనుని తొడలుగాను, నేనుఁగుతొండమును భీమునిగదాదండముగానుభ్రమించుననుట.

ఫణికేతుఁడు - దుర్యోధనుఁడుఫణిధ్వజుఁడు.

"మణిమయోరగరుచి జాలమహితమైన

పడగవాఁడు కురుక్షితిపతి" [విరాట 5-4]

[4] బడబాగ్ని = ఔర్వానలము. జడధిన్ = సముద్రము వలన (నుండి) వెల్వడియెడునని = బయటికివచ్చుచున్నదని, కానన్ = అరణ్యమునందు, పూచిన = పుష్పించిన, కింశుకము = మోదుగుపువ్వును చెలులకున్ = చెలికత్తెలకు, చూపున్ = కనఁబఱుచును.

అడవిని సముద్రముగాను, మోదుగుపువ్వును బడబానలముగాను భ్రమించునన్న మాట.

సముద్రవర్ణము నీలము. అరణ్యవర్ణముహరితము. (ఆకుపచ్చన) నీలహారితములకభేదముకవిసమయము "కృష్ణనీలయోః, కృష్ణహరితయోః, కృష్ణశ్యామయోః .... నిబంధనంచకవిసమయః" (కావ్యమీ) కృష్ణనీలహారితశ్యామవర్ణములకైక్యము గ్రాహ్యమన్న మాట.

బడబాగ్ని - బడబా (ఆఁడుగుఱ్ఱము) ముఖమున సముద్రమునఁగలయౌర్వమహర్షికోపాగ్ని. చూ 1-121 వ్యాఖ్య.

కింశుకము - వ్యుత్పత్తికి : చూ 4-233 వ్యాఖ్య.

వ్యాక :— జడధిన్ = జడధివలన - పం. కారక 11

అంచ = హంసయొక్క, కౌఁగిటనున్న = కౌఁగిటియందున్న హేమాంబుజంబున్ = పొందామరను, శేష = ఆదిశేషునిచేత, వృత = చుట్టుకొనఁబడిన, మేరుశిఖర = బంగారుకొండయొక్కశృంగమనెడు, మనీషన్ = బుద్ధితో, పొగడున్ = కొనియాడును.

హంసనాది శేషుఁడుగాను, బొందామరను బంగారుకొండ శిఖరముగాభ్రమించునన్న మాట.

హంసఱెక్కలు తెల్లగానుండును "హంసాస్తుశ్వేతగరుతః"(అమ) శేషుని వర్ణము తెలుపు, (చూ 1-9 వ్యాఖ్య)

అలం :— భ్రాంతి, కావ్యలింగము.

సీ॥ సుధ 1 యొల్కు నెటివేణి 2 సోమార్థమునఁబోలెఁ
జెమరించెదుర్గలే 3 జిలుఁగునొసలు
4 ఘుర్కురభర్తృదృగ్గోళంబు 5 శీధు సం
సేవనం 6 బునఁబోలెజేవురించెఁ
విష్ణునన్యానక్తు వీక్షించు 7 టనుబోలె
ముక్త కేశికిబొమముడి జనించెఁ
ద్వరితనిశ్వాస 8 వేదనఁబోలెఁగంపించె
విజయునివదనారవిందదళము

తే॥ పరమపావనమైనతత్పాండరీక
పుణ్యతీర్థావకాశమపూర్వ 9 శుద్ధిఁ
10 బెనఁచున్నృపకన్యకాసఖీజనులవివిధ
విలసనంబులజనియించునలుకననఘ! 300

వ్యా :— అనఘ = ఓసుకృతీ! - ఓనారదా! పరమపావనమైన = పరమపవిత్రమయిన, తత్పాండరీక = అపౌండరీకమను పేరుగల; పుణ్యతీర్థ = పుణ్యక్షేత్రముయొక్క, అవకాశము = ప్రశస్తమయిన ప్రదేశమును, (అవకాశః = ప్రశస్తప్రదేశః - శబ్దక) అపూర్వశుద్ధిన్ = మునుపటి పరిశుద్ధిలేనిదానినిగా, పెనఁచు = చేయు-మార్చు

---

300 ప.- 1 నొల్కు — గౌ; యొల్కు - ర, అ 2 సోమార్థమునుబోలి - ర, సోమార్థమునుబోలి - గౌ. సోమార్థమునుబోలి (మునఁబోలి?)- అ.
3 జెమరు - ముద్రి [అ], ర; జిగుతు - త, గౌ. ఁజిలుఁగు — అ.
4 ఘూర్ఘూర - గౌ; ఘుర్కుర - ర, అ. 5 సింధు-గౌ; శీధు- ర,అ.
6 బునుబోలె.చ,డ.ద,బ బునఁబోలె - ర, అ, గౌ. 7 టనెపోలె త;
టనుబోలె - ర, అ. 8 వేదనపోలె - డ, ద, బ; వేదనఁబోలె- ర,అ.
9 శుద్ధి త, ర, గౌ. (అ+పూర్వ+శుద్ధి = అశుద్ధియనియా?).అ.
10 బెనుచు - ప, ర; బెనచు - అ.

నృపకన్యకాసఖీజనుల = రాజకుమారియొక్కయు నామె చెలికత్తెల యొక్కయు, వివిధ విలసనంబులన్ = పలురకములగు చేష్టావిశేషముల చేత, జనియించు = కలుగు, అలుకన్ = కోపముచేత -

1 దుర్గ = దుర్గాదేవియొక్క, లేఁజిలుఁగునొసలు = తరుణ సుందరమగుఫాలము, సుధ = అమృతమును, ఒల్కు = చిందు, నెఱివేణి = ఒప్పిదమయినజడయందలి, సోమార్ధమునఁబోలెన్ = చంద్ర ఖండముచేతనో! యనునట్లు, చెమరించెన్ = స్వేదముగలదియయ్యెను.

జడయందలి నెలవంకనుండి చిందిన యమృతబిందువులచేతనో యనునట్లు దుర్గనొసలుచెమర్చెననుట.

దుర్గ — చూ 2-98 ప.

2 కుర్కురభర్త = కాలభైరవునియొక్క, దృగ్+గోళంబు = కనుగ్రుడ్లు, శీధు = పక్వమయినచెఱకు రసముతోఁజేసిన మద్యభేదము యొక్క, (శీధురిక్షురసైః - మాధవుఁడు) సంసేవనంబునన్‌పోలెన్ = ఉపభోగముచేతనోయనునట్లు - త్రాగుటచేతనో యనునట్లు, జేవు రించెన్ = ఎఱ్ఱపడెను

కుర్కురభర్త - చూ 4-287 ప.

3 అన్యా = ఇతరకాంతలయందు, ఆసక్తున్ = ఆసక్తిగల వాఁడగు, విష్ణున్ = కృష్ణుని - విఠ్ఠలుని, వీక్షించుటను + పోలెన్ = కనుఁగొనుటచేతనో! యనునట్లు, ముక్తకేశికిన్ = ముక్తకేశిక, బొమ ముడి = భ్రూభంగము, జనించెన్ = కలిగెను.

ముక్తకేశి - చూ 2-128 ప.

4 విజయుని = నరునియొక్క, దళము = భాగము, (దళ= ఖండే - శబ్దస్తో) త్వరిత = వడిఁగలిగిన, నిశ్శ్వాస = నిట్టూర్పుల

యొక్క, వేదనన్‌పోలెన్ = అనుభవముచేతనో! యనునట్లు, (నిట్టూర్పులుపుచ్చుటచేతనోయనునట్లు - అనుట) కంపించెన్ = చలించెను.

నరునిముఖప్రదేశము వడివడిగా నిట్టూర్పులు పుచ్చుటచేతనో యనునట్లుచలించెననుట.

విజయుఁడు = నరుఁడు. (2-120 ప) నరనారాయణులలో నరుఁడే విజయునిగా (= అర్జుననిగా) జన్మించెనని భారతము. కాన విజయశబ్దము నరుఁడనునర్థమునఁ బ్రయుక్తము. విజయునకునరునకు నభేదోపచారము. అలం :— ఉత్ప్రేక్ష.

క॥ పొడగనిరి 1 పడఁతులయ్యెడఁ
బొడలపొడలయొడలితపసి పుట్టువుఁగప్పన్
జడ 2 భరతసిభమునరహరి
యడుగుఁబుడమి 3 సరియ వెడలియటుఁజనుదేరన్. **301**

వ్యా :— పడఁతులు = (అ) కాంతలు, అయ్యెడన్ = ఆసమయమునందు, పొడలపొడలయొడలి = మచ్చలమచ్చల శరీరముగల తెలుపు, నలుపు, పసుపుపచ్చ రంగులుగల (5-285 ప) తపసిపుట్టువున్= తపసియొక్క పుట్టువుగలదియు - పూర్వజన్మమునఁదపసిగా జన్మించుట గలదియు, జడభరతనిభమున్ = జడభరతునితో సమానమయినది యునగు, కప్పన్ = భేకమును, నరహరి = నృసింహస్వామియొక్క అడుగు = పాదముయొక్క-పాదమూలమునొద్దఁగల, పుడమిసరియన్ = భూబిలమునుండి, (సరియయనఁగండియన .... రంధ్రిమడరు - అం. భా: చూ 5-283 ప.) అటన్‌చనుదేరన్ = అస్థలమునుగూర్చి వచ్చుచుండఁగా, (అక్కడికివచ్చుచుండఁగా - అనుట) పొడగనిరి = చూచిరి.

---

301 ప.- 1 పొలఁతు - క; పడఁతు - ర, అ. 2 భరము - గౌ, భరత-ర,అ. 3 నరియ - గౌ; సరియ - ర, అ.

జడభరతుఁడు — ఇతఁడు ఋషభుని కుమారుఁడు, తరువాతి జన్మలో లేడిగా జన్మించెను. పిమ్మట నాంగిరసునకుఁ బుత్రుఁడుగా జన్మించి రహూగణుఁడను సింధుదేశరాజునకు వేదాంతమును బోధించెను. ఇతఁడు జడునివలె సంచరించుటచే జడభరతుఁడను పేరుగలిగెను. ఇది భాగవతాది ప్రసిద్ధము. అలం ;— లుప్తోపమ.

చ॥ 1 కనకపుటేఱో! రోహణనగంబొ! సుధాంబునిధానగర్భమో!
యనిమిషకార్ముకంబుదయమయ్యెడు 2 నయ్యెడయొక్కొ! దీనిపు
ట్టిన 3 కడయంచు విస్మయముడింపక చంపకపుష్పనాసికల్
చొనిపిరి వాలుఁజూపువల 4 చుట్టునదర్దురపట్టు 5 భద్రునిన్. 302

వ్యా :— దీని = దీనియొక్క - ఈకప్పయొక్క, పుట్టినకడ= జన్మస్థలము, కనకపుటేఱో = జంబూనదియో? రోహణనగంబొ = విదూరపర్వతమో! (రోహణః = విదూరాద్రిః - ఇతిజటాధరః- శబ్దక) సుధాంబునిధాన = క్షీరసముద్రముయొక్క, గర్భమో = లోపలి భాగమో! అనిమిషకార్ముకంబు = సురధనువు - ఇంద్రధనుస్సు, ఉదయమయ్యెడు = పుట్టెడు, అయ్యెడయొక్కొ = అస్థలమగునేమో! (ఇంద్రధనుస్సుపుట్టినస్థలమగునేమో!) అంచున్ = అని, విస్మయము = ఆశ్చర్యము, డింపక = విడువక, చంపకపుష్పనాసికల్ = సంపంగి వంటి ముక్కులుగలవారు - అకన్యలు, దర్దురపట్టభద్రునిన్ = కప్పల రాజును, వాలుఁజూపు = ఓరచూపులనెడు; వలచుట్టునన్ = జాలముయొక్క వలయమునందు, చొనిపిరి = చొచ్చునట్లుచేసిరి.

---

302 ప॥ 1 కనకపుపేరి-ముద్రి [అ] ర, కనకముపేరొ - ర; పేరు -ర (పా) కనకపుటేరొ - అ, గౌ 2 నొప్పగునొక్కొ - ముద్రి [అ], ర, నయ్యెడయొక్కొ - అ, గౌ. 3 కత - ప; కడ - ర, అ. 4 చుట్టును - ముద్రి (అ), చుట్టున - అ. 5 బద్ధునిన్ - గ, త; భద్రునిన్ - ర, అ.

కనకపుటేఱు - జంబూనదీ తీరములందలిమన్ను జాంబూనద మను సువర్ణముగా మాఱునుగాన జంబూనదిని గనకపుటేఱుగాఁబేర్కొనుట. (భాగ. 5 స్కం. 23_26 ప.)

రోహణనగము - విదూరపర్వతము. చూ 3-154 వ్యాఖ్య.

కప్పుచిత్రవర్ణముగలది. (5-285 కావున, జాంబూనద విదూర క్షీరసముద్రములు నింద్రధనువు పుట్టినచోటు, కప్పుజన్మస్థలములేమో! యనిసందేహించుట.

అలం :— సందేహము, రూపకము.

తే॥ కందుకముగాదు కేళీశుకంబుగాదు
1 పల్కువీణియగాదు దర్పణముగాదు
వర్షపిశునంబుఁబట్టఁబల్వరుసఁజనిరి
చంచలాక్షులు చపలప్రచారలెందు. **303**

వ్యా :— కందుకముగాదు = బంతికాదు. కేళీశుకంబుగాదు = కీడార్థమయిన చిలుకకాదు. పల్కు = మ్రోఁగెడు; వీణియ + కాదు = వీణకాదు. దర్పణము + కాదు = అద్దముగాదు. వర్షపిశునంబున్ = వానను సూచించుదానిని - కప్పను, పిశున = సూచకేశబ్దస్తో) పట్టన్ = పట్టుకొనుటకు, పల్వరుసన్ = పెక్కువంతులందు (వంతులు వంతులుగా) చనిరి = అరిగి. చంచల అక్షులు = చపల నేత్రిలు - కాంతలు, ఎందున్ = ఎల్లచో, చపల = చంచలమయిన, ప్రచారలు = సంచరించుటగలవారు.

---

303 ప. 1 పలుకు - గౌ. పల్కు - ర, అ.

కందుకక్రీడసల్పుట, విలాసార్థముగఁ జిలుకను దర్పణమును దాల్చుట, వీణనువహించుట పూర్వకాలపునాగరస్త్రీలయాచారములు.

వర్షపిశునము - కప్పలయఱపువర్షసూచకము.

"కప్పలు, గఱవఱగఱవరగయనుచు గట్టిన నఱచెన్" (హర 2-19) "కప్పయెలుంగుచెలంగె నిర్ఝల,స్థానములందు" (విక్రమా 4-27)

అలం :— అర్థాంతరన్యాసము

తే॥ యువజనంబులఁదనయురిఁదవులు పఱుచు
కీలుగలిగినయొకనీలనీలవేణి
తుఱుమువిరిదండయురివారిచరముఁజిక్క
పఱుపనేరకమదిఁ 1 జిక్కువడియెఁదాన. **304**

వ్యా :— యువజనంబులన్ = తరుణజనులను, (యువకులను) తన = తనయొక్క, ఉరిన్ = ఉచ్చునందు - మోహపాశమునందు, తవులుపఱుచు = చిక్కుకొనునట్లుచేయు, కీలుగలిగిన = ఉపాయముగలిగిన, ఒక = ఒక్క, నీల = నల్లనివర్ణముగల, నీలవేణి = నల్లనిజడగలది- కాంత, (కన్యాకుబ్జరాజకన్యయొక్కచెలికత్తెలలో నొకతె) తుఱుమువిరిదండన్ = కొప్పునందలిపుష్పసరిజముతో, వారిచరమున్= జలచరమును - కప్పను, చిక్కపఱుపనేరక = పట్టుపడునట్లుచేయఁజాలక, తాన = తానే,మదిన్ = మనస్సునందు, చిక్కు + పడియెన్ = బాధపొందెను.

---

304 ప:- 1 గుట్టుబడియె - త, జిక్కువడియె – ర, అ.

తే॥ చొచ్చి 1 చనఁబట్టుటకునొక్కమచ్చెకంటి
మొఱిలఁబఱచిన 2 చేలదర్దురముదాఁటెఁ
దొంటిపుట్టునఁదన 3 యంటుసంటువారి
మీఁదిమమకారనది 4 దెఱివ్వనీఁదుకరణి. **305**

వ్యా :— చొచ్చిచనన్ = ప్రవేశించియరుగఁగా - తాను పఱచిన వస్త్రమునందుఁబ్రవేశించి యరుగుచుండఁగా, పట్టుటకున్ = పట్టుకొనుటకు, ఒక్కమచ్చెకంటి = ఒకమీనాక్షి - ఒకచెలికత్తె, మొఱిలన్ = ముందటిభాగమునందు, పఱచినచేలన్ = పఱచినట్టి వస్త్రమును, తొంటిపుట్టునన్ = పూర్వజన్మమునందు, తన = తనయొక్క అంటుసంటువారిమీఁది = బంధువులపైనున్న, మమకార = మమత్వ మనెడు, నదిన్ = ఏటిని; తెఱివ్వన్ = పూర్ణముగా, ఈఁదుకరణిన్ = ఈఁదునోయనునట్లు, దర్దురము = కప్ప, (భేకేమండూక వర్షాభూశా లూరప్లవదర్దురాః - అమ) దాఁటెన్ = లంఘించెను.

ఒకచెలికత్తె వస్త్రమును బఱచి కప్పదానియందుఁ బ్రవేశించి వెడలునప్పుడు దానిని బట్టుకొనవలెనని తలపోయఁగాఁ బూర్వజన్మము నందలి తనబంధువులయెడఁగల మమత్వమనెడునదిని బూర్తిగా నీఁదునో యన్నట్లుగా, నాపఱచినవస్త్రమునుదాఁటికప్ప తప్పించుకొనిపోయెననుట

వ్యా :- "మచ్చెకంటియనింద్య గాత్రిమ్యంబుగఁగాత్రిహ్యంబగు" (ము. కౌ. సమాస 16) మచ్చెములవంటి కన్నులుదేనికిఁగలదోయది - బహువ్రీహి )

అలం :— ఉత్ప్రేక్ష.

---

305 ప.- 1 చనిపట్టు - అ; చనఁబట్టు - ర, గౌ. 2 చేల - 'అనిటను'- అ, చేల - ర, అ, గౌ. 3 యంటసంట - త, యంటుసంటి - ర, అ, 4 ద్రివ్వ - ప; దెఱివ్వ - ర, అ, గౌ.

క॥ అవర్షాభూవిభువునకు
1 హావళిదఱచయ్యెబిసరుహాక్షులచేతన్
రావణునకు వైకుంఠపు
రావానస్త్రీలచేతియలజడివోలెన్. **306**

వ్యా :— రావణునకున్ = రావణాసురునకు, వైకుంఠపుర = శ్వేతదీపము, ఆవాస = నివాసముగాఁగల, స్త్రీలచేతి = కాంతలచేతఁ గలిగిన, అలజడివోలెన్ = బాధవలె, అవర్షాభూవిభునకున్ = అకప్పల రాజునకు, (భేకేమండూక వర్షాభూ, శాలూరప్లవదర్దురాః - అమ) బిసరుహాక్షులచేతన్ = పద్మనేత్రిలచేత - ఆచెలికత్తెలచేత, హావళి = బాధ, తఱచుఅయ్యెన్ = అధికమయ్యెను.

వైకుంఠస్త్రీలు రావణాసురుని బురుగుగాభావించి తమచేతులతోఁ బీడించుట, తప్పించుకొన లేక యతఁడొకతెచేయి కఱచుట, యామె చేయి విదలింపఁగా సముద్రమునఁబడి తప్పించుకొని పాఱిపోవుట యుత్తరరామాయణ ప్రసిద్ధము.

అలం :— ఉపమ.

ఆ॥ పూర్వజన్మకుంభభూ 1 శిష్యముఖ్యుండు
ఖెకరూపకూపబింబితుండు
ప్రియుతసుతుఁడు దవులుపడఁడయ్యె భూపాల
తనయనఖులచేత, ధాతృతనయ! **307**

---

306 ప:- 1 హావడి - గొ; హావళి - ర, అ.

307 ప:- 1 ముఖ్యశిష్యుండు - క; శిష్యముఖ్యుండు - ర, అ.

వ్యా ;— ధాతృతనయ = ఓబ్రహ్మయొక్క కుమారుఁడా!- ఓనారదా! పూర్వజన్మ = మునుపటిపుట్టువునందలి, కుంభభూ = ఘటజుని యొక్క, (అగస్త్యునియొక్క) శిష్యముఖ్యుండు = ధాతుప్రియుండుఁ బ్రధానుఁడును, భేకరూప = కప్పయాకృతిచేత, కూప = భూబిలము నందు, నేలకన్నమునందు, (కూపః కూపకగర్తాంధుమ్యన్మాన గుణ వృక్షకే - విశ్వ) బింబితుండు = ప్రతిఫలించినవాఁడును - నృసింహ స్వామి పాదమూలమునొద్దఁగల భూబిలమునుండి వచ్చుచుఁగనఁబడిన వాఁడును, (చూ 5-286; 301) అగు, ప్రియుతసుతుఁడు = ప్రియు తునికుమారుఁడు - అయుతుఁడు, (కప్పగామాఱిన యయుతుఁడనుట) భూపాలతనయ = (కన్యకుబ్జ) రాజకుమారియొక్క - సఖులచేతన్ = చెలికత్తెలచేత, తవులుపడఁడయ్యెన్ = చిక్కుకొన్నవాఁడుకాఁడయ్యెను (చిక్కలేదనుట)

కుంభభూ - చూ 1 120 వ్యాఖ్య.

క॥ నరనాథపుత్రి యత్తఱి
నురుకచకుచజఘనభారయుతయయ్యె మదిన్
1 ధరియించెఁగార్యభరమున్
గిరిగహన ద్వీపనహితక్షితిధృతిఁబోలెన్. **308**

వ్యా ;— నరనాథపుత్రి = రాజకుమారి, అత్తఱిన్ = ఆసమయమునందు, (అప్పుడు) ఉరు = గొప్పవయిన. కుచకచజఘన భార = స్తనములయొక్కయుఁ, గేశములయొక్కయుఁగటియొక్కయు నతిశయములతో, యుత = కూడుకొన్నది, అయ్యెన్ = అయియును, (అయినప్పటికి) గిరిగహనద్వీప = కొండలతోడను నడవులతోడను

---

308 ప౹- 1 ధరియించె - త; ధరియించె - ర, అ.

దీవులతోడను, సహిత = కూడుకొన్నదియగు, క్షితి = భూమి; ధృతిన్‌పోలెన్ = స్థైర్యమునువలె - ఓర్పునువలె, మదిన్ = మనస్సునందు, కార్యభరమున్ = కార్యభారమును, ధరియించెన్ = తాల్చెను.

కన్యాకుబ్జరాజకుమారి స్తనభారము, కేశభారము, కటిభారము గలదియయ్యు, పర్వతములు నరణ్యములుద్వీపములునను వానితోఁగూడుకొన్నభూమి, యోర్పును వహించునట్లు, కప్పనుబట్టుకొను కార్యభారమును వహించెననుట.

సప్తద్వీపములు --"జంబూప్లక్షకుశక్రౌంచశాకశాల్మలపుష్కరాః" (చూ. 5-326 వ్యాఖ్య)

అలం :— ఉపమ.

ఉ॥ వన్నిదమెద్దియేనిడుఁడు, పట్టెదఁజూడుఁడు దీనినంచు నా
కన్నియ, చిన్నినవ్వొలయఁగాఁజెలికత్తియలం 1 దదుద్యమ
చ్ఛన్నమనస్కలందెగడి, చంచలకాంచికలాప 2 వాగురా
పన్నహనంబునన్ సలిలజంతులల్లామముఁబట్టెనుబ్బుచున్ **309**

వ్యా :— ఎద్దియేన్ = ఏదయినను, పన్నిదము + ఇడుఁడు= పందెము వేయుఁడు, దీనిన్ = దీనిని - ఈకప్పను, పట్టెదన్ = పట్టుకొందును. చూడుఁడు = కనుఁగొనుఁడు. అంచున్ = అని, అకన్నియ = అకన్య - అకన్యాకుబ్జరాజకుమారి, చిన్నినవ్వు = చిఱునవ్వు, ఒలయఁగాన్ = వ్యాపింపఁగా, (ముఖమునఁదోఁపఁగా - అనుట) తద్‌ఉద్యమ = అపూనికచేత - అకప్పను బట్టుకొనవలెనను

---

309 పా.- 1 దనూద్య - డ, ద, బ; దదుద్యమ - ర, అ. 2 వాగురా- ప, ర; వాగురీ - అ, గొ.

ప్రాణికచేత, ఛన్న = ఆవరింపఁబడిన, మనస్కులన్ = హృదయములు గలవారగు, చెలికత్తియలన్ = సఖురాండ్రను, తెగడి = ఆక్షేపించి, చంచల = చలించెడు, కాంచి = కాంచియనుపేరుగల్ల, కలాప = భూషణమనెడు, (కలాపోభూషణేబర్హే తూణీరే సంహతావపి - అమ) వాగురా = మృగములనుబట్టువలయొక్క (వాగురామృగబంధనీ - అమ) సన్నహనంబునన్ = సన్నాహముచేత, సలిలజంతులలామమున్ = జలజంతుశ్రేష్ఠమును - ఆకప్పను, (లలామోస్త్రీలలామాపప్రభావే పురుషధ్వజే, శ్రేష్ఠే - ఇతియాదవప్రకాశః గురుబాల) ఉబ్బుచున్ = ఉత్సాహపడుచు, పట్టెన్ = పట్టుకొనెను.

ఒంటి పేఁటు మొలనూలితో రాజకుమారికప్పనుబట్టుకొనెనను.

కాంచి = ఒంటి పేఁటుమొలనూలుపేరు. (కటిసూత్రము) "ఏకయష్టిర్భవేత్కాంచీ, మేఖలాత్వష్టయష్టికా" (గురుబాల)

పాఠ :- వాగురీ -- అనురూపముద్వీపకోశమునన ండవచ్చునని 'అ' ప్రతియుపోద్ఘాతములో, సూహ్యము. కూచిమంచి వేంకటరాయఁడీరూపమును గలదనెను. (సు మ ౩౯౯ పు) "గురీఉద్యమనే" అను ధాతునిర్దేశమునుబట్టి, వాగురీ - అను రూపముండునన్న భ్రమ కలిగియుండవచ్చును. వాగురా - అను 'ప' ప్రతిపాఠముండుటచే, సందిగ్ధరూపమును గ్రహించుటయనావశ్యకము.

తే॥ సర్వతీర్థప్రదేశప్రశస్తమతికిఁ
గాంచిఁదవులుటుదనకర్హమంచునొక్క!
తవులుపడియుండెవగ ణదంతావళంబు
పడఁతియురిఁ 1 జేసి 2 మెడఁజుట్టుపసిఁడిరశన. 310

310 ప. జేసె - మద్రి [ఆ], వ. జేసి - అ. 2 మెడచుట్ట - ముద్రి [అ], వ. మెడచుట్ట గా, మెడఁజుట్టు - అ.

వ్యా :— సర్వ = సమస్తమయిన, తీర్థప్రదేశ = పుణ్య క్షేత్రములందు, ప్రశస్తమతికిన్ = శ్రేష్ఠమయిన బుద్ధిగలవాఁడగు, (పుణ్యక్షేత్రముల విషయమున సదభిప్రాయముగలవాఁడగు - అనుట) తనకున్ = తనకు, కాంచిన్ = కాంచీనగరమునందు, తవులుటన్ = ఆసక్తుఁడగుట, అర్హ్వమంచున్ఒకో = యోగ్యమగుననియేమో - అని యర్థము. కాంచిన్ = కాంచియను పేరుగలయొంటిపేఁట మొలనూలున, (ఏకయష్టిర్భవేత్కాఁచీ - గురుబాల) తవులుట = చిక్కుట, అర్హ్వమంచున్ఒకో = యోగ్యమగుననియేమో! - అని యర్థాంతరము. వరుణదంతావళంబు = వరుణునియొక్కయేనుఁగు - తిప్ప, పడఁతి = (అ) కాంత - ఆకన్యాకుబ్జరాజకుమారి, ఉరిఁజేసి = ఉచ్చుగానొనర్చి; మెడన్ = కంఠమునందు చుట్టు = చుట్టిన, పసిఁడిరశనన్ = బంగారు మొలనూలియందు, తవులుపడియెన్ = చిక్కుపడెను.

పుణ్యక్షేత్రముల విషయమున సదభిప్రాయము గలవాఁడగు తనకుఁగాంచియందాసక్తుఁడగుట యుక్తమని కాఁబోలు రాజకుమారి యొక్క కాంచికిఁగప్పగా మాఱిన యయుతుఁడు చిక్కుకొనెను.

రశన — "రసనా షోడశసరాః" (గురుబాల) అను ప్రమాణ మునుబట్టి రశనయనఁబదునాఱుపేఁటల మొలనూలు. కాంచియననొంటి పేఁటమొలనూలు (5-309) అనఁగాఁగాంచీరశనాశబ్దములు కటిసూత్ర భేదములన్నమాట. ఈవిశేషవాచకములు కటిసూత్రసామాన్యవాచక ములుగాఁబ్రయుక్తములగుట యౌపచారికము.

కాంచి — పుణ్యదాయకములగు సప్తక్షేత్రములలో నొకటి. చూ 1-99 వ్యాఖ్య.

అలం :— శ్లేషానుప్రాణితమగునుత్ప్రేక్ష.

సీ॥ పులుఁగునాడించు 1 నొప్పున, మించునాడించు
మించున, నకిన నాడించు 2 లీల
నారామచిత్రశాలూరంబు మదహాస
కౌముదీపరిషిక్త గండఫలక
యగుచు నించుకవడియాడించి, కప్పకు
వెఱచినయొకవృద్ధ విప్రుమీఁద
వైచి, తచ్ఛాపంబువలన సఖీజనం
బునుదానుఁదద్భేకమునకు భార్య

ఆ॥ 3 లైరి; యిట్లు తనకు ననురూపతనురూప
శీలములఁదలిర్చు 4 నాలిపిండు
గలుగుటయును నయుతుఁడలఘు సంసారాబ్ధి
నీఁదుఁదొంటియీఁత 5 యినుమడింప. **311**

వ్యా :— ఆరామ = ఆకాంత - ఆకన్యాకుబ్జరాజకుమారి; మదహాసకౌముదీ = వెన్నెలవంటి గర్వసూచకమగునవ్వుతో, పరిషిక్త = తడిసిన - స్నిగ్ధమయిన, గండఫలకయగుచున్ = ఫలకమువంటి చెక్కిలిగలదియగుచు, పులుఁగున్ = పక్షిని. ఆడించు + ఒప్పుననన్ = ఆడించునట్లు, మించున్ = (స్త్రీలు కాలిరెండవ వ్రేలికిఁ బెట్టుకొను నాభరణవిశేషమగు) మట్టెను, ఆడించుమించుననన్ = ఆడించునట్లును, నకినన్ = బొమ్మను, ఆడించులీలన్ = ఆడించునట్లును; చిత్రశాలూరంబున్ = చిత్రవర్ణముగల, (చూ 5_285 ప) కప్పను, ఇంచుకవడిన్ =

---

311 ప:- 1 చొప్పున - ముద్రి (అ), ర; నొప్పున - అ, గౌ. 2 నట్టాలా - ముద్రి (అ), ర; లీలనా - అ, గౌ 3 యయ్యోని - ద. చ. బ; వైరి - ర, అ, గౌ. 4 నాలుబిడ్డ - త; నాలిపిండు - ర, అ. 5 వినుమ — చ, త; యినుమ - ర, అ.

కొంచెముసేపు, ఆడించి = ఆడునట్లుచేసి, కప్పకున్ = భేకమునకు, వెఱచు = భయపడు, ఒకవృద్ధవిప్రిమీఁదన్= ఒకముసలి బ్రాహ్మణుని పైని, వైచి = వేసి, తద్ = అతనియొక్క - అవిప్రునియొక్క, శాపంబువలనన్ = అమోఘమయిన తిట్టుచేత, సఖీజనంబును = చెలి కత్తెలసమూహమును, (జనము = మనుష్యసముదాయము -సూ. ని.) తానున్ = తానును; తద్భేకమునకున్ = ఆకప్పకు, భార్యలైరి = జాయలయిరి. ఇట్లు = ఈప్రకారముగా, తనకున్ = తనకు, అను రూప = అనుగుణమగు, తనరూపశీలములన్ = శరీరాకార స్వభావ ములచేత, తలిర్చు = ఒప్పు, ఆలిపిండు = భార్యలసమూహము, కలుగుటయునున్ = ప్రాప్తించుటయు, అయుతుఁడు = కప్పగా మాఱినయయుతుఁడు, తొంటియీఁత = తొలుతటియీఁదుట, ఇనుమ డింపన్ = రెట్టింపుకాఁగా, సంసారాబ్ధిన్ = సంసారమను సముద్ర మును, ఈదుఁన్ = ఈఁదులాడును. (నీటిలోఁనీదుటతోపాటుసంసారము నీఁదుటతో, నీఁతరెట్టింపయ్యెననుట)

వ్యాక :— సఖీజనంబునుదానుఁదద్భేకమునకు భార్యలైరి. "ఆత్మార్థంబ భిహితంబగుచోఁదత్సంఖ్యాభి ధాయివచనంబు ధాతువున కుంగొన్నియెడలనవివక్షితంబగు" (ము. కౌ. క్రియా 38)

అలం :— ఉపమ, రూపకము

తే॥ అధిపతనయకుమును బహిఃప్రాణములగు
1 చామలెవ్వారు వారెల్ల 2 సతికిదాయ
లైరి, మండూకసార్వభౌమార్ధతనువు
లైనదినముల, సాపత్న్య 3 మంతగిడు! **312**

---

312 ప.- 1 భామ - క,చ,త; చామ - ర, అ. 2 సత్ర - అ. పత్రధాయ-క సంప్రదాయ – గొ, సతికి - ముద్రి (అ), ర, ర(పా) 3 మెంత- ముద్రి (అ), ర, (యతిభంగము) మంత -అ, ర, (పా)

వ్యా :— అధిపతనయ కున్ = రాజకుమారికి, మును = పూర్వము, (కప్పగామా అకపూర్వము బహిః + ప్రాణములగు = వెలుపలియసువులగు - మిక్కిలి ప్రియపాత్రులగు, చామలు = కాంతలు - చెలికత్తెలు, ఎవ్వారు = ఎవరో, వారెల్లన్ = వారలందఱును, మండూకసార్వభౌమ = భేకచక్రవర్తియొక్క, అర్ధతనువులు = అర్ధ శరీరములు - భార్యలు, ఐనదినములన్ = అయినట్టి దివసములందు, భార్యలుగానున్న కాలమునందు - అనుట) సతికిన్ = సాధ్వికి - అ కప్పగామారిన రాజకన్యకు, దాయలైరి = జ్ఞాతులయిరి - పగవారయిరి సాపత్న్యము = సపత్నీధర్మము, (సవతాలితనము) అంత + కీడు = అంతచెడ్డది. (సఖులనుసైతము పగవారినిగాఁజేయునంతచెడ్డదియనుట)

వ్యాక :— బహిస్+ప్రాణ. "ససజుషోరుః" (8 2-66) అను సూత్రముచే - బహిర్+ప్రాణ. "ఖరవసానయోర్విసర్జనీయః" (8-3-15) అను సూత్రముచే, బహిః + ప్రాణ. "ఇదుదుపధస్య చాప్రత్యయస్య" (8-3-41) అనుసూత్రముచే విసర్గమునకు, షత్వము. బహిష్ + ప్రాణ = బహిష్ప్రాణ. ఎవ్వారు = ఎవ్వారో. ఓ - అధ్యాహార్యము. (ప్రౌ. వాక్య 13)

అలం :— అర్థాంతరన్యాసము

ఉ॥ నున్ననిమోము మీనములనూఁగును 1 జెన్నఁటిగాకమున్న మా
యన్నవుగా! గృహస్థులకు నగ్రణివైమనుమంచుమున్న వే
గన్నులవేల్పుదెల్ప, 2 నదిగాదనివాదము సేయుధైర్య నం
పన్నుఁడుదేర్పఁగాఁ 3 దొడఁగెఁబాదనతిన్ గుపితప్రియాతతిన్.

**313**

---

313 ప.- 1 జెన్నటుగాననీవు - గో, జెన్నటిగాకమున్న - ర, అ. 2 నిదిగా- ప, గో, నడిగా - ర, అ. 3 దొఱఁగె - ర, దొడఁగె - అ.

వ్యా :— నున్ననిమోము = చక్కనిముఖము, మీసముల = శ్మశ్రువులయొక్క, నూఁగును = రోమాంకురములును, చెన్నఁటిగాక మున్న = వ్యర్థముకాకముందే, మాయన్నవుగా = మానాయనవుగా! (ఇది వాత్సల్యమునఁదెలుపును) గృహస్థులకున్ = గృహస్థాశ్రమము స్వీకరించిన వారిలోపల, అగ్రణివై = ప్రధానుఁడవై, మనుము = జీవింపుము - సుఖజీవనముచేయుము, అంచున్ = అని, మున్ను = పూర్వము, వే+కన్నులవేల్పు = వేయికన్నులుగలవేల్పు - ఇంద్రుఁడు, తెల్పన్ = బోధింపఁగా, అది+కాదని = అయ్యదితగదని, వాదము + చేయు = వాదించిన, ధైర్యసంపన్నుఁడు = ధీరత్వసంపదతోఁగూడు కొన్నవాఁడు, (అయుతుఁడనుట) పాదనతిన్ = చరణాభివందనముతో కుపిత = కోపించిన - ప్రణయకోపమువహించిన, ప్రియా = ప్రియురాంద్రయొక్క, తతిన్ = సమూహమును, తేర్పఁగాఁ దొడఁగెన్= ప్రసన్నతనొందింపమొదలిడెను.

పాదనతిన్ - గురుమానము వహించిన ప్రియురాలిని బ్రసన్నురాలినిజేసికొనుటకుఁబాదాభివందనము విహితము (చూ 3-12 వ్యాఖ్య)

మానమును వహించిన ప్రియురాలిపట్లఁగ్రమముగా సామము, భేదము, దానము, నతి, యుపేక్ష, రసాంతరమునను, నుపాయషట్కమును బ్రయోగింపవలెను. సామము = ప్రియవచనము. భేదము = చెలికత్తెను గైవసముచేసికొనుట. దానము = భూషణాదులనేదోమిషతో నిచ్చుట. నతి = ప్రణామము. ఉపేక్ష = సామాదులు విఫలములయినప్పుడొప్పరికించుట. రసాంతరము = సంభ్రమాదులచేఁగోపమును దొలఁగించుట. [సా. ద.]

ఇతరభేక సంభోగదర్శనాదులచే గురుమానము వహించిన భేక కాంతలను భేకములగా మాఱిన యయుతుఁడు పాదనతితోఁబ్రసన్నత్వ [illegible] బొందించుననుట.

వ్యా :— గృహస్థులకునగ్రణి = గృహస్థులలోపల నగ్రణి." కొన్నియెడలఁగు వర్ణకంబును నిర్ధారణషష్ఠికగు" ము కౌ. శారక 12 వేగన్నులవేల్పు = వే(యి)కన్నులయొక్క వేల్పు. షష్ఠితత్పురుషము. వేయికన్నులుగలవేల్పు - అను నర్థమునుబట్టి దీని నాభాసబహువ్రీహి యనియందురు. [విశ్ర]

తే॥ విషమశరుఁడేయు తూఁపుల 1 వేఁడ్లకన్న
వాండ్లువాధూలముని శాపవర్ణ 2 తతుల
రాతికొడుకైన 3 యిల్వలారాతి చట్టు
మనసుగరఁగించి మమతలఁ 4 బెనఁచెఁగాన. **314**

వ్యా :— రాతికొడుకు = కప్ప. అయిన = అయినట్టి. ఇల్వల = ఇల్వలునియొక్క. అరాతి = శత్రువుయొక్క-అగస్త్యుని యొక్క. చట్టు = శిష్యునియొక్క-కప్పగామాఱిన యగస్త్యునియొక్క, (అయుతునియొక్క-అనుట) మనసు = హృదయమును, కరఁగించి = ద్రవింపఁజేసి, మమతలన్ = మమకారములతో, పెనఁచెన్ = పెనఁగొనునట్లుచేసెను, కానన్ = కావున, విషమశరుఁడు = అసమబాణుఁడు (మన్మథుఁడు) ఏయు = ప్రయోగించు, తూఁపుల = బాణముల యొక్క, వేఁడ్లకన్నన్ = తీక్ష్ణతలకంటె, వాధూలముని = వాధూల మౌనియొక్క, శాపవర్ణ = శాపాక్షరములయొక్క, తతులు + అ = సమూహములేవాండ్లు = తీక్ష్ణములు.

---

314 ప: 1 వేట్లనెన్నువాఁడు - ముద్రి (అ); వేఁట్ల త; వెండ్లకన్నవాండ్లు-గౌ (దీర్ఘమునకుహ్రస్వములేఖనసంప్రదాయము. కానవెండ్ల = వేండ్ల) వేండ్లకన్నవాండ్లు - అ. 2 తతులు - గౌ. తతుల - ర, అ. 3 యబ్బలారాతిచుట్టు - త: చట్టు - చ: యిల్వలారాతచట్టు-ర,అ. 4 బెనఁగె - ముద్రి (అ); బెట్టు - గౌ; బెనఁచె - అ.

మన్మథబాణములకంటె వాధూలమహర్షి శాపాక్షరములే తీక్ష్ణములయినవి. ఏలన మన్మథబాణములయుతునిపైఁబనిచేయలేదు. నిర్మముని ధైర్యమును మన్మథుఁడు హరింపలేఁడని యయుతుని వాదము. (5-231) వాధూలముని శాపాక్షరములచేఁగప్పగా మాఱిన యయుతుని మనస్సు, కప్పలుగామాఱిన రాజకన్యపై నామెసఖులపై మమకారముగలది యయినది. కాన మన్మథబాణములకంటె వాధూలముని శాపాక్షరములే తీక్ష్ణములనుట.

ఇల్వలారాతి - అగస్త్యుఁడిల్వలవాతాపులను వధించుట యితిహాస ప్రసిద్ధము.

వ్యాక ;— వేఁడి+లు = వేఁడ్+లు; వేండ్లు; వాఁడి+లు = వాఁడ్+లు; వాండ్లు - బా. అచ్చిక 15

తతులు+లు - అవధారణార్థకము. వేఁడ్లకన్నన్ - అనుచో, కంటె షష్ఠ్యర్థమున, 'కన్న' వాడఁబడినది.

తే॥ స్వాతిమేఘంబు చినుకులువనధిశుక్తి
వితతిమ య్యాదునై మౌక్తికతవహించు
కరణి, నయుతుని ప్రేమతత్కాంతలందు
సిలిచెఁబల్యాయపాత్రితానియమసరణి. 315

వ్యా:— స్వాతిమేఘంబు = స్వాతికార్తెకుఁజెందిన జలధరము యొక్క, చినుకులు = వర్షబిందువులు, వనధిశుక్తిన్ = సముద్రపు ముత్తెపుఁజిప్పలయొక్క. (ముక్తాస్ఫోటః స్త్రియాం శుక్తిః-అమ) వితతిన్= సమూహమునందు, ముయ్యాదునై = మూఁడుదశల సమాహారముగలవయి, (మూఁడుదశలయందు) మౌక్తికతవహించుకరణిన్ = ముక్తామణిత్వమును దాల్చునట్లు, (ముత్యములుగామాఱునట్లు - అనుట) అయుతుని ప్రేమ = కప్పగామాఱిన యయుతునియొక్క యనురాగము.

వర్ణ్యాయ = వరుసక్రమమునకు సంబంధించిన. పాత్రతా = యోగ్యతలయొక్క, నియమసరణిన్ = కట్టుపాటుపద్ధతులచేత, తత్కాంతలందున్ = (కప్పలుగామాఱిన) ఆతరుణులయందు; నిలిచెన్ = పాదుకొనెను.

స్వాతికార్తెలోఁగురిసిన వర్షబిందువులు సముద్రమునందలి ముత్తెపుజిప్పలయందుఁబడి ముత్యపుఁలుగా మాఱునట్లు, కప్పగామాఱినయయుతుని ప్రేమ, కప్పలుగా మాఱిన రాజకుమారియందు, నామెచెలికత్తెలయందు, యథాయోగ్యముగాఁబాదుకొనెను. అనఁగా, నధికయోగ్యతచేత, రాజకుమారియందధికముగాను, చెలికత్తెల విషయమున వారివారిపూర్వయోగ్యతలకనుగుణముగాను, నయుతుని ప్రేమపాదుకొనెననుట.

స్వాతిమేఘము — స్వాతికార్తెయందలిమేఘము. సూర్యనక్షత్రసంగమమును గార్తెయనియందురు. "స్వాతీసూర్యసంగమము, ఆశ్వయుజకార్తికములలో సంభవించును. ప్రతిసంవత్సరము అక్టోబరునెల మూఁడవవారములో సుమారు 20వ, తేదీనుండి నవంబరు తొలివారము వఱకును స్వాతికార్తెదినములు". (జ్యోతిర్వే)

స్వాతిమేఘపుఁజినుకులు ముత్యపుఁజిప్పలయందుఁ బడిముత్యములగుననుటకు —

"స్వాత్యాంస్థితేరవౌమేఘై, ర్యేముక్తాజలబిందవః
శీర్ణాఃశుక్తిషుజాయంతే, తైర్ముక్తానిర్మలత్విషః" (గరుడ)

కప్పయందు ముత్యములు పుట్టుననుటకు —

"శంఖొగజశ్చక్రోడశ్చ, ఫణీమత్స్యశ్చదర్దురః
వేణురేతేసమాఖ్యాతా, స్తజ్జ్ఞైర్మౌక్తికయోనయః" (భావప్ర)

"భేకాదిష్వపిజాయంతే, మణయోాయేశ్వచిత్క్వచిత్"(గరుడ)-శబ్దక

"ముయ్యాడునై మౌక్తికత వహించుకరణి" అనుటచే ముత్యపుం జిప్పయందుంబడిన వర్షబిందువు మూండుదశలలో ముత్యముగాంబరిణ మించునని యూహ్యము. ముయ్యాడు = మూండువయస్సుల (దశల) సమాహారము.

అలం :— ఉపమ.

క॥ మునిపతికి రాజసుతకును
దనయుండు జన్మించెనంతఁదచ్ఛాపపుటి
ర్లును విరిసె జ్ఞానచంద్రుండు
గనుపట్టెన్ విష్ణుపదముగానంగనయ్యెన్. **316**

వ్యా :— మునిపతికి = మౌనినాథునకు - కప్పగా మాటిన యయుతునకు, రాజసుతకును = నృపనందనకు - కప్పగా మాటిన కన్యాకుబ్జనృపనందనకు, తనయుండు = కొడుకు - పిల్లకప్ప, ఉద యించెన్ = పుట్టెను. అంతన్ = అనంతరము, తచ్ఛాపపుఇర్లును = అశాపమనెడు చీకటియును, విరిసెన్ = తొలంగెను. జ్ఞానచంద్రుండు = మోక్షసాధనమగుబుద్ధియనెడు (మోక్షేధీర్ జ్ఞానమ్ - అమ) చందమామ, కనుపట్టెన్ = ఉదయించెను. విష్ణువుయొక్క, పదము = స్థానము - వైకుంఠము - కానంగవచ్చెన్ = గోచరించెను - ప్రాప్తించెను.

అలం :— శ్లేషానుప్రాణితమగు రూపకము.

వ॥ 1 సలపితుండగుట మందపాలసమశీలుండగు ప్రియుత
నందునుచరిత్రింబద్భుతరసైకపాత్రింబయ్యె 2 నిట్లు **317**

---

317 ప.- 1 సలపితుం - చ; సలపేతుం - క; సలపితుండగు

వ్యా :— వలపితుండగుటన్ = వాక్కుతోఁగూడుకొన్న వాఁడగుటచేత - అని యయుతునిపక్షమునకర్థము. (వ్యాహారశక్తిగల పితంభాపితంవచనంవచః - అమ) వలపితుండు = (భార్యయగు) లపితతోఁగూడుకొన్నవాఁడు - అని మందపాలుని పక్షమునకర్థము. మందపాల = మందపాలమహర్షితో, సమ = సమానమయిన, శీలుండు = బ్రహ్మచర్యమునాశ్రయించు స్వభావముగలవాఁడగు - మందపాలునివలె స్వభావముగలవాఁడగు, పత్రియుతనందను = పత్రియుతుని కుమారుని యొక్క - అయుతునియొక్క, చరిత్రంబు = చరిత్ర, అద్భుతరస = ఆశ్చర్య రసమునకు, ఏక = ముఖ్యమయిన, పాత్రంబు = భాజనము అయెన్ = అయెను. ఇట్లు = ఈప్రకారముగా (ముందటిపద్యముతో నన్వయము)

మందపాలుఁడు - మందపాలమహర్షి బ్రహ్మచర్యదీక్షవహించి పెక్కేండ్లు తపస్సుచేసి యోగమార్గమున దేహమువిడిచి, "అపుత్రస్య గతిర్నాస్తి" యనితెలిసికొని, భూలోకమునకుఁ దిరిగివచ్చి జరితయను లావుక పెంటియందుఁ బుత్రులనుబడసి పూర్వజన్మలో భార్యయగు లపితతోఁగలసి స్వర్గమునకేగెనని భారతము (ఖాండవదహనసమయమున మందపాలుని తనయులున్న వృక్షమునుదహింపకయగ్నిదేవుఁడు విడిచిపెట్టెను) మందపాలుఁడు లావుక పెంటియందు సంతతిగని స్వర్గమునకేగెను. అయుతుఁడు కప్పపెంటియందు సంతతిగని వైకుంఠమునకేగెను.

అలం :— శ్లేషానుప్రాణితమగునుపమ.

క॥ గృహమేధి ధర్మ1 మర్మా
సహమతియగు సుమతి నయుతుచందమున సుదు

---

318 ప:- 1 వర్మా - ముద్రి (అ), ర: మర్మా - అ. గౌ

స్పహాదుఃఖగ్రాహానన
గుహాఁబడునని వింటిమునుముకుందుని చేతన్. 318

వ్యా :— గృహమేధిధర్మ = గృహస్థధర్మముయొక్క; మర్మ = గూఢార్థమునందు, అసహామతి = సహింపనిబుద్ధిగలవాఁడగు కుమతి = కుత్సితబుద్ధి, అయుతుఃచందమునన్ = అయుతునివలె, సుదుస్పహ = మిక్కిలిసహింపరాని, (సు = అతిశయే - శబ్దస్తో) దుఃఖ = వ్యథయనెడు, గ్రాహ = నక్రరాజముయొక్క, అననగుహాన్ = గహ్వరమువంటినోటియందు, పడునని = చొచ్చునని, (చిక్కుకొనునని - అనుట) మును = పూర్వము, ముకుందునిచేతన్ = విష్ణువుచేత, వింటిన్ = ఆకర్ణించితిని.

గ్రాహము -- "గ్రాహోఽవహారో నక్రస్తుకుంభీరః" (అమ)

ఇందు మొదటి రెండుమత్స్యభేదములని, తక్కిన రెండుజలజంతుభేదములని గురుబాలప్రబోధిక.

"గ్రాహోఽవహారో -- లతాకారముగాఁజుట్టుకొని పీడింపఁజేయుమత్స్యముపేళ్లు. నక్రస్తుకుంభీరః --- ఏనుఁగునుబట్టి యీడ్చుకొనుపోవు జలజంతువుపేళ్లు" [గురుబాల]

"గ్రాహః = జలజంతు విశేషః --- జలహస్తి, ఇతికేచిత్. తత్పర్యాయః, అవహారః" (శబ్దక)

నక్రకుంభీరమకరములు పాదవిశిష్టజలజంతుగణమునకుఁ జెందిన వేఱువేఱు జలజంతువులని భావప్రకాశము.

"కుంభీరకూర్మనక్రాశ్చ; గోధామకరశంఖవః
ఘంటికశ్శిశుమారశ్చ, త్యాదయః పాదినఃస్మృతాః"
[భావప్ర] - శబ్దక.

"అథయాదాంసిజలజంతవః, తద్భేదాశ్శింశుమారోద్రశంకవో మకరాదయః (అమ) మకరః = చొరమీను" [ గురుబాల ]
"మత్స్యానాంమకరః శ్రేష్ఠః - ఇతిహారీతే" [ శబ్దక ]

నక్రాదిజలజంతువులలో శ్రేష్ఠమగు జలజంతుభేదముగ్రాహమని హారావళీకోశము.

"గ్రాహో జలకిరాటుశ్చనక్రశ్చాజో జలాంతుకః" (హారా)

"నక్రరాజః = నక్రాణాంకుంభీరాదీనాంరాజాశ్రేష్ఠత్వాత్ -- జలజంతువిశేషః" [ శబ్దక ]

గ్రాహనక్రమకరశబ్దములు తఱుచుగా మొసలియనునర్థమున వాడఁబడును. (చూ 5-139) గ్రాహము = నక్రరాజము, మత్స్య విశేషము, నీటియేనుఁగు.

ఆ॥ విష్ణుభక్తులై వివేకులై తృష్ణావి
దూరులై స్వకుక్షిపూరణంబు
సమయసంభృ 1 తార్థి సంతృప్తి గాఁ 2 గొని
నడచువారు 3 భయముఁగడచువారు. **319**

వ్యా :— విష్ణుభక్తులై = హరియొక్క భక్తులై, వివేకులై = వివేచనగలవారయి; తృష్ణావిదూరులై = పేరాసకు మిక్కిలిదవ్వయిన వారయి, సమయ = కాలమునందు - యుక్తకాలమునందు, సంభృత = పొందఁబడిన, అర్థి = యాచకులకు, సంతృప్తిగాన్ = మిక్కిలి తనివి

---

319 ప:- 1 తార్థ - ముద్రి (అ), ర. తార్థి - అ. 2 గోరి - డ, ద, బ, గొని - ర. అ. 3 భవము - ర: భయము - అ, గొ

కలుగునట్లుగా, స్వకుక్షి = తనదయిన కడుపుయొక్క, పూరణంబున్ = పూరించుటను (కడుపునింపుకొనుటను) కొని = స్వీకరించి, నడచువారు = ప్రవర్తించువారు, భయమున్ = భీతిని - సంసారభీతిని, కడచువారు = తొలఁగించుకొనువారు.

సీ॥ అని పార్వతీనాథుఁడమర సంయమిఁజూచి
పరమభాగవత 1 ప్రపత్తిగలుగు
నీవిట్లు ప్రార్థింపనిఖిలోన్నతములగు
దైవతక్షేత్రతీర్థములమేళ
నంబెఱింగించితి నానాకథానిధా
నంబగుదాని, నెన్నఁడును దీని
వైష్ణవధర్మప్రవర్తనంబెడలిన
2 యసదులకెఱుక 3 సేయకయ నీవు

తే॥ గుప్తముగఁజేయుమనుడు భర్గునకు మ్రొక్కి
ముని, మునిధ్యేయ! నీకతంబున దురాప
రూపతత్ క్షేత్రరాజస్వరూపమెఱుఁగఁ
గంటి, 4 గఱిగంటిగాని 5 సౌఖ్యములు 6 గంటి. **320**

వ్యా :— అని = ఈప్రకారముగా, పార్వతీనాథుఁడు = గౌరీపతి - శివుఁడు, అమరసంయమిన్ = దేవమౌనిని - నారదుని, చూచి = కనుఁగొని, పరమభాగవత = ఉత్కృష్టులయిన భగవద్భక్తులకు

---

320 ప:- 1 ప్రవర్తి - గ. ప్రపత్రి - ర, అ. 2 యసురుల - క; యసదుల - ర, అ. 3 సేయకుము- ముద్రి (ఆ). ర, సేయకయ-అ. 4 గనుఁగొంటి - క; గరిగంటిగాని - ర. గౌ. గరిగంటిగాని [?]-అ. 5 సౌఖ్యముల - ర; సౌఖ్యములు - అ, గౌ. 6 గొంటి - క; గంటి - ర, అ.

సంబంధించిన, ప్రపత్తి = శరణాగతి, కలుగు = కలిగిన. నీవు = ఈవు, ఇట్లు = ఈవిధముగా, ప్రార్థింపన్ = వేడఁగా, నానాకథా = అనేకచరిత్రలకు, నిధానంబగుదానిన్ = ఆధారమగునట్టి, నిఖిల = అన్నిటికంటె, ఉన్నతములగు= గొప్పవయిన, దైవత, క్షేత్రతీర్థముల = దేవునియొక్కయుఁబుణ్యప్రదేశముయొక్కయుఁ బుణ్యనదియొక్కయు, మేళనంబు = కూడిక, ఎఱింగించితిన్ = తెలిపితిని. దీనిన్ = దీనిని ఈదేవతక్షేత్రతీర్థములమేళనమునుగూర్చి, ఎన్నఁడును = ఏనాఁడును, వైష్ణవధర్మ = విష్ణుభక్తులకు సంబంధించిన యాగమోక్తకర్మముల యొక్క, ప్రవర్తనంబు = నడవడి, ఎడలిన = విడిచిన, అసదు లకున్ = అల్పులకు, ఎఱుకసేయకయ = తెలుపకయే, నీవు = ఈవు, గుప్తముగన్‌చేయుము = గూఢముగానొనర్పుము. (రహస్యముగా నుంచుమనుట) అనుడున్ = (ఇట్లు శివుఁడు) పలికినయనంతరము; భర్గునకున్ = శివునకు, మ్రొక్కి = నమస్కరించి. ముని = మౌని-నారదుఁడు; మునిధ్యేయ = మౌనులచేత ధ్యానింపఁదగినవాఁడా! నీక తంబునన్ = నీకారణమున, దురాప = పొందరాని, రూప = స్వభా వముగల, తత్ క్షేత్రరాజ = ఆక్షేత్రశ్రేష్ఠముయొక్క, స్వరూపము = ధర్మమును, ఎఱుఁగఁగంటిన్ = తెలియఁబడసితిని. (తెలిసికొనుభాగ్య మును గంటిననుట) గఱిగంటి = తక్కువయయినవి, కాని = కానట్టి-అనల్పములయిన, (అధికములయిన - అనుట) సౌఖ్యములు = సుఖ ములను, కంటిన్ = పొందితిని.

గఱిగంటి - ఇది నిఘంటువులకెక్కలేదు. ప్రయోగాంతరములు-

i "మఱివచ్చిచూచుడు గఱిగంటిగామి" (బసవ ఆం. ప. 61పు)
ఇది, వావిళ్లప్రతిలో 'గఱిగొఱ' అని సవరింపఁబడినది.

ii "గఱిగంటిగాని సౌఖ్యములఁదనరి" (ఉ. నా. 1-117)
(గరిగంటి - అనిలఘురేఫముతో ముద్రితము.)

చ॥ భయమునదల్చి, దుఃఖముల 1 బాచి, సుఖంబులఁబో్రదిచేసి, త
ద్దయుఁ 2 దిలకించునీయడుగుఁదమ్ములనిమ్ములఁగొల్చి నిత్యసం
శ్రియమొనరించునాకిఁకన సాధ్యములే 3 దదియట్లయౌన; 4 ని
ర్ణయభవసాగరోత్తరణ నావికులాదిమవైష్ణ 5 వాశ్రితుల్. **321**

వ్యా :— భయమున్ = భీతిని, అదల్చి = తొలగించి; దుఃఖములన్ = వ్యథలను, పాచి = పోఁగొట్టి, సుఖంబులన్ = సౌఖ్యములను, పో్రదిచేసి = పెంపొందించి; తద్దయున్ = అత్యంతము-తిలకించు = ఒప్పు, నీ = నీయొక్క; అడుగుఁదమ్ములన్ = పద్మముల వంటిపాదములను, ఇమ్ములన్ = ప్రీతితో, కొల్చి = సేవించి, నిత్య = ఎల్లప్పుడు, సంశ్రియమొనరించు = ఆశ్రయించు, నాకున్ = నాకు, ఇఁకన్ = ఈపైని, అసాధ్యము = సాధింపశక్యముకానిది, లేదు = కలుగదు అది = అయ్యది, అట్ల = ఆప్రకారముగానే, ఔన్ + అ = తప్పక ప్రవర్తిల్లును. (అసాధ్యము లేకపోవుట నిశ్చితము - అనుట) ఆదిమవైష్ణవాశ్రితుల్ = ఆద్యులగు వైష్ణవ ధర్మమునాశ్రయించినవారు, నిర్ణయ = నీతిలేని, (నీతిమాలిన) భవసాగర = సంసారమనెడు సముద్రముయొక్క, ఉత్తరణ = దాఁటుటయందు, నావికులు = కర్ణ ధారులు. (ఓడనడపువారు) తాముతరించుచు నితరులను దరింపఁజేయు వారనుట.

అలం :— రూపకము.

---

321 పః- 1 బాసి - గౌ; బాచి - ర, అ, 2 డిలకించి - డ, ద, బ; దిలకించు ర, అ. 3 దనియట్లయౌను - గ; దదియట్లయౌన - ర; దదియట్లయౌన - అ, గౌ. 4 దుర్ణయభవ - ర; నిర్భయ - డ, ద, బ; (యతిభంగము) నిర్ణయభయ - క; నిర్ణయభవ - అ. 5 వోత్తములల్ - ర; వాశ్రితుల్ - అ, గౌ.

క॥ అనిపౌనఃపున్యం 1 బుగ
వనజాసన సూతిమ్రొక్కి వలగొనిహరువీ
డ్కొని పౌండరీకమునకున్
జని, 2 భైమిం దీర్థమాడి; చక్రిభజించెన్. **322**

వ్యా :— అని = ఈప్రకారముగా, పౌనఃపున్యంబుగన్ = పునఃపునరావృత్తిగా, (మాటిమాటికి - అనుట) వనజాసనసూతి = బ్రహ్మయొక్క సంతానము - నారదుఁడు, (సూతిః = సంతానః-శబ్దక) మ్రొక్కి = నమస్కరించి, వలగొని = ప్రదక్షిణచేసి, హరున్ = శివుని వీడ్కొని = పోయివత్తునని విన్నవించివిడిచి, పౌండరీకమునకున్ = పౌండరీకక్షేత్రమునకు, చని = అరిగి, భైమిన్ = భీమరథీనదియందు, తీర్థమాడి = స్నానముచేసి, చక్రిన్ = విష్ణుమూర్తిని - విట్ఠలుని, భజించెన్ = సేవించెను.

క॥ భజియించి, తత్ప్రసాద
వ్యజనానిలశమితతాపుఁడై, యిప్పుడు న
బ్జజసూతిదక్షిణద్వా
రజగతినున్నాఁడు సుస్థిరప్రమదమున్ **323**

వ్యా :— భజియించి = (విట్ఠలుని) సేవించి, తద్ = అతని యొక్క, ప్రసాద = అనుగ్రహమనెడు, వ్యజన = తాళవృంతము యొక్క, (విసనకఱ్ఱయొక్క) అనిలగాలిచేత, శమిత = శాంతించిన, తాపుఁడై = తాపముగలవాఁడయి, ఇప్పుడున్ = ఇపుడును, అబ్జజ

---

322 ప:- 1 బున - గ; బుగ - ర, అ. గౌ. 2 భైమీ - గౌ; భైమిం - ర; భైమిన్ - అ.

సూతి = బ్రహ్మయొక్క సంతానము - నారదుఁడు; దక్షిణద్వార జగతిన్ = దక్షిణపువాకిటి ప్రదేశమునందు, సుస్థిర = మిక్కిలితిర మయిన, ప్రమదమునన్ = సంతోషముతో, ఉన్నాఁడు = కలఁడు.

అబ్జజ - ఇదిఖగోళదృశ్యమునకుఁబ్రతీక. చూ 1-3 వ్యాఖ్య.

క॥ అనికథకుఁడు శౌనకముఖ
మునులకు హరిదివ్యచరితములు దురితతమో
దినకరకిరణా 1 యితములు
వినిపించెఁగళా 2 కళేశ! వేదాద్రీశా! **324**

వ్యా :— అని = ఈప్రకారముగా, కథకుఁడు = (పురాణ) కథలుచెప్పువాఁడు - సూతుఁడు (ఉగ్రశ్రవసుఁడు, రౌమహర్షణి) శౌనకాదులగు, మునులకున్ = మౌనులకు, దురిత = పాపములనెడు, తమః = చీకట్లకు, దినకర = సూర్యునియొక్క, కిరణాయితములు = కిరణములవలె నాచరించునవియగు, హరి = విష్ణుమూర్తియొక్క, దివ్య చరితములు = దివ్యములయిన చరిత్రలు, కళా = కవిత్వాదికళల యొక్క, కళా = జ్ఞానమునకు, (కళా -- జ్ఞానావయవయోరపి -- వై. ని.) ఈశా = అధిపతియయినవాఁడా! వేదాద్రీశా = వేదాద్రినాథా! వినిపించెన్ = వినిచెను.

అలం :— రూపకానుప్రాణితలుప్తోపమ.

---

324 ప:- 1 యుతములు - ర; యితములు — అ, గొ. 2 కళావతీశ - డ, ద, బ; కళావళీశ - ర; కళేశ — అ, గొ.

శా॥ దిగ్దంతావళకర్ణచాలన సముద్వేల్లన్మరుత్పల్లవ
1 స్రగ్దీప్తి ప్రకటప్రతాపశిఖిసంఛన్నాఖిలాశాంత! స
మ్యగ్దానాధరితామరద్రుమ! రమాప్రాణేశ 2 భక్తప్రియా!
ప్రాగ్దిక్కేసరిపీఠికాధిప 3 సభాపద్మాకరాహస్కరా! **325**

వ్యా :— దిగ్దంతావళ = దిగ్గజములయొక్క. కర్ణచాలన = చెవులయొక్క చలింపఁజేయుటచేత, సముద్వేల్లత్ = పైకెగదలుచున్న, మరుత్పల్లవ = దేవతావిటులయొక్క. స్రజ్ = పూలదండలయొక్క, దీప్తి = కాంతిచేత, ప్రకట = స్పష్టమయిన, ప్రతాప = పరాక్రమ మనెడు, శిఖి = అగ్నిచేత, (కుక్కుటేఽగ్నౌ మయూరేఽశౌష్ప్రక్షే కేతు గ్రహేశిఖీ - వై. వి) సంఛన్న = బాగుగానాచ్ఛాదింపఁబడిన, అఖిల= సమస్తమయిన, ఆశా = దిక్కులయొక్క, అంత = తుదలుగలవాఁడా!

దిగ్గజముల చెవిగాలులచేతఁ బైకెగదలుచున్న దేవతావిటులు దాల్చిన పూదండలకాంతిచేతఁ బ్రస్ఫుటమయిన పరాక్రమాగ్నిచేఁగప్పఁ బడిన దిగంతములు గలవాఁడా! అనఁగా, వేదాద్రితోడి యుద్ధమున మరణించి దేవతా విటులుగా స్వర్గమున కేగుచున్న శత్రువులు దాల్చిన పూదండలు, దిగ్గజములచెవిగాలులచేఁ బైకెగదలుచు వేదాద్రిపరాక్ర మాగ్నినిబ్రస్ఫుటముచేయుచున్నవనియు. నట్టిపరాక్రమాగ్నిచే వేదాద్రి దిగంతములనాచ్ఛాదించుచున్నాఁడనియు భావము. (దిగ్గజములు - చూ 1-113 వ్యాఖ్య)

సమ్యక్ = సంగతమయిన. దాన = త్యాగముచేత, అధరిత= అధఃకరింపఁబడిన, (తక్కువపఱుపఁబడిన) అమరద్రుమ = దేవతా

---

325 ప:- 1 స్రగ్దీప్తి - ముద్రి (అ), ర. త్స్రగ్దీప - గౌ: స్రగ్దీప్త - అ.
2 భక్తి - చ. భక్త - ర, అ. 3 విభా - గౌ: సభా - ర, అ.

వృక్షములుగలవాఁడా! రమాప్రాణేశ = లక్ష్మీపతియొక్క - విష్ణువు యొక్క, భక్త = భక్తులకు, ప్రియా = ఇష్టుఁడయినవాఁడా! ప్రాగ్దిశ్ = తూర్పుదిక్కునందలి, కేసరిపీఠికాధిప = సింహాసనాధీశునియొక్క, సభా = పరిషత్తనెడు, పద్మఆకర = తామరకొలనికి (సరోవరమునకు) అహస్కరా = సూర్యుఁడా!

అమరద్రుమములు చూ 1-62 వ్యాఖ్య.

అలం :— రూపకము.

క॥ విద్వత్కుముద 1 నిశాకర !
విద్వేషివరూథనాథ వేశంతమదాం
ధద్విరద! 2 కీర్తివృత స
ప్తద్వీప! దిలీపభూమిప సమాటోపా! **326**

వ్యా :— విద్వన్ = పండితులనెడు, కుముద = తెల్లకలువలకు, (సితేకుముదకైరవే - అమ) నిశాకర = చంద్రుఁడు! విద్వేషి = విరోధులయొక్క, వరూథనాథ = సేనాపతులనెడు. (వరూథమ్ = సైన్యమ్ - శబ్దర) వేశంత = అల్పసరస్సులకు, (వేశంతః పల్వలంచాల్పసరః - అమ) మద = మదముచేత. అంధ = గ్రుడ్డిదయిన — బలగర్వముచే లెక్కచేయని, ద్విరద = ఏనుఁగయినవాఁడా! కీర్తి = యశస్సుచేత, వృత = ఆవరింపఁబడిన, సప్తద్వీప = ఏడుదీవులుగలవాఁడా! దిలీపభూమిప = దిలీపభూపాలునితో, సమ = సమానమయిన, ఆటోపా = అతిశయముగలవాఁడా!

---

326 ప:- 1 సిరా — గౌ; నిశా - ర, అ. 2 కీర్తిసంవృత, సద్వీపదిలీపభూపసదృశాటోపా - ముద్రి (అ). ర; కీర్తిధృతస, ప్తద్వీప — గౌ; కీర్తివృతస, ప్తద్వీప - అ.

చంద్రికుముదమైత్రికవిసమయసిద్ధము. మదాంధద్విరద — భద్రజాతికరులకెనిమిదిచోట్ల మదముపుట్టును.

"దానంకపోలయోస్సింధు. రక్ష్ణో(గ్రంతోయస్తుసాగరః
కరాగ్రేశీకరస్సిక్యం, స్తనాగ్రేమేహనేమదః
హృదయేఘర్మసలిలం, మేఘస్తుచరణద్వజే
సంజ్ఞయాష్టమదాహ్యేతే, జాయంతేభద్రదంతినః"

(అ శే.) - వసు 1-101 టీక.

సప్తద్వీపములు — చూ. 5-308 వ్యాఖ్య. ఈద్వీపములను స్వాయంభువమనువు కుమారుఁడగు ప్రియవ్రతుఁడేర్పఱిచెను. వీని వివరణము భాగవతాదిపురాణ ప్రసిద్ధము. అలం :— రూపకము.

మాలిని ;- సరసగుణరతీశా! షట్సహస్రాన్వయేశా!
నిరవధికగుణాబ్ధీ! నిత్యసత్యోపలబ్ధీ!
హరిహయసమభోగా! యాచమా1నామరాగా!
కరగతనిగమాళీ! కావ్యకృత్పద్మహేళీ! 327

వ్యా :— సరసగుణ = సరసములయిన సద్గుణములయందు, రతీశా = రతిపతియైనవాఁడా! (మన్మథుఁడా) షట్సహస్రాన్వయ = ఆఱువేల నియోగివంశమునకు, ఈశా = అధిపతియయినవాఁడా! నిరవధిక = మేరలేనివగు గుణ = సద్గుణములకు, అబ్ధీ = సముద్రమయినవాఁడా! (నిలయమయినవాఁడా - అనుట) నిత్యసత్య = శాశ్వతమయిన సత్యముయొక్క, ఉపలబ్ధీ = ప్రాప్తిగలవాఁడా! హరిహయ = ఇంద్రునితో, సమ = సమానమయిన, భోగా = భోగములుగలవాఁడా! యాచమాన = యాచకులకు, (యాచమానః = యాచకః - శబ్దక) అమర = దేవతలయొక్క, అగా = వృక్షమయినవాఁడా! కరగత = హస్తప్రాప్తమయిన - స్వాధీనమయిన,

327 ప్ర.- 1 యాచమాసాను-గొ; యాచమానాను- ర; యాచమానామ - అ.

నిగమాళీ = వేదశ్రేణిగలవాఁడా! కావ్యకృత్ = కావ్యకర్తలనెడు- కవులనెడు, పద్మ = కమలములకు, హేళీ = సూర్యుఁడయినవాఁడా!

అమరాగములు - చూ 1-62 వ్యాఖ్య.

కావ్యకృత్పద్మహేళీ - పద్మసూర్యమైత్రికవిసమయప్రసిద్ధము.

నిగమములు -- ఋగ్యజుస్సామాథర్వణములు.

ఆర్వేలనియోగి - "ఆర్వేలవారు = ఆఱువేలదేశపువారు - నియోగులలోనొకశాఖపేరు". "నియోగి= ఒకతెగబ్రాహ్మణుఁడు (వ్యవ) వీరువైదికులు, వారునియోగులు. (వీనిలోభేదములు - ఆఱువేలనియోగులు, తెలఁగాణపునియోగులు, నందవరీకనియోగులు. మొ॥" (సూ.ని.)

వెలనాడునే, యాఱువేలనాడని యందురు. ఏలన వెలనాటి యందాఱువేల గ్రామములుండెడివి. ఇది కృష్ణానదికి దక్షిణమునఁ గలదు. దీనికి ధరణికోటరాజధాని (సూ. ని.)

సాతవాహనసామ్రాజ్య పతనానంతరము కలిశకము 3710 సంవత్సరమున నేర్పడిన బ్రహ్మక్షత్రవంశీయులలో రాజకీయోద్యోగములు స్వీరించియు బ్రాహ్మణధర్మమును విడువనిబ్రహ్మక్షత్రవంశ్యులు నియోగులని, కీ. శే. కోటవేంకటాచలముగారి యభిప్రాయము. (అగ్ని.రా)

వ్యాక :— షట్సహస్రాన్వయము - "సంజ్ఞావాచకాదులకు సంస్కృతీకరణంబుగొన్నియెడలఁగానంబడియెడి" (ము.కౌ.ప్రకీర్ణక 16)

అలం :— రూపకము.

ఛం :— మాలిని. గణములు - ననమయయ. యతి - 1-9. ఇది 15-4672 వృత్తము.

ఇది శ్రీమత్పరమపదనాథ నిరవధిక కృపాపరిపాకపరిచిత సరస కవితాసనాథ, రామకృష్ణకవినాథ ప్రణీతంబైన పాండురంగమాహాత్మ్యంబనుపరమభాగవత చరిత్రంబునందు సర్వంబునుబంచమాశ్వాసము.

వ్యా :— చూ - ప్రథమాశ్వాసాంతవ్యాఖ్య.

## సంజీవనీ వ్యాఖ్యానము సంపూర్ణము

